

# సంపూర్ణ నీతిచంద్రిక

( మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధి)

(ఒకే సంపుటముగా)


శ్రీ పరవస్తు చిన్నయసూరి (మిత్రలాభము, మిత్రభేదము)

శ్రీ కందుకూరి వీరేశలింగము (విగ్రహము, సంధి)

పరిష్కర్త : వ్యాఖ్యాత

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు ఎం.ఏ.పి.హెచ్.డి.

విశ్రాంతాంధ్ర భాషాశాఖాధ్యక్షులు

ప్రభుత్వ కళాశాల, రాజమహేంద్రవరము





© 2473444

రోహిణి పబ్లికేషన్స్

పాత కూరగాయల మార్కెట్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

# సంపూర్ణ నీతి చంద్రిక

శ్రీ పరవస్తు చిన్నయసూరి

శ్రీ కందుకూరి వీరేశలింగము





పరిష్కరణము, వ్యాఖ్యానము

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు ఎం.ఏ.పి.హెచ్.డి.



ప్రథమ ముద్రణ :
ఆగస్టు 1997
చతుర్థ ముద్రణ :
సెప్టెంబరు 2003

మూల్యము
రూ. 75/-



"పురుషులలో
పుణ్యపురుషులు వేరయా"
అన్నట్లే పుస్తకాలలో గూడా
పుణ్యం - పురుషార్థం కలిగించే
పుస్తకాలూ వేరే వుంటాయి.
అటువంటి పుస్తకాల ప్రచురణే
ధ్యేయంగా నడుస్తున్న సంస్థ
మా
రోహిణి పబ్లికేషన్స్



ముద్రణ :
స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ - 520 003.
ఫోన్స్ : 578211, 572832

ప్రకాశకులు
రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

# పీఠిక

## (ప్రథమ ముద్రణ)

సంస్కృతములో 'సుహృల్లాభము', 'సుహృద్భేదము', 'కాకోలూ కీయము' , 'లబ్ధప్రణాశము', 'అసంప్రేకితకారము' అనే ఐదుతంత్రములు "పంచ తంత్రమనే" గ్రంథంగా పేరుగాంచింది. మహాపండితుడైన విష్ణుశర్మ ఈ 'పంచతంత్రమను' రచించాడు. ఈ గ్రంథములో మనుషులతోపాటు జంతువులను కూడా ప్రధాన పాత్రధారులుగా కవి మలచినా- మృగప్రాయమైన మనుషుల స్వభావాలను జంతువులలో ప్రవేశపెట్టి, అటువంటి వారిని నీతిగా వుండమని చెప్పటమే ఇందులో ముఖ్యోద్దేశం.

ఏ కాలములోనైనా మనుషులకు నీతి ముఖ్యం- అని ఉపదేశించేదే 'పంచతంత్రగ్రంథం' ఈ కాలమేకాదు- ఏకాలమైనా ప్రయోజనాత్మక విలువలు కలిగివున్నదని చెప్పవచ్చును. భావితరాలకు సంబంధించి ఎందరో మనస్తత్వాలను ఆలోచించి, ఆ మనస్తత్వాలకు తగిన పాత్రలను మహాభారతంలో రచన చేసినట్లుగా ... పంచతంత్రంలో కూడా అన్ని రకాల మనస్తత్వాలను మేళవించి .. చక్కగా వివరించడం జరిగింది.

మొదట... ధవళ చంద్రుడనే రాజుగారి ఆదరణ పొందిన నారాయణ పండితుడు "హితోపదేశము" అనే నీతి గ్రంథం రచించాడు. ఇందులో మిత్రలాభము, సుహృచ్ఛేదము, విగ్రహము, సంధి అనే నాలుగు భాగాలున్నాయి.

"హితోపదేశము" గ్రంథాన్ని ఆధారం చేసుకొని- మొదట పరవస్తు చిన్నయసూరి (1806-1862) పండితుడు మొదటి రెండు భాగాలను 'మిత్రలాభము' , 'మిత్రభేదము' పేరిట గద్య గ్రంథాలను తెలుగులో వెలువరించారు. తరువాత కందుకూరి వీరేశలింగం గారు (1848-1919) హితోపదేశములోని తతిమా రెండు భాగాలను- విగ్రహము, సంధి అనువాటిని గద్య గ్రంథాలుగా తెలుగులో అనువదించారు.

ఈ విధంగా- వేరు వేరు కాలాలలో పైన పేర్కొన్న ఇద్దరూ రచించిన గ్రంథమునకు "నీతి చంద్రిక" అనే పేరు వచ్చింది.

నీతి చంద్రికలో... నీతి అనబడే చంద్రిక (వెన్నెల) ముఖ్య విషయం. వెన్నెల ఏ విధంగా చీకటిని పారద్రోలి- ప్రకాశవంతం చేస్తుందో ... అలాగే మనిషిలోని అవినీతిని పోగొట్టి, వివేకాన్ని కలిగిస్తుందని "నీతి చంద్రిక" భావము.

చిన్నయసూరి పండితుడు ఎన్నో గ్రంథాలను రచించినా- నీతిచంద్రిక(1853), బాలవ్యాకరణము (1855) మాత్రం రచయిత ప్రతిభకు తార్కాణంగా వున్నాయి.

పూర్వము... నన్నయ భారతాది గ్రంథాలలో అక్కడక్కడా వచనము లున్నాయే తప్ప పూర్తిగా వచన గ్రంథాలేమీ లేవని చెప్పవచ్చును. "జైమినీ

భారతాది" రచనలు వచన శైలిలో వున్నా కూడా- సంస్కృత మూలమునకు దగ్గరగా వుండటం వలన తెలుగుదనం వుట్టి పడేవిగా కనబడటం లేదు. తెలుగు భాషలోని సహజ తత్వాన్ని, మాధుర్యాన్ని చాటి చెపుతూ బాల, బాలికలకు ఆదర్శప్రాయమైన 'నీతిచంద్రికను' చిన్నయసూరి సరళ వచన గ్రంథంగా రచించడం జరిగింది.

పూర్వము- సుదర్శనుడనే రాజు తన మూర్ఖపు పుత్రులకు ఈ "నీతిచంద్రిక' ' గ్రంథము ఉపయోగపడుతుందని ప్రోత్సహించడం జరిగింది. కానీ ... తెలుగు పిల్లలకు ఆంధ్ర భాషా పాటవాన్ని చాటి చెప్పే గ్రంథమయింది "నీతిచంద్రిక" ఈ రోజు.

క. తుద ముట్టఁగ నీ కబ్బము- పదిలముగాఁ జదివినట్టి బాలుర
బోదలను భాషాజ్ఞానము- కుదురుం గొదలేక నీతి కుశలత్వంబున్'

ఏ భాషలోనైనా సగే- ముందు లక్ష్యము. తరువాత లకణము అనే ఉద్దేశ్యముతో చిన్నయసూరి "బాలవ్యాకరణము" అనే గ్రంథాన్ని 1855లో రచించాడు అంతకు ముందున్న వచన గ్రంథాలేవీ తెలుగు బాలబాలికలకు భాషా ప్రావీణ్యతను కలిగించలేనివిగా భావించి, చిన్నయసూరి "బాల వ్యాకరణము" రచించడం జరిగిందని భావించ వచ్చును. బాల వ్యాకరణము తెలుగు భాషకు పూరి ప్రామాణికమైన గ్రంథంగా పేరుగాంచింది. తెలుగు భాష వున్నంత కాలం 'బాల వ్యాకరణ' మూల స్తంభంగా నిలుస్తున్నదనటంలో అతిశయోక్తి లేదు.

"నీతి చంద్రిక" గ్రంథము ఎన్నో ముద్రణలు వెలువడ్డాయి. ఈ ముద్రణలలో కొన్ని మార్పులు కూడా కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. కొన్ని మార్పులు అసలు విషయానికి ఆమడ దూరంలో వుంటున్నాయి.

చిన్నయసూరి- 'మిత్రలాభము'ను సులభశైలిలోనూ. 'మిత్ర బేధమ్ము' కఠినశైలిలోనూ వ్రాయటం జరిగింది. అంట- మిత్రబేదము చదవగలవారు సులువుగా అర్థంచేసుకోగలిగే భాషా పరిజ్ఞానం కలిగి, 'మిత్రభేదము' చదవటానికి కావలసిన పరిజ్ఞానాన్ని సంతరించుకోవాలని చిన్నయసూరి బావం. ఈ విధానంలో సూక్ష్మ దృష్టి కలిగి వుండటం వలనే రచనా శైలిలో సులభం, కఠినం చెప్పడం జరిగిందని అందరూ భావించాలి.

"నీతి చంద్రిక"లో మిత్రభేధము, మిత్రలాభము మాత్రమే చిన్నయసూరి తెలుగులో అనువాద రచన చేసారు. తరువాత కందుకూరి వీరేశలింగం పంతులుగారు- విగ్రహం, సంధి అనువాటికి చిన్నయసూరి శైలికి ప్రాధాన్యతనిచ్చి అదే శైలిలో మిగతా భాగాలను వచన గ్రంథం చేసారు. ఈ రచనా సామర్థ్యంతో కందుకూరి వీరేశలింగంగారు 'గద్యతిక్కన' అనే బిరుదును కూడా సార్థకం చేసుకున్నారు.

భారతములో చివరి పదిహేను పర్వములను రచించిన తిక్కన కవి మొదటి పర్వములను కూడా రచించగలడు. కానీ ... అప్పటికే నన్నయ రచనలో ప్రావీణ్యతను, ప్రామాణకతను గౌరవించి మొదటి పర్వములను రచించలేదు. అలాగే ... వీరేశలింగం గారు కూడా- "నీతి చంద్రిక"లోని చిన్నయ సూరి రచించిన మిత్రలాభము, మిత్రభేదములను వదలి ... మిగతా భాగాల రచన చేసారు. ఇదే

ఆయన ఔచిత్యానికి నిదర్శనం.

చిన్నయసూరి రచన- సోపాన క్రమంలో ఆరోహణా రీతిలో నుండగా, వీరేశలింగము గారి రచన సోపాన క్రమములోనే అవరోహణా రీతిలోనున్నది. అంటే- మొదటిదైన 'విగ్రహము' కఠినశైలిలోను, 'సంధి'సులభశైలిలోనూ ఉన్నాయి. ఈ విషయాన్నే వీరేశలింగంగారు ఈ క్రింది పద్యము ద్వారా చెప్పుకున్నారు.

ఉ. ఇంతకుమున్ను నేను రచియించిన విగ్రహతంత్ర మెల్లచో
నెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁబడ్డ దటుంచుఁ బల్మరున్
వింతగ నాకు లేఖలను బెక్కురు వ్రాయుచునుంటఁ జేసియ
త్యంతము వ్రాసితిన్ సులభమౌగతి దీనిని సంధి తంత్రమున్.

'విగ్రహము' రచన బహుకష్టముగా నున్నది. ఒక శబ్దమునకు సంస్కృతములోనూ, తెలుగులోనూ ఎన్ని పర్యాయపదాలున్నాయో ... అన్నీ ఈ రచనలో ఉన్నాయి. దీనివలన పాఠకులకు శబ్దజాలము బాగా తెలిసి మంచి భాషా పరిజ్ఞానము కలుగుతుంది.

పంచతంత్రములోని హితోపదేశములకు సంబంధించి కొన్ని అంశాలను అభినవ రీతిలో రచన సాగించినట్లు చిన్నయసూరి- వారి అభిప్రాయాన్ని చెప్పారు. భారత పంచతంత్రము పూర్తిగా పరిశీలించి- కొన్ని క్రొత్త కథలతో ... విగ్రహం, సంధి రచనలు చేసినట్లు వీరేశలింగం పంతులుగారు చెప్పారు.

వీరేశలింగము గారు ఒక అద్భుతమైన వ్యక్తి. ఒక ప్రక్క ఆయన సంఘ సంస్కరణ గురించి విశేషంగా కృషి చేస్తూనే- మరొక ప్రక్క అసాధారణ శైలితో రచనలు చేసారు. సాంఘిక, సాహిత్య రంగాల్లో విశేష కృషి చేసి అద్భుత ఫలితములు పొందిన సవ్యసాచి ఆయన. సంఘములోని దురాచారాలు, మూఢ విశ్వాసాలను ఖండించడానికి సాహితీ ఖడ్గమును ధరించి- సంఘసంస్కరణకు సాహిత్యమును వుపయోగించిన మహనీయులు వీరేశలింగముగారు.

వీరేశలింగముగారి 'విగ్రహ, సంధి' భాగముల రచనలకు ఇప్పటి వరకూ వ్యాఖ్యానము లేదు. విద్యార్థుల సౌకర్యము కోసం 'వ్యాఖ్యానం' ఎంతో అవసరమని- ఈ గ్రంథమును వెలువరిస్తున్న రోహిణి పబ్లికేషన్స్ వారు నన్ను కోరగా... నేను ఈ విధంగా నిర్వహించాను. ఈ వ్యాఖ్యానముతో పాటు చిన్నయసూరి రచనలకు కూడా గత వ్యాఖ్యానములోని తప్పులను సరిజేసి మరలా వ్యాఖ్యానము చేసాను. ఈ అవకాశమును నాకు కలిగించిన రోహిణి పబ్లికేషన్స్- రాజమండ్రి వారికి కృతజ్ఞుడను.

చిన్నయసూరి, వీరేశలింగము రచనలు వేరువేరు గ్రంథములుగా నుండగా, వాటిని ఒక్కటిగా కలిపి, 'నీతి చంద్రికను' తెలుగు ప్రజలకు అందిస్తున్న రోహిణి పబ్లికేషన్స్ వారు ఎంతో ప్రశంసనీయులు. వారి కృషి ఫలించి ఈ గ్రంథము సర్వజనాదరణ కాగలదని నా విశ్వాసము. కేవలం వ్యాపార దృష్టి కాకుండా- సాహిత్య సేవా దృక్పథంతో చేయు ప్రచురణ సంస్థలలో ఇది అగ్రస్థానము నందుతున్నది. మరికొన్ని ప్రాచీన గ్రంథములను వినూత్న రీతిలో- విశిష్టముగా వెలికితీసి ... ప్రచురించాలనే శ్రద్ధ, పట్టుదల కలవారు వీరు.

పాఠకలోకమునకు ఆదరణ కాగలదని భావిస్తున్నాను.

ఆది, సభాపర్వములను, అరణ్యపర్వములోని కొంత భాగమును నన్నయ భట్టారకుడు రచింపగా, మిగతా పర్వములను వేర్వేరు కాలములలో తిక్కన, ఎఱ్ఱన- ఆంధ్ర మహాభారతమును పూర్తి చేసారు.

పరవస్తు చిన్నయసూరి- మిత్రలాభ, మిత్రభేదములను 1853లో రచింపగా, మిగతా భాగములయిన విగ్రహము, సంధిలను కందుకూరి వీరేశలింగము గారు (1848-1919) రచించి నీతిచంద్రికను పూర్తి చేసారు. వీరందరూ సదా ప్రశంసనీయులు.

ఆంధ్ర మహాభారత గ్రంథములో తిక్కనకు గల స్థానమే- నీతి చంద్రిక గ్రంథములో వీరేశలింగము గారికి కలదు.

శయ్యా విషయముబట్టే కాకుండా పూరణ విషయమును బట్టియే వీరేశలింగముగారికి 'గద్య తిక్కన' బిరుదు సార్థకమయింది.

అటు సాంఘిక సేవతో పాటు, ఇటు సాహిత్యసేవ కూడా చేస్తూ- సవ్యసాచి అనిపించుకున్న వీరేశలింగముగారికి ఆంధ్రజాతి ఎంతో ఋణపడి వుంది.

చిన్నయసూరి రచన- మిత్రలాభములో నలుభశైలిలో సాగుతూ, మిత్రభేదములో కొంచెం కష్టముగా వుంటుంది. వీరేశలింగముగారి రచన విగ్రహములో కష్టమై, సంధిలో సులభంగా వుంటుంది. విగ్రహ తంత్రం కష్ట శైలిలో వుందని చాలామంది లేఖలు వ్రాయడం వలన సంధి తంత్రాన్ని సులభశైలిలో రచించడం జరిగిందని వారే అంగీకరించారు.

వీరేశలింగం గారు- వారి రచనలో ... ఒక పదమునకు గల పర్యాయపదములను ఎన్నిటినో ప్రయోగించడం వలన చదివే విద్యార్థులకు మంచి శబ్దార్థజ్ఞానం కలుగుతుందనడంలో సందేహము లేదు.

చిన్నయసూరి రచనకు వ్యాఖ్యానములు వున్నాయిగానీ- వీరేశలింగము గారి రచనకు ఇంతవరకూ శబ్దార్థ వివరణను తెలిపే వ్యాఖ్యానము లేదు. ఈ ఆవశ్యకతను గుర్తించి రోహిణి పబ్లికేషన్స్- రాజమండ్రి వారు నాతో వ్యాఖ్యానము చేయించినందుకు వారికి నేనెంతో కృతజ్ఞుడిని.

శారీరకముగ, ఆర్థికముగా ఎన్నో కష్ట-నష్టాలకోర్చి- ఆంధ్ర పాఠకలోకానికి సమగ్రమైన నీతిచంద్రికను వ్యాఖ్యా సమేతంగా అందివ్వాలనే వీరు అభినందనీయులు. కేవలం వ్యాపార దృష్టితోనే కాకుండా భాషాసేవ దృక్పథం కలిగి, మరెన్నో ప్రాచీన గ్రంథములను కూడా ప్రచురించదలపెట్టడం ప్రశంసనీయం.

ఇది ద్వితీయ ముద్రణ. ప్రథమ ముద్రణలో దొర్లిన కొన్ని పొరపాట్లను ఈ గ్రంథములో చాలా వరకూ సవరించడం జరిగింది. దీనిని పాఠకలోకం ఆదరించగలరని నా మనవి.

పరిష్కర్త, వ్యాఖ్యాత-

**డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

ఎం.ఏ., పి.హెచ్. డి.,

శ్రీః

# హితవచనాలు

భాషాప్రవీణ
**డాక్టర్ వృయ్యూరు లక్ష్మీనరసింహారావు** P.O.L., M.A.,M.Phil., Ph.D.,
డైరెక్టర్ - విద్వాన్ కళాశాల,
బృందావన్ గార్డెన్స్, గుంటూరు - 522 006

శ్లో : యదేక మక్షర మజం న నశ్యతి న జాయతే।
శబ్దబ్రహ్మైక సర్వస్వం వాగ్జ్యోతి స్తదుపాస్మహే॥

- శ్రీ భోజరాజ

సంస్కృతములో విష్ణుశర్మ నిర్మించిన పంచతంత్రము, నారాయణ పండితులవారు నిర్మించిన హితోపదేశము సరళసంస్కృతమయములు. అవి పశుపక్ష్యాది పాత్రముల ద్వారా మానవులకు నీతులను బోధించుటతో పాటు సరళ సంస్కృతము నభ్యసించుటకు రుచిర మార్గములను కూడ చూపుచున్నవి. కావున సంస్కృతవిద్యార్థులు ఆ గ్రంథద్వయమును విధిగా పఠించుట భారతదేశమున సంప్రదాయమై యున్నది.

ఇఁక మన చిన్నయసూరి ఆంధ్రీకరించిన మిత్త్రలాభ మిత్త్రభేదములు మూలగ్రంథముల వలె నీత్యుపదేశము సేయుచున్నను భాషావిషయమున స్వతంత్రించి ప్రౌఢమార్గము నవలంబించినవి. అనఁగా నాంధ్రభాషాప్రౌఢిమలు నేర్పుటలో నేర్పును వహించినవి. వీనిని పఠించుటవలన కావ్యభాష సులభముగా హృదయమందిరము నలంకరింపఁగలదు. ఆంధ్ర కావ్యభాష నధ్యయనించుట ఆంధ్రులధర్మమై యున్నది. అందులకు నీతిచంద్రికనుండి ప్రారంభించుట నిఖిలశ్రేయఃప్రదాయకము.

## తల్లిదండ్రులబాధ్యత

ఆంగ్లవిద్యావ్యామోహములో మునిఁగిన మనము నీతిచంద్రిక వంటి మంచి గ్రంథాలను విస్మరించుట నీతిగాదు. వీనిని వీలయినప్పుడు మనపిల్లలకు బోధింపఁజేసినచో భాషాపరముగాను, నీతిమార్గపరముగాను పిల్లలకు లభించు సత్ఫలము అనంత సంతోషసందాయకమై యుండును. నేటి బీజములనుబట్టి రేపటిఫలము లుండునట్లు నేటి సంస్కారమును బట్టి రేపటి వికాస ముండును.

కనుక మేధను పెంచు విద్య లెన్ని నేర్పినను హృదయమును పెంచు విద్యతో సాటిగా పసునత్యమును స్మరించుచు, పసివారి నడకలు పెడదారులు పట్టకముందే సైన్సుపుస్తకాలతోపాటు సత్సంస్కారదాయక గ్రంథరత్నములను వారికి మధురధోరణితో బోధింపవలసినకాలమిది. లేనిచో 21వ శతాబ్దము నందలి సమాజము అయోమయజలధిలో మునిఁగెడి ప్రమాదమున్నది. తెలివి కలిగినజాతి రానున్న ప్రమాదమును ముందుగానే పసిగట్టి ప్రతిక్రియకు సిద్ధపడఁగలదు.

నీతిచంద్రికయందలి కొన్ని మధురోక్తులను చదివినచో మన బాధ్యత యిట్టే స్ఫురింపఁగలదు. చూడుఁడు -

## మధురోక్తులు

1. పూలతోఁగూడిన నారకు వాసన గలిగినట్లు సజ్జనులతోడ సావాసించు మూర్ఖునకు మంచి గుణము గలుగుట సాజము. అంతే కాదు. సాధుసాంగత్యము సర్వశ్రేయములకు మూలము.
2. సంఘీభవించి యెంతటి కార్యమైన సాధింపవచ్చును. గడ్డిపరకలు సహితము పెంటిగా నేర్పడి మదపుటేనుఁగును బంధించుచున్నవి.
3. శరీరము క్షణభంగురము, గుణములు కల్పాంతస్థాయులు.
4. సజ్జన దర్శనము సమస్త దోషములు పోఁగొట్టును, సర్వశుభములిచ్చు నని పెద్దలు చెప్పుదురు.
5. ఉన్నకాల మందటికి మంచివాఁడనిపించుకొని పోవలెను.
6. పోఁగాలము దాపించినవారు దీపనిర్వాణగంధమును, అరుంధతినీ, మిత్త్రవాక్యమును మూర్కొనరు, కనరు, వినరు అని పెద్దలు చెప్పుదురు.
7. ఉన్నంతలో జరుపుకోవలెను గాని విస్తరించి పదార్థ సంగ్రహము చేయవలెనని పేరాసపడరాదు.
8. తృష్ణ యెంతటి మానెనా యావల దరిద్రుఁడెవఁడు? ధనికుఁడెవఁడు?
9. సర్వదానములు, సర్వవ్రతములు, సర్వయాగములు శరణాగతరక్షణముతో సరిగావు. శరణాగతు నుపేక్షించుట కంటె దురితము లేదు.
10. ప్రాప్తించిన దుఃఖమునకు విషాదపడరాదు.

ఇవి మిత్త్రలాభము నుండి చూపఁబడిన కొన్ని మాత్రమే. ఇట్టివి లెక్కకు మిక్కిలిగా తక్కిన భాగములలోను గలవు. ఈ సూక్తి రత్నములు మన బిడ్డల మనుగడకు పనికిరావని పలుకువారు గలరా? వీనిని వల్లె వేయింపవలసిన బాధ్యత మనపై లేదా? ఇట్టి మంచిమాటల నాచరింపఁజేయుచు మన సంస్కృతిని నిలుపుకొనవలదా?

### ప్రశంసనీయ ప్రచురణము

చిన్నయసూరి భాగములను, వీరేశలింగముగారి భాగములను ఏకత్ర కూర్చి రోహిణి పబ్లికేషన్స్‌వారు సంపూర్ణ నీతిచంద్రికను ప్రచురించి, తెనుఁగు జనులకు మహోపకార మొనరించినారు. ఈ సంపూర్ణనీతిచంద్రికకు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు వ్యాఖ్యా శారదను నిలిపి పాఠకులకు పరమోల్లాసమును కలిగించినారు. ద్వితీయముద్రణకు హితవచనాలు వ్రాసే భాగ్యము కలిగించిన రోహిణిపబ్లికేషన్స్‌వారికి ధన్యవాదాలు. ఇట్లే ప్రయోజన ప్రదాయక గ్రంథములను ప్రచురించుచు రోహిణి పబ్లికేషన్స్‌వారు భారత భారతీ సేవాతత్పరులు కాఁగలరని ఆశించుచున్నాను.

### ప్రభుత్వమునకు విజ్ఞప్తి

మన విద్యార్థులు పదవతరగతి ముగియునప్పటికి నీతిచంద్రికపై మంచిపట్టు సాధించునట్లు తెలుఁగు వాచకములను నిర్మింపఁజేయవలసినదిగా మన ప్రభుత్వమువారికి మనవి చేయుచున్నాను. ఇందుల కనుగుణముగా 8, 9, 10 తరగతులలో క్రమవికాసము కలుగునట్లు కథలను కూర్చవలసియుండునని భావించు చున్నాను. ప్రస్తుతమున్న పదవతరగతి తెలుఁగు వాచకములో నీతిచంద్రికలోని ప్రౌఢకథను చేర్చవలసినదిగా విన్నవించుచున్నాను.

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

- శ్రీ వినుకొండ వల్లభరాయుడు

బహుధాన్య శ్రావణ బహుళ
పంచమి బుధవారము
(12-8-1998)

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు
పుయ్యూరు లక్ష్మీనరసింహారావు

శ్రీః

# సంపూర్ణ నీతిచంద్రిక

## మంగళాచరణము

ఉ. శ్రీ యను మించుమిం చొలయ సేవక చాతకలోక మోదసం
ధాయకుఁడై, యుదారకరుణారసవృష్టి దురాపతాపముల్
వాయఁగఁ జేయుచున్ సకల వాంఛిత సస్యము లుల్ల సిల్లఁగాఁ
జేయుచు వేంకటాద్రి నివసించుఘనుం డిడుఁగాత! భద్రముల్. 1

శ్రీ + అను-మించు-మించు = లక్ష్మీదేవి యనెడు ప్రకాశించు మెఱపు, ఒలయన్ = వ్యాపింపఁగా, సేవక....సంధాతుకుఁడై; సేవక = సేవకులు (భక్తులు) అనెడి, చాతక = వానకోయిలల యొక్క, లోక = సమూహమునకు, మోద = సంతోషమును, సంధాయకుఁడు = కూర్చువాఁడు, ఐ = అయి, ఉదార...వృష్టిన్ : ఉదార = అధికమైన, కరుణారస = దయారసము అను నీటియొక్క, వృష్టిన్ = వానచేత, దురాప-తాపముల్ = పొంద శక్యముకాని, తాపముల్ = ఆధ్యాత్మి కాధిభౌతి కాధిదైవికములనెడి తాపత్రయ మనెడి సెగలను, పాయఁగన్ + చేయుచున్ = పోఁగొట్టుచు, సకల .... సస్యములు : సకల = ఎల్లరయొక్క, వాంఛిత = కోరికలనెడి, సస్యములు = పంటలును, ఉల్లసిల్లఁగాన్ + చేయుచున్ = ప్రకాశింపఁజేయుచు - పండించుచు ననుట, వేంకటాద్రిన్ = పాపనాశకమగు తిరుమలయందు, నివసించు - ఘనుండు = ఉండు గొప్పవాఁ డనెడు మేఘుఁడు, భద్రములు = శుభములను, ఇడుఁ గాతన్ = ఇచ్చుఁగాక.

శ్రీ వేంకటేశ్వరుఁడు నీలమేఘమువంటి శరీరచ్ఛాయ కలవాఁడనియు, లక్ష్మీదేవి మెఱుపుఁ దీఁగవంటి మేను గలదనియు, లక్ష్మీదేవి వేంకటేశ్వరుని వక్షమునందుండి ప్రకాశించుట వర్షించునపుడు మేఘమధ్యమందుండి మెఱపు మెఱయు నట్లున్నదనియుఁ, దెలియనగును. మించు మించు-అనుట సామాన్యమైన మెఱపువలెఁగాక యీ మెఱపు నిలిచి మెఱయుచున్నదను నర్థమును దెలియఁజేయుచున్నది. మెఱపుతోడి వర్షమును జెప్పుటచే నధికవర్షము తోఁచుచున్నది. వర్షాధిక్యమునకు మెఱపు హేతువు. అట్లే దయారసవర్షాతిశయమునకు లక్ష్మి హేతువని తెలియఁదగినది. సామాన్యవృష్టి సామాన్యతాపమును బోఁగొట్టఁగా, ఈ వృష్టి సంసారరూపమైన దుస్సహసంతాపమును గూడఁ బోఁగొట్టును. కావుననే 'దురాప' తాపము లనుట. సాధారణ మేఘము కొన్నిచోట్ల

మాత్రమే కురిసి కొందఱి పయిరునే పండించును. కాని యీ మేఘము దయారసము నెల్లచోట్లఁ గురిసి యెల్లర వాంఛిత సస్యములను బండించును. కావుననే 'సకల' విశేషణము.

క. కరుణ తెలుంగున హరి యెద
నిరవుకొని యఘాళి నరయనీక యతనిచే
నిరతము సంశ్రితజనులం
బరిరక్షింపించుతల్లి భజియింతు మదిన్. 2

హరి + ఎదన్ = విష్ణువు వక్షమునందు, ఇరవుకొని = వసించి, అఘ + ఆళిన్ = పాపముల వరుసను, నిరతమున్ = ఎల్లప్పుడును, సంశ్రిత - జనులన్ = ఆశ్రయించిన జనులను, - భక్తులను, పరిరక్షింపించు = కాపాడఁజేయు.

హరి ప్రజలకుఁ దండ్రి కనుక, లక్ష్మి తల్లియగును. ఆమె భక్తుల దోషములను గణింపనీక భర్తచే వారిని గాపాడఁజేయుచున్నదని భావము.

చ. వనజభవాండభాండము లవారిగ నెవ్వని తుందకందరం
బున నొకమేల నింటరముఁ బొందక పొందుగఁబొల్చు నమ్మహా
త్ముని నిజభోగశయ్య నిడి పొత్తులకందువునట్లు లాలనం
బొనరుచు నయ్యనంతు, మహిమోన్నతు సన్నుతియింతు నిచ్చలున్.3

వనజభవాండభాండములు = కుండలవంటి బ్రహ్మాండములు, అవారిగన్ = అపరిమితముగా, ఎవ్వని-తుంద-కందరంబునన్ = ఏ మహాత్ముని గుహవంటి కడుపునందు, ఒక-మేలన్ = ఒక గుంపుగా, ఇంటరమున్ = ఇఱుకటమును, పొందక = చెందక, పొందుగన్ = పొందికగా, పొల్చున్ = ఒప్పునో, ఆ + మహాత్మునిన్ = మహానుభావుఁడైన ఆ విష్ణువును, నిజ-భోగ-శయ్యన్ = తనదైన, శరీరమనెడు సుఖార్థ మయిన, పఱుపునందు, ఇడి = ఉంచి, పొత్తుల-కందువు + అట్లు = సన్నని మెత్తని ప్రాఁతవస్త్రములందలి శిశువును వలె, లాలనంబు + ఒనరుచు = బుజ్జగించునట్టి, ఆ + అనంతున్ = ఆ ఆదిశేషుని, మహిమ+ఉన్నతున్ = గొప్పతనముచేత అధికుఁడైన వానిని, నిచ్చలున్ = ఎల్లప్పుడును, సన్నుతియింతున్ = చక్కఁగా స్తుతింతును.

బ్రహ్మాండభాండములను దన కడుపులో నొక గుంపుగా నిఱికించుకొన్న మహానుభావుఁడైన శ్రీ మహావిష్ణువును దన శరీరమనెడు శయ్యపై నిడికొని పొత్తులలో నున్న పసిబిడ్డనువలె లాలించు నాదిశేషుని స్తుతింతునని భావము.

# కవిస్తుతి

క. ఘను నన్నయభట్టును, ది
క్కన, నెఱ్ఱాప్రెగడఁ బొగడి - యలికంబున య
క్షిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్.

అలికంబున యక్షినిన్ = నుదుటి యందలి కంటిని, డాఁచిన + అట్టి = దాఁచినటువంటి, సర్వజ్ఞునిన్ - సర్వముఁ దెలిసినవానిని - ఈశ్వరుని - ఇది నాచన సోమనాథునకు విశేషణము.

నాచన సోమనాథుఁడు ఉత్తర హరివంశ కావ్యకర్త. ఇతనికి సర్వజ్ఞుఁడని బిరుదు కలదు. అనఁగా సర్వమును దెలిసిన ఈశ్వరుఁడని యర్థము. మఱి ఈశ్వరునకు నుదుటఁ గన్ను కలదుగదా! ఇతని కేదీ యనఁగా నితఁడు దానిని దాఁచెనని భావము. నుదిటి కన్ను కనఁబడని సర్వజ్ఞుఁడని యర్థము. అలికంబున యక్షిని - ఇది 'అరదంబున యురవడికిన్' వంటి సమాసము. సూ. షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. ప్రౌఢ. సమాస. 1

# కృతి ప్రశంస

తే. ఒనరఁగాఁ బంచతంత్ర హితోపదేశ
ములను బరికించి, వానిలో వలయు నంశ
ములను గొని, కొంత యభినవంబుగను గూర్చి
కృతియొనర్చెద 'నీతిచంద్రిక' యనంగ. 1

ఒనరఁగాన్ = ఒప్పుగా, పంచతంత్రము - ఇది విష్ణుశర్మ యను పండితునిచే రచింపఁబడినది. ఇందు మిత్రభేదము, మిత్ర సంప్రాప్తి కాకోలూకీయము, లబ్ధప్రణాశము, అపరీక్షితకారిత్వము అను నైదు తంత్రములు గలవు.

హితోపదేశము : దీనిని నారాయణ పండితుఁడు రచించెను. ఇందు మిత్రలాభము, సుహృద్భేదము, విగ్రహము, సంధి యను నాలుగు కథలు గలవు. అభినవంబుగను - క్రొత్తగాను.

క. తుదముట్టఁగ నీ కబ్బము
పదిలముగాఁ జదివినట్టి బాలుర కోలిం

బొదలును భాషాజ్ఞానము
కుదురుం గొదలేక నీతికుశలత్వంబున్. 2

తుద-ముట్టఁగన్ = సంపూర్ణముగా, కబ్బము = కావ్యము, ఓలిన్ = క్రమముగా, పొదలును = కలుగును, కొదలేక = కొదవ (కొఱఁత) లేక. నీతికుశలత్వంబున్ = నీతి శాస్త్రమునందు నేర్పును, కుదురున్ = అమరును.

తే. విద్యయొసఁగును వినయంబు; వినయమునను
బడయుఁ బాత్రత; పాత్రతవలన ధనము;
ధనమువలనను ధర్మంబు; దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు. 3

వినయంబు = అడఁకువ. వినయమునను = అడఁకువచేత, పాత్రత = అర్హత. ఐహిక + ఆముష్మిక-సుఖంబులు = ఇహ పరలోకముల సౌఖ్యములు.

ఆ. జరయు, మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము, విద్యఁ గూర్పఁ దలఁపవలయు;
ధర్మ మాచరింపఁదగు మృత్యుచేఁ దల
వట్టి యీడ్వఁబడినవాఁడుఁబోలె. 4

జర = ముసలితనము, మృతి = చావు, ప్రాజ్ఞుండు = పండితుఁడు, ధర్మ....వాఁడుఁబోలె = మనుష్యుఁడు మృత్యువుచేఁ దలపట్టి యీడ్వఁబడిన వాని విధమున - అనఁగా బలాత్కారముగా నైనను ధర్మము నాచరింపవలయుననుట.

ఆ. నీతిలేనివాని నిందింత్రు లోకులు;
లేదు సేగి లాఁతి లేకయున్నఁ;
గాన మానవుండు పూనిక నయవిద్య
గడనసేయ మొదలఁ గడఁగవలయు. 5

సేగి = కీడు, లాఁతి = ఇతరము, పూనికన్ = ప్రయత్నముతో, నయ-విద్య = నీతి విద్య, గడన+చేయన్ = సంపాదించుటకు, మొదలన్ = ముందు; కడఁగవలయున్ = ప్రయత్నింపవలయును.

నీతిలేనివానిని లోకులు నిందింతురు. ఇతరము లేకున్నను కీడు లేదు - నీతి మాత్ర మావశ్యకము. కావున మానవుఁడు పూనికతో నీతివిద్య నార్జింప మొదట యత్నింపవలయును.

క. నవభాజనమున లగ్నం
బవు సంస్కారంబు వొలియ దటు గావున మా
ణవులకుఁ గథాచ్ఛలంబునఁ
జవి యుట్టఁగ నీతివచనసరణిఁ దెలిపెదన్. 6

నవ-భాజనమునన్ - నవ = క్రొత్తది యగు, భాజనమునన్ = పాత్రము నందు, లగ్నంబు + అవు = అంటినది అగు, సంస్కారంబు = చిత్రము, పొలియదు = నశింపదు, అటు+కావునన్ = ఆ కారణముచేత, మాణవులకున్ = బాలురకు, కథాచ్ఛలమునన్ : కథా = కథలనెడి, ఛలమునన్ = నెపముచేత, చవి = రుచి, ఉట్టఁగన్ = కలుగునట్లు, నీతి-వచన - సరణిన్ = నీతి వాక్యపద్ధతిని, తెలిపెదన్ = ఎఱిఁగింతును.

పచ్చికుండపై వ్రాసిన చిత్రము చెడకుండునట్లు బాలురకుఁ జెప్పినవిద్య మనసున బాగుగా నాటుకొనును. కనుకఁ గథలనెపమున బాలురకు నీతులను దెలిపెదను.



# కథా ప్రారంభము

గంగాతీరమందు సకల సంపదలు గలిగి పాటలీపుత్ర మను పట్టణము గలదు. ఆ పట్టణమును సుదర్శనుఁడను రాజు పాలించుచుండెను. అతఁ డొకనాఁడు వినోదార్థము విద్వాంసులతో సల్లాపములు జరపుచుండఁగా నొక బ్రాహ్మణుఁడు-

క. "పరువంబు, కలిమి, దొరతన,
మరయమి యనునట్టి వీనియం దొకఁడొకఁడే
పొరయించు ననర్థము నాఁ
బరఁగినచో నాల్గుఁ జెప్పవలయునె చెపుమా?"

పరువంబు = యౌవనము, కలిమి = సంపద, దొరతనము = ప్రభుత్వము, అరయమి = అవివేకము, ఒకఁడొకఁడే = ఒక్కటొక్కటే, అనర్థమున్ = కీడును, పొరయించున్ + నాన్ = కలిగించుననఁగా, నాల్గున్ = పరువము మున్నగు నాలుగును, పరఁగినచోన్ = ఉన్నయెడల.

యౌవనము, సంపద, ప్రభుత్వము, అవివేకము అను నాల్గింటిలో ఒక్కటొక్కటే కీడును గలిగించుననఁగా, ఆ నాలుగు నున్నయెడలఁ దప్పక కీడు కలుగునని వేఱుగఁ జెప్పవలయునా? చెప్పనక్కఱలేదనుట,అలంకారము కావ్యార్థాపత్తి.

క. "పలు సందియములఁ దొలఁచును
వెలయించు నగోచరార్థవిజ్ఞానము, లో
కుల కక్షి, శాస్త్ర; మయ్యది
యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్."

పలు-సందియములన్ = పెక్కు సందేహములను, తొలఁచును = తొలఁగించును, అగోచర + అర్థ-విజ్ఞానము = దృష్టివిషయములు గాని పదార్థములయొక్క వివేకమును, వెలయించున్ = ప్రకాశింపఁజేయును, లోకులకున్ = జనులకు, శాస్త్రము, అక్షి = కన్ను; అయ్యది = ఆ శాస్త్రమనెడి కన్ను, ఎవ్వనికిన్ = ఎవనికి, అలవడదు = కలుగదు, వాఁడు+ఎ = వాఁడే, జగతిన్ = లోకమున, అంధుఁడు = గ్రుడ్డివాఁడు.

శాస్త్రము పెక్కు సందేహములను దొలఁగించును. కంటికిఁ గనఁబడని పదార్థముల వివేకమును గలిగించును. కనుక లోకులకు శాస్త్రమే కన్ను. అది లేనివాఁడే లోకమున గ్రుడ్డివాఁడు.

అని ప్రస్తావవశముగా[1] జదివెను. ఆ పద్యములు రాజు విని, చదువులేక మూర్ఖులయి సదా క్రీడాపరాయణులయి[2] తిరుగుచున్న తన కొడుకులఁ దలఁచుకొని యిట్లని చింతించె :

తల్లిదండ్రులు చెప్పినట్టు విని చదువుకొని లోకులచేత మంచివాఁడని పించుకొన్నవాఁడు బిడ్డఁడు గాని, తక్కినవాఁడు బిడ్డఁడా ? మూర్ఖుఁడు కలకాలము తల్లిదండ్రులకు దుఃఖము పుట్టించుచున్నాఁడు. అట్టివాఁడు చచ్చెనా తల్లిదండ్రులకు దుఃఖము నాఁటితోనే తీఱుచున్నది. కులమునకు యశము[3] తెచ్చినవాఁడు పుత్త్రుఁడుగాని, తల్లి కడుపు చెఱుపఁ బుట్టినవాఁడు పుత్త్రుఁడు గాఁడు. గుణవంతులలోఁ బ్రథమగణ్యుఁడు[4]గాని కొడుకును గన్న తల్లికంటె వేఱు గొడ్రాలు గలదా? గుణవంతుఁడయిన పుత్త్రుఁ డొకఁడు చాలును. మూర్ఖులు నూఱుగురవలన ఫలమేమి? ఒక రత్నముతో గులకరాలు గంపెఁడయినను సరిగావు. విద్యావంతులయి గుణవంతులయిన పుత్త్రులను జూచి సంతోషించుట యను సంపద మహాపుణ్యులకుఁగాని యెల్లవారికి లభింపఁదు," అని కొంత చింతించి, యుంకించి[5], తల పంకించి[6] "యూరక యీ చింత యేల? నా పుత్త్రులు చదువమనిరా? పరామరిక[7]మాలి[8] తగిన విద్యాభ్యాసము చేయింపనయితిని. బిడ్డలకు విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రుల దోషము. తల్లిదండ్రులచేత శిక్షితుండయి బాలుఁడు విద్వాంసుఁడగును గాని, పుట్టఁగానే విద్వాంసుఁడు గాఁడు. పురుషకారముచేత[9]ఁ గార్యములు సిద్ధించును. రిత్త[10]కోరికలచేత సిద్ధింపవు. నిద్రించు సింహము నోరను మృగములు తమంత వచ్చి చొరవు. కాఁబట్టి యిప్పుడు నా పుత్త్రులకు విద్యాభ్యాసముకయి వలయు ప్రయత్నము చేసెద"నని చింతించి యచటి

1.సందర్భానుసారముగా; 2. ఆటలయం దాసక్తిగలవారై; 3. కీర్తి; 4. మొదట నెంచఁదగినవాఁడు; 5. యత్నించి; 6. ఊఁపి; 7. విచారణ; 8.నశించి; 9. పురుష ప్రయత్నము; 10. వ్యర్థమైన.

విద్వాంసులతో నిట్లనియె: "నా పుత్త్రులు విద్యాభ్యాసము లేక క్రీడాసక్తులయి[1] తిరుగుచున్నవారు. ఎవ్వరయిన వీరిని నీతిశాస్త్రము చదివించి మంచి మార్గమునకుఁ ద్రిప్పఁజాలినవారు కలరా?" యనిన విష్ణుశర్మయను బ్రాహ్మణుఁ డిట్లనియె:

"రాజోత్తమా! ఇది యెంతపాటి పని? మహావంశజాతులయిన దేవర[2] పుత్త్రులను నీతివేదులను[3] జేయుట దుష్కరముగాదు. కొంగను మాటలాడించుట దుష్కరము గాని, చిలుకను బలికించుట దుష్కరము గాదు. సద్వంశమందు గుణహీనుఁడు పుట్టఁడు. పద్మరాగముల గనిలో గాజు పుట్టునా? ఎట్టి రత్నమయినను సానపెట్టక ప్రకాశింపనట్లు బాలుఁ డెట్టివాఁడయినను గురుజనశిక్ష లేక ప్రకాశింపఁడు. కాఁబట్టి నే నాఱుమాసములలో దేవర పుత్త్రులను నీతికోవిదులను జేసి మీకు సమర్పించెదను." అనిన రాజు సంతోషించి యిట్లనియె: "పూవులతోఁగూడిన నారకు వాసన గలిగినట్లు సజ్జనులతోడ సావాసించు[4] మూర్ఖునకు మంచిగుణము గలుగుట సాజము[5]. అంతేకాదు. సాధుసాంగత్యము[6] సర్వ శ్రేయములకు[7] మూలము." అని సాదరముగా వచియించి, యాతనికిఁ బసదనమిచ్చి[8], తన కొడుకులను రప్పించి చూపి, "విద్యాగంధము[9] లేక జనుషాంధులవలె[10] నున్నారు; వీరిని గన్ను దెఱపి రక్షించుట మీ భార" మని చెప్పి యొప్పగించెను.

అనంతర మా బ్రాహ్మణుఁడు వారల నొక రమణీయ సౌధమునకుఁ దోడుకొనిపోయి కూర్చుండఁబెట్టుకొని యిట్లనియె; "మీకు వినోదార్థ[11] మొక కథ చెప్పెద. అది మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధియునని నాలుగంశములచేత నొప్పుచుండును - వినుండు.

---

1. ఆటలయందాసక్తిగలవారు; 2. ప్రభువుల; 3. నీతియందుఁబండితులు; 4.సహవాసముచేయు; 5. సహజము; 6. మంచివారితోడి స్నేహము; 7. ఎల్లమేళ్ళకు; 8. పారితోషికము; 9.విద్యయొక్క వాసన; 10. పుట్టుగ్రుడ్డివారు; 11.వేడుకకయి.

# మిత్రలాభము

"ధన సాధన సంపత్తి లేనివారయ్యు బుద్ధిమంతులు పరస్పర మైత్రి[1] సంపాదించుకొని కాక, కూర్మ, మృగ, మూషికములవలె స్వకార్యములు సాధించుకొందురు." అనిన రాజపుత్త్రులు విని "యే కార్యములు కాక, కూర్మ, మృగ, మూషికములు[2] సాధించెను ? మాకు సవిస్తరముగ వినిపింపుఁ"డనిన విష్ణుశర్మ యిట్లని చెప్పఁదొడంగె.

### లఘుపతనకము హిరణ్యకుని యొద్ద కేఁగుట

గోదావరీ తీరమందు గొప్ప బూరుగు వృక్షము గలదు. అందు నానా దిక్కులనుండి వచ్చు పక్షులు రాత్రి వసించుచుండును. ఒకనాఁడు వేకువ లఘుపతనకమను వాయసము[3] మేలుకొని రెండవ యమునివలె సంచరించుచున్న కిరాతునిఁజూచి, "వఱువాత[4] లేచి వీని మొగము చూచితిని, నేఁడేమి కీడు రాఁగలదో తెలియదు. వీఁడు వచ్చినచోట నిలువఁదగదు. జాగు[5] సేయక యీచోటు విడిచి పోవలె" నని యత్నము సేయుచుండఁగా వాఁ డా వృక్షమునకు సమీపమందు నూకలుచల్లి, వలపన్ని పోయి చేరువ పొదలో దాఁగి పొంచి చూచుచుండెను. అనంతరము చిత్రగ్రీవుఁడను కపోతరాజు నింగిని[6] సంచరించుచు నేలమీఁది నూకలు చూచి, తనతోడి కపోతములతో[7] నిట్లనియె: "ఈ నిర్జనవనమందు[8] నూకలు రా నిమిత్త[9] మేమి?"

"మన మీ నూకల కాసపడరాదు. తొల్లి యొక్క తెరువరి[10] కంకణమున[11] కాశపడి పులిచేతఁ దగులుకొని మృతిఁ బొందెను. మీ కా కథ చెప్పెద వినుండు!

### పులి - కంకణము - బాటసారి

"ఒక ముసలిపులి స్నానముచేసి దర్భలు చేతఁబట్టుకొని కొలని గట్టున నుండి 'యోయి, తెరువరీ! ఈ పయిఁడి[12] కంకణము పుచ్చుకొ'మ్మని పిలిచి చెప్పెను. ఒక పాంథుఁ[13] డామాట విని 'యిది నా భాగ్యముచేతనే వచ్చుచున్నది.

---

1. ఒండొరులతో స్నేహము; 2. కాకి, తాఁబేలు, లేడి, ఎలుక; 3. కాకి; 4. వేకువను; 5. ఆలస్యము; 6. ఆకాశమునందు; 7. పావురములతో; 8. జనులు లేని అడవి; 9. కారణము; 10. బాటసారి; 11. కడియమునకు; 12. పయిఁడి=బంగారు; 13. పాంథుఁడు=బాటసారి.

ఏల సందేహపడవలె' నని చింతించి 'యేదీ కంకణము చూపు' మని యడిగెను. పులి చేయి చాఁచి 'యిదిగో హేమకంకణము[1] - చూడు' మని చూపెను. 'నీవు క్రూర జంతువవు. కాఁబట్టి యేలాగున నిన్ను నమ్మవచ్చు' నని పాంథుఁడు పలికెను. ఆ మాట విని పులి యిట్లనియె : 'ఓరీ పాంథా! విను. మునుపు యౌవనమందు మిక్కిలి దుష్టుఁడనయి యుంటిని. అనేకములగు గోవులను, మనుష్యులను వధించి మితిలేని పాపములను సంపాదించి భార్యాపుత్త్రులను బోఁగొట్టుకొని యేకాకినయి[2] నిలిచితిని.. అనంతర మొక పుణ్యాత్ముఁడు నాయందు దయచేసి 'యిఁకమీఁదట గోవులను, మనుష్యులను వధింపకు. సత్కార్యములు చేయు' మని చెప్పెను. అది మొదలుకొని పాపకృత్యములు విడిచి మంచికార్యములు చేయుచున్నవాఁడను, వృద్ధుఁడను. బోసి[3] నోరి వాఁడను. గోళ్ళు పోయినవి. లేవ సత్తువలేదు. నన్ను నీవేల నమ్మవు? నీవు దరిద్రుఁడవు కాఁబట్టి యిది నీకు దానము సేయవలెనని కోరితిని. సంశయపడక యీ కొలనిలో స్నానముచేసి వచ్చి పసిఁడి కంకణము పుచ్చుకొమ్ము. అనఁగానే వాఁడు పేరాస[4] చేత దాని మాటలకు లోఁబడి కొలనిలో స్నానము చేయఁబోయి మొలబంటి బురదలో దిగఁబడెను. అప్పుడు పులి చూచి 'యయ్యయ్యో! పెను రొంపిలో[5] దిగఁబడితివి గదా! నేను వచ్చి నిన్ను లేవనెత్తెదను. భయపడకు' మని తిన్నతిన్నఁగా సమీపించి వానిని బట్టుకొనెను. ఈలాగున వాఁడు తగులుకొని 'క్రూరజంతువును నమ్మరాదు. నమ్మి యీ గతి తెచ్చుకొంటిని. మించినదానికి వగచి యేమి ప్రయోజనము? ఎవ్వరికైన విధి[6] తప్పించుకో వశముగాదు.' అని చింతించుచు దానిచేత భక్షింపఁబడియె.

"కాబట్టి సర్వవిధముల విచారింపని పని చేయరాదు. చక్కఁగా విచారించి చేసిన పనికి హాని[7] యెప్పటికి రాదు." అని చెప్పఁగా విని యొక కపోతవృద్ధము[8] నవ్వి యిట్లనియె : "ఆ! ఇవి యేటిమాటలు? ఒక యిక్కట్టు[9]

---

1. బంగారు కడియము; 2. ఒంటరినయి; 3. పండ్లులేని; 4. పేరు + ఆశ = పెద్దఆశ; 5. పెద్దబురదలో; 6. ఏర్పాటు; 7. కీడు; 8. వృద్ధమైన కపోతము; 9. కష్టము.

వచ్చినప్పుడు వృద్ధుని మాట వినవలసినది. వినుండు స్థానాస్థానములు[1] వివేకింపక[2] సర్వత్ర[3] యిట్టి విచారము పెట్టుకోరాదు. కొఱమాలిన[4] శంకలు తెచ్చుకొని భోజనము మానుకోవచ్చునా? మానుకొని యేలాగున బ్రదుకవచ్చును? ఈర్ష్యాళువు,[5] జుగుప్సావంతుడు,[6] నిస్సంతోషి,[7] క్రోధనుఁడు,[8] నిత్యశంకితుఁడు[9] పరభాగ్యోపజీవియు[10] ననువా రాఱుగురు దుఃఖభాగులని[11] నీతికోవిదులు చెప్పుదురు.' అనఁగా విని కపోతములన్నియు నేల వ్రాలెను.

గొప్పశాస్త్రములు చదివి మిక్కిలి వినికి[12]గలిగి పరుల సంశయములను వారింప నేర్పుగలవారు సహితము లోభమువల్ల వివేకము పోఁగొట్టుకొని క్లేశపడియెదరు.[13] అహా! లోభ మెంత చెడుగుణము! అన్ని యిడుమలకు[14] లోభము కారణము.

## పావురములన్నియు వలలోఁ దగులుకొనుట

అనంతరము పావురములన్ని వలలోఁ దగులుకొని కపోతవృద్ధమును జూచి 'నీవు వృద్ధుఁడవు - తెలిసినవాఁడవని భ్రాంతిపడి నీ మాటలను విని యీ విపత్తు[15] తెచ్చుకొంటిమి. ఎవ్వఁడు బుద్ధిమంతుఁడో వాఁడు వృద్ధుఁడు గాని, యేండ్లు మీఱిన వాఁడా వృద్ధుఁడు?' అని కపోతములు నిందింపఁగా విని చిత్రగ్రీవుఁ డిట్లనియె : "ఇది యీతని దోషముగాదు. ఆపదలు రాఁగలప్పుడు మంచి సహితము చెడు గగుచున్నది. మన కాలము మంచిది గాదు. ఊరక యేల యీతని నిందించెదరు? ఈతఁడు తనకుఁ దోఁచినది చెప్పినాఁడు. అప్పుడు మనబుద్ధి యేమయ్యె? ఆపద వచ్చినప్పుడు తప్పించుకొను సాధనము విచారింపవలెఁగాని, యీ మాటలవల్ల ఫలమేమి? విపత్కాలమందు విస్మయము[16] కాపురుష లక్షణము.[17] కాఁబట్టి యిప్పుడు ధైర్యము తెచ్చుకొని ప్రతీకారము[18] చింతింపుఁడు. ఇప్పటికి నా కొకటి

---

1. తగిన, తగనిచోట్లు; 2. విచారింపక; 3. అన్నిచోట్ల; 4. ప్రయోజనములేని; 5. పరుల మేలుచూచి ఓర్వలేనివాఁడు; 6. రోఁత గలవాఁడు; 7. సంతోషము లేనివాఁడు; 8. కోపము గలవాఁడు; 9. ఎప్పుడును అనుమానించువాఁడు; 10. ఇతరుల సంపదనే అనుసరించి బ్రతుకువాడు; 11. దుఃఖమును పొందువారు; 12. వినుట; 13. కష్టము పొందుదురు; 14. కష్టములకు; 15. కష్టము; 16. ఆశ్చర్యము; 17. దుర్జనుల స్వభావము; 18. మాఱుచేఁత.

తోఁచుచున్నది. మీరందఱు పరాకు[1] లేక వినుండు. ఒక్కసారిగా మన మందఱము వలయెత్తుకొని యెగిరిపోవుదము. మన మల్పులము - మన కీ కార్యము సాధ్యమగునాయని విచారింపఁబనిలేదు. సంఘీభవించి[2] యెంతటి కార్యమైన సాధింపవచ్చును. గడ్డిపరకలు సహితము వెంటిగా[3] నేర్పడి మదపుటేనుఁగును[4] బంధించుచున్నవి. మీరు విచారింపుఁడు. దీనికంటె మంచి సాధనము మీ బుద్ధికిఁ దగిలెనా యది చేయుదము!" అనిన విని 'మీరు చెప్పినదే సరి. ఇంతకంటె మంచి సాధనము లే'దని చెప్పి పావురములన్ని విచిత్రముగా గగనమార్గమున[5] కెగిరెను. అప్పు డా వ్యాధుఁడు[6] వెఱగుపడి[7] 'యీ పక్షులు గుంపుగూడి వలయెత్తుకొని పోవుచున్నవి. నేల వ్రాలఁగానే పోయి పట్టుగొనెదఁ గాక' యని చింతించి మొగము మీఁది కెత్తుకొని తెప్పవ్రేయక చూచుచు, నవి పోవు దిక్కున కయి క్రిందనే పోవుచుండెను. ఈ వింత చూడవలెనని లఘుపతనకము పావురములను వెంబడించి పోవుచుండెను. అనంతర మా పక్షులు చూపుమేర దూరము మీఱి పోఁగానే వ్యాధుఁడు నిరాశ చేసికొని మరలిపోయెను. అదిచూచి యిప్పుడు మనము చేయవలసినది యేమియని పక్షు లడిగెను. చిత్రగ్రీవుఁ డిట్లనియె: "లోకమందు మాతాపితలు,[8] మిత్రుఁ డను వీరు మువ్వురే హితులు.[9] తక్కినవారందఱు ప్రయోజనముఁ[10] బట్టి హితు లగుచున్నారు. కాఁబట్టి యిప్పుడు నాకు మిత్రుఁ డొకఁడున్నాఁడు. అతఁడు హిరణ్యకుఁడను మూషికరాజు. గండకీ తీరమందు విచిత్రవన మాతని నివాసస్థానము. అతఁడు పండ్లబలిమిచేత వలత్రాళ్ళు తెగఁగొఱికి మనయాపదఁ బాపఁగలఁడు. అక్కడికి మనము పోవుదము." అని చెప్పఁగానే పావురములన్ని చిత్రగ్రీవుఁడు చెప్పిన గుఱుతు పట్టుకొని పోయి హిరణ్యకుని కలుఁగు[11] దాపున[12] వ్రాలెను. అప్పుడు హిరణ్యకుఁడు కపోతములు వ్రాలిన సద్దు[13] విని భయపడి కలుఁగులో మెదలకుండెను. అనంతరము చిత్రగ్రీవుఁడు కలుఁగుదాపు చేరి

---

1. ప్రమాదము; 2. కూడి; 3. పురి; 4. మదము + ఏనుగు = మదించిన ఏనుగు; 5. ఆకాశ మార్గమునకు; 6. బోయవాఁడు; 7. ఆశ్చర్యపడి; 8. తల్లిదండ్రులు; 9. మంచిని గోరువారు; 10. కార్యము; 11. రంధ్రము; 12. సమీపమున; 13. శబ్దము.

యెలుఁగెత్తి యిట్లనియె : 'ఓ చెలికాఁడా! ఏల మాతో మాటలాడవు?'' అనఁగానే హిరణ్యకుఁ డామాట సవ్వడి[1] పట్టి శీఘ్రముగా లాఁగ[2] వెలుపలికి వచ్చి యిట్లనియె :

## హిరణ్యకుఁడు పావురములను విడిపించుట

ఆహా! ఏమి నా భాగ్యము! నా ప్రియమిత్రుఁడు చిత్రగ్రీవుఁడు నాకు నేత్రోత్సవము[3] చేయుచున్నాఁడు'' అని పలుకుచు వలలోఁ దగులుకొన్న పావురములను జూచి వెఱఁగుపడి క్షణ మూరకుండి "చెలికాఁడా! ఇది యే'' మని యడిగెను. చిత్రగ్రీవుఁ డిట్లనియె : "ఇది మా పూర్వజన్మకర్మమునకు ఫలము. చేసిన కర్మమనుభవింపక తీఱునా?'' అనఁగానే చిత్రగ్రీవుని బంధము ఛేదించుటకయి[4] సమీపింపఁగాఁ జిత్రగ్రీవుఁ డిట్లనియె: "చెలికాఁడా! చేయవలసిన దీలాగునఁగాదు. ముందుగా నా యాశ్రితుల[5] బంధము[6] వడలింపుము. తరువాత నాకుఁ గానిమ్ము'' అనిన హిరణ్యకుఁడు విని యిట్లనియె : 'నా దంతములు మిక్కిలి కోమలములు.[7] అన్నిటి బంధములు కఱచి త్రెంపఁజాలను. పండ్లబలిమి కలిగినంతదాఁక నీ బంధము ఛేదించెదను. తరువాత శక్తి కలిగినపక్షమునకు మిగిలినవారి కార్యము చూచుకొందము' అనిన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె : 'ఆ లాగుననే కానిమ్ము. శక్తికి మీఱి యేమి చేయవచ్చును? ముందు యథాశక్తి[8] వీరి నిర్బంధము మానుపుము. ఆవల నాపని యప్పటికయినయట్లు విచారించుకొందము.' అనిన హిరణ్యకుఁ డిట్లనియె : 'తన్నుమాలి పరుల రక్షింపలెననుట నీతిగాదు, "తన్నుమాలిన ధర్మము, మొదలుచెడ్డ బేరము గలదా?'' యను లోకోక్తి[9] విన్నాఁడవు గావా? తాను బ్రదికి కదా సమస్త పురుషార్థములు[10] సాధించుకోవలె? తాను బోయిన తరువాత దేనితోనయినఁ బనియేమి?' అన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె : "చెలికాఁడా! నీవు చెప్పినది నీతి కాదనను. అయినను నావారి దుఃఖమును

1. జాడ; 2. కన్నము; 3. కన్నుల పండుగు; 4. త్రెంచుట కొఱకు; 5. ఆశ్రయించుకొన్నవారి; 6. కట్టు; 7. మృదువులు; 8. శక్తిననుసరించి (అవ్యయీభావ సమా.); 9. సామెత; 10. ధర్మార్థకామమోక్షములు.



చూచి సహింపఁజాలను కాఁబట్టి యింత నొక్కి చెప్పితిని. ప్రాజ్ఞుండు తన జీవితమునయిన మానుకొని మంచివారికి వచ్చిన కీడు తొలఁగింపవలెనని నీతికోవిదులు చెప్పుదురు. అది యటుండనిమ్ము. నావంటివారు వీరు - వీరివంటివాఁడను నేను. ఇప్పటి కొదవని నా ప్రభుత్వమువలన వీరికి రాఁగల ఫలమేమి? చెలికాఁడా! హేయమై[1] వినశ్వరమైన[2] యీ కళేబర[3] మం దాస్థ[4] మాని నాకు యశము సంపాదింపుము. నా వలన జీతమా, బత్తెమా? యేదియు లేదు. అయినను వీరు సర్వకాలము నన్ను విడువక కొలుచుచున్నారు. నేను వీరి ఋణమెప్పుడు తీర్చుకోఁ గలనో యెఱుఁగను. నా బ్రదుకు ముఖ్యముగాఁ జూడకు. వీరి ప్రాణములు రక్షించితేఁ[5] జాలును. అనిత్యమై[6] మలినమైన[7] కాయము[8]చేత, నిత్యమై నిర్మలమైన యశము లభించెనా దానికంటె లాభము గలదా? శరీరమునకు గుణములకు మిక్కిలి యంతరము[9]. శరీరము క్షణభంగురము,[10] గుణములు కల్పాంతస్థాయులు.[11] ఇట్టి శరీరము నపేక్షించి కీర్తి పోఁగొట్టుకొనవచ్చునా?" అనిన విని హిరణ్యకుఁడు సంతోషపడి పులకితుఁడై[12] యిట్లనియె. "చెలికాఁడా! మేలు మేలు. నీ యాశ్రిత వాత్సల్యము[13] గొనియాడ నేనేపాటివాఁడను? ఈ గుణముచేఁ ద్రిలోకాధిపత్యము[14]నకుఁ దగియున్నాఁడవు." అని పలికి యన్నిటి బంధములు తెగఁ గొఱికి వాని నన్నిటిని సాదరముగా[15] సంపూజించి "చిత్రగ్రీవా, చెలికాఁడా! యెంతవారికిఁ గాని పూర్వకర్మ మనుభవింపక తీఱదు. వలఁ దగులుకోలునకు[16] నొచ్చుకోకు.[17] సమస్తము తెలిసినవాఁడవు. నీకు నాబోఁటులు చెప్పెడుపాటివారు గారు." అని యూరడించి బలఁగంబుతోఁ చిత్రగ్రీవున కాతిథ్యము చేసి కౌఁగిలించుకొని వీడుకొలిపెను.[18] అనంతరము చిత్రగ్రీవుఁడు తన పరిజనములతో హిరణ్యకుని గుణములు కొనియాడుచు నిజేచ్ఛంజనియె.[19] మిత్రలాభము కంటె మించిన లాభము లోకమం దేదియుఁ గానము. కాఁబట్టి బుద్ధిమంతుఁడు పెక్కండ్రు

1. విడువఁదగినది; 2. విశేషముగా నశించునది; 3. శరీరము; 4. ప్రయత్నము; 5. రక్షించితివేని; 6. అశాశ్వతమై; 7. ముఱికియగు; 8. శరీరము; 9. భేదము; 10. క్షణములో నశించునది; 11. ప్రళయము వఱకు నుండునది; 12. గగుర్పాటు చెందినవాఁడై; 13. ఆశ్రయించిన వారియందలి దయ; 14. ముల్లోకముల ఏలుబడి; 15. ఆదరముతో; 16. చిక్కుకొనుట; 17. బాధపడకు; 18. పంపెను; 19. ఇష్టము వచ్చినట్లు.

మిత్రులను సంపాదించుకోవలెను. ఒక్క మూషికము తోడి మైత్రి కపోతముల కెంత కార్యము చేసినది! చూడుఁడు." అని చెప్పి మఱియు విష్ణుశర్మ యిట్లనియె :

### లఘుపతనకము హిరణ్యకుని సఖ్యముఁగోరి వచ్చుట

అనంతరము హిరణ్యకుఁడు తన లాఁగఁ జొచ్చెను. పిమ్మట లఘుపతనకము జరిగిన సర్వకార్యమునకు వింతపడి హిరణ్యకుని లాఁగ దాపున వ్రాలి యిట్లనియె : "ఓహో! హిరణ్యకా! కొనియాడఁదగినవాఁడవు గదా! నేను నీతో సఖ్యము[1] గోరి వచ్చితిని. అనుగ్రహింపుము - నా కోరిక సఫలము సేయుము." అనిన విని హిరణ్యకుఁడు లాఁగలోపలనుండి యిట్లనియె : "ఎవ్వడఁవు నీవు?" అనిన విని కాకి యిట్లనియె : "నేను వాయసమను. నా పేరు లఘుపతనకము." అనఁగానే హిరణ్యకుఁడు విని "సరి సరి, నీతోనా మైత్రి చేయవలె? ఏది యెవ్వరితోఁ దగునో వారితో బుద్ధిమంతుఁ డది చేయవలె. తగని కార్యముఁ జేయరాదు. నేను భోజ్యమను[2] నీవు భోక్తవు.[3] మనకు మైత్రి యేలాగున సరిపడును? నీతో మైత్రి నాకు విపత్తునకే కారణము. పూర్వమొక మృగము జంబుకమును[4] నమ్మి దాని కపటవచనములకు లోపడి పాశములలోఁ[5] దగులుకొని వాయసముచేత రక్షింపఁబడియె." అనిన విని "సవిస్తరముగా నాకది చెప్పు" మని లఘుపతనక మడిగెను. హిరణ్యకుఁ డిట్లనియె.

### మృగాకాకముల కథ

మగధ దేశమందు మందారవతి యను వనము గలదు. అందు బహు దినములనుండి మృగకాకములు రెండు మిక్కిలి సఖ్యముతో వాసము చేయుచుండెను. ఆ మృగము లెస్సగా[6] బలిసి వనములో విచ్చలవిడి సంచరించుచుండఁగా నొక నక్క చూచి యిట్లు చింతించె. "ఆహా! ఈ జింక

---

1. చెలిమి; 2. భుజింపఁదగినదానను; 3. భుజించువాఁడవు; 4. నక్కను; 5. త్రాళ్ళలో; 6. బాగుగా.

యెంత పోతరించియున్నది.[1] ఏలాగున దీని మాంసము నాకు లభించును? మంచిది. దీనికి నమ్మకము పుట్టించెద"నని యాలోచించి తిన్నఁగా సమీపము చేరి యిట్లనియె :-"మిత్రుఁడా, కుశలమా?" అనఁగానే విని 'యెవ్వఁడవు నీ' వని మృగమడిగెను. "నేను నక్కను. నా పేరు సుబుద్ధి. నా బంధువులందఱు నన్నొంటిఁజేసి పోయిరి. ఈ యడవిలో మృతకల్పుఁడనయి[2] యున్నవాఁడను. మఱి యెవ్వరితోఁగాదు దైవముతోఁ[3] జెప్పుచున్నాను వినుము. నిన్నుఁ జూడఁగానే నా బంధువులందఱు వచ్చినట్లు తోఁచినది. సజ్జన[4] దర్శనము సమస్త దోషములు పోఁగొట్టును; సర్వశుభము లిచ్చునని పెద్దలు చెప్పుదురు. దానికిదే తార్కాణము.[5] నేను నీతోడ సావాసము[6] చేయవలెనని మిక్కిలి కోరుచున్నాఁడను, నా కోరిక నెఱవేర్పుము." అనిన విని మంచి దాలాగుననే కానిమ్మని మృగము నక్కను వెంటఁబెట్టుకొని పోయి సాయంకాలము తన వాసస్థానము[7] చేరెను. అక్కడ మందారవృక్షము మీఁది కాకి తన మిత్రమయిన మృగమును జూచి 'యెవ్వఁ డీతఁ'డని యడిగెను. "ఈతఁడు సుబుద్ధియను జంబుకోత్తముఁడు.[8] నా చెలిమి గోరి వచ్చినవాఁ"డని జింక చెప్పెను. ఆ మాటలు వాయసము విని యిట్లనియె : 'క్రొత్తఁగా వచ్చిన వానిని నమ్మ వచ్చునా? ఇప్పుడు నీవు చేసినపని మంచిది కాదు. కులశీలములు దెలియక యెవ్వరికిఁగాని తా విచ్చుట[9] తగదు. పూర్వము "మార్జాలమునకు[10] జరద్గవమను గృధ్రము[11] తా విచ్చి మృతిఁ బొందెను. అది సవిస్తరముగా వివరించెద వినుము.

## జరద్గవము కథ

భాగీరథీ తీరమందు గొప్ప జువ్వి వృక్షము గలదు. దాని తొఱ్ఱలో జరద్గవ మను చీఁకు[12] ముసలి గద్ద వాసము చేయుచుండెను. ఆ వృక్షముమీఁద వసించు పక్షులు దానికి జీవనముకయి తాము తెచ్చుకొన్న యెర[13]లోఁ

---

1.బలిసియున్నది; 2. కొంచెముతక్కువగాఁజచ్చిన వానితో సమానుఁడను; 3. దైవ సమానుఁడవైన నీతో; 4. సత్ + జన; 5. నిదర్శనము; 6. మైత్రి; 7. నివసించుచోటు; 8. నక్కలలో శ్రేష్ఠుఁడు; 9. చోటిచ్చుట; 10. పిల్లికి; 11. గ్రద్ద; 12. గ్రుడ్డి; 13. ఆహారము.

గొంచెము గొంచెము పంచి యిచ్చుచుండెను. అది దానిచేత జీవనము చేయుచుండెను. ఒకనాఁడు దీర్ఘకర్ణమను పిల్లి పక్షిపిల్లలను భక్షించుటకై యా మ్రానికడకు 'సద్దు'[1] చేయక వచ్చెను. దాని రాకనుజూచి పక్షిపిల్లలు భయపడి కూయసాగెను. ఆ కోలాహలమును[2] జరద్గవము విని యెవ్వరో పరులు వచ్చుచున్నారని యెంచుకొని "యెవరక్కడ"? నని హెచ్చరించెను. అప్పుడు బిడాలము[3] గద్దనుజూచి భయపడి "హా! చచ్చితిఁ గదా! కడు దాపునకు వచ్చితిని. మరిఁగిపోనయితిగాదు,[4] తప్పించుకొని పోవుట కుపాయాంతరము లేదు; కార్యము మించినది. ఇప్పుడు వెనుకఁదీయరాదు, కానున్నది కాక మానదు - జోటిలోఁ దలదూర్చి రోఁకటిపోటునకు వెఱవఁదీఱునా?[5] మంచిది. ఇప్పుడు మంచితనముచూపి దీనికి నమ్మిక పుట్టఁజేసెద" నని యాలోచించి యెట్టయెదురఁ[6] నిలిచి యిట్లనియె : "అయ్యా! నమస్కారము" అనఁగానే గృధ్రము విని "యెవరవు నీ?"వని యడిగెను. "నేను బిడాలమను. నన్ను దీర్ఘకర్ణమని చెప్పుదురు" అన విని గృధ్ర మిట్లనియె "శీఘ్రము దూరముగాఁ బో - పోకుంటివా నీ ప్రాణములు నీవి గావు. చూడు నా దెబ్బ" అనఁగానే బిడాల మిట్లనియె : "ముందు నా మాట వినుండు. నేను వధ్యుఁడనో[7] కానో విచారింపుఁడు, తర్వాత మీకుఁ దోఁచినట్లు చేయుఁడు. గుణదోషములు విచారించి వీఁడు పూజ్యుఁడు, వీడు వధ్యుఁ డని నిర్ణయింపవలెఁ గాని జాతిమాత్రముచేత నిర్ణయింపఁ గూడునా?" నావుడు 'నీవు వచ్చిన పనియేమి?' మని గృధ్ర మడిగెను. పిల్లి యిట్లనియె : "ఇక్కడ గంగలో నిత్యము స్నానము చేయుచు, మాంసాశనము[8] విడిచి బ్రహ్మచారినై చాంద్రాయణవ్రతము[9] చేయుచున్నాఁడను. మిమ్ము ధర్మజ్ఞులని, మంచివారని యిచ్చటి పక్షు లప్పుడప్పుడు ప్రశంసింపఁగా[10] విని బహుదినములనుండి నాకు మీ దర్శనము చేయవలెనని కోరిక కలదు. అది యిన్నాళ్ళకు ఫలించినది. మీరు విద్యా

1. శబ్దము; 2. కలకల ధ్వని; 3. పిల్లి; 4. మరిఁగి పోన్ + అయితి + కాదు = తిరిగి పోవుటకు అనుకూలముకాదు; 5. భయపడనగునా; 6. ఎదురన్ + ఎదురన్ = మిక్కిలి యెదుట; 7. వధింపఁదగినవాఁడనో; 8. మాంస + అశనము = మాంస భోజనము; 9. భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలోఁ జంద్రుని క్షయవృద్ధుల ననుసరించి కృష్ణపక్షము నందు ఒక్కొక్కకడిగాఁ బెంచుచు భుజించు నొకానొక వ్రతము; 10. పొగడఁగా.

వయోవృద్ధులు.[1] కాఁబట్టి మీవలన ధర్మములు వినవలెనని సయితము మనసు గలదు. ధర్మజ్ఞులైన మీరే యిల్లు త్రొక్కుకొని వచ్చినవానిని వధింపను యత్నము చేసితిరి. గృహస్థధర్మమా యిది! శత్రువున కయినను గృహమునకు వచ్చిన వాని కాతిథ్యము చేయవలసినది. ధనములేని పక్షమునకు మంచి మాటలతో నైన సత్కరింపవలెను. ఉస్సురని యింటికి వచ్చిన యతిథి పోరాదు. అది మిక్కిలి పాపమునకు మూలము." అనఁగా విని గద్ద యిట్లనియె: "పిల్లలకు మాంసమందు రుచి మిక్కుటము. ఇక్కడనా పక్షిపిల్ల లున్నవి. అందుచేత నేనట్లు చెప్పితి" ననఁగానే పిల్లి రెండు చెవులు మూసికొని 'కృష్ణ కృష్ణ' యని యిట్లనియె : "ఎంత పాపముచేసి యీ పిల్లిజన్మ మెత్తితినో యిది చాలక యీ పాపము సహితము కట్టుకోవలెనా? ఎంతమాట వినవలసి వచ్చెను! ధర్మశాస్త్రములు విని నిష్కాముఁడనై[2] యిప్పుడు చాంద్రాయణ వ్రతము చేయుచున్నాఁడను నే నిట్టి పాపము చేయుదునా? పరస్పర విరుద్ధములైన[3] ధర్మశాస్త్రములు సహిత 'మహింసా పరమోధర్మ'[4] యనుచో నైకమత్యము[5] గలిగియున్నవి. ఏ హింసగాని చేయక సర్వభూతములందు దయాళువు[6] లయి వర్తించువారికి స్వర్గము కరస్థము.[7] భూతదయ గలవాఁడే సర్వధర్మములు చేసినవాఁడు. అది లేనివాఁడు చేసియుఁ జేయనివాఁడె. కడపటఁ దాను జేసిన ధర్మము తనకు సహాయమయి వచ్చును గాని తక్కినది యేదియు లోకములోనిది తోడ రాఁబోదు. తెలియక చెడినకాలము పోనిమ్ము. తెలిసి యింకఁ జెడుదునా? అడవిలో స్వచ్ఛందముగా[8] మొలచిన యే శాకముతో[9] నయిన క్షుధఁ[10] దీర్చుకొని ప్రొద్దుఁ బుచ్చవచ్చును. ఈ పాడుపొట్టకయి యింత పాపము చేయుట కెవ్వఁడు పాలుపడును? ఆహా! ఎంత మాటాడితిరి!" అనఁగా గ్రద్ద విని "కోపము చేయకు. క్రొత్తఁగా రాఁగానే వచ్చినవారి స్వభావ మేలాగునఁ దెలిసికోవచ్చును? అప్పుడు తెలియక చెప్పినమాట తప్పుగాఁ బట్టఁబోకు.

---

1. విద్యచేతను, వయస్సు చేతను వృద్ధులు; 2. కోరిక లేనివాఁడనై; 3. ఒకదాని కొకటి వ్యతిరేకములు; 4. అహింస ముఖ్యమైన ధర్మము; 5. ఏకమతిత్వము; 6. దయగలవారు; 7. చేతనున్నది; 8. తనంతఁదానుగా; 9. కూర; 10. ఆఁకలి.

పోయినమాట పోనిమ్ము. నీవు యథేచ్ఛముగా[1] రావచ్చును, బోవచ్చును, మాకడ నిలువ వచ్చును. నీ కొక యడ్డంకి లే"దని చెప్పెను. అనంతరము మార్జాలము జరద్గవముతో మిక్కిలి సఖ్యము గలిగి యా తొఱ్ఱలో వాసము చేయుచుండెను. ఇట్లు కొన్ని దినములు కడచిన తర్వాత మార్జాలము ప్రతిదినము నడికిరేయి[2] చప్పుడు చేయక వృక్షమెక్కి పక్షిపిల్లలను గొంతు కొఱికి తెచ్చి తొఱ్ఱలోఁ బెట్టుకొని తినసాగెను. అక్కడి పక్షులు తమ పిల్లలను గానక మిక్కిలి దుఃఖించి యక్కడక్కడ వెదక నారంభించెను. అది యెఱిఁగి పిల్లి తొఱ్ఱ వెడలి పాఱిపోయెను. ఆ పక్షులు వెదకుచు వచ్చి తొఱ్ఱలోఁ దమ పిల్లల యెముకలు చూచి యీ గద్దయే మన పిల్లలను భక్షించినదని నిశ్చయించి దానిని గోళ్ళతో ఱక్కి[3] చంచువులతోఁ[4] బొడిచి చంపెను.

## జింక - నక్క - మోసము

"కాఁబట్టి క్రొత్తఁగా వచ్చిన వానిని నమ్మరాదని చెప్పితిని." అనఁగా విని నక్క కాకిని మిక్కిలి కోపించి చూచి యిట్లనియె : "ప్రథమదర్శన దినమందు మృగమునకు నీవు సహితము క్రొత్తవాఁడవే. అది యెట్లు నీతో మృగమునకు స్నేహము రాఁగారాఁగా వర్ధిల్లుచున్నది[5]? నీకు మాఱులేదు గనుక నీతులని నోరికి వచ్చినవి వదరుచున్నావు. విద్వాంసుఁడు లేనిచోట స్వల్ప బుద్ధియు సమ్మానింపఁబడుచున్నాఁడు. ప్రమాను[6] లేని దేశమం దాముదపుఁ జెట్టు మహావృక్షము కాదా? వీఁడు తనవాఁడని, వీఁడు పరుఁడని యెన్నిక లఘుబుద్ధులకు[7]. మహాత్ములకు లోకమే కుటుంబము. ఈ మృగము నాకు బంధు వయినట్లు నీవు కావా? ప్రపంచ మున్నంత కాలము బ్రదుకఁబోము. ఎప్పుడో కాలుఁడు[8] మ్రింగఁ గాచియున్నాఁడు.[9] ఉన్నకాల మందఱికి మంచివాఁ డనిపించుకొని పోవలెఁగాని యిట్టి విషమబుద్ధి[10] చేత ఫలమేమి?" అనఁగా

---

1. ఇచ్ఛననుసరించి; 2. అర్ధరాత్రము; 3. గీఱి; 4. పక్షిముక్కు; 5. పెరుఁగు; 6. చెట్టు; 7 తేలిక బుద్ధిగలవారికి; 8. యముఁడు; 9. వేచియున్నాఁడు; 10. సమము కాని బుద్ధి.

విని మృగ మిట్లనియె : "ఈ వాదులాట యేల? మన మందఱ మొకచోట మంచి మాటలతో సుఖముగాఁ గాలక్షేపము చేయుదము. వీనికి వీఁడు మిత్రము, వీనికి వీఁడు శత్రువని నియమము గలదా? వ్యవహారముచేతనే మిత్రులుగాని, శత్రువులుగాని కలుగుచున్నారు." నా విని[1] కాకి యాలాగే కానిమ్మని పలికెను. అనంతరము మృగ, కాక, జంబుకములు కడు నేస్తము[2] గలిగి తద్వనమందు వాసము చేయుచుండెను.

ఇట్లు కొంతకాలము జరిగిన వెనుక నొక్కనాఁడు నక్క జింకతో నిట్లనియె : ఈ వనమం దొక చోట నిండు పయిరు[3] గల పొలము నేఁడు చూచితిని. నీవు నా వెంబడి రా. నీకు నే నా పొలమును జూపుచున్నాను" అని చెప్పి మృగమును వెంటఁబెట్టుకొని పోయి క్షేత్రముఁ జూపెను. తరువాతఁ బ్రతిదిన మక్కడికి మృగము పోయి పయిరు మేయసాగెను. ఒకనాఁ డది క్షేత్రస్వామి[4] చూచి 'యీ మృగము పయిరు మేయ మరిగినది.[5] దీనిని జీవముతో విడువరా' దని యాలోచించి పొలములో గూఢముగా[6] వల పన్ని యింటికిఁ బోయెను. ఎప్పటి వాడుక చొప్పున మఱునాఁడు మృగము వచ్చి పొలములో మేయ దిగి వలలోఁ దగులుకొని యిట్లు చింతించె. "అయ్యో, వలలోఁ దగులుకొంటిని గదా! ఏమి చేయుదును! ఈ కాలపాశము[7] వలన నన్ను విడిపించు దిక్కెవ్వ రున్నారు? ఇప్పుడు నా ప్రియమిత్రుఁడు జంబుకోత్తముఁడు వచ్చెనా యీ విపత్తు మానుపఁగలఁడు." అని చింతించు చుండఁగా నక్క వచ్చి చూచి లోపల సంతోషపడి "యిన్నాళ్ళకు నా యత్నము ఫలమునకు వచ్చినది. పొలముకాఁపు దీనిని నేఁడు చంపక మానఁడు. దీనియొక్క రక్తమాంసములతోఁ గావలసినన్ని యెముకలు దొరకఁగలవు. నాకు నేఁడుగా పండుగు." అని యెంచుకొనుచు దాపునకుఁ బోయెను. మృగము నక్కను జూచి యింక భయము లేదని యెంచుకొని యిట్లనియె : "చెలికాఁడా!

---

1. నాన్ + విని = అనఁగా విని; 2. స్నేహము; 3. పైరు = పంట; 4. పొలము కాఁపు; 5. అలవాటుపడినది; 6. రహస్యముగా; 7. యముని త్రాడు.

శీఘ్రముగా వచ్చి వలఁగొఱికి నన్నుఁ గాపాడుము." అనఁగానే నక్క కదియఁబోయి[1] వల చూచి "చెలికాఁడా! ఈ వల నులినరములతోఁ[2] జేయఁబడినది. నేఁడు భట్టారకవారము.[3] నరములు పండ్లతో నేనెట్లు తాఁకుదును! మిత్రుఁడా! మనములో వేఱుగాఁ దలఁపఁబోకు. మఱి యేపని గాని చెప్పితివా యిప్పుడు తలతోఁ[4] జేయుచున్నా"నని పలికెను. అంతట సాయంకాలము కావచ్చెను. కాకి తన మిత్రము హరిణము[5] తావు[6] చేరమికి మిక్కిలి చింతించి యక్కడక్కడ వెదకుచు వచ్చి యా పొలము కడకు వచ్చి చూచి 'చెలికాఁడా! ఇదియే?' మని యడిగెను. 'మిత్రుని మాట విననిదానికి ఫలమిది. చేటుఁగాలము[7] దాపించినవాఁడు[8] హితులమాట యేల విను?' నని మృగము పలికెను. అది విని కాక 'మా నక్క యెక్కడ?' నని యడిగెను. "నా మాంసము తినవలెనని యిక్కడనే యెక్కడనో కాచుకొని యున్న" దని మృగము చెప్పెను. నా విని కాకి యిట్లనియె : "నేను మునుపే చెప్పితిని. నా మాట వినకపోయితివి. పరులకు నేను గీడు చేయఁబోను. వారు నాకొక కీడు చేయఁబోరని నమ్మరాదు. మంచివారికి సహితము దుష్టులవలన భయము గలదు. పోఁగాలము దాపించినవారు దీపనిర్వాణగంధము,[9] నరుంధతిని,[10] మిత్రవాక్యమును మూర్కొనరు,[11] కనరు, వినరని పెద్దలు చెప్పుదురు. ప్రత్యక్షమం[12] దిచ్చకములాడి[13] పరోక్షమందుఁ[14] గార్యహాని చేయు సంగాతకాఁడు[15] పయోముఖవిషకుంభము[16] వంటివాఁడు. అట్టివాని సాంగత్య[17] మవశ్యము[18] మానుకోవలెను." అనఁగా విని హరిణము నిట్టూర్పు[19] విడిచి యిట్లనియె. "సజ్జన సాంగత్యము వలన సర్వశ్రేయములవలె, దుర్జన సాంగత్యమున సర్వానర్థములు ప్రాప్తించును. దానికి సంశయము లేదు. ఆ జిత్తులమారి మృగముయొక్క తేనెమాటలకు మోసపోయితిని. నాలిక తీపు, లోన విషమని యెఱుఁగుదునా?" అని చెప్పుచుండఁగా దూరమందు

1. చేరఁబోయి; 2. సన్నని నరములతో; 3. ఆదివారము; 4. శిరసావహించు; 5. జింక; 6. చోటు; 7. వినాశకాలము; 8. సమీపించిన వాఁడు; 9. దీపమారిపోయినప్పటి వాసన; 10. వశిష్ఠుని భార్య; 11. వాసన చూడరు (క్రమాన్వయము); 12. ఎదుట; 13. ప్రియవచనములు; 14. చాటున; 15. స్నేహితుఁడు; 16. పాలుపైని గల విషపుఁగుండ; 17. స్నేహము; 18. తప్పక; 19. నిట్టూర్పు = నిడు + ఊర్పు.

వచ్చుచున్న పొలముకాఁపును జూచి కాకి యిట్లనియె : "చెలికాఁడా! యిప్పుడు తగిన వెరవు[1] విచారింపక మసలరాదు.[2] అదిగోఁ బొలముకాఁపు బడియ[3] చేతఁబట్టుకొని యమునివలె వచ్చుచున్నాఁడు. నాకొక యుపాయము తోఁచుచున్నది విను. ఊపిరి బిగియఁబట్టి కడుపు బూరటించి[4] నాలుగు కాళ్ళు చాఁచుకొని బిట్టబిగిసి[5] కొని చచ్చినట్లు పడియుండుము. నేను నీపై నెక్కి ముక్కుతో నీ కన్నులు పొడుచుచున్నట్లు కూర్చుండి యుండెద. నేను సమయము చూచి కూసెదను. కూయఁగానే పాఱిపొ"మ్మని చెప్పెను. పిదప మృగము కాకి చెప్పినట్లు పడియుండెను. తదనంతరము పొలముకాఁపు దాపునకువచ్చి చూచి మృగము చచ్చినదని యెంచుకొని వల వదలింపఁగానే కాకి కూసెను. అది విని మృగము శీఘ్రముగా లేచి పరుగెత్తెను. "ఆహా! యిది యెంత మాయలమారి మృగము! నన్ను మోసపుచ్చినది గదా?" యని యెంచుకొని పొలముకాఁపు తన చేతి బడియను విసరివ్రేసెను. దైవికముగా దాని తాఁకు[6] వడి నక్క చచ్చెను. చూడు నక్క యేమి తలంచుకొని యుండెను? తుద కేమాయెను? పరులకు హాని చేయఁగోరువారు తామే చెడిపోదురు."

అనిన విని హిరణ్యకునితో లఘుపతనక మిట్లనియె : "ఏల యీ మాటలు. నీతో మిత్రభావము గోరి వచ్చినాఁడను. నన్ను వేఱుగాఁ దలంపకు. నిన్ను నేను భక్షించినమాత్రాన నా కడుపు నిండునా? నా మనవి విను చిత్రగ్రీవుని వలె నన్నుసహిత మనుగ్రహింపుము. నీ సౌజన్యమే యింతగా నాచేత నిన్ను వేఁడుకొలుపుచున్నది. నీకు దయవచ్చునంతదాఁక నిన్ను విడిచి కదలను. నీవంటి సజ్జనుని సాంగత్యము చేసి సౌఖ్యము పొందనివాని జన్మమేల?"

## లఘుపతనక హిరణ్యకుల స్నేహము

అనిన విని హిరణ్యకుఁ డిట్లనియె : "నీవు చపలుండవు.[7] చపలునితో

1. ఉపాయము; 2. ఆలసింపరాదు; 3. దండము; 4. ఉబ్బించి; 5. బిట్టబిగియ - బిగియు + బిగియు - ఇది అందదుకు ప్రభృతుల లోనిది; 6. దెబ్బ; 7. చంచలుఁడవు.

మైత్రి సర్వధా[1] చేయరాదు. ఇంతేకాదు, మాకు నీవు శత్రుపక్షమువాఁడవు. ఎంత మంచి వానితోఁగాని దాయతో[2] సాంగత్యము చేయరాదు. కాఁబట్టి నీతో నాకు నేస్తము సరిపడదు. అశక్యము శక్యము గాఁబోదు. శక్య మశక్యము గాఁబోదు. జలము మీఁద బండ్లు, నేల మీఁద నావలు నడచునా? ఏల యందని మ్రాని పండ్ల కఱ్ఱు[3] చాఁచెదవు? నీ పని చూడు. మిక్కిలి ప్రొద్దెక్కినది. కడుపుపని[4] విచారించుకో. పో, పో." నా విని లఘుపతనక మిట్లనియె. నా స్వభావము తెలియక యేల యింతదూరము వెగటుమాట[5] లాడెదవు? కడపటిది విను. చిత్రగ్రీవుఁడు లోకోత్తరుఁడవయిన[6] నీతో సౌహార్దసౌఖ్య[7] మనుభవించుట చూచితిని. నీతో సంగాతము చేయవలెనని మనసు పడితిని. నా ప్రార్థన విని నా కోరిక నెఱవేర్చితివా సరి, లేదా యింతే నా భాగ్యమనుకొని యిక్కడనే ప్రాయోపవేశము[8] చేసి ప్రాణములు విడిచెదను. ఇది నా నిశ్చయము. మృద్ఘటము[9] వలె దుర్జనుని సులభముగా భేదింపవచ్చును గాని, సంధింపఁ[10] గూడదు. హేమఘటమందు[11] వలె సుజనునియం దీ లక్షణము విపరీతమై యుండును. ద్రవత్వము[12] వలన సర్వలోహములును, నిమిత్తము[13] వలన మృగపక్షులును, భయలోభముల వలన మూర్ఖులును, దర్శనమువలన సజ్జనులును గలిసికొందురు. మఱియు శుచిత్వము, త్యాగము, శౌర్యము, సుఖదుఃఖములయందు సామాన్యము, దాక్షిణ్యము,[14] స్నేహము, సత్య వర్తనమును సుహృద్గుణములని చెప్పుదురు. ఈ గుణములన్నియు నీయందుఁ గానఁబడుచున్నవి. ఇతరుని నీవంటివానిని కనివిని యెఱుఁగను. నీ బోఁటి వానితో సఖ్యము సంపాదించుకొంటకంటె మే లొకటి లేదు. నా కోరిక యీడేఱిచితివా[15] మేలయ్యెను, లేదా యింతే నా యదృష్టమని యెంచు కొనియెదను," అనిన హిరణ్యకుఁడు లాఁగ వెడలి వచ్చి యిట్లనియె : "లఘుపతనకా! నీ వచనామృతము[16]చేత మిక్కిలి తృప్తిఁ బొందితిని.

1. అన్నివిధముల; 2. శత్రువుతో; 3. మెడ; 4. కడుపు నింపుకొనుపని; 5. అప్రియ వచనములు; 6. లోకమందు శ్రేష్ఠుఁడవు; 7. మైత్రివలని సుఖము; 8. చచ్చునంత వఱకు నాహారము మాను నొకానొక వ్రతము; 9. మృత్ + ఘటము = మట్టికుండ; 10. అతుకు; 11. బంగరుకుండ; 12. ద్రవస్థితి (కరఁగినపుడు లోహము లొకదానితో నొకటి కూడును); 13. హేతువు; 14. మొగమాటము; 15. నెఱవేర్చితివేని; 16. వచనమనెడి అమృతము.

ప్రీతిపూర్వకమైన సజ్జనసల్లాపమువలె గంధసారమును,[1] హిమాంబుపూరమును,[2] వారిజాత వారమును[3] శ్రమము పోఁగొట్టఁజాలవు. దుర్జనుఁడు తలఁచునది యొకటి, చెప్పునది యొకటి, చేయునది యొకటి. సజ్జనుఁడు తలఁచునది, చెప్పునది, చేయునది యొకటియై యుండును. నీయందు దోషము లేశమయినను స్వభావముచేతఁ గానఁబడదయ్యె. నీ వలన మిక్కిలి సంతోషించితి. నీ యభిమతమే[4] కానిమ్ము" అని పలికి హిరణ్యకుఁడు యథోచిత సత్కారములు చేసి, వాయసమును సంతోషపఱిచి వీడుకొలిపి తన వివరము[5] ప్రవేశించెను. నాఁటఁగోలె[6] మూషికవాయసములు కుశల ప్రశ్నములచేత నన్యోన్యాహారదానములచేత[7] విస్రంభాలాపములచేతఁ[8] గాల క్షేపము చేయుచుండెను.

## లఘుపతనకము - మంథరుఁడు

ఒక్కనాఁడు వాయసము మూషికమును జూచి "చెలికాఁడా! ఇక్కడ నా కాహారము కష్టతరలభ్యముగానున్నది[9]. కాఁబట్టి యీ వనము విడిచి యెక్కడి కేనిఁ దగిన యెడకుఁ[10] బోవలెనని యత్నపడి యున్నవాఁడను." అనిన విని హిరణ్యకుఁ డిట్లనియె : "దంతములు, కేశములు, నఖములు, నరులును[11] స్థానభ్రంశముఁ[12] బొందిరేని రాణింపరు.[13] కాఁబట్టి మతిమంతుఁ[14] డీయర్థము తెలిసికొని స్థానము మానవలెనను బుద్ధి మానుకోవలెను." అనిన విని కాకి యిట్లనియె : "చెలికాఁడా! నీవు చెప్పిన విషయము దుర్బల విషయము.[15] గజములు, సింహములు, సత్పురుషులను స్థానము విడిచి విచ్చలవిడి[16] సంచరింతురు. కాకములు, మృగములు, కాపురుషులును[17] స్థానము మానఁజాలక వినాశముఁ బొందుదురు." అనిన విని హిరణ్యకుఁ డిట్లనియె : "చెలికాఁడా! ఇక్కడ మానుకొని యెక్కడికిఁ బోవలెనని నీ యత్నము?" అనిన వాయస మిట్లనియె : "ముందు చోటు చూచి, పాదము

---

1. మంచిగంధము; 2. పన్నీటి ప్రవాహము; 3, తామరల సమూహము; 4. ఇష్టము; 5. రంధ్రము; 6. అప్పటినుండి; 7. ఒకరి కొక రాహారము నిచ్చుటచేత; 8. విశ్వాసముతోఁ గూడిన మాటలచేత; 9. మిక్కిలి శ్రమముచేతఁ బొందఁదగినది; 10. చోటు; 11. పండ్లు, వెండ్రుకలు, గోర్లు, మనుష్యులు; 12. ఉన్నచోటినుండి జాఱుట; 13. ప్రకాశింపరు; 14. బుద్ధిమంతుఁడు; 15. బలహీనుల విషయము; 16. స్వేచ్ఛగా; 17. కుత్సితులైన పురుషులు.

మోపికదా వెనుకటి పాదమెత్తవలెను? అట్లు స్థానాంతరము[1] విచారించుకోక పూర్వస్థానము మానరాదు. కాఁబట్టి ముందు గంతవ్యస్థానము[2] నిరూపించుకొనక ప్రయత్నపడినవాఁడను గాను విను. దండకారణ్యమందుఁ గర్పూరగౌరమను[3] సరోవరము[4] గలదు. అందు నా ప్రియమిత్రుఁడు మంథరుఁడను[5] కూర్మరా జున్నాఁడు. అతఁడు సహజ ధార్మికుఁడు. పరులకు వలసినన్ని ధర్మములు చెప్పవచ్చునుగాని, తాను నడచుకోలు[6] దుష్కరము గాదా? ఆ తామేటిమేటి[7] మీనాద్యాహారదానములచేత[8] నన్ను భరింపఁజాలినవాఁడు" నా విని హిరణ్యకుఁ డిట్లనియె : "నీవు పోయిన తరువాత నా కిక్కడఁ బనియేమి? సమ్మానము,[9] జీవనము,[10] బాంధవులు, విద్యాగమములేని[11] దేశము మానవలెనని పెద్దలు చెప్పుదురు. కాఁబట్టి నీతో నన్నుఁ దోడుకొని[12] పొమ్ము. వచ్చెదను' ' అనఁగా విని, లఘుపతనకము సంతోషపడి 'వల్లె'యని పయనమై మూషికముతో సరసాలాపములు గావించుచుఁ గతిపయ[13] దినంబుల కా కొలను చేరఁబోఁగా మంథరుఁడు దూరమునందుండి చూచి, యెదురువచ్చి కొనిపోయి లఘుపతనక హిరణ్యకులకు యథోచితముగా నాతిథ్యము చేసెను.

## హిరణ్యకుని పూర్వ వృత్తాంతము

తరువాత లఘుపతనకుఁడు మంథరునితో నిట్లనియె: "చెలికాఁడా! ఈ మూషిక రాజును నీవు మిక్కిలి సమ్మానింపుము. ఇతఁడు పుణ్యకర్ముల లోపల ధురీణుఁడు[14] - గుణ రత్నాకరుఁడు[15] -హిరణ్యకుఁ డనువాఁడు. ఈతని గుణములు శేషుఁడు సహితము వర్ణింపఁజాలఁడు. నే నేపాటివాఁడను." అని పలికి మొదటి నుండి హిరణ్యకుని వృత్తాంతము సర్వము వినిపించెను. అంతట మంథరుఁడు హిరణ్యకుని మిక్కిలి సమ్మానించి యిట్లనియె : "హిరణ్యకా! నీవు నిర్జనవనమందు వాసము చేయుటకు నిమిత్తమేమి? చెప్పుము." అని

1. మఱియొకచోటు; 2. పోఁదగినచోటు; 3. కర్పూరమువలెఁ దెల్లనిది; 4. శ్రేష్ఠమైన సరస్సు; 5. మెల్లఁగా నడుచువాఁడు; 6. నడచుకొనుట; 7. కూర్మరాజు; 8. చేఁపలు మున్నగు నాహారముల నిచ్చుటచేత; 9. గౌరవము; 10. నీరు, బ్రతుకు; 11. విద్యాలాభము లేని; 12. పిలుచుకొని; 13. కొన్ని; 14. గొప్పవాఁడు; 15. మంచి గుణములకు సముద్రుఁడు.

యడిగెను. హిరణ్యకుఁ డిట్లనియె : "చంపకవతి యను పట్టణము గలదు అందు సన్న్యాసులు పెక్కండ్రు వాసము చేయుచుందురు. అందు జూడాకర్ణుఁడను పరివ్రాజకుఁడు[1] గలఁడు. అతఁడు తాను భోజనము చేసి మిగిలిన వంటకము భిక్షాపాత్రలోఁబెట్టి చిలుకకొయ్యమీఁదనుంచి నిద్రపోవును నేను సద్దుచేయక దానిమీఁద కెగిరి ప్రతిదిన మా వంటకము భక్షించి పోవుచుందును. ఒకనాఁడు చూడాకర్ణుఁడు తన స్నేహితుఁడు వీణాకర్ణుఁడన సన్న్యాసితో మాటలాడుచుండి మాటిమాటికి మీఁదివంక చూచి తన గిలుకకఱ్ఱతో నేలమీఁదఁ గొట్టి నన్ను వెఱపించుచు వచ్చెను. అపుడు వీణాకర్ణుఁడు "చూడాకర్ణుఁడా! ఏ మది మీఁదు చూచి నేల కఱ్ఱతోఁ దట్టుచున్నాఁడ?" వని యడుగఁగాఁ జూడాకర్ణుఁ డిట్లనియె : "ఒక యెలుక ప్రతిదినము చిలుకకొయ్యమీఁది కెగిరి పాత్రమునందున్న యన్నము భక్షించి పోవుచున్నది. నాకు దీని యుపద్రవము[2] పెద్దదిగా నున్న" దని చెప్పెను. ఆ మాటలు వీణాకర్ణుఁడు విని "యెక్కడి యెలుక? యెక్కడి చిలుకకొయ్య? ఇంత యల్ప జంతువున కింత పొడవున కెగురు బల మెక్కడనుండి వచ్చెను? దీని కే మయినను నిమిత్తము లేకమానదు."

## బ్రాహ్మణి - నూవులు

పూర్వము నేనొక విప్రుని యింటికి భిక్షార్థము పోయియుంటిని. అప్పు డా బ్రాహ్మణుఁడు తన భార్యను జూచి "ఱే పమావాస్య - బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఏ మేమి భోజ్యపదార్థములు[3] కూర్చిన దాన?" వని యడిగిన బ్రాహ్మణి[4] యిట్లనియె : "పురుషులు పదార్థములను సేకరించి యింటికిఁ దెచ్చిరేని వానిని స్త్రీలు వలసిన పనులకు వాడుకొందురుగాని, మీరు తేని[5] పదార్థము లెక్కడినుండి వచ్చును?" అనిన విని యాతఁడు కోపించి భార్యను జూచి యిట్లనియె : "ఉన్నంతలో జరుపుకోవలెను గాని విస్తరించి

1. సన్న్యాసి; 2. కష్టము; 3. భుజింపఁదగిన పదార్థములు; 4. బ్రాహ్మణ స్త్రీ; 5. తీసికొనిరాని.

పదార్థసంగ్రహము[1] చేయవలెనని పేరాసపడరాదు'' అనిన బ్రాహ్మణి యిట్లనియె : "అలాగుననే కానిండు. ఱేపటి కార్యము కలిగినంతటితోనే జరిపెద" నని చెప్పి యాయమ్మ నూవులు కడిగి, దంచి, యెండఁబోసెను. అంతట నొకకోడి వచ్చి యా తిలలు[2] కాళ్ళతోఁజీరి చల్లులాడెను. అది బ్రాహ్మణుఁడు చూచి "యీ నువ్వు లంటుపడ్డవి.[3] బ్రాహ్మణభోజనమునకుఁ బనికిరావు. కాఁబట్టి యివి కొనిపోయి మార్చుకొని ర''మ్మని చెప్పెను. తదనంతర మా బ్రాహ్మణి మఱునాఁడు నేను భిక్షార్థము పోయియున్న యింటి లోగిటికి వచ్చి "యీ నువ్వుఁబప్పు పుచ్చుకొని నూవు లిచ్చెదరా?'' యని యా యింటివారి నడిగెను. ఆ యింటి పాఱుత[4] యా మాట విని, మిక్కిలి సంతోషపడి, చేటలో నూవులు పోసికొని వచ్చి మాటలాడుచుండఁగా నామె భర్త వచ్చి "యేమి బేరమాడుచున్నా?''వని యడిగెను. "చేరుడునూవులిచ్చి[5] దంచిననూవులు పుచ్చుకొనుచున్నా''నని యామె చెప్పెను. ఆ మాటలు బ్రాహ్మణుఁడు విని "యోసి వెఱ్ఱి! చేరుడునూవులకు దంచిన నూవు లెవ్వరయిన నిత్తురా? ఈమె యీలాగునఁ దెచ్చి యిచ్చుట కేమైన నిమిత్తముండును. కాఁబట్టి నీ వా నూవులు పుచ్చుకోకు''మని చెప్పెను. ఆలాగుననే యీ మూషికమున కింత బలిమియు. నిక్కడి సదావాసమును నిమిత్తములేక సంభవింపవు.''

### హిరణ్యకుని దీనస్థితి

అని వీణాకర్ణుఁడు చెప్పఁగా విని చూడాకర్ణుఁడు "తడవులఁబట్టి[9] యీ యెలుక యిక్కడ నొక లాఁగ తావుచేసికొని విడువక వాసము చేయుచున్నది. ఇట్లు వసించుటకు నిమిత్తము తెలిసినది కాదు. త్రవ్వి చూచెదఁగాక'' యని చెప్పి యొక గుద్దలితో నేను వసించు వివరము[7] త్రవ్వి చిరకాలోపార్జితమైన[8] నా ధనము సర్వము గ్రహించెను. తర్వాత

1. వస్తు సంపాదనము; 2. నూవులు; 3. మైలపడ్డవి; 4. బ్రాహ్మణి; 5. ముడినూవులిచ్చి; 6. చిరకాలము నుండి; 7. కన్నము; 8. చాల కాలమునుండి సంపాదింపఁబడిన.

సత్త్వోత్సాహములు[1] లేక నానాఁ డాహారము సయితము సంపాదించు కొనఁజాలక దిగులుపడి కృశించి, మెల్లమెల్లఁగ సంచరించుచుండఁగాఁ జూచి చూడాకర్ణుఁ డిట్లనియె : "ధనము గలవాఁడే బలవంతుఁడు. ధనము గలవాఁడే పండితుఁడు. ధనము సర్వశ్రేయములకు నిదానము.[2] ధనము లేనివాని జీవనమేల? ఈ మూషికము తన ధనము కోలుపోయి కదా తొంటి[3] జవసత్త్వము[4] లుడిగి[5] స్వజాతిసామ్యముఁ బొందెను. అర్థపరిహీనునకు[6] నిరంతరము ఖేదము[7] సంభవించును. నిరంతరఖేదమువలన బుద్ధిహీనత్వము ప్రాప్తించును. బుద్ధిహీనతవలన సమస్తకార్యములు నిదాఘనదీపూరము[8] లట్లు వినాశము నొందును. ధనవంతునకే పౌరుషమును,[9] మేధాసంపత్తియు,[10] బంధు మిత్రులును గలుగుదురు. పుత్త్రమిత్రవిరహితుని[11] గృహమును, మూర్ఖుని చిత్తమును శూన్యములు, దారిద్ర్యము సర్వశూన్యము,[12] దారిద్ర్యముకంటె మరణము మేలు. మరణ మాపాతయాతనావహము,[13] దారిద్ర్యము యావజ్జీవము[14] తీవ్ర వేదనాకరము.[15] ఇంద్రియముల, నామముసంబుద్ధిని, వచోధోరణిని[16] బురుషుఁడు తొంటివాఁడయ్యు[17] ధనమును బాసిన క్షణముననే లాఁతివాఁ[18] డగును. ఇది మహాచిత్రము."

అని యా పరివ్రాజకుఁడు చెప్పఁగా విని మిక్కిలి ఖిన్నుఁడనయి[19] యిట్లు చింతించితిని. ఇఁక నా కిక్కడ వసింపఁదగదు. ఇప్పుడు నా వృత్తాంతము పరులతోఁ జెప్పికోలును[20] యుక్తముగాదు. అర్థనాశము,[21] మనస్తాపము,[22] గృహమందలి దుశ్చరితము,[23] వంచనము,[24] పరాభవమును[25] ప్రకాశింపఁ

---

1. సత్త్వమును, ఉత్సాహమును; 2. మొదటి కారణము; 3. తొల్లిటి, పూర్వపు; 4. వేగమును, బలమును; 5. పోయి; 6. ధనములేని వానికి; 7. దుఃఖము; 8. వేసవికాలపు నదీ ప్రవాహములు; 9. మగతనము; 10. బుద్ధి సంపద; 11. కొడుకుల చేతను, స్నేహితుల చేతను హీనుఁడైన వాని; 12. అన్నిటి చేతను శూన్యము; 13. అప్పుడు బాధను గలిగించునది; 14. బ్రతికినంత కాలము; 15. అధికమైన బాధను గలిగించునది; 16. వచస్(ః) + ధోరణిని = మాటల రీతి చేతను; 17. పూర్వపు వాఁడు; 18. మఱియొకఁడు; 19. దుఃఖించినవాఁడను; 20. చెప్పికొనుట; 21. ధనముపోవుట; 22. మనోవ్యథ; 23. చెడునడవడి; 24. మోసము; 25. అవమానము.

జేయఁదగదని పెద్దలు చెప్పుదురు. దైవానుకూల్యము లేక పౌరుషము చెడినప్పుడు మానవంతునికి వనవాసముకంటె సుఖము లేదు. కుసుమ స్తబకము[1] వలె మానవంతుఁడు[2] సర్వజనుల మూర్ధము[3] మీఁదనయిన నుండవలె - లేదా వనమందు సమసిపోవలె.[4] ఇక్కడనే వాసము చేసికొని యాచనతో[5] జీవించెదనంటినా దానికంటె గర్హితము[6] లేదు. ఒక్క ముక్కడిని[7] యాచించుకంటె నిప్పులోఁబడి శరీరము తొఱఁగుట[8] మేలు. అనృతమాడుటకంటె మౌనము మేలు పరధనాపహరణముకంటెఁ దిరియుట[9] మంచిది. వివేకహీనుఁడయిన ప్రభువును సేవించుటకంటె వనవాస ముత్తమము. యాచించుకొని బ్రతుకుటకంటె మరణము శ్రేయము. సేవావృత్తి మానమును వలె, యాచనావృత్తి[10] సమస్తగౌరవమును హరించును. ఒకరి యిల్లు కాచి, వారి పెట్టువోఁతలకు దోసిలి యొగ్గి యునికియు[11] మిక్కిలి నింద్యము[12]' ' అని నానావిధముల విచారించియు లోభము త్రిప్పులకు లోనయి మరల నర్థసంగ్రహము[13] చేయవలె నని తలఁచి యచ్చోటనే నిలిచితిని. లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును.[14] దుఃఖము జ్వలనము[15] వలె స్వాశ్రయమునకు[16] నాశము పుట్టించును. కాఁబట్టి లోభమునకు బుద్ధిమంతుఁడు లోపడఁడు.[17] తరువాత నే నక్కడ వదలకుంటఁ జూచి చూడాకర్ణుఁడు నన్నుఁ గఱ్ఱతో విసరివ్రేసెను. ఆ వ్రేటు[18] దైవవశమువలనఁ దప్పిపోయినది. తగిలియుండెనా యింతకు యమలోకములోఁ బ్రాఁతకాఁప నయి యుండనా? అనంతర మిట్లు చింతించితి. ఆహా! ధనలోభము సర్వాపదలకు మూలము గదా! తద్వర్జనము[19] కంటె లోకమందు సుఖమేదియు లేదు - ఆశ దిగనాడినవాఁడే సత్పురుషుఁడు. వాఁడే సర్వశాస్త్రములు చదివినవాఁడు. వాఁడే సర్వధర్మము లాచరించినవాఁడు. ఉదరముకయి[20] పరుల

---

1. పూలగుత్తి; 2. అభిమానము గలవాఁడు; 3. శిరస్సు; 4. నశించి పోవలయును; 5. బిచ్చమెత్తుకొనుటతో; 6. నిందితము; 7. అల్పుని; 8. విడుచుట; 9. బిచ్చమెత్తుట; 10. బిచ్చమెత్తుకొను పని; 11. దోసిలియొగ్గి యునికి = తీసికొనగోరి యుండుట; 12. నిందింపఁదగినది; 13. డబ్బుకూడఁబెట్టుట; 14. పుట్టించును; 15. అగ్ని; 16. స్వ+ఆశ్రయము = తన్నాశ్రయించుకొన్నదానికి; 17. వశపడు; 18. వ్రేటు = దెబ్బ, వ్రేయు = వ్రేటు (కృదంతము); 19. దానిని విడుచుట; 20. పొట్టకై.

గోఁజక[1] ప్రాప్తలాభమునకు[2] సంతోషించువాఁ డొక్కఁడు లోకమందు ధన్యుఁడు. వాఁడే సుఖి.[3] తత్తత్కర్మానురూపముగ[4] దేహికి[5] దుఃఖములట్లు సుఖములు కోరకయే ప్రాప్తించుచున్నవి. అందులకయి ప్రయాసపాటు[6] నిరర్థకము.[7] ఈ తావు తాతముత్తాతలు సంపాదించిన కాణాచి[8]గాదు. భూమండలములో నింకఁ ద్రావు దొరకదా! ఇక్కడ నుండుటేల? ఈ చెడగరపు బోడ[9] కట్టు మోఁదులు వడి ప్రాణములు కోలుపోనేల? ఇంక నెక్కడికయిన నొక్క విజన ప్రదేశము[10] చేరి కాలము పుచ్చుట[11] మంచిది. శిలాంతరాళ[12]మందలి కప్పను భరించెడి[13] దయామయుఁడైన యీశ్వరుఁడు నన్నుఁ గాపాడకుండునా? అని చింతించి, మనసు గట్టిపఱుచుకొని, యచ్చోటువిడిచి యానిర్జనవనము చేరితిని. వనములోఁ గాయగసురులు భక్షించి పడియ[14]నీరు త్రాగి, యొక చెట్టునీడలో వసించి కాలము పుచ్చుట మంచిదిగాని, ధనహీనుఁడయి నలుగురిలో నుండరాదు. అనంతరము నా పుణ్యము వలన నా కీ మిత్రుఁడు లభించెను. నా మహాభాగ్యమువలననే యిప్పుడు నీ యాశ్రమ మను స్వర్గము దొరకినది. సత్సంగతికంటె[15] లోకమందు మే లేదియు లేదు. సంసార విష వృక్షమునకు[16] రెండుఫలము లమృత తుల్యములు.[17] కావ్యామృత రసపాన[18] మొకటి, సజ్జనసంగతి[19] యొకటి" అనిన విని మంథరుఁ డిట్లనియె :

**ధనాశ**

అర్థములు[20] నిత్యములు గావు. యౌవనము ఝరీవేగతుల్యము,[21] జీవనము[22] బుద్బుదప్రాయము.[23] కాఁబట్టి బుద్ధిమంతుఁడు సత్వరముగా

1. పీడించియడుగక; 2. లభించిన లాభము; 3. సుఖము గలవాడు; 4. వారి వారి కర్మములకుఁ దగినట్లు; 5. దేహము గలవాఁడు-మానవుఁడు; 6. శ్రమపడుట; 7. వ్యర్థము; 8. చిర కాలవాసస్థానము; 9. చెడగరపు బోడ= క్రూరుఁడైన సన్న్యాసి; 10. విజన ప్రదేశము = జనులులేనిచోటు; 11. కాలము పుచ్చు = కాలముగడపు; 12. రాతిలోపలి భాగము; 13. పోషించెడి; 14. పడియ = నీళ్ళు నిలిచిన చిన్న పల్లము; 15. సత్సంగతి = మంచివారితోడి కూడిక; 16. సంసారమనెడి విష వృక్షమునకు; 17. అమృతముతో సమానములు; 18. కావ్యమనెడి అమృతరసమును ద్రావుట; 19. మంచివారి తోడి స్నేహము; 20. ధనములు; 21. ప్రవాహవేగముతో సమానము; 22. జీవితము; 23. నీటి బుడగతో సమానము.

ధర్మము సమాచరింపవలెను. సమాచరింపనివాఁడు పశ్చాత్తాపముఁ బొంది శోకాగ్నిసంతప్తుఁడగును.[1] నీ వతిసంచయము[2] చేసితివి. దాని దోష మిది. తటాకోదర జలమునకుఁ[3] బరివాహము[4] వలె సమార్జిత విత్తములకుఁ[5] ద్యాగమే రక్షణము. పాఁతఱలో దాపఱికము చేయుట దాని వినాశమునకు దారిచేయుట గాని వేఱుగాదు. వాయి[6]కట్టి, కడుపుకట్టి[7] ధనము గడించువాఁడు పరులకయి మోపు మోచువానియట్లు క్లేశమునకు[8] మాత్రము పాత్రము.[9] భోగ త్యాగములకు వినియోగింపని ధనముండుట వలన ఫలమేమి? పోకడ[10] వలన హానియేమి? లోభి ధనికుఁడయ్యు భోగవిరహముచే[11] దరిద్రునితో సమానుఁడే. అయినను లోభికి ధనార్జన రక్షణ హానులయందు[12] దుఃఖ మొక్కటి విశేషము.[13] లోభి తన ధనము పేదలకుఁ బెట్టఁడు. చుట్టములకు వినియోగింపఁడు. తానుం గుడువఁడు.[14] కడపట నేలపాలో, దొంగలపాలో చేయుచున్నాఁడు. ప్రియ వచనములతోడి దానము, గర్వసహితముగాని జ్ఞానము, క్షమాసహితమైన[15] శౌర్యము, త్యాగయుక్తమయిన విత్త మనియెడు నాలుగు లోకమందు దుర్లభములు. బుద్ధిమంతునకు సర్వధా[16] ధనార్జన మావశ్యక కార్యమేకాని, యతిసంచయేచ్ఛ[17] తగదు. తొల్లి యొక్క జంబుకము లోభము చేత మిక్కిలి వస్తువులు సంగ్రహింపఁగోరి వింటిదెబ్బ పడి చచ్చెను. వినుము. నీ కా కథ చెప్పెదను.

## జంబుక వృత్తాంతము

కల్యాణకటకమను పట్టణమందు భైరవుఁడను వ్యాధుఁడు[18] గలఁడు. వాఁ డొకనాఁడు వేఁటకయి సింగాణి[19] తూపులు,[20] వల యురులు, చిక్కము లోనగు సాధనములు పూని వింధ్యాటవికిఁ బోయెను. అక్కడ వాఁ డొక వది[21]

1. దుఃఖమనెడు అగ్నిచేత మిక్కిలి తపించినవాఁడు; 2. మిక్కిలి కూడఁబెట్టుట;3. చెఱువులోని నీటికి; 4. తూము; 5. సంపాదింపఁబడిన ధనములు; 6. నోరు; 7. తినక; 8. కష్టమునకు; 9. తగినవాఁడు; 10. పోవుట; 11. అనుభవింపక పోవుటచే; 12. ధనార్జన రక్షణ హానులు = డబ్బు సంపాదించుట, కాపాడుట, నశించుట; 13. అధికము; 14. తినఁడు; 15. ఓర్పుతోఁగూడినది; 16. అన్ని విధముల; 17. మిక్కిలి కూడఁబెట్టుట యందలి కోరిక; 18. బోయవాఁడు; 19. విల్లు; 20. బాణములు; 21. వేఁటకాఁడు దాఁగియుండుటకు త్రవ్వికొన్న పల్లము,

ఛావించుకొని, మచ్చు[1] వెట్టి పొంచియుండి యొక పోతరించిన[2] మృగమునేసి, చంపియెత్తి, యఱకడఁ[3] బెట్టుకొని వచ్చుచుండఁగా నడగొండవలె[4] నొక పంది కానఁబడెను. అంతట నా మృగయుఁడు[5] నా భాగ్యమువలన మాంసాంతరము[6] సయితము దొరకినదని సంతోషించి, యామృగమును నేలదించి, విల్లెక్కుపెట్టి, బాణము సంధించి[7] సూకరము[8] నేసెను. ఏటు[9] వడిన యాక్షణమె యా వరాహము[10] క్రోధచోదితమయి[11] శరవేగమున[12] ఘుర్ఘురించుచుఁ[13] బాఱి వచ్చి కొమ్మున వానిఁ గొట్టెను. వాఁడు మొదలు నఱికిన తరువువలె[14] నేలఁగూలి ఱ్రోలుచుఁ[15] బ్రాణములు విడిచెను. పందియు మృతిఁబొందెను. అక్కడ నొక్క సర్పము కిరాతవరాహముల త్రొక్కుడులఁబడి మడిసెను.[16] అంత నొక్కనక్క దీర్ఘరావ మనునది యాహారార్థము వనములోఁ గ్రుమ్మరుచు[17] నక్కడకు వచ్చి, చచ్చిపడి యున్న సర్ప, కిరాత, వరాహ, మృగములను జూచి 'నాకు భోజనము పుష్కలముగా[18] దొరకిన' దని సంతోషించి యిట్లు చింతించెను. నాకు మూఁడు నెలల గ్రాసమునకు[19] వీని మాంసములు చాలు. ఒక మాసము కిరాతుని మాంసముతోఁ గడపవచ్చును. మృగ సూకరముల మాంసముతో రెండుమాసములు జరుపవచ్చును. ఒక దినమున కీ పాము చాలును. తొలియాఁకలి యిప్పటి కీ వింటివారి నరముతోఁ దీర్చుకొని యెదఁగాక!' యని చింతించి, చేరువకుఁబోయి. గొనయము[20] పంటనొక్కి కొఱుకఁ గానే బెట్టువదలి గొనయముపెట్టు[21] ఱొమ్మునఁ దాఁకెను. ఆ పెట్టుతోనే యా నక్క నేలఁగూలి ఱోలుచు, విలవిలఁ దన్నుకొనుచుఁ జచ్చెను. చూడు, లోభము నక్క నే దశకుఁ దెచ్చినది?

### ఉత్తమ జీవనము

'కాఁబట్టి యతిసంచయేచ్ఛ తగదని చెప్పితిని. ఒరులకిచ్చి తాను భుజించినదే తనసొత్తు. పరులకీక, తాను గుడువక కూడఁబెట్టిన ద్రవ్యము

1. మృగాదులను బట్టుకొనుట కుంచు ఆహారము; 2. బలిసిన; 3. మోఁపుపై; 4. నడుచుకొండ; 5. వేఁటకాఁడు; 6. మఱియొక మాంసము; 7. ఎక్కుపెట్టి; 8. పంది; 9. ఏటు=దెబ్బ; ఏయు-ఏటు (కృదంతము); 10. పంది; 11.కోపముచేఁ బ్రేరేపింపఁబడినది; 12. బాణవేగము; 13.అఱచుచు; 14. చెట్టువలె; 15. బాధచే నఱచుచు; 16. చచ్చెను; 17. తిరుగుచు; 18. సమృద్ధిగా; 19. ఆహారము; 20. వింటిత్రాడు; 21. దెబ్బ.

చచ్చిన తఱి వెంట రాఁబోదు.' అని చెప్పి కూర్మము మఱియు నిట్లనియె : 'మిగిలిపోయిన'[1] దిప్పుడు త్రవ్వుకోనేల?[2] పోనిమ్ము, బుద్ధిమంతులు రానిదాని కెదురుచూడరు. పోయినదానికి వగవరు. విపత్తు వచ్చినప్పుడు వితాకుపడరు.[3] కాఁబట్టి మిత్రుఁడా! సదా నీ వుత్సాహముతో నుండుము. శాస్త్రములు చదివియు మూర్ఖులయి యున్నారు. పురుషుఁడెవ్వఁడు క్రియావంతుఁడో వాఁడు విద్వాంసుఁడు. రోగుల కౌషధము పేరు చెప్పిన మాత్రమున రోగశాంతి గాఁబోదు. వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డివానికి స్వహస్తదీపమువలె[4] నిష్ఫలము. చూడుము. విపత్తు వచ్చినప్పుడు నాకు ఖేదములేదు[5] సంపద వచ్చినప్పుడు నాకు మోదములేదు.[6] దేహి కాపత్సంపదలు[7] పర్యాయమున[8] రాకడ[9] సహజము. అర్థములు నిత్యములు గావనియెడు నెఱుక గలవాఁడు తన్నాశమునకు వగవఁడు. అర్థము లేకున్న ధీరునకు లోకమందు మాన్యత[10] కొఱఁతవడదు. పుష్కలముగా ధనము గలిగియున్నను క్షుద్రునకు[11] గారవము రాఁబోదు. సింహమునకుఁ గలిగిన నైసర్గిక[12] తేజము శ్వానమునకు[13] నూఱు బంగారు సొమ్ములు పెట్టినను రాదు. నీవు బుద్ధిమంతుఁడవు. నీ గారవమున కిప్పుడు హానియేమి? ఏలాగునన్నైనఁ బుట్టించినవాఁ డాహారము కల్పింపక పోఁడు. చూడు -జంతువు గర్భమునుండి నేల జారఁగానే తల్లి ఱొమ్ము చేఁపుచున్నది. కాఁబట్టి జీవనార్థము మిక్కిలి యాయాసంపాటు[14] సయితము వ్యర్థము. నీవు సకలధర్మములు తెలిసినవాఁడవు. నీకు విస్తరించి చెప్పఁబనిలేదు. నీకు లఘుపతనకుఁ డొక్కఁడు, నే నొక్కఁడను గాము. మనలను మూవురను దైవమొకచోటఁ జేర్చెను. దొరకినంతటితోఁ గాలము గడపుకొని సుఖముగా జీవింతము" అనిన హిరణ్యకుఁడు మిక్కిలి సంతోషించి యిట్లనియె:

"మంథరా! నీ వచనామృతము[15] వర్షించి దురంతతాపము[16]

---

1. అయిపోయినది; 2. మరల స్మరింపనేల; 3. నిశ్చేష్టత నందరు; 4. తనచేతియందలి దివ్వె; 5. దుఃఖము; 6. సంతోషము; 7. ఆపదయును, సంపదయును; 8. క్రమమున, 9. వచ్చుట; 10. గౌరవము; 11. నీచునకు; 12. సహజ; 13. కుక్క; 14. శ్రమపడుట; 15. వాక్కనెడి అమృతము; 16. అంతములేని వేఁడిమి (దుఃఖము).

నివారించితివి. నేను ధన్యుఁడ నయితిని. 'మిత్రలాభ మనులాభసంపద'[1] యను వచనమును నేఁడు నాకు లక్ష్యసమన్విత మయ్యెను.

### ధన తృష్ణ

ఎవ్వఁడు హంసములను, శుకములను,[2] మయూరములను[3] శుక్ల,[4] హరిత[5] చిత్రములఁ గావించె నా యీశ్వరుఁ డాయా జంతువులకుఁ దత్తదనురూపమయిన[6] వృత్తిని గల్పించువాఁడు. మూఢు లీయర్థ మెఱుఁగక వృత్తి[7]కయి పడరాని పాట్లుపడి కాలము వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు. విత్తము గడన[8]యం దొక దుఃఖము, కాఁపుదల[9]యం దొక దుఃఖము, వినాశమం దొక దుఃఖము పుట్టించుచున్నది. ఇట్లు దుఃఖైకమూలమయిన[10] విత్తమేల? కాల్పనా? దర్మార్థము ధనము గోరుటకంటె నిస్స్పృహత్వము[11] మంచిది. అడుసు[12] త్రొక్కనేల, కాలు గడుగ నేల? ఆకాశమునందుఁ బక్షుల చేత, భూమియందు వ్యాళములచేత[13], జలములయందు మీనములచేత[14] మాంసము భక్షింపఁ బడినట్టు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును. కాఁబట్టి ధనతృష్ణ మానికోలు[15] వివేకకార్యము. తృష్ణ యొకటి మానెనా య్యావల దరిద్రుఁ డెవఁడు? ధనికుఁ డెవఁడు? దాని కెవ్వఁ డెడమిచ్చును?[16] వాని మూర్ధమే[17] దాస్యమునకు సింహాసనము. నీ సన్నికర్షప్రభావముచేత[18] నా యజ్ఞానము నివర్తించినది.[19] కృతార్థుఁడ నయితిని. నిరంతరముగా నీతోడి సంగతికంటె నాకు లాభమొకటి లేదు. నీతోడి ప్రణయమున కొక్కకొఱఁతయు రాఁబోదు. ప్రణయము లామరణాంతములు,[20] కోపములు తత్క్షణభంగురములు,[21] త్యాగములు నిశ్శంకములు[22] నగుట మహాత్ములకు సహజము." అని పలికిన, మంథరుఁ

---

1. మిత్రలాభమును లాభసమ్పదః - ఇది భారవిలోని యొక శ్లోకమందలి పాదము, లాభ సమ్పదః = ఇతర లాభ సంపదలు, మిత్రలాభమను = మిత్రలాభము కంటె దక్కువైనవి; 2. చిలుకలు; 3. నెమళ్ళు; 4. తెల్లని; 5. ఆకుపచ్చని; 6. తత్తదనురూపమైన = ఆయాదానికిఁదగిన; 7. జీవనము; 8. సంపాదన; 9. రక్షణము; 10. దుఃఖమునకుఁబ్రధాన కారణము; 11. కోరికలేమి; 12. బురద; 13. క్రూర జంతువు; 14. చేఁప; 15. మానుకొనుట; 16. ఎడము = అవకాశము; 17. శిరస్సు; 18. సామీప్య మహిమ; 19. పోయినది; 20. మరణము వఱకు నుండునవి; 21. ఆక్షణమందే నశించునవి; 22. సందేహము లేనివి.

డా పలుకులు విని మిగుల సంతోషించి హిరణ్యకలఘుపతనకులునుం, దానును యథేచ్ఛ విహారాదులఁ గాలక్షేపము చేయుచు సుఖముగా నుండెను.

**చిత్రాంగుని యాగమనము**

తరువాత నొకనాఁడు మంథరాదులు మూవురు సల్లాపములు సలుపుచుఁ బ్రొద్దుపుచ్చుచుండ నొక మృగము మృగయునిచేఁ దఱుమఁబడి బెదరి, మహావేగముతో నక్కడికిఁ బాఱివచ్చెను. అది చూచి భయపడి కూర్మము జలములోఁ బ్రవేశించెను. మూషికము లాఁగ[1] జొచ్చెను. వాయస మెగిరి వృక్షాగ్రమెక్కెను. అనంతరము మ్రానిమీఁద నుండి కాకము నిక్కి నలుదిక్కులు చూచి, చూపుమేర దూరములో భయహేతువేదియు లేమి నిశ్చయించుకొని మంథరహిరణ్యకులను బిలిచి "మీరు వెఱవకుఁడు. చుట్టుపట్టు మిక్కిలి దూరము చూచితిని. భయమునకు నిమిత్తమేదియు నాకంటఁబడలేదు" అని చెప్పఁగానే కచ్ఛపమూషికములు[2] జలబిలములు[3] వెడలి వచ్చెను. లఘుపతనకమును వారిచేరువ వ్రాలెను. అంత మంథరుఁడు భయపడి వడవడ వడంకుచున్న జింకనుజూచి 'నీవెవ్వఁడవు? నీవేల పాఱివచ్చితివి? అని యడిగెను. మృగము ప్రక్కలెగయ రొఁజుచు నిట్లనియె : 'నా పేరు చిత్రాంగుఁడు. నన్ను వేఁటకాఁ డొకఁడు తఱుముకొని వచ్చెను. వానికి భయపడి పాఱివచ్చితిని. వాఁడు నా పరుఁగుపట్టఁజాలక వెనుకఁ జిక్కినాఁడు మీకు నేను శరణాగతుఁడను.[4] సర్వదానములు, సర్వవ్రతములు, సర్వయాగములు, శరణాగతరక్షణముతో సరిగావు, శరణాగతు నుపేక్షించుటకంటె[5] దురితము[6] లేదని ధర్మజ్ఞులు చెప్పుదురు. మీరు సకలధర్మవేత్తలని బుద్ధిమంతులు చెప్పఁగా వినియున్నాఁడను. మనసు కలఁత పడియుండుట వలన నిది చెప్పఁదగినమాట, యిది చెప్పగూడనిమాట యని యెఱుఁగక యేమో చెప్పినాఁడను. మీకు ధర్మములు చెప్పెడుపాటివాఁడను గాను. నా వాగ్దోషము[7] క్షమియించి నన్ను రక్షింపుఁడు. మీతో మైత్రి సంపాదించుకొని, యిక్కడ నివసించి కాలము గడపవలెనని నా కోరిక. మా బంధువులను, మా దేశమును విడిచి వచ్చితిని.

---

1. లాగ = బొఱియ; 2.తాఁబేలును, ఎలుకయును; 3. నీరును, కన్నమును; 4. శరణము కొఱకు వచ్చినవాఁడను; 5. పట్టించుకొనకపోవుట; 6. పాపము; 7. మాట తప్పు.

మీ మఱుఁగు చొచ్చితిని. మీఁద నన్నుఁ బాల ముంచెదరో, నీట ముంచెదరో మీ భారము." అనిన విని మంథరుఁ డిట్లనియె : "చిత్రాంగా! నీవు బుద్ధిమంతుఁడవు - సాధువవు. నీతోడి సఖ్య మవశ్యము మా కపేక్షణీయము.[1] దీని కింతదూరము చెప్పఁబనిలేదు. ఈ తావు నీ యిల్లుగా నెంచుకొని మాతోఁగూడి యథేచ్ఛముగా వర్తించుచు సుఖముగా నుండుము." అని చెప్పఁగా మృగము మిగుల సంతోషించి యా వనమందు లేఁబచ్చిక జొంపములు[2] మేయుచు మడుఁగులోని నీరు త్రావుచుఁ జేరువమ్రాని నీడలోఁ బండుకొనుచు నిట్లు చిరకాలము సుఖముగా వసించెను.

అంతట నొకనాఁడు మృగము మేఁతకుఁబోయి తొల్లిటివలె వేళకు వచ్చి తావు చేరమికి మిక్కిలి చింతపడి మంథరుఁడు లఘుపతనక హిరణ్యకులతో నిట్లనియె : "మన చెలికాఁడు చిత్రాంగుఁ డింత మసలుటకు[3] నిమిత్తమేమి? ఎన్నఁడుగాని యింత తడవు రాక నిలిచినవాఁడు కాఁడు. అక్కడక్కడ మేఁతకుఁబోయిన శకుంత సంతానములు[4] కొఱఁకులు[5] మాని యిరవులకు[6] రాఁదొడఁగె. వ్రేలు[7] తమ తమ పసుల కదుపులను[8] దోలుకొని పల్లియలకుఁ బోవుచున్నవారు. సూర్యుఁడు ప్రతీచీ ముఖమందు[9] సిందూర తిలకము నందము[10] వహించుచున్నవాఁడు. తరణికిరణవారము[11] చల్లారఁ జల్లార నా కారాటము[12] పెల్లుమీఱుచున్నది.[13] కొంతదూరము పోయి వెదకి వచ్చెద నంటినా నాకు గమనవేగము లేదు. మిమ్ముఁ బంచితినా[14] మీఁదు మిక్కిలి మీరు మరలివచ్చి నాకంటఁ బడునందాఁక నా చిత్తము తత్తఱ పడుచుండును.[15] నే నేమి చేయుదును?" అని కన్నీరువిడిచి దిక్కులు చూచు చూరకుండ లఘుపతనకుఁ డిట్లనియె: "నాకు నెల్ల పక్షులకంటె జవాతిశయము[16] గలదు. బహుయోజనము లయినను క్షణమాత్రములోఁ గ్రుమ్మరి మరలి

1. కోరఁదగినది; 2. చిగురులు; 3. ఆలసించుటకు; 4. పక్షుల గుంపులు; 5. మేఁతగలచోట్లు, కొఱఁకు (ఏక), కొఱఁకులు (బహు); 6. ఇండ్లకు; 7. గొల్లవాండ్రు; 8. పశువుల మందలను; 9. పశ్చిమ దిక్కనెడు స్త్రీ ముఖమునందు; 10. కుంకుమ బొట్టు తీరును; 11. సూర్యకిరణముల సమూహము; 12. సంతాపము; 13. అతిశయించు; 14. పంపితినా 15. కలఁతపడు; 16. వేగాధిక్యము.

రానోపుదు. దానిఁబట్టియే కదా లఘుపతనకుఁడని యన్వర్థసంజ్ఞఁ[1] బడసియున్నాఁడను. నీవు కొంచదలపడకుము.[2] నే నిక్కడ నున్నట్టే యెంచుకొనుము. ఇదిగో నిమిషమాత్రాన వెదకి వచ్చి చిత్రాంగుని వృత్తాంతము చెప్పెద" నని పలికి యా క్షణమె యెగిరిపోయి యా యరణ్యము నానాప్రదేశములు వెదకి యొక్కచో నురులలోఁ జిక్కువడియున్న చిత్రాంగునిఁ జూచి కన్నుల నీరు పెట్టుకొని చేరంబోయి 'చెలికాఁడా! నీవు పరుల సొమ్మున కాశపడవు. పరుల బాధింపఁబోవు. అడవిలోని గడ్డిమేసి, పడియ నీరు త్రాగి యొక చెట్టునీడలోఁ బడియుండి ప్రొద్దుఁబుత్తువు, నీ వొక కీడుచేఁత[3] యెఱుఁగవు. నీవంటి సాధువునకా యీ యాపద రావలె? ఇంతదూరము చింతింప నేల? ఎంతవారికిఁగాని దైవ మలంఘ్యము.[4] ప్రాప్తించిన వ్యసనమునకుఁ[5] బ్రతికారము[6] విచారింపవలెఁగాని తెచ్చపడియుండఁ[7] దగదు. కాఁబట్టి యిప్పుడు కర్తవ్యము నీకుఁదోచినది శీఘ్రముగా జెప్పుము. మంథర హిరణ్యకులు నా మార్గము చూచుచుందురు. పోవలెను." అనినఁ జిత్రాంగుఁడు విని "వేఁటకాఁడు రాకముందు హెచ్చరికపడి సదుపాయము చేసితిరా నన్నుఁ దప్పింపవచ్చును. లేదా నాయాశ నేఁటితో మానుండు. ఇప్పుడు పోయి వేగిరము హిరణ్యకుని దోడుకొని రమ్ము. అతఁడు వచ్చెనా నా కట్లు తెగఁగొఱికి నన్ను రక్షింపఁజాలును." అని చెప్పఁగానే లఘుపతనకుఁడు మనోవేగముతో నెగిరిపోయి యీ వృత్తాంతము మంథరహిరణ్యకులతోఁ జెప్పి హిరణ్యకుని వంకఁజూచి "మనము కడు శీఘ్రముగాఁ బోవలెను. నీవు నా వేగము ననుసరించి రాఁజాలవు. ఇంతలో నేమి కీడు మూడునో[8] తెలియము. నా వీఁపెక్కుము నిమిషములోఁ గొనిపోయి విడిచెదను." అని చెప్పి యొడంబఱిచి హిరణ్యకునిఁ దన వీఁపుమీఁద నెక్కించుకొని ఱింగుమను ఱెక్కలమ్రోఁతతో బాణమువలెఁబోయి చిత్రాంగుని దాపున వ్రాలెను. అంతట హిరణ్యకుఁడు చిత్రాంగుని బంధములు త్రెగఁగొఱికి 'చెలికాఁడా! నీవు మంచి బుద్ధిమంతుఁడ వీ యురులలో నెట్లు చిక్కితివి?' అని యడిగెను. లఘుపతనకుఁ డది విని

1. అన్వర్థ సంజ్ఞ = సార్థకనామము; 2. విచారింపకుము; 3. హాని చేయుట; 4. దాఁటరానిది; 5. కష్టమునకు; 6. మాఱుచేఁత; 7. నిశ్చేష్టతనంద; 8. కీడుమూడునో = ఆపద కలుగునో.

యిట్లనియె : 'మన మిక్కడ నిలువరాదు. ముందు ముచ్చట లాడుకోవచ్చును. లే లెండు' అని పలికి పయనముచేసి తాను వారికి మీఁద దాపుగా గగన మార్గమందు[1] వచ్చుచుండెను. అప్పుడు చిత్రాంగుఁడు హిరణ్యకున కిట్లనియె: 'ఎట్టి బుద్ధిమంతునకుఁ గాని, యెట్టి బుద్ధిహీనునకుఁగాని దుఃఖమో, సుఖమో యే కాలమం దేది యనుభవింపవలెనో యది యనుభవింపక తీఱదు. ప్రాణులకు సుఖదుఃఖములు సహజములు. నా పూర్వకర్మ మెట్టిదో పలుమా ఱిట్టి యాపదలకే పాలయితిని.

## చిత్రాంగుని పూర్వజన్మ వృత్తాంతము

ఆఱునెలల ప్రాయమప్పుడు నేను మా జాతిమృగములతోఁగూడి సంచరించుచుండఁగా నొకనాఁడు వేఁటకాఁడు వచ్చి, యురులుపన్ని, మంచి పచ్చికఁదెచ్చి మచ్చువెట్టి కొంతదూరానఁ బొదమాటునఁ గూర్చుండి చూచుచుండెను. అంతట నేను బాల్యచాపల్యముచేతఁ బదువు[2] విడిచి ముందు పేరెమువాఱుచుఁ[3] జివుకుచివుక్కునఁ జవుకళించి[4] దాఁటుచుఁజని మచ్చుఁజూచి మేయఁబోయి యురులలోఁ దగులుకొని భయపడి కూఁతఁ బెట్టితిని. అంతట మా పదుపు మృగములన్ని తలలెత్తి, చెవులు ఱిక్కించి[5] నిక్కిచూచి, బెదరి చట్రాతిమీఁదఁ గొట్టిన కుండపెంచికలవలెఁ[6] జెదరి నలువలఁకులకుఁ[7] బాఱిపోయెను. అనంతరము వేఁటకాఁడు పొదమాటు విడిచి నా దాపునకు వచ్చెను. నేను మృగమను - శిశువను, మా పదువుఁ బాసితిని. బంధములోఁ జిక్కుకొంటిని. దాపున యమునివలె వేఁటకానిఁ జూచితిని. ఇంక నేమి చెప్పవలె? నా ప్రాణము ముక్కాలు మువ్వీసము పోయినది. పిమ్మట వాఁడు నా యొద్దఁ గూర్చుండి యొక దారము నా మెడకుఁగట్టి, పట్టుకొని నాకు నోవకుండ[8] నురి విడిపించెను. కొం తాయువున్నది కాఁబట్టి నన్నుఁ జంపఁగడఁగినవాఁడు కాఁడు. తరువాత నన్ను వాఁ డఱకడఁ బెట్టుకొని పోయి యాదేశ మేలుచున్న రాజు కొమారునికి నూడిదగా[9]నిచ్చెను. ఆ రాచ

---

1. ఆకాశమార్గము; 2. సజాతీయ ప్రాణి సమూహము; 3. పరుగువెట్టుచు; 4. నాలుగు కాళ్ళతో నెగిరి; 5. నిక్కించి; 6. పెంకులవలె; 7. నాలుగు దిక్కులకును; 8. బాధ కలుగకుండ; 9. కానుక.

కొమారుఁడు తమ సాహిణమునకు[1] నెదురుఁగొట్టములోఁ[2] గట్టఁబంచి నా కాహారదానాదికృత్యములు తఱితప్పక జరుపుట కచ్చటి సేవకులకుఁ గట్టడిచేసి[3] నాయందు ముద్దుచేత నానాఁడు నన్ను విచారించుకొనుచుండెను. అంత దినక్రమమున బెదరు విడిచి మనుష్యులతో మచ్చికపడితిని. కాఁబట్టి కాచువాండ్రు నన్ను రాచకొమారుని యనుమతిని గట్టువదలి తిరుగ విడిచిరి. నేను మెడ బంగారుజంగెలు[4] గజ్జెలు మ్రోఁగఁగా విచ్చలవిడిగా మనసు వచ్చినచోట్లఁ దిరిగి తోఁపులందు, దొడ్లయందు లేఁబచ్చిక మేసి కొలఁకునీరు త్రాగి, చల్లని మ్రానినీడఁ గొంతవడి నెమరువెట్టుచుఁ బండుకొనియుండి, సాయంకాలమునకుఁ గట్టుఁబట్టునకు[5] వచ్చి చేరుచుండుదును.

ఒక్కనాఁ డా పట్టణము వీథిని సంచరించుచుండఁగా బాలకులు గుంపుగూడి 'కో' యని కూకలు పెట్టుచు నన్ను వెంబడించి తఱిమిరి. నేను బెదరి చవుకళించి దాఁటుచుఁ బాఱి సమీపమందున్న ప్రమదవనము చొచ్చితిని. చొరఁగానే యక్కడి రాజాంతఃపురకాంతలు నన్నుఁ బట్టుకొనిపోయి యంతిపురములో రాచకొమారుని శయనగృహమునకు దాపుగా నొక కంబమునకుఁ[6] గట్టిపెట్టిరి. నాఁటి రాత్రి కన్నులు మిఱుమిట్లుకొలుపు[7] మెఱుములతో శ్రవణకుహరములు[8] విదారించు[9] నుఱుములతోఁ గడవలతో ముంచివంచినట్లు నిరంతరధారమై మిన్నుమ న్నే[10]కమయినట్లు కారు[11] గ్రమ్మి యొక వర్షము గురిసెను. అప్పు డా వర్షముచూచి మిక్కిలి కుతూహలపడి మనుష్యుల భాషతో నాలో నేను మీఁద వానచినుకులు పడఁగా మెల్లని చల్లగాలి పొలయఁగా[12] మా పదువుతోఁ గూడి చవుకళించి దాఁటుచు, దువాళించుచు[13] సద్యోజాతమయిన[14] కదంబముకుళజాతము[15] మేయుచు విచ్చలవిడిగా సంచరించు భాగ్యము వెండియు నా కెన్నఁడు గలుగునో యనుకొంటిని.

---

1. గుఱ్ఱాలసాల; 2. పసులఁ గట్టు చోటు; 3. ఆజ్ఞ; 4. చిఱుగంటలు; 5. కట్టుచోటు; 6. స్తంభమునకు; 7. మిఱుమిట్లు - మిట్లు + మిట్లు, అందందుకు ప్రభృతులలోనిది; 8. చెవుల రంధ్రములు; 9. బ్రద్దలుచేయు; 10. ఆకాశము, భూమి; 11. నలుపు; 12. వ్యాపింపఁగా; 13. దౌడుపాఱుచు; 14. అప్పుడు పుట్టినది; 15. కడిమిచెట్ల మొగ్గల సమూహము.

అప్పుడు రాచకొమారుఁ డాచమనము చేయను వసారాలో వచ్చుచు నా మాటలు విని దిక్కులు చూచి వెంబడివచ్చు లంపతావానిఁ[1] జూచి 'యిక్కడ వింతవారెవ్వరు లేరు. ఇప్పటి మాటలు నీవును వింటివిగదా! ఇది యేమివింత? ఈ జింకపిల్ల యొక్కటియే యీ లోఁగిట నున్నది. ఇది యీలాగున మాటలాడి యుండునని తోఁచుచున్నది. నీ కేమి తోఁచుచున్నది?" అనిన వాఁ డిట్లనియె: "ఏలినవారికిఁ[2] దోఁచినది తప్పదు. మన విన్నమాటలచేఁ దెలియఁబడిన కోరిక మానిసికిఁ[3] బుట్టనేరదు." అనిన రాచ కొమారుఁడు విని 'యౌనౌను లెస్సగా నూహించితి'వని పలికి యాచమించిపోయి శయనించి వఱువాత లేచి కొలువుఁగూటమునకు వచ్చి కూర్చుండి జ్యోతిశ్శాస్త్ర పారంగతుని[4] నొక్క బ్రాహ్మణుని రావించి జరిగిన వృత్తాంతము వినిపించెను. అతఁ డదివిని మృగము మానుషభాష భాషించుట మిక్కిలి యరిష్టసూచకము.[5] దీనికి జపహోమాదులు చేయింపుఁడు. ఇప్పు డా మృగమును నిండినయింటిలో నిముషమయిన నిలుపరాదు.' అన విని రాచకొమారుఁ డంతఃపురమునుండి నన్నుఁ దెప్పించి 'యీ మృగమును దూరపుటడవిలో విడిచిరం'డని సేవకుల కాజ్ఞాపించెను. వారు నట్లు చేసిరి. అవ్వల వనములో నక్కడక్కడఁ దిరుగుచుండఁగా వేఁటకాఁడు తఱుముకొనివచ్చెను. నేను భయపడి పాఱివచ్చి మీ మఱుఁగు[6]చొచ్చి యప్పటి ముప్పు తప్పించుకొంటిని. నేఁ డిక్కడఁ దగులుకొని నీ యనుగ్రహమువలన బ్రతుకు గంటిని. ఇప్పటికిఁ గడతేఱితి మనరాదు. మీఁద నేమి రానున్నదో యెఱుఁగుదుమా? నీ వెంతటి బుద్ధిశాలివి? నీ వృత్తాంతము మంథరలఘుపతనకములవలన విన్నవాఁడను. నీవు పడ్డ యిడుమలు చెప్పితీఱునా? వేయి మాటలేల? విను. విధి త్రిప్పులకు లోపడని జంతువొక్కటి లోకమందుండదు' అని చెప్పి 'మంథరుఁడు మనరాక వేచి యుండును. మనలఁ జూచునందాఁక నాతనికిఁ బ్రాణములు కుదుటఁబడవు' అని ముచ్చటలాడుచు వచ్చుచుండఁగా నింతలోపల నక్కడ మంథరుఁడు లఘుపతనక హిరణ్యకులు వోయిన దిక్కు చూచుచుఁ 'బోయినవా రేల యింత

1. లంపతావానిన్ = పరిచారకుని; 2. ప్రభువులకు; 3. మానిసి = మనుష్యుఁడు; 4. జ్యోతిశ్శాస్త్రమునం దాఱితేఱిన వానిని; 5. అశుభశూచకము; 6. ఆశ్రయము.

తడసిరి[1]? పోయినపని నిరంతరాయముగా[2] సాగెనే? గడవేల[3] పట్టును? కటకటా! ఎట్టి పాపపుమాట వినఁబడునో కదా! ఏమి చేయుదును?' అని తలపోయుచు నక్కడ నిలువఁజాలక వెడలివచ్చువాఁడు మార్గమునందు హిరణ్యకాదులను జూచి 'అయ్యలారా! వచ్చితిరా! నా కడుపునఁ బాలు వోసితిరి.[4] శీఘ్రముగాఁబోయి స్థానము చేరుఁడి.' అని పలికి తాను వారివెంబడి వచ్చుచుండెను. అంత హిరణ్యకుఁడు మంథరునితో నిటనియె. 'నిమిష మెచ్చుతక్కువగా రాకమానము. దీనిలో నేమి మునిఁగిపోయినది? ఇట్టి సాహసము చేయరాదు. ఏదిగాని యిక్కడ నొక యిక్కట్టు[5] వచ్చెనా మేము తప్పించుకో నేరము. జలములయందువలె నీకు మెట్టల[6] గమనవేగము లేదు. కాఁబట్టి యిప్పుడిక్కడికి నీ రాక శుభోదర్కముగా[7] నాకుఁ దోఁపలేదు.' అనిన మంథరుఁ డిటనియె. 'మీరింత తాలస్యము చేసితిరి. మీ లోపల నొక్కరయిన ముందువచ్చి జరిగిన వృత్తాంతము చెప్పవచ్చుఁగదా! అదియును లేకపోయెను. మీఁదుమిక్కిలిగాఁ బోయినవారేమి కీడునకుఁ బాలయిరో యేమయిరో కదా యని మనసు మఱిమఱి తత్తఱింపఁదొడఁగెను. నీవ చెపుమా యెటు నిలువ మనసువచ్చును? మిమ్ముఁ జూచిన వెనుకఁగాని నా గుండె కుదిరినది.' అని సల్లాపములు సలుపుచుండఁగా మృగయుఁ డురులొడ్డిన చోటికి వచ్చి మృగ ముచ్చు[10] ద్రెంచుకొని యుఱికినదని యెఱిఁగి యాశ్చర్యపడి విల్లెక్కువెట్టి నేలఁజూచుకొని యడుగులజాడ చూచుచు మృగము పోయిన దారినే వచ్చుచుండఁగా లఘుపతనకుఁడు చూచి 'యోహో మాటల పరాకున మీరు పెండినడక నడచుచున్నవారు. వేఁటకాఁడిదె వెంబడించి పొంచికొని వచ్చుచున్నాఁడు. మాటలు కడలేదు. సత్వరముగా నూడనిఁబాఱుఁడు[11]' అనిన విని హిరణ్యకుఁ డొక్క లాఁగ దూఱెను. చిత్రాంగుఁడు పాఱిపోయెను. మంథరుఁడు నిసర్గమునకు[12] భయముతోఁ బ్రొద్ద నడవఁగాళ్ళు రాక మెల్లఁగాఁ బోవుచుండెను.

---

1. ఆలసించిరి; 2. నిర్విఘ్నముగా; 3. ఆలస్యము; 4. మేలుచేసితిరి; 5. కష్టము; 6. నేలపై; 7. ముందుమేలు నిచ్చునదిగా; 8. ఎక్కువ; 9. తొందరపడ; 10. ఉచ్చు - వాగుర; 11. పరువెత్తుఁడు; 12. స్వభావము.

## మంథరుఁ డాపదనుండి రక్షింపఁబడుట

అంత మృగయుఁడు తన్నుఁజూచి మృగము పాఱిపోకకు ఖేదపడి యచ్చోటఁ గచ్ఛపమును జూచి కొంత సంతోషించి డాయఁబోయి పట్టుకొని గొనయమునఁ[1] గట్టుకొని మూఁపుమీఁదఁ బెట్టుకొని పోవుచుండెను. అప్పుడు చిత్రాంగాదులు మూవురును గూడుకొని మంథరునకు వచ్చిన వ్యసనమునకుఁ[2] గన్నీరు విడుచుచుఁ గొంతదూరాన వేఁటకాని వెనుకనే పోవుచుండిరి. హిరణ్యకుఁడు చిత్రాంగ లఘుపతనకులఁ జూచి 'ప్రాప్తించిన దుఃఖము నిస్తరించి[3]తిమిగదా!' యని క్షణమునకు ముందు సంతోషపడితిమి. ఇంతలోనే యీ దుఃఖము ప్రాప్తించెను. ప్రాప్తించిన దుఃఖమునకు విషాదపడరాదు. వేఁటకాఁ డడవి దాఁటిపోకమునుపే మంథరుని విడిపింప ననువయిన యుపాయము వెదకవలెను. మించిపోయినవెనుక మన కభిమతము సాధించుట దుష్కరము.' అనిన విని చిత్రాంగలఘుపతనకు లిట్లనిరి: 'మేను[4] నిప్పులఁ బొరలిన[5] ట్లెరియు[6]చున్నది. చిత్తము స్వాయత్తము[7]గాదు. కర్తవ్య మిట్టిదని మాకుఁ దోఁచినదికాదు. నీవు బుద్ధిశాలివి. నీకుఁ దోఁపని యుపాయము లేదు చెలికానిని విపత్సముద్రము[8] దరి[9]చేర్చి శోకసముద్రము[10]దరిఁ దరి[11]వలె మమ్ముఁ జేర్పుము. నీవు తప్ప మా కన్యము శరణము లేదు. కర్తవ్యమును మా కుపదేశింపుము. నీ పంపు శిరసావహించి చేసెదము' అనిన హిరణ్యకుఁ డిట్లనియె: 'మన లోపల నొక్కరికి వచ్చిన మేలుగీళ్ళకు మన మందఱము పాలివారము[12]. కాఁబట్టి ఇప్పుడు ప్రాప్తించిన వ్యసనమునకుఁ బ్రతికారగవేషము[13] మీకుఁబోలె నా కావశ్యకమయియుండఁగా మీరు నన్నింత వేఁడుకోనేల? ఏదో నాకుఁదోఁచిన యుపాయము చెప్పెదను. మీరు మీ బుద్ధిచేత విచారింపుఁడు. సర్వసమ్మతమయిన పక్షమవలంబితము' అని చెప్పి చిత్రాంగునిఁజూచి "నీవు వేఁటకాని కంటఁబడకుండ ముందుపోయి వాఁడు వచ్చుమార్గములో నొక జలాశయమం[14] దొదిగిలి నాలుగు కాళ్ళు చాఁచుకొని

---

1. గుణము, వింటిత్రాడు; 2. కష్టము; 3. దాఁటు; 4. శరీరము; 5. దొరలినట్లు; 6. మండు; 7. స్వాధీనము; 8. ఆపదయనెడు సముద్రము; 9. తీరము; 10. దుఃఖమనెడి సముద్రము; 11. నావ; 12. భాగస్థులము; 13. మాఱుచేఁత వెదకుట; 14. కొలను.

గ్రమాఁగన్ను[1] వెట్టి, మెడయెత్తి మోర సారించి చచ్చినట్లు మెదలక పండుకొని యుండుము. లఘుపతనకుఁడు నీ మీఁదఁ గూర్చుండి కన్నులు పొడుచుకొని తినువానివలె నభినయించుచు, నఱచుచు నుండువాఁడు. అంత వేఁటకాఁడు మృగము చచ్చిపడియున్నదని భావించి మంథరునితోడ విల్లుదించి నేలఁబెట్టి చేరువకు వచ్చును. నేను వానివెంటనే వచ్చి మంథరుని బంధము చిటుకనకుండఁ దెగఁ గొఱికెదను. అంతట మంథరుఁడు జలాశయముఁ బ్రవేశించువాఁడు. నేను బొఱియ దూఱెదను. మీరు పాఱిపొండి. ఇది నాకుఁదోఁచిన యుపాయము,' అనిన విని చిత్రాంగలఘుపతనకులు హిరణ్యకుని బుద్ధికి మిగుల సంతోషించి తదుక్తప్రకారమునఁ[2] గార్యము నిర్వర్తింప హిరణ్యకుఁడు తన పాలి కార్యము నెఱవేర్చి మనోరథసిద్ధిఁబడసెను. అప్పుడు మృగయుఁడు మిగుల వగఁబొంది యల్లల్లఁదన మనికిఁపట్టున[3]కుఁ జనియె. హిరణ్యకాదులు తమ యిరవు[4]నకుఁజని తొంటియట్లు సుఖముండిరి.

పరవస్తు చిన్నయసూరి విరచితంబగు
నీతిచంద్రికయందు మిత్రలాభము సంపూర్ణము.

---

1. గ్రమాఁగన్ను = అర్ధ నిమీలిత నేత్రము చేసి; 2. తదుక్తప్రకారము = అతఁడు చెప్పినట్లు; 3. మనికిపట్టు = నివాస స్థానము; 4. ఇరవు = స్థానము.



# మిత్త్రభేదము

అనంతరము రాజపుత్త్రులు విష్ణుశర్మతో నిట్లనిరి. "స్వామీ! మీ యనుగ్రహమువలన మిత్త్రలాభము వింటిమి. ఇంక మిత్త్రభేదము వినఁగోరెదము." అనిన విష్ణుశర్మ యిట్లు చెప్పఁదొడఁగెను.

"ఒక వనములో సింహవృషభములు[1] మిక్కిలి చెలిమి గలిగి యుండఁగా నొక మాయావియయిన గోమాయువు[2] వానికి విద్వేషము పుట్టించి సింహముచేత వృషభమును జంపించెను. ఆ కథ మీకు సవిస్తరముగా వినిపించెదను. సావధానముగా వినుండి."

## వర్ధమానుఁడు వ్యాపారార్థ మేఁగుట

దక్షిణాపథమునందు రక్షావతియను పట్టణము గలదు. అందు వర్ధమానుఁడను సార్థవాహుఁడు[3] వాసము చేయుచుండును. అతఁడు తనకంటె సంపన్నులైన తన బంధువులను జూచి వారికంటె మిక్కిలిగా ధనము సంపాదింపవలెనని యెంచి యిట్లు చింతించెను

"అర్థము[4] పురుషార్థములలో[5] నుత్తమము. అర్థవంతున[6]కసాధ్యము లోకమం దేదియుఁ గానము. కాఁబట్టి పురుషుఁడు న్యాయము దప్పక యే యుపాయముచేతనయినను ద్రవ్యము సంపాదింపవలెను. ఇంత సంపాదించితి నింకెలయని తనియరాదు[7]. బుద్ధిమంతుఁడు జరామరణములు లేనివానివలె విద్యాధనములు గడయింపవలెనని పెద్దలు చెప్పుదురు. ధనార్జనమునకు సాధనములు పెక్కులు గలవు. వానిలోపల వాణిజ్యము[8] సర్వప్రకారములచే మేలయి కానఁబడుచున్నది" అని విచారించి పరదేశమునకు వలసిన తన దేశమందలి మేలిసరకులు సేకరించుకొని పెక్కు సరకులు బండ్లమీఁద, గుఱ్ఱములమీఁద, వేసడము[9]లమీఁద నెత్తించి కొన్నిటికి భారవాహులను[10] నియమించి, మంచికంచర[11] మొకటి సిద్ధముచేసికొని దానిని

1. సింహమును, ఎద్దును; 2. నక్క; 3. బేహారి; 4. ధనము; 5. ధర్మము, అర్థము, కామము, మోక్షము; 6. ధనవంతుఁడు; 7. తృప్తిపడరాదు; 8. వణిజుని భావము - వ్యాపారము; 9. కంచరగాడిద; 10. బరువు మోయువారు; 11. బండి.

## పింగళకుఁడు - కరటక దమనకులు

ఆ కాననమందుఁ బింగళక మనుసింహము గలదు. అది పుండరీకముల[1] ఖండించుచు, సలుగుల[2] నలుగులంపడఁజేయుచుఁ[3], గాసరముల[4] మీసరము[5] గాసించుచు[6], ఋక్షముల[7] శిక్షించుచుఁ, దక్కిన ముక్కడి[8] మృగముల లెక్కింపక యిచ్చకు వచ్చినట్టు విహరించుచు, నాఁడు డప్పివడి[9] పిపాసితమై[10] యమునాకచ్ఛము[11]నకుంబోయి ప్రళయ సమయ పర్జన్య గర్జానుకారి[12] యయిన సంజీవకము భీషణ ఘోషణము[13] విని వెఱఁగుచే[14] రాపడి[15] నిలుచుండెను.

ఆ యరణ్యమందు గరటకదమనకము లనుజంబుకములు గలవు. కరటకుఁడు దమనకునితో ముచ్చట లాడుచుండి సంజీవకము రావము[16] విని యదరిపడి గుండెలు తటతటఁ గొట్టుకొనఁ గొంతవడికి సంబళించికొని[17], యావలనికిఁ[18] గ్రేఁగంటిచూపు[19] నిగిడించి[20], చెవి నిక్కించి యాలించి యిట్లనియె. 'మఱి సద్దుగానము. నీవును వింటివిగదా? ఇది యేమి, యింత కాలమాయెను. ఈ యరణ్యములో నున్నారము. ఇట్టి బెట్టిదపుఁగూఁత[21] యెన్నఁడుగాని విన్నది లేదు.' అనిన దమనకుఁ డిట్లనియె : "ఔనౌను. ముందు విన్నదిగాదు. ఈ శబ్దము మహాశ్చర్యము. అదిగోఁ జూడు మనరాజు, పింగళకుఁడు యమునాకచ్ఛమునకుఁ బోవువాఁడు రాపడి నిలుచున్నాఁడు. ఆ ధ్వని విని కాఁబోలు" అని చిఱునవ్వు నవ్వి 'యంతవాఁ డట్లాయెను. మన మనఁగా నెంతవారము?' అనినఁ గరటకుం డిట్లనియె : 'ఇట్టి బెట్టిదపుటులివు[22] గావించిన జంతువు కొంచెపాటిగా[23] నుండదు. ఎక్కడినుండి వచ్చి యా జంతు వీ వనము చేరినది? ధ్వనిమాత్రము విన్నారము గాని యా జంతువును గానము.

---

1. పులి; 2. అడవి పంది; 3. అలుగులము+పడు = బాధపడు; 4. అడవిదున్న; 5. మిక్కిలి; 6. బాధించు; 7. ఎలుఁగు; 8. అల్పము; 9. డప్పి + పడి = శ్రమమునొంది; 10. త్రావఁగోరిక గలదై; 11. యమునా నది యొడ్డు; 12. ప్రళయకాలము నందలి మేఘమునుఱుమును బోలునది; 13. భయంకర ధ్వని; 14. ఆశ్చర్యము; 15. స్తంభించి; 16. ధ్వని; 17. కుదుటఁబఱుచుకొని; 18. దిక్కునకు; 19. క్రేవ+కంటి = కడగంటి; 20. ప్రసరింపఁజేసి; 21. బెట్టిదము+కూఁత = భయంకరమైన కూఁత; 22. బెట్టిదము+ఉలివు; 23. అల్పము.

నిన్న మాపో[1], నేఁడు రేపో[2]; యిక్కడి కది వచ్చి చేరియుండును. ఇంక నేమి యిడుమపాటు[3] రానున్నదో యెవ రెఱుంగుదు' రనిన దమనకుం డిట్లనియె: 'ఈ యరణ్యము మనకు మాన్యక్షేత్రమా?[4] లాఁతిచోటికిఁ[5] బోఁగూడదని నియమమా? మఱి యరణ్యము లేదా? అభిజన[6] మెవ్వరికిఁగాని దుస్త్యజమే[7]. అట్లని చావున కొప్పుకోవచ్చునా' 'ఈ విచారమేల? ఇప్పుడు మనకు వలసదీయునంత యిడుమ యేమివచ్చినది? ఈవఱ కా జంతువు నల్లనిదో, తెల్లనిదో యెఱుఁగము. అది క్షుద్రజంతువో, మహాజంతువో ముందు తెలిసికొని పిమ్మటఁ గర్తవ్యము విచారింతము. 'పిట్ట కొంచెము కూఁత ఘన మన్నట్లు క్షుద్ర జంతువునకు సయితము పెద్దనోరుండవచ్చును. జంతు వంత బెట్టిదము గాదనుటకు సూచన కొంత గానఁబడుచున్నది. నీవును జూడుము. ఆ వంక జంతువులు కలగుండు[8] వడిన లక్షణమేదియుఁ గానరాదుగదా? మంచి దాలకింపుము. క్షోభ మేమాత్రము పుట్టిన నలబలము[9] వినరాకుండునా?' అనినఁ గరటకుం డిట్లనియె : "అవునది నిజమే. కాని కడపట నిది యిట్టి జంతువు కూఁత యని మాత్ర మాకళింతకు[10] రాలేదు." అని చెప్పి కొంతతడ వూరకుండి చిఱునవ్వు నవ్వి యిట్లనియె : 'ఇప్పటికి స్మరణకు వచ్చినది. మఱియేమి గాదు విను. కొన్నాళ్ళకు మునుపు వర్తకుఁడొకఁడు దారిని బోవుచుండి తనబండి యీడువఁజాలక యీడిగలఁబడిన యొక బక్కయెద్దును బ్రయాణత్వరఁబట్టి యీ యడవిలో విడిచిపోయినాఁడు. అది యీ పాటికి గడ్డిపరకలు కొఱికి తేఱుకొని కొంత చియ్యఁబట్టి[11] యక్కడక్కడ నల్లాడఁ[12]గాఁ జూచితిని. ఇప్పుడు మనము విన్నది దాని అంకె. దానికి స్థూలదేహము లేదు. ఊఱక యీవఱకుఁ బనికిమాలిన పిఱికితనముఁ దెచ్చుకొంటిమి. మనకంటె శూరుఁడు మనరాజు!'[13] నావుడు దమనకుం డిట్లనియె : మనము పింగళకునకు మంత్రి పుత్త్రులమై యుండి యిప్పు డొప్పరికింపరాదు[14]. డాయఁ[15]బోయిన యాతని భీతి మానింతము[16]. ఈ నెపముచేత[17] నాతని కొలువు సంపాదించు

1. రాత్రి; 2. వేకువ; 3. కష్టము; 4. పన్నులేని భూమి; 5. ఇంకొకచోటికి; 6. జన్మభూమి; 7. విడువరానిదే; 8. కలఁత; 9. కలకలము; 10. అవగాహనము; 11. కండపట్టి; 12. విహరించు; 13. వ్యతిరేక లక్షణముచే మనకంటెను బిఱికివాఁడు మనరాజని భావము; 14. ఉపేక్షించు; 15. సమీపించు; 16. పోఁగొట్టుదము; 17. వ్యాజము, మిష

కారువు లను రావించి, తగిన వెతనములు నియమించి దానిఁ గట నియోగించెను. వారు దానిఁ గట్టుచుండఁగా నొకనాఁడు చవదూలము అంపముచేఁ గోయించుచు నది సుకరముగా వ్రీల్చు[3]టకు సూత్రధారుఁ[4] డక్కడక్కడ [illegible] మెకులు[5] దిగఁగొట్టి మధ్యాహ్నభోజనార్థము కూలవాండ్రును దానును బోయిను. అప్పు డా పరిసరతరువులందుఁ[6] దిరుగుచున్న కోఁతులు దేవాలయము దాపునకు వచ్చి ప్రాకారములు ప్రాఁకుచుఁ ప్రాంతమున [illegible] లమీఁదికిఁ గుప్పించి దాఁటుచు వెలుకొమ్మలు కాళ్ళతఁ బట్టి తలక్రిందులుగా వ్రేలుచుఁ, బెనుగొమ్మలు కరములతోఁ బట్టి యీఁచుచు విమానములమీఁదఁ[8] గూర్చుండి వికృతముగా బరులు[9] [illegible] గిఱుకొనుచు, నిక్కుచు, బొమలెత్తి[11] యుఱుఁగొట్టి[12] బెదరించుచుఁ, బం డ్లిగిలించుచు, వెక్కిరించుచు నొకటి నొకటి కుఱువుమీఁదఁ[13] బండించుకొని మేనిపేల నేఱి నోర[14] వేసికొనుచుఁ, గిలకిలారావము[15] గావించుచు నొండొంటితోఁ బోరుచుఁ, ఫలములు భక్షించుచు, మధువులానుచు[16] స్వాభావికచపలభావముతోఁ[17] దిరుగుచుండెను. ఒక ముసలి మల్లు[18] కాలచోదితమై[19] చవదూలముదాసి యక్కి దాని నెఱియలోఁ[20] దన ముష్కము[21] వ్రేలం గూర్చుండి యందు బిగియఁగొట్టిన కొయ్యమెకు రెండుచెతులతోఁ జిక్కఁబట్టి బలముతొ నూడఁబెఱికె యా నెఱియలో వ్రేలు ముష్కము చదియుటంజేసి[22] యొలుచుం[23] గాలధర్మము[24] నొందెను. కాఁబట్టి జోలిమాలిన పనికిఁ బోరాదు.

దమనకుఁడు "మన ప్రభు వాతని భృత్యవర్గము లెస్సు. అతనికిఁ గ్రొత్త కొలువు కాండ్రనేకు[25] లున్నారు. స్వామి హితాహితములు[26] విచారము వారిదిగాని, మన కా యధికారము లెదు. పరాధికారము పయివేసికొన్నవాఁ డొండ్రవట్టి

1. [illegible]
కొయ్యమేకులు; 6. సమీపవృక్షములందు; 7. సమీపవృక్షములు; 8. స్తూపములు; 9. [illegible] 10. ప్రక్కలు; 11. [illegible] 12. [illegible] 13. [illegible] 14. [illegible] 15. కిలకిలధ్వని; 16. తేనెలు త్రాగుచు; 17. [illegible] 18. కోతి; 19. [illegible] 20. [illegible] 21. [illegible] 22. [illegible] 23. విలపించుచు; 24. మరణము; 25. సేవకులు; 26. [illegible]

మోఁదువడిన గాడిదవలె వినాశముఁ బొందును. ఆ కథ చెప్పెదను సావధానముగా వినుము.

**కుక్క - గాడిద**

వారణాసియందు ధావకమల్లుఁ డనుచాకివాఁడు గలఁడు. ఒకనాఁడు వాఁడు మిగుల బట్టలు గుంజిన బడలికచేత మయిమఱచి[1] గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండెను. ఆ నడికిరేయి వాని యి ల్లొకదొంగ చొచ్చెను. అప్పుడు వాని యింటివాకిటఁ గాలిబందముతో గాడిదె నిలుచుండెను. ఆ యింటి కావలికుక్క దాపునఁ గూర్చుండి చూచుచుండెను. అవి యొండొంటితో 'లోనికి దొంగ చొచ్చినాఁడు చూచితివా?'

'చూచితిఁ జూచితి.'

'మఱి యేల మొఱుఁగవు?'

'నా పని విచారింప నీ కేమి నిమిత్తము?'

'మన దొరయిల్లు దొద్దవోఁగా[2] నొప్పరికింపవచ్చునా?'

'నీ వే మెఱుఁగుదువు? రాత్రిందివము[3] నిమిషమాత్రమయినఁ బ్రమాదపడక, తలవాకిలి వదలక యిల్లు గాచుకొని యుండుదును. అవంతయయిన నావలని ప్రయోజన మెఱుఁగక యేలిక[4] నాయందు సౌకల్యము[5] లేక యున్నాఁడు. కాఁబట్టి కూడు కమికెఁడయిన[6] దొరకుట కఱవయ్యె. పా టెఱుఁగని[7] దొరను సేవించుటకంటె మిన్నకుంట[8] మేలు'.

ఇట్లు ఖరశ్వానములు[9] ప్రశ్నోత్తరములు జరుపుచుండఁగా గాడిదె మిక్కిలి కోపించుకొని, 'ఓరీ దురాత్మా! వినుము. ఒక పోరామి[10] వచ్చినప్పుడు స్వామిదోషములు దడవి యుపేక్షించియుంట భృత్యునకు ధర్మముగాదు అదియునుగాక స్వామిరక్షణము విచారింపక సేవకుఁడు స్వార్థపరుఁడయి స్వకృత్యమునందుఁ బ్రవర్తింపఁడేని కృతఘ్నుఁడగును. నీవు పాపిష్ఠుఁడవు దొసఁగు[11] పొసఁగినప్పుడు[12] స్వామికార్య ముపేక్షించితివి. ఇంతటితో నేదియు

1.శరీరముమఱచి; 2.కొల్లపోఁగా; 3.రేయుంబవలును; 4.యజమానుఁడు; 5.అనుగ్రహము 6. కమికెఁడు-కమికి+ఎఁడు=వంపఁబడిన వ్రేళ్ళుగల పుడిసిలి పట్టునంత; 7.పాటు= శ్రమము; 8. మిన్నక+ఉంట (ఉండుట)=ఊరకుండుట; 9. గాడిదయుఁ, గుక్కయు 10. ఆపద; 11. దొసగు = ఆపద; 12. కలిగినప్పుడు.

మునిఁగిపోదు నీపని నాచేతఁ గాదా? చూడు. మన యేలిక నిప్పుడు ప్రబోధించెదను[1] అని చెప్పి గట్టిగా నోండ్రపెట్టెను అంత నా మడివేలు[2] మేలుకొని నిద్రాభంగ మాయెనని మహాకోపముతో లేచి యొక బడియతో గాడిదను మోఁదెను ఆయమం[3] దామోఁదు తాఁకుటఁజేసి యా గాడిదె ప్రాణమును విడిచెను. కాఁబట్టి పరాధికారము మనము పయిఁబెట్టుకోరాదు

అక్కడక్కడఁ బసరముల[4] డొక్కలు వెదకుట మన కార్యము అది మాని యీ విచారమేల? భక్షితావశిష్ట[5] మయిన మాంసము కావలసినయంత యున్నది రా రా భక్షింతము

**ఉత్తమాధమ జీవితములు**

అనిన దమనకుఁ డిట్లనియె : ఇప్పుడు త్వరయేల? మెల్లఁగా బోయి భక్షింతము ఎల్ల జంతువుల కాహార నిద్రా భయములు సహజ ధర్మములు. కుక్షింభరిత్వముచే[6] గారవము రాఁబోదు మిత్రామిత్రుల కుపకారాపకారములు[7] సేయవేఁడి బుద్ధిమంతులు రాజాశ్రయము గోరుదురు. స్వోదరమాత్రము[8] భరియింప నేఁడు లేఁడు? ఎవాఁడు[9] జీవింప ననేకులు జీవింతురు. వాని మనుగడయే[10] సఫలము వాఁడొకఁడు జీవించువాఁడు. ఆమిషశూన్యమయి[11] వసాగంధిలమైన[12] శల్యము[13] దొరకిన మాత్రాన వేఁపి[14] మిక్కిలి సంతోషపడును గాని దానిచే దాని యంగద[15] గొంతయైన నడంగదు.[16] కేసరి[17] యాసన్నమైన[18] యొక్కడి మృగమును లెక్కింపక *నిజఖర నఖర విదారిత హస్తిమస్త మస్తిష్కమ[19] కోరును ఎల్లవారును సత్త్వానురూపమైన[20] ఫలమే వాంఛింతురు శునకము తన కోగిరము[21] పెట్టువానికడఁజేరి తోఁకాడించును నేలఁబడి నోరు కడుపు చూపును ఇన్ని పాట్లుపడు కుక్క కొక్క ముద్ద వంటకముకంటె మిక్కిలి

---

1 మేలుకొలిపెదను 2 చాకలివాఁడు 3 మర్మస్థానము 4 పశువు 5 తినఁగా మిగిలినది. 6. పొట్టనింపుకొనువాని భావము 7 మిత్రుల కుపకారము అమిత్రుల (శత్రువుల) కపకారము 8 స్వ+ఉదరమాత్రము = తన పొట్టను మాత్రమే 9 ఎవఁడు 10 జీవనము 11 మాంసహీనము 12 ముఱుగుడుఁగ్రొవ్వుచే దుర్వాసన గలది· 13 ఎముక 14 కుక్క 15 ఆఁకలి 16 నశింపదు 17 కేసరములు గలది-సింహము 18 దగ్గఱనున్నది. 19. *తనవైన వాఁడియైన గోరులచే చీల్పఁబడిన ఏనుఁగు యొక్క శిరస్సు నందలి మెదడునే 20 బలమునకుఁ దగినది 21 ఆహారము

నడప సమర్థుఁడవును ఆ సామర్థ్యము చేతఁ బదానతేముఁ బడయును. ఎట్టి ప్రజ్ఞావంతుఁడుగాని పేటికాంతరరత్నముంబోలె[1] వినాలోకయోగము[2] లేక ప్రకాశింపఁడు. పురుషుఁడు సాదువరసుఁడయ్యేనేని సర్వలోక పూజ్యుఁడగును గానిచో గర్హ్యుఁ డగును మానావమానములు ప్రవర్తనా యత్తము లయి యుండును. గుణవంతుఁ డని పేరువడుట దుర్లభము లాఁతివిధము సులభము. మహా గావమును గావాగము నెక్కించుటయుం బోలెఁ గ్రిందికిఁ ద్రోయుట దుష్కరము గాదు.

నావుడుఁ[8] గరటకుఁ డిట్లనియె : రాజసేవలని ప్రయోజన మెఱుఁగని వాఁడఁగాము. తొలి యీతనివలనఁ బడపాటు తలఁచుకొనుమాత్రానఁ దల కంటగించు[9] చున్నది. కాఁబట్టి యిటు ఎచయించుతిని. భృత్యుల గుణదోషములయందు వివేకము చాలని రాజును గొలుచుట దుష్కరము. నీవ వివేకివి. అన్యులచేతఁ జెపించుకొనవలసిన యర్థము నీ కొకటి లేదు. ఉచితమయినటు చేయుము. ఇపుడు ఏవ చయఁబూనిన కార్యముఁ నావుడు దమనకుఁ డిటనియె :

**సంగీత సామరుల భేదము**

'మనరాజు పింగళకుఁడు జలపానారము[10] కాళిందికిఁ[11] బోయి యెదు ర్కొంకెవిని బయపడి తీరావతరణము షూని వెఱఁగుపడి[13]యున్నవాఁడు. పరహృదయమునకు సులభముగాదు కాఁబట్టి యాతని చితవృత్తిని నివెటు తెల్లిసిక్కొంటివనఁబోకు. ఈ యుర మాతని యాకారముచేతనే నా కవగతమయినది.[14] ధీమంతులకుఁ బరుల భావము సుగమమై[15] యుండును.

1 పెట్టెలోపలనున్న రత్నము విధమున 2 ఇక+ఆలోక-యోగము = సూర్యకాంతితోడి కూడికయని రత్నపరమైన యర్థము పబుదరున పాపియని పాత్రపరమైన యర్థము 3 నింద్యుఁడు; 4 నడవడికి లోఁబడినవి. 5 అనేవిధమ్ము-గుణహీనుఁడని పేరువడుట యని భావము. 6. పెదఱ్ఱాయి 7 కొండకొన 8 నావుడున్= అనినంతనే-అనుధాతువు అనంతరార్థకరూపమ్ము - అనుడు అనవుడు అనియు రూపములు· 9 నొచ్చు 10 నీరు త్రావుకొఱకు 11 యమునానది, 12 రేవులో దిగుట 13 ఆశ్చర్యపడి 14 బోధపడినది 15 సులభము.

తురంగ[1] మాతం[2]గాదులు సహితము చెప్పిన యర్థము గ్రహించి వహనాదికార్యములఁ[3] బ్రవర్తిల్లుచున్నవి. పరేంగితావగాహి[4] యయిన బుద్ధి యొక్కటియే పండితునకు విశేషము. అది లేనినాఁడు పండితునకుఁ బామరుని[5] కంటె విశేషమేమి? అది యటుండనిమ్ము. కర్తవ్యాంశము వినుము. నే నిప్పుడు రాజు పాలికిఁబోయి తద్భావానురూపముగా[6] ననుసరించి, వలసిన మాటలాడి, యీ కార్యము నీవు చేయుమని యాజ్ఞాపింపఁజేసికొని మనసున కెక్కఁ[7] బ్రవర్తించి యాతని మన్ననలు వడసెదను".

**రాజసేవ**

అనినఁ గరటకుఁ డిట్లనియె : "రాజుకొలువు కోరువారు మెలఁకువ[8] గలిగి ప్రవర్తింపవలెను. వారి చిత్తవృత్తి యెఱిఁగి మెలఁగుట కడిఁది[9]. అది స్వచ్ఛంద వృత్తి వంటిది గాదు". నావుడు దమనకుఁ డిట్లనియె : "ఉద్యోగికి దూరభూమియు, విద్వాంసునకుఁ బరదేశమును బ్రియవాదికి[10] శత్రువును లేనియట్లు బుద్ధిమంతున కసాధ్య మొకటిలేదు. సద్వర్తనము గలిగి నిచ్చలు[11] తమ్ముఁ గొలుచువారిని రాజు లాదరింతురు. భృత్యుండు ఱేని కోప ప్రసాదముల[12] యంగమచ్చము[13] లెఱిఁగి మెలఁగెనేనిఁ దదనుగ్రహమునకుఁ బాత్రుఁడగును". అనవుడుఁ గరటకుఁ డిట్లనియె : "తొలుత రాజును జూచి నుడువ[14] దొరఁకొను[15] నర్థమేది?" నా విని దమనకుఁ డిట్లనియె : "ఈ యర్థము వచియింపవలెనని నియమము గలదా? ప్రతిభాశాలికిఁ బ్రభువు నెదుర సమయోచితముగా వచియింపవలసినది బహువిధముగా నుండును. సేవకుఁ డడఁకువఁ దోఁపఁ గట్టెదురు[16] పట్టు[17] దలఁగి[18] యేలిక మొగమునన[19] చూపు నిలిపి యాతఁడు తన వలను[20] చూచునెడఁ దత్కాలోచితముగఁ

---

1 వడిగాఁబోవునది-గుఱ్ఱము· 2 మతంగుఁడను మునివలనఁ బుట్టినది-ఏనుఁగు; 3 మోయుట మున్నగుపనులు; 4 ఇతరుల మనోఽభిప్రాయములను దెలియునది; 5. మూఢుఁడు; 6. అతని యభిప్రాయమునకుఁ దగినట్లుగా 7 మదికి నచ్చునట్లు; 8. జాగరూకత 9. దుర్లభము 10 ఇచ్చకమాడువాఁడు 11 నిత్యము 12. కోపము యొక్కయు అనుగ్రహముయొక్కయు, 13 గుర్తులు; 14 పలుకుటకు· 15. ప్రారంభించు; 16 కడు+ఎదురు; 17. స్థానము; 18. తొలఁగి· 19 మొగమునందే; 20. దిక్కు.

బౌర్వాపర్యము[1] విచారించి తేనిభావ మూహించి, తక్కుఁగల రాజభృత్యులకు నవిరుద్ధముగ[2] నేరిమిమీఱఁ[3] బలుకవలసిన యర్థము పలుకవలయును'.

### దమనకుఁడు పింగళకునిచెంత కేఁగుట

అనినఁ గరటకుఁడు 'నీకుఁ గార్యసిద్ధి గావుత! అదె తేఁడును మరలి తన యిరవునకుఁ జనుచున్నవాఁడు. అతఁ డిరవు[4] చేరునంతకు నీవుంబోయి దాకొన[5]వచ్చుఁబొమ్ము,' నావుడు దమనకుఁడు పింగళకుని పాలికింబోయి యడఁకువతోఁడ నొదుఁగువాటున[6] నిలిచి భయభక్తులు పిరిగొనఁ[7] దొట్రువడుచు[8] జోహారు[9] వొనరింప మృగేంద్రుఁ డతని సాదరంబుగ[10] వీక్షించి, కూర్చుండ నియమించి 'కుశలమా? బహుకాలమునకు నిన్నుఁ జూడఁగలిగె' నావుడు దమనకుం డిట్లనియె :

### సేవా విధములు

"దేవా! తావకం[11] బగు నపాంగావలోకంబునకుం[12] బాత్రంబైన[13] యీ వనక్షేత్రంబున[14] జంతుసంతానంబుల[15] కావంతయేనిఁ గొఱంత కుశలం బునం గలుగదనం దావక సేవకులగు మావంటివారి కయ్యది యడుగం బనియేమి? అవసరంబగుడు సేవకుం డనాకారితుం[16] డయ్యు రావలయుఁ గాదెఁ స్వామికిం దఱి[17]యెఱిఁగి భృత్యుండు హితాహితంబు[18] లెఱిఁగింప వలయు. ఉపేక్షకుండయినఁ బ్రియవాదియయినను స్వామిద్రోహి యగు. స్వామిద్రోహికి సర్వశ్రేయంబులును జెడును. సదసద్వివేక సంపన్నుం[19] డయిన ప్రభువునకు మాబోఁటి క్షుద్రుల వలన నరయందగిన యర్థం బొకటి గల దేయని విచారింపఁ బనిలేదు. చక్షుష్మంతునకే[20] దీపంబు గాని యంధునకుం గొఱ[21]యగునె ? ఒక్కటి విన్నవించెద నవధరింపుఁడు[22].

---

1. ముందువెనుకలు; 2. విరుద్ధముకానియట్లు; 3. నేర్పు అతిశయించునట్లు; 4. స్థానము; 5. సమీపించు; 6. ఒదిఁగియుండుట; 7. పెనఁగొనునట్లు; 8. సంభ్రమించుచు; 9. నమస్కారము; 10. స+ఆదరంబుగన్ = ఆదరముతో; 11. మీఁదయిన; 12. కడకంటి చూపునకు; 13. తగిన; 14. అడవి భూమియందు; 15. జంతువుల సమూహములకు; 16. పిలువఁబడనివాఁడు; 17. సమయము; 18. మేలుగీళ్ళు; 19. మంచిచెడ్డలనరయు జ్ఞానముతోఁ గూడినవాఁడు; 20. కన్నులు గలవానికి; 21. ప్రయోజనము; 22. వినుఁడు.

బహుదేశాటనంబును[1] బహుశ్రుతుల[2] తోడ నిరంతరసాంగత్యంబును[3] గావ్యశాస్త్రవిచారంబును రాజాస్థానంబుల బహుకాలసేవనంబును బుద్ధిహీన కెట్టివానికేని వివేకంబు పుట్టింప సమర్థంబులయి యుండు. ఈ నాలుగింట నొక్కండేని[4] యెవ్వానికి లేకుండు వాఁడు కూపస్థమండూకంబుం[5] బోలెం దన ముక్కునకుం జక్క నిమీఁదిదె యాకాశంబు, తన గొందియ[6] లోకంబని యెంచి స్వజీవనమాత్రంబునకుం దుష్టి[7]వొంది లోకవృత్తంబున[8] మూఢుం డయి నశియించుచున్న. చిరకాలం బేలినవారి పాదంబుల కొలువు సేయుచున్న మాబోంట్లు[9] ముఖ్యులమయ్యు విద్యావివేకసంపన్నులగుట సన్నిధాన ప్రభావంబు[10]చేతం గాదె? స్వామికి క్షేమంబుఁ గాంక్షించు భృత్యుం డప్రాప్తానుయోగుం[11] డయ్యుం దటియెఱింగి వలయునర్థంబు వచింప వలయును. అయినను స్వామి చిత్తంబునకు వేఱొండుగఁ దోఁచునేమోయని మనంబు తేఁకువఁ[12] బొరసెడు[13]". నా విని పింగళకుండు "దమనకా! నీవు మాకు హితభృత్యుండవు. నీ వచనంబు మా కవశ్యగ్రాహ్యంబు[14]. మేము నీకుఁ గ్రొత్తవారమే? ఏల జంకువడియెదవు? నీ యిచ్చవచ్చినచొప్పునఁ జెప్పవచ్చును." నావుడు దమనకుండు కరంబున నోరుమూసికొని యావచనంబు లాలించి[15] బుద్ధిబుద్ధి![16] యన్న. "దేవా! యింతకుం గొంతముందు యమునా కచ్ఛంబు[17]నకుం బోయి యచట నిశ్చేష్టపడిన[18] తెఱంగు[19] దోఁపం గొంతసేపు చిత్రరూపంబు పగిదిం[20] జూపటి మరలి యిరవున కరుదెంచితిరి. ఇందులకు నిమిత్తంబు[21] గానక నిశ్శగ[22] బుత్కలం[23] బొందెడు. అయ్యది చెప్పవచ్చునేని దేవరచిత్తంబునకుం దోఁచిన సేవకుండు వేచి[24] యున్నవాఁడు" నావిని పింగళకుండు "దమనకా! వినుము. మాకు నీవు పరమాప్తుండవు. నీకు

---

1. పెక్కుదేశములు తిరుగుట; 2. పండితులు; 3. ఎడతెగని కూడిక; 4. ఒక్కఁడు ఏని=ఒక్కటియైనను; 5. నూతిలోని కప్ప; 6. ఇరుకైన స్థలము; 7. సంతోషము; 8 లోకపునడకయందు; 9. మావంటివారు; 10. సామీప్య మహిమ; 11. పొందఁబడని ప్రశ్నము గలవాఁడు - ప్రశ్నింపఁబడనివాఁడు; 12. భయము; 13. పొందును; 14. తప్పక గ్రహింపఁదగినది; 15. విని; 16. చిత్తము, చిత్తము అనునట్టి వినయోక్తి; 17 యమున తీరము; 18. నిశ్చేష్టుఁడగు; 19. విధము; 20. బొమ్మయందు రూపువలె; 21. కారణము; 22. మనస్సు; 23. కలత; 24. ఎదురుచూచు.

దాఁపురము[1]చేయు నర్థము మాయం దొకటియైనఁ గలుగదు. అఖిల సత్త్వశరణ్యంబైన[2] యీ యరణ్యంబు మదధీనంబు[3]. ఈ దేశంబున నా యాదేశంబున[4] గాక యాకయినం గదల వెఱచు. వింటివా నేఁ డొక్క విపరీతంబు. పిపాసార్దితుండ[5]నయి యమునా తరంగిణి[6] కరుగుచుండ నుఱుము తెఱంగున మొరపం[7] బొక్కటి కర్ణగోచరం[8] బయ్యె. ఆ నినదంబు[9] వినినచోటనే వితాకువడి[10] నిలిచితిని. ఇసుమంత యయిన నంతరంగంబున భయంబునం బొరయక యిట్లు ఘోరంబయిన యారావంబు[11] గావించిన జంతు వలంతిగ[12] నుండదని చింతించెద. లోకంబున నుత్తముం డగు శూరునకుం బరప్రకర్షంబు[13] సహ్యంబగునే[14]? అలఁతివానినేనిం బగవాని నొప్పరికింపం జన[15] దన లాఁతివానిఁ జెప్పనేల. ఎట్టివానికేని బలదర్పంబునఁ బగతు[16] నొప్పరికించు నట్టివాని కశక్తిభీరుత్వంబులు[17] లోకు లారోపింతురు! వలదని వాకొనకుండ[18] మూఁకుట[19] నోళులు గ్రమ్మవచ్చునే? ఇట్టి సడి[20] వడుకంటె నొడలు[21] విడుచుట మేలుగాదె? ఊరక దోరు[22]కంటెఁ బోర[23] నది శ్రేయోదాయకంబయి[24] యుండు. దైవ యోగంబున[25] మారుతుండు[26] దొరెనేనియుం గడు మేలయ్యె. కావున నిప్పుడ దాయ[27]వయి నొండెఁ[28]బోవుదము. అరాతినిరాసంబ[29] పరమార్థంబుగం గోరితిమేని దదుపాయాన్వేషణం[30] బావశ్యకంబు. బలవంతుం బగతు నుపాయంబుచేతన సాధింపవలయును. కావున నిప్పటికిఁ దొలంగి చని కాలదేశోచితంబుగ[31] వలయు నుపాయంబు సముపార్జించు[32] కొని విపక్షు[33] శిక్షింత మొండె. ఇందు

---

1. దాఁచుట; 2. ఎల్లజంతువులకు శరణమయినది; 3. మత్+అధీనంబు= నావశమయినది; 4. ఆజ్ఞ; 5. దప్పికచే బాధపెట్టఁబడిన వాఁడను; 6. నది; 7. ధ్వని; 8. చెవులకుఁదెలిపినది-వినఁబడినది; 9. ధ్వని; 10. వితాకు+పడి = నిశ్చేష్టతఁజెంది; 11. ధ్వని; 12. తక్కువగా; 13. శత్రువు ఆధిక్యము; 14. సహింపఁదగినది. 15. ఒప్పరికింపన్+చనదు = ఉపేక్షింపఁదగదు; 16. శత్రువును; 17. శక్తిలేమియు, పిరికితనమును; 18. చెప్పు; 19. మూఁకుటితో; 20. నింద; 21. శరీరము; 22. చచ్చు; 23. యుద్ధమందు; 24. మేలునిచ్చునది; 25. దైవవశమున; 26. శత్రువు; 27. శత్రువు; 28. అటుకాని పక్షమున; 29. శత్రువు నిరసనమే; 30. ఆయుపాయమును వెదకుట; 31. కాలమునకు, దేశమునకుఁ దగినట్లు; 32. సంపాదించుకొని; 33. శత్రువును.

నీ కెయ్యది పోలియున్న యది చెప్పు" మనిన దమనకుండు కొంతవడి చింతించి తుదముట్టం గారణంబుఁ దెలియక తమకింప[1]రాదు. శబ్దమాత్రంబునకు నివ్వెఱఁ[2] బొరయం జనదు.

## నక్క - నగారా

తొల్లి యొక జంబుకంబు[3] వనమ్మునం గ్రుమ్మరుచు నెక్కడ నాహారంబు చేకూరమిం[4] గరం బుదరం బాఁకట నకనకంబడ డిల్లపడి[5] వికలాంగంబులయి[6] నేలం గూలిన శతాంగంబులను[7], ఖండిత శుండాదంత కాండంబు[8] లయి కెడసి[9] కొండలపిండు[10] విడంబించు[11] వేదండ తండంబులును[12], ముంగాళ్ళు[13] విఱిగి, డొక్కలు పెరిగి[14] మాఱు మెడలు వైచి తాఱుమాఱుగం బడియున్న వారువంబులును[15], నెఱమగంటిమి[16] మెఱయ వాతెఱం[17] గొఱుకుచుం జూపుజంకెనల[18] పొంకంబు[19] వదలని శిరంబులును, వాలు[20]దొరంగని[21] కరంబులును[22], గరంబు మెఱయు వీరశయనంబు[23] నొందిన యోధవారంబుం[24] గలిగి ఘోరంబయి వివిక్తం[25] బయిన యొక పొలికలనిం[26] గని తఱియంజని[27] యొక్క దారుణారావంబు[28] విని గుండియ లవియ[29] బెండువడి[30] మూర్ఛిల్లి కొంతవడికిం దెప్పిఱి[31] తెప్పలువిచ్చి యప్పొలంబు నలువలంకులు విలోకించి గాలిం గదలు[32] వ్రేలుఁ గొమ్మల తాఁకున మ్రోఁగు దుందుభిం[33]గని మనంబునం దలంబగు[34] కొందలంబు[35] మాని దాని డాయంబోయి యద్దాని తోలు వ్రీలం గొఱికి చొరంబడి వెడలివచ్చి దీని కలరూపు[36] తొలుతం దెలియం జాలనయితి

1. తొందరపడరాదు; 2. నిండు+వెఱ=మిక్కిలి భీతి; 3. నక్క; 4. లభింపక పోవుటచే 5. బలహీనమయి; 6. వీడిన అవయవములు గలది; 7. రథము; 8. నఱకఁబడిన తొండముల, దంతముల సమూహములు గలవి; 9. పడి, చచ్చి; 10. కొండల సమూహమును, 11. అనుకరించు; 12. ఏనుఁగుల గుంపులను; 13. ముదు+కాళ్ళు 14. తెగి; 15. గుఱ్ఱములను; 16. నిండుపరాక్రమము; 17. పెదవి; 18. బెదరింపు; 19 పొందిక; 20. కత్తి; 21. విడువని; 22. చేతులను; 23. యుద్ధమరణము; 24. వీరుల సమూహము; 25. జనులులేని; 26. యుద్ధభూమి; 27. సమీపింపఁబోయి; 28. భయంకర ధ్వని; 29. బ్రద్దలగు, 30. బలహీనమగు; 31. తేఱి; 32. గాలిచేఁగదలు; 33. భేరిని; 34. అధికము; 35. విచారము; 36. యధార్థము.

ఇప్పుడుగదా దీని చొప్పు[1] నెఱింగితి. ఎద్దియేని సవిమర్శంబుగఁ బరికింపకకాని యున్నతెఱం గెఱుంగంబడదు గదా యని యెన్నుకొనుచుం దన చుట్టుఁబట్టుం జూపట్టు శవనివహంబు[2] పాఱంజూచి "యాహా! యిట్టి యాహారంబు దొఱంగి సురుంగం[3]జూచితిం గదా!" యని వగచుచు వలయు నంత వలలంబుఁ[4] దిని తన యిచ్చంజనియె. కావున శబ్దమాత్రంబునకు నివ్వెఱఁ బొరయం జనదని వచించితి.

**దమనకుని జంతువుఁ గనుఁగొనఁ బంపుట**

'స్వామి ముదల[5] యిచ్చినం జాలును. ఈ క్షణంబ యా చప్పు డుప్పతిల్లిన[6] చాయ[7]కుంబోయి తత్కారణం బారసి నీ లెంక[8] రాఁగలండు" అనినఁ బింగళకుం డాతని మొగంబట్టె చూచి కొంత చింతించి "యిదియు నిప్పటి కుచితంబని తోఁచుచున్నది. కరంబు పరికింపక యేకార్యంబున కేనిం దమకింప లగ్గుకాదు[9]. ఎదిరి[10] సమ్ముఖంబున మాటలాడ సూటి[11]వడేనేని బలాబలంబుల కొలంది యెఱింగి తత్కాలోచితంబుగ నా పుత్తెంచిన[12] మాటలుగ నాడవలసిన నీకుం బోలిన తెఱంగున నాడి యెదిరిని లోఁగొన వచ్చునేని నట్లు నడపుము. నీ వన్నింటం జతురుండవు[13]. నీకుం జెప్పవలయునే? పోయిరమ్ము".

నావుడు దమనకుఁడు గ్రక్కున[14] వెళ్ళి తొల్లి మ్రోఁత వీతెంచిన జాడన పోయి యా పొలంబు నలుకెలంకులు[15] కలయం[16]జూచి యడుగుల చొప్పువట్టి[17] డాయం బోయి సంజీవకుం గాంచి 'యోయి వృషభేంద్రా! నేను మృగేంద్రుని భృత్యుండను. నీ పాలికి వచ్చితిని. అతండు దానుగా నీతోడ నాడు మాటలు నాకుం గఱపి[18] పుత్తెంచినవాఁడు వినుము. "ఈ యరణ్యంబు మదధీనంబు. దీనంగల సత్త్వంబులన్నియు నా శాసనంబు వహించి వర్తించుచున్నవి. నీవును నా యాజ్ఞానువర్తివయి యుండునది. ఇంతియకాదు. మదీయానుచరులంగూడి

1. విధము; 2. శవముల సమూహము; 3. పాఱు, 4. మాంసము; 5. ఆజ్ఞ; 6. పుట్టు; 7. చోటు; 8. సేవకుఁడు; 9. మేలు; 10. శత్రువు; 11. యుక్తము; 12. నేను చెప్పిపంపిన; 13. నేర్పరివి; 14. శీఘ్రముగా; 15. నాలుగు ప్రక్కల; 16. అంతటను; 17. జాడపట్టి; 18. బోధించి.

వర్తింప నీకుం బ్రియంబేని ననురూపంబగు రాచకార్యం[1] బొసంగెద. నీ యిష్టం బెయ్యది యది యనుసరింపవచ్చు" నని యానతిచ్చె. ఇంతకుమునుపు నీవు నిశ్శంకంబుగ అంకియ వైచితివి కాఁబోలు! దాని విని యేలికకు నీ పొలఁకువ[2] విచారణీయంబయ్యె. నీవు భయపడకుము. అమ్మహామహుండు కరుణాళుండు, ధార్మికుండు గావున సజ్జనులకు గమ్యుండయి యున్నవాఁడు. నీవు శంకింపక యేతె"మ్మని[3] నుడివి యొడంబఱిచి[4] ముందు మృగేంద్రుని పాలికిం జని "స్వామీ! దేవర యాజ్ఞచొప్పునం బోయి పరికించితి. మీ విన్నయా రావంబు గావించినవాఁడు మీ కనుగ్రాహ్యుండు[5] గాని, నిగ్రాహ్యుండుగాఁడు[6]. తావకంబగు నవక్రవిక్రమంబు విని భయాక్రాంతుఁడయి[7] యున్నవాఁడు. ప్రభంజనుండు[8] మహాభూజంబుల[9] భంజించుంగాని[10] వినతంబులగు[11] తృణవితానంబులు[12] పెకలింపఁగడఁగునెట్లు? శక్తిసంపన్నుండు దన్ను మాఱుకొను[13]వానియందు దన బలంబు వెలయించుఁగాని ముక్కడుల లెక్కింపఁడు. ఇట్టి గుణము లేలినవారికి సహజంబులై యున్నయవి. అవసరంబగుడు వచియింపవలసెంగాని దేవరకు ముందర వాక్రువ్వ వలయునే?[14] ఆతఁడు సంజీవకుం డనువృషభేంద్రుండు. బుద్ధిమంతుఁడు. ఏలినవారి యోలగంబున[15] వర్తింపఁజాలినవాఁడు. అతని స్వామిపాదంబుల చెంతకు గొనివచ్చెద. ముదలయే" యనం బింగళకుఁడు చిఱునగవుతోడ నంగీకారసూచకంబుగ మొగం బెగురవేయ మహాప్రసాదంబనుచు వినమితగాత్రుండై[16] యొదుంగుచు వేళంబ[17] చని సంజీవకున కెదురువోయి "నీ భాగ్యంబుకతంబున మృగరా జొంటినున్న[18] వాఁడు. కానిపించుకొన నిదియె సమయంబు. మసలక[19] యేతె"మ్మని వెంటం దోఁకొనివచ్చి[20], తేని కట్టెదురు దొలంగించి కొంత చెంత నిలువ సంజీవకుండు భయవినయసంభ్రమంబులు

1.రాజోద్యోగము; 2. జాడ; 3. రమ్మని; 4. అంగీకరింపఁజేసి; 5. అనుగ్రహింపఁదగినవాఁడు; 6. నిగ్రహింపఁదగినవాఁడు; 7. భయముచే నాక్రమింపఁబడినవాఁడు; 8. వాయువు; 9. పెద్దచెట్లను; 10. విఱుచును; 11. వంగినవి; 12. గడ్డి మొక్కల సమూహములను; 13. ఎదురుకొను; 14. చెప్పు; 15. కొలువున; 16. వంగిన శరీరము గలవాఁడు; 17. వెంటనే; 18. ఏకాకిగా; 19. ఆలసించు; 20. తోడ్కొను.

ముప్పిరిగొన[1] వినమ్రుండయి[2] వందనం బాచరింప మృగేంద్రుండు సాదరంబుగం బ్రసాదమేదురంబగు[3] క్రేఁగంటిచూ పతనిపయిం బొలయ "నిన్ను మా దమనకుండు పెక్కు తెఱంగుల నుగ్గడింప[4] విని సంతసించి నారము. నీయట్టి ధీమంతుండు మా కొలువు నీయకొనుట[5] మాకుం బరమలాభంబని యెన్నుచున్నవారము. మంత్రిపదంబు నీ కొసంగినారము. జాగరూకుండవయి మన్నియోగంబులందు[6] మాకు మాఱుగం గార్యంబులు నిర్వహించుచుఁ బరివారసంరక్షణాదికార్యంబులు కొఱంతవడకుండ జరుపునది" అని యానతిచ్చి యది దొరంకొని[7] తానును మంత్రియు బద్ధసఖ్యంబున నుండి నానాఁటం దక్కుంగల పరివారంబువలన నిరాదరుండై యుండె.

## దమనక కరటకుల వివాదము

దానంజేసి[8] దమనకుండు తన యిరవున కరుదెంచి చింతాక్రాంతుం డయి యుండుటం గాంచి కరటకుండు "తమ్ముఁడా! నెమ్మొగంబు[9] విన్నంబోవ[10] ఖిన్నుండవయి[11] యున్నవాఁడవు. కతం బే" మనియడిగి, యాతనిచేతఁ దత్కారణంబారసి కొండొకతడవు[12] మిన్నకుండి[13] "మీఱినపని[14] కూరక విచారంపడ నేమి ఫలంబు? మన కేల యీ పెద్దతనంబులని మొదలనె పెక్కువిధంబులం జాటి చెప్పితిని. నీవు నేర్చిన నీతులన్నియుఁ బెల్లుగ[15] వల్లించితివిగాని, నా పలు కొకటియయినఁ జెవిఁజొరనిచ్చితివె? 'తన్నుఁ గట్టఁ ద్రాళ్ళు దాఁదెచ్చుకొన్నట్టు' రాఁగల హానిఁగానక జేనితోడ లేని పెద్దఱికంబులు కొన్ని నోరికసిదీఱ నా యెద్దునకుం గలుగంబలికి చెలికారంబు[16] చేయించితివి. ఇప్పు డనుభవింపకతీఱునె? ఇది నీ నేరమి[17]గాదె?" నావుడు దమనకుండు నిట్టూర్పు నిగిడించి, తల పంకించి, యుంకించి మొగంబెగనెత్తి "కరటకా! నీ

---

1. మూఁడు పిరులు కొనఁగా - మూఁడును ఒక్కటిగాఁ పెనవైచుకొన; 2. వంగినవాఁడు; 3. అనుగ్రహ పూర్ణము; 4. పొగడు; 5. అంగీకరించు; 6. మత్+నియోగంబులు = నా ఆజ్ఞలు; 7. మొదలుగ; 8. దానన్+చేసి = ఆ కారణముచేత; 9. నెఱ+మొగము = నిండుమోము; 10. చిన్నఁబోవు; 11. దుఃఖము నొందినవాఁడు; 12. కొంతసేపు; 13. ఊరకుండి; 14. గతించిన పనికి; 15. అధికముగా; 16. చెలిమి; 17. తెలివిలేమి.

వచనంబు సత్యంబు. దూరము విచారింపక చేసితిని. ఇంక నేమి చేయవచ్చు? దైవంబు ప్రతికూలంబయినం బురుషకారంబెల్ల వ్యర్థంబయి చను. కావున నన్నూరక దూఱకుము. ఇట్లు నే నొక్కండనకాను. ఆషాఢభూతి యనువానిచే నొక్క సన్న్యాసియు మేషయుద్ధంబుచే[1] నొక్క జంబుకంబును ధన ప్రాణంబులు గోలుపోయిరి. ఆ కథ వాక్రుచ్చెద నాకర్ణింపుము.

**ఆషాఢభూతి కథ**

దేవశర్మాభిధానుండగు[2] పరివ్రాజకబ్రువుం[3] డొక్కరుండు గలండు. అతండు లోభాకృష్టచేతస్కుండయ్యు[4] వీతస్పృహుండుంబోలె[5] జనంబులకు మనంబులు తనియ నశ్రాంతంబు[6] వేదాంతార్థంబు లుపన్యసించుచుం దదాకర్ణనకుతూహలంబున[7] మూఁగి లోకులు భక్తిందెచ్చి యెదురనిడిన విత్తంబుల *ననాదరసూచకమందహాసరోచిరుదంచితసుందరవదనుం[8] డగుచుం గాంచి తదనుగ్రహార్థంబుంబోలెఁ జూపుల నంగీకరించుచు నట్లు నానాఁట సముపార్జించిన విత్తం[9] బొక్క బొంతం బదిలంబుగ నునిచి [illegible]ర్పువోసి యది కప్పికొని క్రుమ్మరుచుండు. అతం డొక్కనాఁడు జనులకుం [illegible]ర్ణరసాయనంబుగ[10] మోక్షధర్మంబు లుపన్యసించుచుండ నొక్క మాయావి[11] యా మస్కరి[12]ధనంబు తస్కరింపంగోరి[13] పెక్కుదినంబుల నుండి వేచియుండి లాఁతివెరవు[14] దొరకమింజేసి డాయంబోయి సర్వాంగాలింగితభూతలం బుగం[15] బ్రణామంబు[16] గావించి లేచి ముకుళితకరుండగుచు[17] నాతనికి

---

1. పొట్టేళ్ళపోరు; 2. దేవశర్మ యనుపేరుగలవాఁడు; 3. కుత్సితసన్న్యాసి. బ్రువ, బంధు, ధూర్త, వటు మున్నగునవి నిందావాచకములగునపుడు ఉత్తరపదములుగానే యుండును; 4. ఆశచే నాకర్షింపఁబడిన మనస్సు గలవాఁడు; 5. పోయిన కోరిక గలవాఁడు - కోరికలు లేనివాఁడు; 6. ఎల్లప్పుడు; 7. వానిని విను వేడుకతో; 8.*అనాదర = ఆదరము లేమిని, సూచక = సూచించు, మందహాస = చిఱునవ్వు యొక్క, రోచిస్ = కాంతిచేత, ఉదంచిత = మిక్కిలి ఒప్పిన, సుందర = అందమైన, వదనుండు = ముఖము గలవాఁడు; 9. సంపాదించిన ధనము; 10. చెవులకు అమృత ప్రాయములుగా; 11. మోసగాఁడు; 12. సన్న్యాసి; 13. దొంగిలింపఁగోరి; 14. ఉపాయము; 15. అన్ని అవయవములచేతను కౌఁగిలింపఁబడిన భూమిగలుగునట్లు - సాష్టాంగముగా నునుట; 16. నమస్కారము; 17. మోడ్పఁబడిన చేతులు గలవాఁడు - చేతులు మోడ్చినవాఁడు.

మఱువడకుండ[1] నొక్కపక్క కొదిఁగి నిలుచుండి, యాతండు వాక్రుచ్చు ధర్మంబులు తదేకాగ్రహృదయుండుంబోలె[2] నాలకించుచు విలక్షుండుంబోలె[3] దూరిత తారళ్య విస్తారిత నయనుండగుచుం[4] *జిరంతనాత్మీయ ధర్మసంశయ నిరాకరణచణ ప్రస్తుత ప్రకరణార్థ శ్లాఘమానుండుం బోలెం[5] బరివాహిత మస్తకుండ[6]గుచు శ్రవణాంతరాయాసహిష్ణుండుం బోలెం[7] దత్రత్యజన సల్లాపంబులు[8] భ్రుకుటితముఖుండయి[9] సీత్కారపూర్వకంబుగ[10] నుత్క్షిప్త కరసంజ్ఞచే[11] వారించుచు[12], నిర్భరానందవివశుండుంబోలె[13] సబాష్ప నిమీలితలోచనుండగుచుఁ[14] దదుపన్యాసావసానంబున[15] నచ్చటి జనులం గాంచి "స్వాములు[16] కడుబడలియున్నవారు. ఇక్కడి వారందఱుఁ గొంతసే పెడ[17]గలుగ నుండుఁడు. భిక్షానంతరంబు రండు, పొండు". అని యవ్వలి కనిపి యొక్కతాళవృంతంబు[18] పుచ్చుకొని పక్క నిలువంబడి యల్లన[19] వీచుచుండె.

అంత నయ్యోగి యాతని సాదరంబుగం జూచి "యోయి. నీ వెవ్వఁడవు?" మాకు భక్తిసేయుచున్నవాఁడవు? మావలన నీకు వలయు ప్రయోజనంబేమి? నావుడు "స్వామీ! నే నాషాఢభూతి యనువాఁడ.

---

1. మఱుఁగు పడకుండునట్లు; 2. దానియందే లగ్నమైన హృదయము గలవాని వలె; 3. ఆశ్చర్యముతోఁ గూడుకొన్నవానివలె; 4. దూరిత = దవ్వుగలదిగాఁ జేయఁబడిన, తారళ్య = చాంచల్యము గలవియై, విస్తారిత = విరివి గలవిగాఁ జేయఁబడిన, నయనుండు = కన్నులు గలవాఁడు; 5.*చిరంతన = బహుదినములుగానుండు, ఆత్మీయ = తనదైన, ధర్మ సంశయ = ధర్మముల యందలి సందేహములను, నిరాకరణ = పోఁగొట్టుటయందు, చణ = సమర్థమైన, ప్రస్తుత = అప్పటి, ప్రకరణ + అర్థ = సందర్భములందలి విషయములను, శ్లాఘమానుండున్ + పోలెన్ = కొనియాడువానివలె; 6. ఊపఁబడిన శిరస్సు గలవాఁడు; 7. వినుటకు విఘ్నములను సహింపనివాని వలె; 8. అచ్చటి జనుల మాటలు; 9. ముడివడిన బొమలు గల ముఖము గలవాఁడయి; 10. విసువుతోఁగూడునట్లు; 11. ఉత్ + క్షిప్త - కర - సంజ్ఞచేన్ = పయికెత్తఁబడిన చేతి సన్నచే; 12. ఆఁపుచు; 13. అధికసంతోషముచేఁ బరవశుఁడైన వాని విధమున; 14. కన్నీటితోఁగూడి మూయఁబడిన కన్నులు గలవాఁడు; 15. అతని యుపన్యాసము చివర; 16. యోగులు; 17. దవ్వు; 18. తాటి విసనకఱ్ఱ; 19. మెల్లఁగా.

తమ్ముఖ్ఖుఁడు గుప్తంబై[1] యనన్యసాధ్యంబయిన[2] యర్థంబు[3] తమకు శుశ్రూష[4]యొనరించి వడయంగోరినవాఁడ. నన్ను శిష్యుంగాఁగొని నా యీప్సితార్థం[5]బొసఁగి యనుగ్రహింపుఁడు. మఱియొక్కం డే నొల్ల[6] యథార్థంబు విన్నవించితి" నావుడు నప్పారాశరి[7] యట్లు కానిమ్ము. నావుడు వాఁడు మహావినయభయభక్తులు కరంబు మెఱయించుచు, శుశ్రూషచేయుచు నాతని వెంబడి దేశాటనంబు[8] సలుపుచుండె : ఒకనాఁ డా పారాశరి దారింబోవుచుండ నా టక్కుదారి[9] సత్వరంబున నాతనిఁ జేరంజని "యో స్వామీ! నిన్నరాత్రి మనము నిద్రించిన యింటివారిది గడ్డిపరక నా గుడ్డనంటివచ్చినది. తృణమైనఁ బరులసొమ్ము గొనంజనదు. ద్రుతగతిం[10] బోయి యిది యా యింటివారి కిచ్చి వచ్చెద" నని, వాఁడు కుచ్చి కొంత దవ్వు వెనుకకుంజని యా పరకం దారుఁగ విడిచి కొండొకతడవు దారిమసలి యరుదేరంగాంచి[11] యా కర్మంది[12] వెఱఁగంది యీతండు వీతస్పృహుం డవిగీతచరిత్రుండు[13] విశ్వాసపాత్రుండని[14] యెంచి చిరసంచిత ధన సంచయంబు[15] నించిన[16] తన బొంత మోవఁ బ్రాలుమాలి[17] వెంటవచ్చు నా పచ్చెకానిం[18]గాంచి "వార్ధకంబున[19] హీనసత్త్వుండ[20] నగుటంజేసి యింత మాత్రంబు కప్పుడుబొంత మోవంజాలకున్నవాఁడ, దీవిం బదిలమ్ముగఁ గొనిరమ్మా" యని చేతికిచ్చిన, వాఁడు సంతోషభరాక్రాంతస్వాంతుండగుచు[21] వినమ్రుండయి[22] మహాప్రసాదంబని గైకొని పెచ్చు[23] హెచ్చరిక[24]తోడ వహించి

---

1. దాఁచఁబడినదయి - రహస్యముగనున్నదయి; 2. ఇతరులకు సాధింపరానిది; 3. వేదాంతార్థము, ధనము (శ్లేషము); 4. సేవ - వినఁగోరికయని శబ్దార్థము; 5. కోరఁబడిన ధనము; 6. అంగీకరింపను; 7. అప్పారాశరి = ఆ+పారాశరి - ఆ సన్న్యాసి; 8. దేశ సంచారము; 9. టక్కరి; 10. శీఘ్రగమనమున; 11. రాఁగా; 12. సన్న్యాసి; 13. వీతస్పృహుండు = పోయిన కోరికలు గలవాఁడు - కోరికలు లేనివాఁడు; అవిగీత చరిత్రుండు = అనిందితమైన ప్రవర్తనము గలవాఁడు; 14. నమ్మఁదగినవాఁడు; 15. చాల కాలముగాఁ గూడఁబెట్టఁబడిన ధనముల సమూహములు గలవాఁడు; 16. నిండించిన; 17. బద్ధకించి; 18. చూచుచుండఁగా దొంగిలించువాఁడు; 19. ముసలి తనమున; 20. తగ్గిన బలము గలవాఁడు; 21. సంతోషాతిశయముచేత నాక్రమింపఁబడిన మనసు గలవాఁడు; 22. మిక్కిలి వంగినవాఁడు; 23. హెచ్చు; 24. అవధానము.

తెచ్చుచు, వలసినచో నా భిక్షునకుం బఱుపుగం జలికప్పుగ వినియోగించుచుం దొంటికంటె హెచ్చుగ నచ్చికc[1]బుట్టించు వాలకంబుc[2] బూని యూడెంబు[3] సేయుచుండె. ఒక్కనాc డక్కావితాల్పు[4] మార్గంబునం బోవుచు సమయజామదగ్న్యుండు[5] కరసహస్రంబు[6] ఖండింప రక్తప్రభాభాసమానుండును[7], బ్రతాపహీనుండు[8]నయి. కృతవీర్యసూనుండు[9]నుంబోలె భానుండు[10] చూపట్టుడు[11] నచ్చోటికిం గుఱంగలియగు[12] జలాశయంబునకుం బోయి వార్చు[13]చుండె. అప్పుడు కట్టెదురం దత్తీరంబున మేషంబులు రెండు రోషంబుమీఱ నగంబులు[14] బ్రతిఘోషంబులీనc[15] బెల్లురేcగి[16] పెడిల్లన డీకొంచు దారుణంబుగం బ్రవిదారణంబు[17] సలుపుచుండ వానిమధ్యంబున నల్లం[18] దాcకు[19]వడి మూర్ధంబులు[20] వగులం గాఱి పేరినదాని ఫేరవం[21] బొక్కండు గాంచి పలలఖండంబని[22] తలంచి సంతసించి డాయం బోయి, యిది యుధ్యన్మేషమధ్యంబని[23] గణింపక దాని భక్షించుచుండ నంతకుముందు డీకొని పిఱిందికి[24] జరిగిన యురణంబులు[25] మరలం బఱతెంచి డీకొనుడు నడుమం దగులువడి యా వంచకంబు[26] పంచత్వంబు[27] నొందె.

ఆ సన్న్యాసి యయ్యది విలోకించి "యాహా? అమిషలోభంబు[28] గోమాయువు నిట్టిదశకుం దెచ్చెcగాదే! ఏరికేనిం గానిగుణంబు[29] లోభంబుకంటె నొక్కండు గలదే?" యని చింతించుచు, మరలి తీరం బారోహించి యాదారి శిష్యుం గానక "యోహో! యాషాఢభూతి! ఓహో! యాషాఢభూతి!" యని యెలుంగెత్తి పిలిచిపిలిచి సంజప్రొద్దు[30] వెలుంగునకుc గరంబు మఱుంగు

---

1. నమ్మిక; 2. వేషము; 3. ఊడిగము = పరిచర్య; 4. కాషాయమును ధరించువాcడు - సన్న్యాసి; 5. కాలమనెడు పరశురాముcడు; 6. వేయిచేతులు, వేయి కిరణములు; 7. ఎఱ్ఱని కాంతితోc బ్రకాశించువాcడు, రక్తకాంతితోc బ్రకాశించువాcడు; 8. పరాక్రమము లేనివాcడు, అధికతాపము లేనివాcడు; 9. కార్తవీర్యుcడు; 10. సూర్యుcడు; 11. కనcబడcగానే - ఇది సూర్యాస్తమయవర్ణనము - శ్లేషాలంకారము; 12. సమీపము; 13. ఆచమించు; 14. కొండలు; 15. ప్రతిధ్వనులు కలుగన్; 16. మిక్కిలి విజృంభించి; 17. యుద్ధము; 18. రక్తము; 19. దెబ్బ; 20. తలలు; 21. నక్క; 22. మాంసపు ముక్కయని; 23. పోరుచున్న పొట్టేళ్ళ నడిమికి; 24. వెనుకకు; 25. పొట్టేళ్ళు; 26. నక్క; 27. మరణము; 28. మాంసమునం దత్యాశ? 29. దుర్గుణము; 30. సంధ్యాసూర్యుcడు.

వెట్టుకొని కనుమేర దూరంబు చూపు సారించి పాఱంజూచుచు యాతాయాత జనంబులం[1] జేరంబోయి వానియుంగమచ్చముఁ[2] జెప్పి యిట్టివాని బొంతమోచుకొనిపోవువానిం జూచితిరా యని యడిగి యడిగి నలువలంకులకుం బాఱిపాఱి, వెదకి వెదకి వేసరి[3] కడకుం ద న్నా దురాత్ముండు ప్రతారించెనని[4] యెఱింగి, శిరంబు పంకించి, నిట్టూర్పు నిగిడించి "మేష యుద్ధంబుచే జంబుకంబును, నాషాఢభూతిచే నేనును స్వదోషంబువలనఁ జెడితిమి. ఇఁక నేమి చేయవచ్చు" నని చింతించుచుం జనియె.

అని చెప్పినం గరటకుం "డెట్టి ధీమంతునకే నొక్కొక్క కాలంబునం బ్రమాదంబు వాటిల్లుట స్వాభావికంబు. దానికి వగవంబనిలేదు. నీ వింకం జేయందలంచిన కార్యంబేమి?" యని యడిగిన దమనకుం డిట్లనియె "వినాశోన్ముఖకార్యంబు[5] మేలువఱుచుటకు[6], భావ్యర్థసంగ్రహంబునకు[7] కనర్థప్రతీకారంబునకు[8] నర్హంబగు మంత్రంబే[9] శ్రేయంబు. కావున నదియ యిపుడు కర్తవ్యంబు. అందుఁ బింగళకసంజీవకులకు భేదంబుపుట్టించు నుపాయంబుపరికించుట ముఖ్యంబు. దానంజేసి మనకెల్ల యర్థంబులు సిద్ధించు. మన మిప్పు డుపేక్షించినం బిదపం బింగళకు డాయుట దుష్కరంబు. నా విని కరటకుం 'డదియెట్లు సాధ్యంబగు' ననిన దమనకుం డిట్లనియె, "ఉపాయంబుచే నేయది శక్యంబగు, నాయది పరాక్రమశతంబుచేతనయిన శక్యంబుగాదు. కాకం బొక్కం డుపాయంబుచేఁ దనకు విరోధియగు సరీసృపంబును[10] దోరించె. అక్కథ వక్కాణించెద[11] నాకర్ణింపుము.

**కాకి - పాము**

యమునాతీరమందలి వనములో మఱ్ఱిమ్రాఁకుమీఁద గూఁడు గావించుకొని వాయసమిథునము[12] వాసము చేయుచుండెను. ఆ మఱ్ఱిక్రింది

1. యాత + ఆయాత జనంబులు = పోయెడు వచ్చెడు జనులు; 2. గుర్తు; 3. విసిగి; 4. మోసగించెనని; 5. వినాశ + ఉన్ముఖ - కార్యంబు = చెడనున్న పని; 6. బాగుచేయుటకు; 9. భావి + అర్థ = రాఁగల ప్రయోజనమును గూర్చుటకును; 8. కీడునకు మాఱు చేఁతకును; 9. ఆలోచనము; 10. పామును; 11. చెప్పెద; 12. కాకుల జంట.

పుట్టలో సర్పము వాసము చేయుచుఁ గాకిపెట్టిన గ్రుడ్లు భక్షించి పోవుచుండెను. దానికి వాయసము మిక్కిలి ఖేదపడి[1] తన మిత్రమయిన నక్కపాలికిఁబోయి త్రాఁచువలనఁ దనకు మాటిమాటికి వచ్చు నుపద్రవము[2] చెప్పుకొని యంగలార్చెను[3].

అప్పుడు నక్క యిట్లనియె : "తొల్లి యొకకొలనిలోని మీనముల[4] నెల్ల బలవంతముచేసి భక్షించిన కొంగ నొక్క యెండ్రి యుపాయంబుచేతం జంపెను. అట్లు నీవును నీ శత్రువును గడముట్టింపుము[5]. నీ కా కథ చెప్పెద నినును.

## కొంగ - ఎండ్రి

బదరికావనమందు సారోదం బను కాసారంబు[6] గలదు. అక్కడి కొక్క ముసలి కొక్కెర[7]వచ్చి నయనంబులు నిమీలించి[8], యాహారంబు మాని దుష్కరంబయిన తపంబు చేయుదానివలె నొంటికాలితో నిలువంబడి యుండెను. ఒక యెండ్రి యా తెఱఁగు[9]జూచి కరము వెఱఁగువడి డాయంబోయి యిట్లనియె : ఓయి బకోత్తమా[10]! నీ వనయంబు[11] క్రశిమంబు[12] వహించుచున్నవాఁడవు. చేరువఁ బాఱాడు[13] మీనంబులఁ జూడనయిన నొల్లవు. ఈ యునికి[14] యేదియే నొక్క మహార్థం[15] బర్థించి[16] పూనిన యనశన వ్రతానుష్ఠానంబు[17] గాఁబోలు. నీ విచిత్ర చరిత్రంబు[18] మదీయ శ్రోత్రపేయంబు[19] గావింపుము" అనిన విని బకం బల్లన నిట్లనియె : "ఓయి కర్కటకోత్తమా[20]! నీవు మిక్కిలి బుద్ధిమంతుఁడవు. ఆకారంబుచేతన భావంబు భావింప సమర్థుండవు. నిస్సంగుల[21] మయి మౌనముద్రాధారులమగు[22] మాదృశులకు[23] సహితము నీ వచనచాతిమంబు[24] సల్లాపంబునం[25]

---

1. దుఃఖించి; 2. ముప్పు; 3. దుఃఖించు; 4. చేపలను; 5. అంతమొందించుము; 6. చెఱువు; 7. కొంగ; 8. మూసి; 9. విధము; 10. కొంగలలో శ్రేష్ఠము; 11. మిక్కిలి; 12. కృశత్వము; 13. సంచరించు; 14. ఇట్లుండుట; 15. గొప్ప ప్రయోజనము; 16. కోరి; 17. నిరశన వ్రతాచరణము; 18. వింతనడవడి; 19. నా చెవులచేఁ ద్రావఁదగినది - నా చెవులకు విందు; 20. ఎండ్రులలో శ్రేష్ఠుఁడా; 21. ఇతరులతో సంబంధము లేనివాఁడు; 22. మాటాడకుండుట వహించువారము; 23. మావంటి వారికి; 24. వాక్చాతురి; 25. మాటాడుట.

దుల్లాసంబు[1] పుట్టించెడు. పుట్టువుఁదొట్టి[2] నా కడుపుఁజిచ్చునంబడి[3] మడిసి
జంతువు లిన్నియని యెన్నికకు[5]రావు. ఇట్లు మదీయజాతికి స్వాభావికంబయి
భూతహింసాధర్మంబుచే[6] శరీరభరణంబు[7] గావించుచుండుదును. గంగో
తారమందు[8] మఱ్ఱివృక్షముకొమ్మమీఁద నేను గూర్చుండియుండఁగా
మ్రానిక్రింద నొక యోగిపుంగవుండు[9] తన శిష్యులకు నానాధర్మం
బుపదేశించువాఁ డిట్లనియె : "పురుషార్థం[10] బర్థించువారి కవశ్యాచరణీయంబు
లగు ధర్మంబులు వినుఁడు. సకలదోషంబులకు మూలంబయిన లోభం
విసర్జింపవలయును[12]. సర్వభూతములయందు సదయుం డయియుండవలె
అలోభంబును[13], భూతదయయు లేనివానికి సర్వధర్మంబు లనుష్ఠితం
లయ్యు[14] నిరర్థకంబు[15] లగు. జీవనంబు క్షణభంగురంబు[16] గావున మోసపో
పురుషుండు కాలంబు పుచ్చక యుత్తమధర్మంబు లనుష్ఠింపవలయును" అ
వక్కాణింప విన్నవాఁడను. ఎట్టి సుకృత విశేషంబుననో[17] నాఁటంగోలె[18]
మహానుభావుండు వచియించిన ధర్మంబులు మనంబునం బ
స్వప్నావస్థయందయిన[19] మఱపునకురావు. అదిగో నాఁడు మొదలుకొ
పురుషార్థంబునంద బుద్ధి నిలిపితిని. హింసాకర్మంబునకు రోసితిని
జలశైవాలాదులతో[21] జీవధారణంబు[22] చేయుచు ముముక్షుత్వంబుం[23] బూ
మునివృత్తి నున్నవాఁడను." నావుడు విని యచ్చో[24]వసించు మీనంబు
మోదమానంబులయి[25] 'యాహా! యీ మహామహుండు నీఱుగవిసిన[26] నిప్పు
నున్నవాఁడు. ఈతండు బకమాత్రుండుగాఁడని పరికించి, డాయంబో

---

1. ఆనందము; 2. పుట్టుక మొదలుకొని; 3. కడుపనెడు అగ్ని; 4. చచ్చిన; 5. లెక్క
6. ప్రాణులను హింసించు ధర్మము; 7. దేహపోషణము; 8. గంగానది ఉత్తరపు గట్టు
దిక్పూర్వక 'తీర' శబ్దమునకు 'తార' ఆదేశము; 9. యోగులలో శ్రేష్ఠుఁడు; 10. ధర్మా
కామమోక్షములు, ఇక్కడ మోక్షమని యర్థము; 11. తప్పక ఆచరింపఁదగినవి; 1
త్యజింపవలయును; 13. అత్యాశలేమి; 14. ఆచరింపఁబడినవి; 15. వ్యర్థములు; 1
క్షణములో నశించునది; 17. పుణ్యాధిక్యముననో; 18. నాఁడు మొదలుకొని; 19. కలగాం
స్థితిలోనయిన; 20. ఏవగించితిని; 21. నీరు, నాచు మొ॥వి; 22. బ్రదుకునిలుపు; 2
మోక్షమం దిచ్ఛ; 24. అచ్చోన్ = అ+చోటన్; 25. సంతోషించుచున్నది; 26. నీఱు
కవిసిన = నివురుకప్పిన.

యిట్లనియె : "ఓ మహానుభావా! నీ కృపావలోకంబు[1] మాపయిం బొలయింపుము. అనావిలభావంబులతో[2] మీ సేవలఁగోరి వచ్చినవారము." నావుడు నా బకంబు ప్రసాదభాసురంబగు[3] దరహాసంబు[4] గావించుచు వాని ప్రార్థనంబు కటాక్షంబుల[5] నంగీకరించి నాఁటంగోలె వానితో సఖ్యంబు గావించుచుండె.

అంత నొక్కనాఁడు వఱువాత నా ఖగంబు[6] సౌఖశాయనికంబులయి[7] డాయం జనుదెంచిన మీనంబుల దీనవదనంబుతో బాష్పవారిపూరిత లోచనంబయి[8] నిట్టూర్పు నిగుడ విలోకించి, తలపంకించి, యుంకించి 'కాలనియోగంబు[9] మీఱ నేరికి శక్యంబు' నా విని మీనంబు లిట్లనియె : "ఓ తపోధనా! తడవులంబట్టి[10] ని న్నెఱుంగుదుము. నీవు నిత్యసంతుష్టుండవు నా నెగడితివి[11]. అట్టి నీకు నేఁ డిట్టిఖేదంబు రాఁ గతం బేమి?" అనపుడు నా టక్కరికొక్కెర యెలుంగు[12] రాలుపడ[13] నిట్లనియె : "కాలము చెల్లినవాఁడను. కాఁబట్టి యింక నూరకుండరాదని విచారించి ముముక్షుండనయి పుత్త్రాదిబంధంబుచే విడిపించుకొని మంటిని[14]. సుఖింపఁగంటి ననియుండఁగాఁ బ్రారబ్ధకర్మవశంబున[15] మీ తగులం[16] బొక్కటి ప్రాప్తంబయ్యె. మీకొక యాపదవచ్చునన్న నుల్లంబు[17] తల్లడిల్లుచున్నది[18]." అనుచు జొటజొటఁ గన్నీరు విడుచుచు నిట్లనియె : "ఇంతకు ముందు కొందఱు జాలరులు వచ్చి యీ కొలని జలంబు కొలంది[19] పరికించి యింకఁగొంత నీరింకిన వత్తమని పోయిరి. ఆ మాట వినఁగానే నా గుండెలు బద్దలయ్యెను. అది మొదలుకొని విషణ్ణుండనయి[20] యున్నవాఁడను" నావుడు మీనంబులు విని భయంపడి యిట్లనియె : "ఎట్లయిన మ మ్మీ బారివలనఁ[21] దలఁగు[22] వెరవు పరికింప నీ

---

1. దయాదృష్టి; 2. నిష్కల్మషమైన బుద్ధి; 3. ఆదరముతోఁ బ్రకాశించునది; 4. చిఱునవ్వు; 5. క్రీఁగన్ను; 6. పక్షి; 7. సుఖనిద్రయా యని యడుగువారు; 8. కన్నీటితో నిండినది; 9. కాలపురుషుని యాజ్ఞ; 10. చాలకాలమునుండి; 11. ఒప్పితివి; 12. కంఠస్వరము; 13. డగ్గుత్తికపడ; 14. జీవించితిని; 15. ముందుచేసిన కర్మమునకు లోపడుటచే; 16. బంధము; 17. మనస్సు; 18. కలఁతనొందు; 19. పరిమితి; 20. విషాదమునొందినవాఁడు; 21. ఆపద; 22. తొలఁగు.

వొక్కరుండ వలంతివి[1]. ఖేదంబు పేర్మిని[2] విషాదంబు నొందియున్నాఁడవు. ఇంతియేకాని లెస్స పరికించిన నీకుం దోఁపని యుపాయంబు లేదు. నీవే మాకు శరణము" అనిన బకంబు కొంతవడి చింతించి యిట్లనియె : "ఇచ్చటికిం గొంత దవ్వున నిత్యాపం బనుకొలను గలదు. అందులకు మి మ్మందఱ నొకనాఁటనె కొంపోవ శక్తుండఁగాను గాని, యోపినంతవట్టు[3] నానాఁటం[4] గొంపోయి విడిచెద" అని చెప్పి ప్రతిదినము వలసినన్నింటిని ముక్కునం గఱచుకొనిపోయి యొక్కకొండబండమీఁదం బెట్టుకొని భక్షించుచుం గొన్ని దినంబులలో నా కొలను నిర్మీనంబు[5] గావించె. అంతఁ దొలి మిత్రంబయిన యెండ్రి బకముతో నిట్లనియె : "నా ప్రియమిత్రుఁడా! ఇక్కడ మీలను[6] బారివలనఁ దలఁగి రక్షించితివి. అట్లు నన్నును రక్షింపుము" నావుడు బకంబు వల్లెయని యెండ్రిని జంచువుల[7] నిఱికించుకొని మిక్కిలి పొడవున కెగసి తాను మీలఁదిన్న కొండకొమ్మునకుఁ జక్కఁగా సాగి మింటఁబోవుచుండెను. ఆ పోకడ[8] చూచి యెండ్రి యిట్లు చింతించెను. "ఇప్పు డీ బకంబు నన్నుం గొనిపోక యీ కొండకొమ్మునకుఁగాని వేఱొండు చోటికిఁ గాదు. ఈ కొండ శిఖరంబున జలంబు లెక్కడివి! ఈ గుంటిమీఁదఁగాని[9], దీని చుట్టుఁబట్టునఁగాని జలంబులు లేవని యాప్తులవలన వినియున్నవాఁడను. ఈ బకంబు కపటంబున మీనంబులఁ బట్టుకొనివచ్చి యీ కొండకొమ్మునఁ బెట్టుకొని తినియెఁగాఁబోలును. ఆహా! తెలియక యీ ఖలుని[10] పలుకులు విని మోసపోయితిని గదా ! మాయికుల[11]యందు బుద్ధిమంతుండు మాయావి యయి ప్రవర్తింపవలెఁగాని ఋజువుగాఁ[12] బ్రవర్తింపఁగూడదు. కాఁబట్టి యే విధముచేతనేని దీని వంచించి తప్పించుకొను నుపాయంబు కావింతుంగాక అని వగచి కర్తవ్యం బాలోకించి లెస్సగా బుద్ధియందుఁ గుదుర్చుకొని యిట్లనియె "ఓయి బకోత్తమా! నీవు నన్నుఁ గడుదవ్వు దుసికిలకుండఁ[13] బట్టుకొని పోఁజాలవు

1. సమర్థుఁడవు; 2. అతిశయము; 3. సాధ్యమైనంతవఱకు; 4. దినదినమునను; 5 చేఁపలు లేనట్టిది; 6. చేఁపలను, మీను - (ఏక) మీలు (బహు); 7. ముక్కు; 8. పోవుట 9. కొండపై; 10. దుష్టుఁడు; 11. మాయావి; 12. తిన్నఁగా; 13. జారిపోకుండ.

జాటిపడితినా భూమిని సంచరించు జంతువులు నన్నుఁ బొలియించి[1] భక్షించును. ఆవల నీ యభిమతంబు సిద్ధింపదు. ఇప్పు డొకయుపాయము చెప్పెద వినుము. నేను నీ కంఠంబు కౌఁగిలించి పట్టుకొని వచ్చెదను. గమ్యస్థానంబునకుఁ[2] బోకమునుపు నా పట్టు విడువను. ఇంత చెప్పనేల, నా రక్షణ భారమునీది. చిత్తము వచ్చినట్లు చేయు" మనిన విని యా కొక్కెర సమ్మతించి యెండ్రిచేతఁ గంఠంబు కౌఁగిలింపించుకొని కొండమీఁదికిఁ బోయి కాళ్ళూనంబోవునపుడు కుళీరంబు[3] తన గిట్టలతో దాని కంఠంబు కఱుక్కునఁ ద్రెంచి నేలఁబడి ప్రాణంబు తప్పించుకొని తన యిచ్చంబోయెను. కాఁబట్టి నీవును సదుపాయంబు[4] విచారించుకొని నీ శత్రువును జంపుము." అని నక్క చెప్ప విని దానిచేత సెలవు తీసికొని కాకి తన యిరవునకు వచ్చి చేరెను.

### కాకి పామును జంపుట

యమున దాపున విలాసధామం బనుపట్టణంబు గలదు. అందలి రాజాంగనలు[5] క్రీడార్థంబు వనంబునకుంజని కుసుమాపచయం[6] బొనరించి శ్రాంతి[7] యడంగ జలంబు లాడంగోరి[8] యొక్క సరసింగాంచి యనూనంబగు[9] దాని మానోజ్ఞకంబునకు[10] మానసంబుల నానందంబు నిట్టవొడువం[11] దత్తీరంబుంజేరి హారాదిపరిష్కారంబులూడ్చి[12] యచ్చోటనుంచి చనుకట్టులు గట్టి యొండొరుల చెట్టలు[13] పట్టుకొని సుందరమందగమనంబుల[14] నొయ్యారంబుమీఱ నీరంబుల డిగి యల్లల్లన[15] నడుగు లిడుచు విసారవార పరిస్ఫురణంబులంగాంచి[16] యంతకంటెం దమమించులు[17] మించుగ[18] మెఱయించు తెఱంగున వెలితళుకుంజూపులు[19] కళవళింప[20] నులుకుచుఁ[21] గటిద్వయసంబుగ[22] డిగి[23] సలిలవిహారంబు[24] సలుపుచుండ నొక్క లతాంగి[25]

---

1. చంపి; 2. పోఁదగినచోటు; 3. ఎండ్రి; 4. మంచియుపాయము; 5. రాజస్త్రీలు; 6. పూలుగోయుట; 7. బడలిక; 8. స్నానము చేయఁగోరి; 9. తక్కువకాని; 10. మనోహరము; 11. ప్రవహింపఁగా, అతిశయింపఁగా ననిభావము; 12. హారములు మున్నగు నలంకారములు, తీసి; 13. చేయి; 14. మెల్లని నడకలతో; 15. మెల్లమెల్లఁగా; 16. చేపల సమూహముయొక్క ప్రకాశములను; 17. తమ ప్రకాశములు; 18. అతిశయముగా; 19. తెల్లని ప్రకాశముగల చూపులు; 20. చలింపఁగా; 21. భయపడుచు; 22. మొలబంటిగా; 23. దిగి; 24. జలక్రీడ; 25. లతవంటి అంగముగలది - స్త్రీ.

తోయంబులు[1] దోయిలించి దోయిలించి[2] యొక్క తోయజాక్షి[3]పైయిం జల్లి యది మాఱుకొని[4] 'యేదేది నిలువక చల్లుము - చూత' మనుచు మీఱం[5] జల్లిన ధారాసారంబునకుం[6] దాళంజాలక కేలొడ్డి[7] పెడమొగంబిడి పెఱకేలెత్తి[8] మ్రొక్కుచు 'నమ్మమ్మ! చాలుంజాలు నీజోలి కింకరాను-మాను' మన నయ్యది 'యిస్సిరో యింత పిఱికివే[9]!' నా మఱియొక్క తెఱవ[10] 'నెఱజాణ వేని[11] నావంక మరలుము. చిఱుతుకదానితోడనా[12] యింత బింకంబులు[13] పొంకించెద'వని[14] పురికొలిపి తానునదియు మఱలంగక[15], తొలంగక, పట్టువదలక, నట్టుగదలక[16] పరస్పర కరకమల సమీరిత వారిధారల[17] లోఁగక[18] తోఁగుచు[19] నొండొరుల హెచ్చుచు, మెచ్చుచు 'నిది యేటి సుమాళంబె[20], చాలుంజాలు మీ యాలంబు[21] చాలింపుఁ'డని తోడివారలు వారింప దరహాసాంకూరంబు[22] లాననాంబుజంబుల[23] నలంకరింప నార్ద్రాంశుకోత్తరీయాంతర్గత నిస్తల స్తనస్తబకంబు[24]లుబ్బి నిబ్బరంబుగ[25] నిక్కం గడు రోఁజుచు[26] నిలువంబడ మఱికొందఱు ముద్దియ[27] లుద్దులై[28] యొండొరుల రవణంబులు[29] పణంబుగం[30] బన్నిదంబు పఱచి[31] పారంబు[32] సేర, వేగంబుమీఱ నీఁదుచుంబోవ నేల యూరక కరంబు కలగుండుపఱిచెదరే[33]' యని లాఁతిచేడియలాడ[34] మనలం జేరినవారి[35] కతనుక్షోభంబు[36] దుర్వారంబు[37] గాదె? అని

1. నీరు; 2. దోసిలితో నెత్తి; 3. తోయజముల (పద్మముల) వంటి అక్షులు (కన్నులు) గలది - స్త్రీ; 4. ఎదురుకొని; 5. అతిశయించునట్లు; 6. జలధారల జడివాన; 7. చేయి అడ్డముపెట్టి; 8. ఇంకొక చేయి; 9. పిఱికిదానవా అనఁగా; 10. స్త్రీ; 11. ప్రౌఢవేని; 12. బాలతోడనా; 13. గర్వోక్తి; 14. పొందుపఱుచు; 15. తిరుగక; 16. స్థానము కదలక; 17. పరస్పర = ఒండొరుల, కరకమల = తామరలవంటి చేతులతో, సమీరిత=త్రోయఁబడిన, వారిధారలన్ = నీటి ధారలచేత; 18. వెనుదీయక; 19. తడియుచున్; 20. ఆవేశమే; 21. యుద్ధము; 22. చిఱునవ్వు మొలకలు; 23. ముఖపద్మములను; 24. ఆర్ద్ర = తడిసిన, అంశుక = సన్నని, ఉత్తరీయ = పైఁటయొక్క, అంతర్గత = లోపలనున్న, నిస్తల = వట్రువలైన, స్తన - స్తబకంబులు = పూలగుత్తుల వంటి చన్నులు; 25. అధికముగా; 26. నిట్టూర్చుచు; 27. ముగ్ధ; 28. జతలయి; 29. ఆభరణంబులు; 30. పందెము; 31. పందెము వైచి; 32. తీరము; 33. కలఁచు; 34. ఇతర స్త్రీలు; 35. మనలఁగూడిన నీటికి-మనలఁగూడిన పురుషులకని యర్థాంతరము - శ్లేషము; 36. అధికమైన కలఁక, మన్మథబాధయని యర్థాంతరము-శ్లేషము; 37. వారింపశక్యముగానిది.

చదురులాడుచుం[1] బారంబు ముట్టుచు[2] ముట్టనివారిం గరంబులం జప్పటులు గొట్టి యోడితి రోడితి రని గేలిచేయుచు[3], *స్తన గమన సామ్యాసహనత్వంబునం బోలె[4] రథాంగచక్రాంగబులం[5] బాఱందోలుచు *స్వోపప్లవకారణ మార ప్రహరణంబులను[6] నీరసంబునంబోలె[7] సారసంబులం[8] దునుముచు[9] జలవిహారంబు సలుపుచుండ ము న్నా తీరంబు చేరువ నునిచిన పరిష్కారంబులం దుదారప్రభారమణీయంబగు[10] మణిసరం[11] బా కాకంబు ముక్కునం గఱచికొని పఱచి యల్లంత నొక్క తరుశాఖం[12] గూర్చుండం గనుంగొని 'యిదియేమి విచిత్రంబె రత్నసరంబు కరటంబు[13] గొంపోయెఁ జూచితిరే' యని యొక్క సీమంతినీలలామంబు[14] వాక్రువ్వ నందఱొక్కమొగి[15] వదనారవిందంబు[16] లెత్తి పారిప్లవేతర[17] విస్తారిత[18] చారులోచనలై[19] యస్పంద[20] మిళింద[21] సుందర[22] వికసిత[23] కుసుమరాజ[24] విరాజమాన[25] మల్లికా వల్లికా మతల్లికా[26] విభ్రమానుకారిణు[27] లగుచు, సూచీముఖాలంకృత నాసికాగ్ర లగుచు[28], దూరీకృత నిమేషంబుగ[29] దృష్టిసారించి కాంచుచు, నిక్కాకంబు పద్మరాగ ప్రభారించోళిం[30] గాంచి యామిషం[31] బని భ్రమియించెఁ గాఁబోలు'

---

1. నేర్పుమాటల; 2. పొందుచు; 3. పరిహాసము చేయుచు; 4.*స్తన = చన్నులతోను, గమన = నడలతోను, సామ్య = సమత్వమునకు, అసహనత్వంబునన్+పోలెన్ = ఓర్వలేమిచేత వలె; 5. రథాంగ = చక్రవాకములను, చక్రాంగంబులన్ = హంసలను; 6. *స్వ = తమయొక్క, ఉపప్లవ = ఉపద్రవమునకు; కారణ = హేతువులైన, మార = మన్మథునియొక్క, ప్రహరణంబులను = బాణములను; 7. ఈరసంబునన్+పోలెన్ = ఈర్ష్యచేతవలె; 8. పద్మములను; 9. ఖండించుచు; 10. అధిక కాంతిచే నందమైనది; 11. రత్నహారము; 12. చెట్టుకొమ్మయందు; 13. కాకి; 14. స్త్రీలలో శ్రేష్ఠురాలు; 15. ఒక్కపెట్టున; 16. ముఖపద్మములు; 17. పారిప్లవ+ఇతర = చాంచల్యమునకు వేఱైన - చంచలములు కాని; 18. పెద్దవిగాఁ జేయఁబడిన; 19. అందమైన కన్నులు గలవారై; 20. చలింపని; 21. తుమ్మెదలచే; 22. అందమైన; 23. వికసించిన; 24. శ్రేష్ఠమగు పూలతో; 25. ప్రకాశించుచున్న; 26. మల్లికా-వల్లికా-మతల్లికా = శ్రేష్ఠములైన మల్లెతీఁగలయొక్క, ఆ స్త్రీల దేహములు తీఁగలతోను, ముఖములు పూలతోను, చూపులు తుమ్మెదలతోను సమానములని యర్థము; 27. విభ్రమ = విలాసమును, అనుకారిణులు = అనుకరించు వారు; 28. చూపుడువ్రేలిచే నలంకరింపఁబడిన ముక్కుకొన గలవారు; 29.దూరము చేయఁబడిన ఱెప్పపాటు గలుగునట్లు; 30.కెంపుల కాంతుల సమూహమును; 31. మాంసమని.

ననుచుఁ 'గాదుగాదు. మెడం దగిలించు కొని కులుకులాడం బోయెడు' నని నవ్వుచు, 'నీ యందంబునకు హారం బొక్కటి తక్కువ' యని మొగం బడ్డంబుగ, సుందరంబుగం బంకించి చేయెత్తి జుట్టన[1] నెటిక[2] విఱుచుచుఁ 'జక్కని హారమమ్మా! యిప్పలుగాకి[3] కాకి యెక్కడనుండి వచ్చెనో యింక నెక్కడం బాఱవై చెడునో యెవ్వరికిం జేపడునో[4]' యనుచు 'నయినం గొఱంత[5] లేదు. జలవనాది దుర్గమస్థానంబులంబడి[6] యేరికిం జేరకపోవుటకంటెం గొంతమేలుగాదె? అనుచు నండజంబునకు[7] మండనంబు[8] తోడం బనియేమి? దీనికిం గతంబు పరికింపవలయు' ననుచు నెద్దియేనియు నొక్క నిమిత్తంబు లేక తక్కదు. నిలుకడమీఁదం దెలియనగు ననుచు నొండొరులు ముచ్చటలాడుచుండఁ దత్పరిచారికలు కొంద 'ఆ వాయసం బేచాయకుం బోయెడినో యేమఱక కనుగలిగి[9] యుండుఁ'డని యచ్చటి వనపాలకుల నియమించి సత్వరంబుగం బోయి యా వృత్తాంతంబు రాజపురుషులకు నివేదించి వారిచేఁ బ్రేరితులగు జనులఁదోకొనివచ్చి[10] కానిపించుడు నా కాకంబు మందగమనంబునం జని యాత్మావాసం[11] బగు వటకుటంబు[12] కొమ్మం జేరి నేరిమి[13] మీఱం గ్రిందివల్మీకంబునకుం[14] జూటివడ[15] విడువ నా సరంబు మీసరంబుగం[16] గెంపుమెఱుంగులు దుఱంగలింపం[17] *దత్రత్య కాలవ్యాళ వినాశ పిశునోల్కాపాతానుకారి[18] యగుచుం గోమఱంతంబడ[19] రాజభటులు గాంచి గునపంబులు లోనగు సాధనంబులు దెప్పించి దానిం ద్రొప్పించిన[20] నందలి దందశూకంబు[21] విషానలంబు[22] దరికొల్పుటకుం[23] బోలె పూత్కారంబులు[24] నిగిడించుచుం[25] బరప్రాణానిలంబులు[26] గ్రోలుటకుం[27]

1. చూపుడు వ్రేలు; 2. వ్రేలి గనుపు; 3. కుత్సితము; 4. లభించునో; 5. లోటు; 6. నీళ్ళు, అడవులు మున్నగు చొరరాని ప్రదేశములందు; 7. పక్షి; 8. అలంకారము; 9. కనిపట్టి; 10. తోడ్కొనివచ్చి; 11. తన నివాస స్థానము; 12. మఱ్ఱిచెట్టు; 13. నేర్పు; 14. పుట్ట; 15. లక్ష్యము; 16. అధికముగా; 17. ప్రకాశింపఁగా; 18.*తత్రత్య = అచ్చటి కాల-వ్యాళ = కాలసర్పముయొక్క, వినాశ = చావునకు, పిశున = సూచకమైన, ఉల్కాపాత =ఇంగలము యొక్క పాటును, అనుకారి = అనుకరించునది; 19. పుట్టచివరి రంధ్ర మందు; 20. త్రవ్వింపఁగా; 21. పాము; 22. విషమనెడి అగ్ని; 23. రాఁజుకొనఁజేయుటకు; 24. బుస్సుమను ధ్వనులు; 25. వ్యాపింపఁజేయుచు; 26. ఇతరుల ప్రాణవాయువులు; 27. త్రావుటకు.

బోలె నాభీలంబుగా[1] నాలుకలార్చుచు నిర్గమించి[2], పయింబడి కఱవం గమకించుడు[3] వారలు చిక్కని పెక్కు బడియలం[4] జదియ[5] నడిచి, దాని మడియించి[6] యా నేవళంబుం[7] గొంపోయిరి. అది దొరంకొని[8] కరటంబు కరంబు సుఖంపడియుండె. కాఁబట్టి యుపాయంబుచే సాధింపరాని కార్యంబులు లేవు.

**కుందేలు - సింహము**

బుద్ధిబలంబుగలవానికిం దక్కుబలంబు లేకుండినం గొఱంత లేదు. ధీశక్తి విరహితునకుం[9] దక్కుంగల బలిమి యెంత గలిగిన నసత్కల్పంబయి[10] చను. తొల్లి యొక్క శశకంబు[11] నేర్పునంజేసి యొక సింగంబుం ద్రుంగించె[12] నక్కథ వక్కాణించెద నవధానంబుతోడ[13] వినుము.

ఒక్క యరణ్యంబున సత్త్వసారంబను కంఠీరవంబు[14] గలదు. అయ్యది యయ్యడవింగల జంతుసంతానంబులం బొలియించి[15] భక్షించు చుండు. అందుల కచ్చటి సత్త్వంబులెల్లం బెల్లు[16] భీతిల్లి యొక్క చక్కటిం[17]జేరి పెక్కు తెఱంగులం బరికించి తమకుం బాటిల్లిన[18] బారికిం[19] బ్రతీకారంబు గానక తమకుం గర్తవ్యాంశం బొక్కండు విచారించి కలియం బలికికొని బెండ గిలి[20] మృగనాథు[21] పాలికిం జని మనంబుల ఘనంబుగ దరంబుగదుర[22], నానంబుల దీనభావంబు నివ్వటిల్ల[23], దవ్వుదవ్వుల[24] నిలిచి యభివందనం బొనరించి "యో మృగస్వామీ! మేము మీ కొక్క చిన్న విన్నపంబు గావింపవచ్చి యున్నవారము. మామీఁదఁ గరుణించి యవధరింపుఁడు. భవదీయ ప్రతాపా నలంబునకు[25] లోకంబులోని వ్యాళజాలంబెల్లఁ[26] దృణప్రాయంబు[27] నా[28]

---

1. భయంకరముగా; 2. బయలు వెడలు; 3. యత్నించినంతనే; 4. దుడ్డు కఱ్ఱలతో; 5. నలఁగు; 6. చంపి; 7. హారము; 8. మొదలుకొని; 9. బుద్ధిబలము లేనివానికి; 10. లేనిదానితో సమానము; 11. కుందేలు; 12. చంపు; 13. శ్రద్ధతో; 14. సింహము; 15. చంపి; 16. మిక్కిలి; 17. చోటు; 18. కలిగిన; 19. ఆపద; 20. కదలి; 21. సింహము; 22. భయము అతిశయింపఁగా; 23. కలుగు; 24. దూర దూరముల; 25. పరాక్రమ మనెడి అగ్నికి; 26. దుష్టగజముల సమూహము; 27. గడ్డిపోఁచలకంటె నించుక తక్కువ; 28. అనఁగా.

మాయట్టి క్రుక్కడుల లెక్కింపనేల? కొంత దయగలిగి తెగవుగాని[1] యొక్క నిమిషంబులోన మమ్మందఱ నిర్మూలింపఁజాలవె? అట్టి కరుణాళుండ వగుటంజేసి మా ప్రార్థనంబు పాలివోవదని[2] తలంచెదము. దేవరసన్నిధికి వంతుమయిం[3] బ్రతిదినం బొక్కొక్క మృగంబుం దమ యాహారార్థం బనుపం దలంచి యున్నవారము. ఇందులకు మేకొని[4] మమ్ము భయంబు వలనం బాచి[5] రక్షింపవలయును." నావుడు సింగం బట్ల కానిండని యభయం బొసంగి మృగంబుల వీడుకొలిపె. అంత నా మృగసంతానంబు కొంత వంతఁదలంగి ప్రత్యహంబు[6] వఱువాత వంతుకొలంది నొక్కొక్క మృగంబును సింగంబు చెంగటికిం[7] బనుచుచుండు. ఇవ్విధంబునం గొంతకాలంబు కడవ మృగంబులెల్ల యథాసంకేతంబుగ[8] నొక్క చెవులపోతుం బిలిపించి "యెల్లి[9] మృగవల్లభుపాలికిం[10]బోవలయువంతు నీపాలంబడియె" నావుడు శశంబు భృశంబు[11] మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి, చెదరిన హృదయంబు పదిలించుకొని[12] 'యెంతవారికేని విధి విధానం బప్రతివిధానంబుగాదే[13]!' యని తలపోయుచు దట్టంబుగ వేఁడినిట్టూర్పులు నిగుడ శిరఃకంపంబు గావించి యెదరు[14] దొడరినతఱి[15] నెఱుక[16] బలిమి కొలఁది వెరవు పరికింపవలయుఁగాని వెఱంగువాటు[17] తెఱంగుగాదు[18]. ఎట్లయిన నా బుద్ధిబలంబునంజేసి కేసరిం బ్రతారించి[19] దోరింపం[20] గడంగెద[21]. అటమీఁద దైవంబు పంచినగతి[22] యయ్యెడుంగాక? అని యచ్చటి తన బలఁగంబువలన సెలవుగైకొని నడవం గాళ్ళులాడక యల్లనల్లం బోవుచుఁ జేయంగల యుపాయంబురోసి[23] మానసంబున కది సరిపఱిచికొని దారిం గొంత మసలి యాహారంబు తఱి దప్పించి డాయంబోయి సవినయంబుగం బ్రణమిల్లుడు హర్యక్షంబు[24]

---

1. సాహసింపవు; 2. వ్యర్థముగాదని; 3. వంతుచొప్పున; 4. అంగీకరించి; 5. తొలఁగించి 6. ప్రతిదినము; 7. సమీపమునకు; 8. ఏర్పాటు ననుసరించి; 9. రేపు; 10. మృగరాజొ నొద్దకు; 11. మిక్కిలి; 12. దిటవుపఱుచుకొని; 13. తిరుగులేనిది; 14. ఆపద; 15. కలిగినప్పుడు; 16. జ్ఞానము; 17. నిశ్చేష్టత; 18. పద్ధతి; 19. మోసగించి; 20. చంపుటకు; 21. యత్నించెద; 22. పనుచు, ఆజ్ఞాపించు; 23. వెదకి; 24. సింహము.

సటాజాలంబు[1] నిక్క వెక్కసంబగు[2] రోషంబున భీషణం బయి యదరులు[3] చెదరం జాడ్కులు నిగిడించి 'యహహా! యస్మదీయ క్షాంతికి[4] ఫలంబు తోడన కలిగె. కుట్టినం దేలంద్రు, కుట్టకున్నం గుమ్మరపురువండ్రు గాదె? నాకుం దఱి దప్పించి యాహారంబు పనుచుట చూడ నా వేఁడిమి చవి[5] యింకొక్క మఱి[6] చూడ వేఁడికాఁబోలు. ఈ యడవిమృగంబు లింతలోనన యింత మత్తిల్లునే? నేఁడ యిప్పాలంబునంగల జంతుజాలంబునెల్లం జమరి[7] సమయించి[8] యెరియు[9] కడుపుఁజిచ్చున వేల్చెద[10]' నని వాలంబు[11] నేల తాడించి[12] లేచుడు శశంబు 'దేవా! తావకులగు[13] సేవకులవలన లేశంబయిన దోషంబు లేదు. నేఁటి ఱేపు[14] మావారల శాసనంబు శిరంబునం బూని యేను సరభసగతిం[15] జనుదేర దారి నొక్క హర్యక్షంబు రూక్షంబుగ[16] వీక్షించి 'యోరీ శశాధమా! ఎట్టి సత్త్వంబేని మా కట్టెదుర దరవిరహితంబుగం[17] జరింపం గానము. మాయురే[18]! నీ యుద్ధతిం[19] జూడ మాకుం గరంబు వెఱంగయ్యెడు. మమ్మ్మం జీరికింగొనక[20] యొరసికొని పాఱు పోతరంబు[21] నీకు రాఁ గతం బేమి? నిలునిలు మెటం బాఱెద' వని యధిక్షేపించి[22] ప్రతిరోధింప[23] నే నాతనింగాంచి మా కెల్లరకు వల్లభుండు సత్త్వసారాభిధానుం డగు సింహరాజు గలండు. అమ్మహామహు సన్నిధిం జనుచున్నవాఁడ. నన్ను మసలింపకుము[24]. అతం డొకింత కోపగించిన లోకం బాకులంబగు[25].' నావుడు నతండు మధ్యందిన విద్యోతమాన ఖద్యోత మండలంబుం[26] బోలె మండుచు 'నహహా! యింతకాలంబున కిట్టి వింత వినంబడియె. ఇవ్వనంబునందలి మృగ సందోహంబునకు[27] నేనొక్కరుండ దొరగాని నాకు దొర యొక్కరుండు

---

1. జూలుగుంపు; 2. అధికమగు; 3. మిడుఁగుఱులు; 4. మా యోర్పునకు, ఉన్నశక్తిని ప్రదర్శించినచోఁ గ్రూరుఁడనియుఁ జూపకున్నచో నశక్తుఁడనియు నందురనుట; 5. రుచి; 6. సారి; 7. చఱచి; 8. చంపు; 9. మండు; 10. హోమముచేయు; 11. తోఁక; 12. కొట్టి; 13. మీవారు; 14. ప్రాతఃకాలము; 15. వేగముతోఁగూడిన గమనమున; 16. తీక్ష్ణణము; 17. నిర్భయముగా; 18. ఔరా!; 19. గర్వము; 20. లక్ష్యపెట్టక; 21. క్రొవ్వు; 22. ఆక్షేపించి; 23. అడ్డగింప; 24. ఆలసింపనీకుము; 25. కలఁగినది; 26. మధ్యందిన = మధ్యాహ్న, విద్యోతమాన = ప్రకాశించుచున్న, ఖద్యోత మండలంబు = సూర్యబింబము; 27. సమూహము.

మాయట్టి క్రుక్కడుల లెక్కింపనేల? కొంత దయగలిగి తెగవుగాని[1] యొక్క నిమిషంబులోన మమ్మందఱ నిర్మూలింపఁజాలవె? అట్టి కరుణాళుండ వగుటంజేసి మా ప్రార్థనంబు పాలివోవదని[2] తలంచెదము. దేవరసన్నిధికి వంతుమయిం[3] బ్రతిదినం బొక్కొక్క మృగంబుం దమ యాహారార్థం బనుపం దలంచి యున్నవారము. ఇందులకు మేకొని[4] మమ్ము భయంబు వలనం బాచి[5] రక్షింపవలయును." నావుడు సింగం బట్ల కానిండని యభయం బొసంగి మృగంబుల వీడుకొలిపె. అంత నా మృగసంతానంబు కొంత వంతఁదలంగి ప్రత్యహంబు[6] వఱువాత వంతుకొలంది నొక్కొక్క మృగంబును సింగంబు చెంగటికిం[7] బనుచుచుండు. ఇవ్విధంబునం గొంతకాలంబు కడవ మృగంబులెల్ల యథాసంకేతంబుగ[8] నొక్క చెవులపోతుం బిలిపించి "యెల్లి[9] మృగవల్లభుపాలికిం[10]బోవలయువంతు నీపాలంబడియె" నావుడు శశంబు భృశంబు[11] మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి, చెదరిన హృదయంబు పదిలించుకొని[12] 'యెంతవారికేని విధి విధానం బప్రతివిధానంబుగాదే[13]!' యని తలపోయుచు దట్టంబుగ వేఁడినిట్టూర్పులు నిగుడ శిరఃకంపంబు గావించి యెడరు[14] దొడరినతఱి[15] నెఱుక[16] బలిమి కొలఁది వెరవు పరికింపవలయుఁగాని వెఱంగువాటు[17] తెఱంగుగాదు[18]. ఎట్లయిన నా బుద్ధిబలంబునంజేసి కేసరిం బ్రతారించి[19] దోరింపం[20] గడంగెద[21]. అటమీఁద దైవంబు పంచినగతి[22] యయ్యెడుంగాక? అని యచ్చటి తన బలఁగంబువలన సెలవుగైకొని నడవం గాళ్ళులాడక యల్లనల్లం బోవుచుఁ జేయంగల యుపాయంబురోసి[23] మానసంబున కది సరిపఱచికొని దారిం గొంత మసలి యాహారంబు తఱి దప్పించి డాయంబోయి సవినయంబుగం బ్రణమిల్లుడు హర్యక్షంబు[24]

---

1. సాహసింపవు; 2. వ్యర్థముగాదని; 3. వంతుచొప్పున; 4. అంగీకరించి; 5. తొలఁగించి; 6. ప్రతిదినము; 7. సమీపమునకు; 8. ఏర్పాటు ననుసరించి; 9. ఱేపు; 10. మృగరాజు నొద్దకు; 11. మిక్కిలి; 12. దిటవుపఱచుకొని; 13. తిరుగులేనిది; 14. ఆపద; 15. కలిగినప్పుడు; 16. జ్ఞానము; 17. నిశ్చేష్టత; 18. పద్ధతి; 19. మోసగించి; 20. చంపుటకు; 21. యత్నించెద; 22. పనుచు, ఆజ్ఞాపించు; 23. వెదకి; 24. సింహము.

సటాజాలంబు[1] నిక్క వెక్కసంబగు[2] రోషంబున భీషణం బయి యదరులు[3] చెదరం జూడ్కులు నిగిడించి 'యహహా! యస్మదీయ క్షాంతికి[4] ఫలంబు తోడన కలిగె. కుట్టినం దేలంట్రు, కుట్టకున్నం గుమ్మరపురువండ్రు గాదె? నాకుం దఱి దప్పించి యాహారంబు పనుచుట చూడ నా వేఁడిమి చవి[5] యింకొక్క మఱి[6] చూడ వేఁడికాఁబోలు. ఈ యడవిమృగంబు లింతలోనన యింత మత్తిల్లునే? నేఁడ యిప్పొలంబునంగల జంతుజాలంబునెల్లం జమరి[7] సమయించి[8] యెరియు[9] కడుపుఁజిచ్చున వేల్చెద[10]' నని వాలంబు[11] నేల తాడించి[12] లేచుడు శశంబు 'దేవా! తావకులగు[13] సేవకులవలన లేశంబయిన దోషంబు లేదు. నేఁటి తేపు[14] మావారల శాసనంబు శిరంబునం బూని యేను సరభసగతిం[15] జనుదేర దారి నొక్క హర్యక్షంబు రూక్షంబుగ[16] వీక్షించి 'యోరీ శశాధమా! ఎట్టి సత్త్వంబేని మా కట్టెదుర దరవిరహితంబుగం[17] జరింపం గానము. మాయురే[18]! నీ యుద్ధతిం[19] జూడ మాకుం గరంబు వెఱఁగయ్యెడు. మమ్ముం జీరికింగొనక[20] యొరసికొని పాఱు పోతరంబు[21] నీకు రాఁ గతం బేమి? నిలునిలు మెటం బాఱెద' వని యధిక్షేపించి[22] ప్రతిరోధింప[23] నే నాతనింగాంచి మా కెల్లరకు వల్లభుండు సత్త్వసారాభిధానుం డగు సింహరాజు గలండు. అమ్మహామహు సన్నిధిం జనుచున్నవాఁడ. నన్ను మసలింపకుము[24]. అతం డొకింత కోపగించిన లోకం బాకులంబగు[25].' నావుడు నతండు మధ్యందిన విద్యోతమాన ఖద్యోత మండలంబుం[26] బోలె మండుచు 'నహహా! యింతకాలంబున కిట్టి వింత వినంబడియె. ఇవ్వనంబునందలి మృగ సందోహంబునకు[27] నేనొక్కరుండ దొరగాని నాకు దొర యొక్కరుండు

1. జూలుగుంపు; 2. అధికమగు; 3. మిడుఁగుఱులు; 4. మా యోర్పునకు. ఉన్నశక్తిని బ్రదర్శించినచోఁ గ్రూరుఁడనియుఁ జూపకున్నచో నశక్తుఁడనియు నందురనుట; 5. రుచి; 6. సారి; 7. చఱచి; 8. చంపు; 9. మండు; 10. హోమముచేయు; 11. తోఁక; 12. కొట్టు; 13. మీవారు; 14. ప్రాతఃకాలము; 15. వేగముతోఁగూడిన గమనమున; 16. తీక్ష్ణణము; 17. నిర్భయముగా; 18. ఔరా!; 19. గర్వము; 20. లక్ష్యపెట్టక; 21. క్రొవ్వు; 22. ఆక్షేపించి; 23. అడ్డగింప; 24. ఆలసింపనీకుము; 25. కలఁగినది; 26. మధ్యందిన = మధ్యాహ్న, విద్యోతమాన = ప్రకాశించుచున్న, ఖద్యోత మండలంబు = సూర్యబింబము; 27. సమూహము.

గలండె? ఎవ్వండేని నెదిరిం దన్నుఁ గానక యందనిపదవికిం గంతుకొన[1] నుంకించె నేని వాని మదీయ తేజోనలంబున[2] కింధనంబుం[3] గావించెద. నీ విటకుముందు ప్రభువని పేర్కొనినవానిం గానిపింపుము[4]. ఇప్పుడ కయ్యంబునకుం[5] గడంగెద. చూపవేని నిన్నుం బొలియించెద' నని పలికి, యట్లు కానిమ్మని నన్నుం బలికించి నీ పాలికిం బుత్తెంచె. దానంజేసి యింత మసలవలసె' నా విని మృగనాథుం డప్రతిరోధక్రోధుండయి[6] 'యీక్షణంబ యా దుష్టమృగంబుం గానిపింపుము. దండధరు వీటికి[7] మసలక పుత్తెంచెద. నాకు మార్గాభిజ్ఞానార్థము[8] మును సనుము.' నావుడు శశకంబు వినయ సంభ్రమంబులు పెనంగొన వల్లెయని కడువడిం జని యొక్కబావిం గానిపించి 'యో మృగకులసార్వభౌమా! నీ మార్తుం[9] డీ వాపికయం[10] దున్నవాఁడు. తొంగిచూడు' మన సింగంబు తొంగిచూచి, యుదకంబునందలి తన ప్రతిబింబంబు మాఱుసింగం బని భావించి కోపాటోపంబు[11] మీఱ, వలంకులు[12] మాఱుమెలంగ[13] గర్జిల్లి గుభుల్లున దుమికి కాలధర్మంబు[14] నొందె. కావున నెంత బలవంతునయిన బుద్ధిబలంబుచే గెలువవచ్చును.

**పింగళకునకు సంజీవకునిపై ననుమానము పుట్టించుట**

'పింగళకుం దొల్లి సేవించుచుండి కాటకపాటకంబులను రెండు జంబుకంబులు కృతాపరాధంబు[15] లగుటం జేసి నిష్కాసితంబు[16]లయ్యె అయ్యవి వెండియు నేని యనుగ్రహంబు సంపాదింపం గోరి సంజీవకు ననుసరించుచున్నయవి. ఇదియు మదీయోద్యోగంబున[17] కనుకూలంబయి కానంబడుచున్నయది. సెలవిమ్ము పోయివచ్చెద?' నా విని కరటకుండు వృక్షమూలంబుం జేరిన ప్రువ్వను[18] మెలపున[19] మూలచ్ఛేదంబు[20] గాకుండ

1. లంఘింప; 2. నాదైన తేజస్సనెడి అగ్నికి; 3. కట్టెపుల్ల; 4. చూపుము; 5. కలహమునకు; 6. అడ్డులేని కోపము గలవాఁడయి; 7. యముని దేశమునకు; 8. దారి తెలియుకొఱకు; 9. మాఱుతుఁడు, శత్రువు; 10. బావియందు; 11. కోపమువలని తొట్రుపాటు; 12. దిక్కులు, వలను, వలఁకు (ఏక); 13. మారు+చెలంగన్ = ప్రతిధ్వనింపఁగా; 14. మరణము; 15. చేయఁబడిన అపరాధము గలవి - అపరాధము చేసినవి; 16. వెడలఁగొట్టబడినవి; 17. నా ప్రయత్నము; 18. పురువు; 19. మెలఁకువతో; 20. మూల + ఛేదము = మొదలు నఱకుట.

వెలార్చి[1] మాయించుట[2] నేర్పరితనంబు. నీ వెఱుంగని యర్థంబు లేదు. నీకుం గార్యంబు సిద్ధించుఁగావుత మెడ[3]సేయక పొమ్మ' నావుడు దమనకుండు పింగళకుని పాలికింబోయి మ్రొక్కి మొగంబు వ్రేలవయిచుకొని దీనభావంబు భావించుకొని నిలుచుండఁ బింగళకుండు కాంచి 'దమనకా! ఏల యిట్లు దెలివి దప్పియున్నవాఁడవు. మాకుం బరమాప్తుండవు. లోకంబునం దెవ్వండేని జీవింపంగోరువాఁడు నీకుఁ గీడు దలంపఁడు. నీ ఖేదంబునకు నిమిత్తంబు దెలియునంతకు మా చిత్తం బుత్తలంపడియెడు[4]. కొంకక[5] వాక్రువ్వుమన దమనకుండు 'స్వామీ! మతివిహీనుండనయి[6] మహాపరాధంబు గావించితిని. నా వలనం గరుణింపుఁడు, క్షమియింపుఁడు. భృత్యుండు స్వాపరాధంబు[7] స్వామికి నివేదింపక మొఱంగంజనదు[8]. మొఱంగినవాఁడు రెండు లోకంబులకుం గాక చెడు. అది యట్లుండనిమ్ము. పెక్కండ్ర మనుగడకు మూలంబగు పుణ్యపురుషుని కొక్క యెడరు వాటిల్లిన నది యొక్కటి శోచ్యంబు[9] గాని, మాదృశుండు[10] క్షుద్రుం డొక్కరుండు పొలిసిన దానం గొఱంతలేదు. దాన లోకం బస్తమింపదు. సమక్షంబున భృత్యుల వర్తనంబు లెల్లఁ గీర్తనీయంబులై[11] యుండుం గాని యందు దోషంబు లేశంబుం గానంబడదు. అట్లగుటంజేసి యధీశ్వరుండు[12] స్వపరోక్షంబునం[13] దత్తద్వర్తనంబులు చారముఖంబునం[14] బరికించి హితాహితుల[15] నిర్ణయించి, యనుగ్రహ నిగ్రహంబులు[16] మెఱయించుచుం బ్రజావృక్షంబునకు[17] మూలంబగు తన్ను రక్షించుకొనవలయును. స్వామీ! సేవకుం డేమో విన్నవించెడునని యాలంబు[18] చేయక యాలకింపుఁడు. సంజీవకుని వర్తనంబు పరికింపం దొంటితెఱంగుగాదు. అన్యాయంబు నుడువంగూడదు. మొదల సంజీవకుని ప్రవర్తనం బనన్యాదృశంబుగ[19] నుండె అతని చరిత్రంబునకు మే

1. వెడలించి; 2. చంపుట; 3. కావుతమెడ = కావుతన్ +ఎడ = ఆలస్యము; 4. విచారించు; 5. సందేహింపక; 6. బుద్ధిలేనివాఁడు; 7. స్వ+అపరాధము = తన తప్పు; 8. వంచించు; 9. విచారింపఁదగినది; 10. మావంటివాఁడు; 11. పొగడఁదగినవయి; 12. ప్రభువు; 13. తనచాటున; 14. వేగులవారి వలన; 15. మిత్రులను, శత్రులను; 16. దయయును, వైరమును; 17. ప్రజయనెడి వృక్షమునకు (రూపకము); 18. ఉపేక్ష; 19. మతియొకనితో సరిపోలినది కానట్టి.

మందఱము మిక్కిలి యాశ్చర్యంపడుచుందుము. ఈతండు తొల్లి యెల్లతఱి మిమ్ము నవ్యాజప్రేమంబునం[1] గొలుచుచు మీ కార్యంబుతఱి నీరువట్టని[2] యాఁకలియని నిద్రయని చూడఁడు. చక్కెరం దిని చేఁ దనవచ్చునే?[3] తొంటి తెఱంగు విచారింప సంజీవకుండు లోకంబులోనివాఁడే! ఏమి కాలదోషంబొ యిప్పు డీతం డాతండు గాఁడని తోఁచెడు. ఈతండు తొల్లి మీ గుణంబులను వేనోళ్ళం గొనియాడుచుండును. అప్పు డాతని నిర్భరానంద పారవశ్యమునకుఁ[4] గొలందిలేదు. కొంతకాలమునకు వెనుక మాబోఁటులెవ్వరైన మిమ్ముం బ్రశంసించుచో సత్యముసత్య మౌనౌనని యంగీకార సూచనంబులతోడనే చాలించుచువచ్చె. అనంతరము దేవర ప్రశంసనంబు[5] వచ్చిన మంద హాసంబుతో వినుచుండుం గాని, యట్టిట్టని వచియింపం గానము. ఇటీవల నేమికతంబొ యేలినవారి ప్రసంగంబులం[6] దెచ్చికోలు[7] వికాసంబె కాని నిక్కంపు మందహాసంబు లేశం బయినం గానంబడక యున్నది. ఈతని యనుభావంబు[8] వింతయయి కానంబడుచున్నది. దీనికిం గతం బేమొకో యని మనంబున రోయుచుండుదు. నేఁడు మదీయాప్తులు కొందఱు మాటవెంబడి స్వామిచే నిగృహీతులగు[9] వారితో సంజీవకుండు చెలికారంబు చేయుచున్నవాఁడు. కాటకపాటకులతోడ నిచ్చలు మంత్రంబు[10] నిర్వర్తించుచున్నవాఁడని వినిపించిరి. దీనంజేసి యీతని భావంబు నిర్ణయించితి. స్వామిహితంబు కాంక్షించువాఁడు స్వప్నావస్థయందయిన స్వామి ద్రోహులతోడ సఖ్యంబునకుఁ బాలుపడునే?' యని నుడివి ప్రక్కవెనుకలు కలయం జూచి కరంబున నోరు మూసికొని శ్రవణమూలంబు[11] చేర మోరసారించి[12] యల్లన నిట్లనియె, 'ఇది దేవరసన్నిధినున్న భృత్యుల కెల్లం దెల్లంబయి యుండవచ్చు. సంజీవకునివలన భీతింజేసి యిచ్చటివారు బయలుపొంగకున్నారు కాఁబోలు. ఇంత యేల? ఒక్కనిం బిలిచి విచారించినం

---

1. మిషలేని ప్రేమతో; 2. దప్పి; 3. మే లనుభవించి కీ డనరాదనుట; 4. సంపూర్ణానంద పరవశత్వము; 5. కొనియాడుట; 6. ప్రస్తావము; 7. తెచ్చికొనుట; 8. అభిప్రాయమును దెలుపు ముఖవికాసాదికము; 9. నిగ్రహింపఁబడిన; 10. ఆలోచనము; 11. చెవి మొదలు; 12. చాఁచి.

జిత్తంబునకు విశదం బయ్యెడు' నా విని పింగళకుం డద్భుత రోషవిషాదంబులు పెనంగొనం దన సేవకుని నొక్కనిఁబిలిచి "యిచ్చటి కొలువుడుకాం[1] డ్రేరేనిం[2] గాటకపాటకులతోడ నేస్తంబు[3] సేయుచున్న వారె?" నావుడు వాఁడు భయంపడి గుటకలు మ్రింగ, 'వెఱవకుము. సత్యంబు వాక్రువ్వుము. దానం గొఱంత లే' దని యేఁడు వలుక విని వాఁ డిట్లనియె: 'సంజీవకుండు వారి చేరికకు మేకొని[4]యున్నట్లు కానంబడుచున్నది.' నావుడు విని 'మే మడిగిన యర్థం బిక్కడన మఱచిపొమ్ము. బయల నుబ్బనీకుము[5]. పొద'మని[6] వానిం బుచ్చి పింగళకుఁడు ఖిన్నుండయి[7] క్రిందుచూచుచు మిన్నకుండం గాంచి వెండియు దమనకుం డిట్లనియె : 'ఇప్పటి చొప్పు పరికింప మనతోడ నింక సంజీవకుండు మనసునం గలిసి వర్తింపఁబోఁడు. అతని తెఱంగు కొంత యెఱింగినవార మగుటంజేసి మనకును దొంటి చందంబున[8] డెందంబు పొందియుండదు. అయిన నీతండు పెద్దకాలంబు దేవర యాస్థానంబునందుండి చిత్తంబున కెక్కం బ్రవర్తించినవాఁడు. చిరకాలసేవియగు భృత్యుండు తెలిసి, తెలియములం[9] జేసి యొక్క యపరాధం బొనరించిన క్షమింపవలయుఁగాని పెఱలం[10]బోలె వానిం ద్రోసిపుచ్చుట ధర్మంబు గాదు. కావున నీతం డింతదనుకఁ జేసిన దుష్కార్యం బావిష్కరించి[11] యలుకు[12] పుట్టించి క్షమియింప వేఁడుకొలిపి యిటమీఁద నిట్టికార్యంబు చేయకుమని నాతికఠినంబుగఁ[13] బలికి యెప్పటిచొప్పున నాతనికొలు వీకొనుట[14] సర్వ విధంబుల నుచితంబని తోఁచుచున్నది.' అనవుడు మృగపుంగవుం డాకర్ణించి, మొగం బెగయించి దమనకుని మొగంబునం జూపులు వొలయ నించుక మనంబునం బరికించి "రాజద్రోహుల నెల్లవిధంబుల దండించుట యుచితంబు. అయినను నా హృదయంబు వానివలన బహుకాలంబు స్నిగ్ధం[15]

1. సేవకులు; 2. ఏరేనిన్ = ఏరు+ఏనిన్ = ఎవరైన; 3. స్నేహము; 4. సమ్మతించి; 5. ప్రకటింపకుము; 6. పొమ్మని; 7. ఖేదము నొందినవాఁడు; 8. విధమున; 9. తెలియుట, తెలియమి అనువానిచేత; 10. ఇతరుల; 11. బయటఁబెట్టి; 12. భయము; 13. అతికఠినము గాకుండ; 14. అంగీకరించు; 15. స్నేహముతోఁగూడినది.

బగుటంజేసి యొక్క తెగువకుం జొరదు. కావున వెలార్త[1]మొండె; నీ చెప్పిన చొప్పు గావింతమొండె[2]; నావుడు నక్కలరాయం[3] డిట్లనియె : 'ఇది యిప్పటికిం దోఁచిన తెఱంగు. అయినను సాహసంపడి యొక్క కార్యంబు చేయంజనదు. "సహసా విదధీత నక్రియా"[4] మని నీతికోవిదులు[5] వక్కాణింతురు. ఇది మఱి యెవ్వని తోడనేని నొక్క ధీమంతునితో దేవర చిత్తంబునకు వచ్చిన[6] వానితో విచారింతము. అప్పటికి దేవర కుచితంబని తోఁచిన యర్థంబు మేకొందము[7]. దూరము విచారించి చేసిన దానం గొఱంతలేదు. ఇంతలోనన మిగిలి చనుకార్యం బేదియుం గానము.' నావుడు మృగపతి 'యిందలి వారందఱు నీ వెఱింగిన వారుగాని లాఁతులు[8] లేరు. వారివారి బుద్ధికౌశలంబులు నీ వెఱుంగుదువు. నీ యిచ్చకు వచ్చిన వానిం జెప్పుము.' నా విని దమనకుండు కొండొకవడి తెప్పలిడక యుప్పరంబు[9] చూచి మరల మృగరాజుం గాంచి 'మదగ్రజుండు[10] కరటకుండు ప్రజ్ఞావంతుండు. దేవర హితంబు గోరువాఁడు. అతండు చిత్తంబునకు వచ్చునే నిప్పుడ రప్పించెద'నని చెప్పి యొప్పించి యొక్క రాజభటునిం బుచ్చి రావింపం గరటకుఁ డనయంబు వినయంబు మెఱయ వందనంబు గావించి మృగస్వామిచే ననుయుక్త[11] స్వాగతుండయి తదాదిష్టం[12]బయిన యుచితాసనంబునం గూర్చుండ నతండు దమనకుం జూచి 'యా వృత్తాంతంబు ససాకల్యంబుగ[13] నీతనికి వినిపింపు' మనవుడు దమనకుండు కరటకునితోడ సంజీవకుని భూతభవద్వర్తనంబులును[14] ఱేనికిం దనకు నందులకయిన సల్లాపంబును వినిపించి, 'యిం దవసానంబున[15] మదుక్తార్థంబును[16], ఱేని వచనంబును వింటివిగదా? ఇందు నీకుం బోలినది వాక్రువ్వుము' నావుడుం గరటకుండు కొండొక మనంబునం బరికించి దమనకుంజూచి 'ఱేని యెఱుంగని యర్థం[17] బొక్కండు లేదు. కార్యా

1. బయటికిఁ బంపివేయుదము; 2. లేదా; 3. రాజు;4. సహసా = యోజింపక, క్రియామ్ = కర్మను, నవిదధీత = చేయవలదు, ఏ పనిని త్వరపడి చేయకుము - ఇది భారవి రచిత కిరాతార్జునీయ కావ్యమందలి యొకశ్లోకమున నొకపాదము; 5. నీతియందుఁ బండితులు; 6. మనసునకు నచ్చినవాఁడు; 7. సమ్మతింతము; 8. పరులు; 9. మీఁదు; 10. అన్న; 11. అడుగఁబడిన; 12. అతనిచే నాదేశింపఁబడినది; 13. సంపూర్ణముగా; 14. జరిగినవి, జరుగఁగలవి, జరుగుచున్నవి; 15.చివర; 16.నాచేఁ జెప్పఁబడిన; 17.ఱేఁ డెఱుంగని యర్థంబు.

కార్యంబులు నిర్ణయింప మనమెంతవారము? అయిన నమాత్యపదమం[1] దున్న వారమగుటం జేసి యవసరంబునం దోఁచిన యర్థంబు విన్నవింపక మిన్నకుండం జనదు[2]. అంతరం[3] బెఱింగి రాజద్రోహంబు గావించినవానిని సర్వవిధంబుల వెలార్పం జనదు. వెలార్చినవాఁడు పగఱఁ[4]గూడి పగ సాధింపగోరుఁగాని, తన చేసిన దోషంబు పరికింపఁబోఁడు. మన కప్పుడు గోరంబోవు పని గొడ్డంటం దీర్పవలసివచ్చును[5]. కాని యెప్పటి చొప్పునం గలిపికొని వర్తింతు మేనిం బూర్వమొక్కమఱి[6]యెడరు[7] వొందింపఁగడంగి పెఱ లెఱుంగుటవలన విఫలమనోరథుండగువాఁడు[8] వెండియుం[9]జేయు నుద్యోగంబు[10] ఫలానుమేయంబై[11] యుండు. అట్టివానిం జేర్చుకంటెం గీడు వేఱొండుగలదె? అధీశుండు తనకు నపాయంబురోయు[12] భృత్యు నుపేక్షింపంజనదు.' నావుడుం బింగళకుండు 'కరటకా! నీవు వాక్రుచ్చినయది సత్యంబు. అయినను జిరకాలసఖ్యంబునం[13] జేసి వానిం గొండొక కీడునకుం జొప్పింప[14] మనం బొప్పదు. నేనేమి చేయుదు?' నావుడుం గరటకుం డిట్లనియె: ఆరోగ్యంబు గోరువాఁడు చికిత్సకువలన నౌషధంబుం బోలె. శ్రేయంబు గాంక్షించు నాయకుండు భృత్యునివలన హితం బవశ్యంబు గ్రహింపవలయును. దేవరకుం దెలియని యర్థం బొక్కండు లేదు. కొండొకదవ్వు[15] పరికించినం గర్తవ్యంబు[16] చిత్తంబునకుఁ దేటపడియెడు. నీతి కోవిదుండగు భూవల్లభుం డుపధాశుద్ధుం[17] గొలువున కీకొన[18]వలయుఁగాని తక్కుతెఱఁ గయినం బర్యవసానంబునం[19] దప్పక ముప్పు వాటిల్లు, ముందు. మందవి సర్పిణి యను చీరపోతు డిండిమం బనుమత్కుణంబుతోఁ గొలఁది తెలియక సావాసంబున కీకొని హానిం జెందె. అక్కథ వినిపించెద వినుండు.

---

1. మంత్రిస్థానమున; 2. ఊరకుండరాదు; 3. అవకాశము; 4. శత్రువులను; 5. సులభముగాఁ జేయఁదగుపనిని గష్టపడి సాధింపవలసి వచ్చుననుట; 6. ఒకసారి; 7. ఆపద; 8. ఫలింపని కోరిక గలవాఁడు; 9. మరల; 10. ప్రయత్నము; 11. ప్రయోజనము ఊహింపఁదగినది; 12. వెదకు; 13. చాలకాలపుఁ జెలిమి; 14. చొరఁజేయు; 15. ఇంచుక దూరము; 16. చేయఁదగినది; 17. పరీక్షచేఁ బరిశుద్ధుఁడైన వానిని; 18. అంగీకరించు; 19. చివర.

## నల్లి - చీరపోతు

మందవిసర్పిణి యని యొక్క చీరపోతు[1] గలదు. అది తడవులంబట్టి[2] యొక్క నృపాలుని పర్యంకంబు[3] జేరి మెలంకువమీఱ వసియించి జీవించుచుండు. అంత నొక్కనాఁడు డిండిమం బనుమత్కుణంబు[4] తత్పర్యకంబున కరుదెంచిన మందవిసర్పిణి యెదురుసని కొనివచ్చి యాతిథ్యం బొనరించి, కుశలంబడిగి యిచ్చటికి వచ్చిన ప్రయోజనం బేమని మందలింప మత్కుణం బిట్లనియె: "పరమమిత్రంబవగు నిన్నొక్క యర్థం బర్థింపవచ్చితి. నీ యనుగ్రహంబు గలిగిన నా మనోరథంబు వ్యర్థంబు గాదు". నావుడు మందవిసర్పిణి యిట్లనియె : 'నాకు బ్రాణసమానుండవు. నీయభీప్సితంబు[5] మదాయత్తం[6] బొకండు గలిగిన దానికింత ప్రార్థింపవలయునే? నీ కీరాని యర్థం బొక్కండు నాకుం గలగదు.' నా విని డిండిమంబు సంతసించి యిట్లనియె: 'తడవులనుండి నానామానవ సంతాన శోణితంబు[7] లాని[8] యున్నవాఁడం గాని మానవనాథు[9]మేని రుధిరం[10] బేనాఁడేని నెఱుంగ. శాల్యోదనంబును[11], హైయంగవీనంబును[12], మధుర సూపంబును[13], సారతర శాకంబులును[14], రుచ్యంబులగు భక్ష్యంబులును, నానాఫలంబులును, రసాయనంబులును[15], వివిధ మాంసంబులును, గోక్షీరంబులును[16], మద్యంబులును[17], నానావిధోపదంశంబులును[18], బిచ్చిలదధియును[19]. శర్కరయుఁ[20], బులకండంబును[21], గంధోదకంబులును[22] లోనగుమంచి పదార్థంబు లనుభవించుచు నెండకన్నెఱుంగని[23] రాజుల మేని రక్తంబు కరంబు

---

1. చీరపేను; 2. చాలకాలమునుండి; 3. మంచము; 4. నల్లి; 5. కోరిక; 6. నా వశము; 7. అనేక మానవుల సమూహముయొక్క రక్తములు; 8. త్రాగు; 9. రాజుయొక్క; 10. రక్తము; 11. శాలి + ఓదనము = వరియన్నము (యణాదేశసంధి); 12. నాఁడే చిలికిన ఆవు వెన్నను గాచిన నేయి; 13. తీయని పప్పు; 14. మిక్కిలి సారవంతమైన కూరలు; 15.పానీయములు; 16. ఆవుపాలు; 17. కల్లు; 18. పెక్కురీతులయిన ఊరుఁగాయలును; 19. మీఁగడ కట్టిన పెరుఁగు; 20. చక్కెఱ; 21. పటిక బెల్లము; 22. పరిమళ జలము; 23. అసూర్యంపశ్యులైన.

స్వాద్యంబయి[1] యుండునని విందు. ఈ తలిమంబునందు[2] నా యునుకువ[3] యొకొంటి వేని[4] నా కోరిక నెఱవేఱును. నావుడు మందవిసర్పిణి మోమోడి[5] మాఱాడక యిట్లనియె : వెఱవెఱింగి వేగిరపడక మైమఱచి[7] కూరుకు[8] సమయంబువేచి తేనిమేని మెల్లఁగఁ గఱచి నల్లం[9]బీలిచికొని మెలంకువతోడం దొలంగి చనవలయు? నా విని డిండిమంబు 'నీ చెప్పినయట్లు మెలంగెద' ననిపలికి చీరపేనితో మిక్కిలి మైత్రి యొనరించుచు నా శయ్య వసియించి తమి[10] పెల్లిదం[11] బాఁపంజాలక తేఁడు పడకంజేరి కూరికి కూరుకక ముంద[12] చేరంబాఱి కొఱుకుడుం బుడమితేఁ డులికిపడి లేచి సీత్కారంబు[13] గావించుచుం బాదసంవాహనంబు[14] సేయు వరిచారకుం గాంచి 'యోరోరీ! తేలుగుట్టినట్లు కరంబు నా శరీరం బెరిసెడు[15]. సత్వరంబుగ దీవియ[16] చేరం దె'మ్మని పలికిన దివ్వియఁ దెచ్చునంతలో మత్కుణంబు దూరంబుగ సురిఁగినం బరిచారకులు శయనంబు నలువలంకులు కలయం బరికించి యొక్కపక్క నెరసువలెం[17] బానుపుంగఱచికొనియున్న చీరపేనిం జూచి 'యిదియె తేనిం గఱచె' నని వారు దానిం బొలియించిరి. కావున స్వరూపం బెఱుంగక పరునిం జేరిచినవాని కవశ్యము హాని సంభవించును.'

### పింగళకుని యభిప్రాయము

అనిన విని పింగళకుం డిట్లనియె : 'నాదు విక్రమంబు[18] జంతుసంతానంబులకు మృత్యుప్రాయంబని లోకవిశ్రుతంబు[19]. సంజీవకుండు నాపై నెత్తుట కాలాగ్ని[20] పై నుఱుకుట గాదే? అయిన ని న్నడిగెద. సంజీవకుండు నాకు నే వెరవునం గీడు రోయఁగలండు?' నా విని కరటకుం డిట్లనియె: క్షుద్రుం డయ్యుం జిరపరిచయంబుచే జ్ఞాతమర్ముం[21] డగువానినేనిం

1. ఆస్వాదింపఁ దగినది; 2. శయ్య; 3. ఉనికి; 4. అంగీకరించితివేని; 5. మోమోటపడి; 6. యుక్తత; 7. ఒడలుమఱచి; 8. నిద్రించు; 9. రక్తము; 10. అనుభవింపని కోరిక యందలి యాశ; 11. ఆధిక్యము; 12. నిద్రపట్టియుఁ బట్టక మునుపే; 13. ఉస్సురనుట; 14. కాళ్ళుపిసుకుట; 15. మండెడును; 16. దీపిక, దివ్వియ (రూపాం); 17. నలుసు; 18. నాయొక్క విక్రమము; 19. లోక ప్రసిద్ధము; 20. ప్రళయాగ్ని; 21. తెలియఁ బడిన మర్మము (రహస్యము) గలవాఁడు.

దఱి వేచి సాధించుట సుకరంబై యుండును.' ఏ వారికేని నొకప్పుడు గాకుండిన నొకప్పుడు ప్రమాదంబు[1] వాటిల్లకుండునే? నీతికోవిదుండు శాత్రవుని క్షుద్రునే నొప్పరికింపం జనదు.' నా విని పింగళకుండు కొంత చింతించి 'మన మీ మంత్రంబుతోడన కార్యంబు నిశ్చయించి సంజీవకు నొక్క కీడునకు లోఁబఱిచితిమేని లోకంబు మనల నిందించుంగాని లోగుట్టు[2] తెలియఁజాలదు. లోకాపవాదంబునకు భయంపడవలయును. ఇంతియకాదు. ప్రకృతివర్గం[3] బవిమర్శకారి[4] యగు తేనియందు విరక్తింబొందు. దానంజేసి సర్వశ్రేయంబులు చెడును. కావునం దుదకుఁ దోఁచినయర్థంబు వక్కాణించెద. దమనకుండు సంజీవకు పాలికింబోయి వానితోడ నిట్లు వాక్రువ్వవలయు. నీవు రాజద్రోహుల తోడం జెలికారంబు[5] చేయుచుంట తేఁ డెఱింగినవాఁడు. కరంబు కుపితుండయి[6] యున్నవాఁడు. అయిన నతండు దీనవత్సలుండు[7] గావున నీవు నా వెంబడిం జనుదెంచి నిజాపరాధంబు నివేదించి ప్రార్థించితివేనిం బ్రసన్నుండగు'నని వచియింపుము. మనచే నయినంత దనుకం గలుపుకోలుఁదనంబునకు[8] కడంగుదము[9]. "నీచాః కలహ మిచ్ఛన్తి సన్ధి మిచ్ఛన్తి సాధవ" యని ధర్మజ్ఞులు వచియింతురుగాదె? ఊరక వేఱిమికయి[10] యాడికొంట కెంత సేపుపట్టు? మనము ఋజుమార్గంబునం బ్రవర్తింతము, సంజీవకుండు నీ వచనంబులకు ననుకూలుండయి వచ్చెనేని మేలొందెడు. తక్కినం దత్ఫలం బనుభవించెడును' అని పలికి దమనకుంజూచి 'నీవు పోయిరమ్ము. మన యిక్కడి తక్కిన వచనంబు లేవియుం ద్రవ్వకుము.'

**దమనకుండు సంజీవకునితోఁ బింగళకుని యభిప్రాయము చెప్పుట**

నావుడు దమనకుండు వల్లెయని యల్లల్లంజని యాననంబున దీనభావంబు గదురఁ బదంబులు దొట్రిల డాయంబోవ సంజీవకుండుగాంచి ప్రత్యుత్థానం[11] బొనరించి యుచితాసనంబునం గూర్చుండంజేసి

1. పరాకు; 2. మర్మము; 3. మంత్రులు మున్నగువారి గుంపు; 4. ఏ పనినైనను విచారింపక చేయువాఁడు; 5. చెలిమి; 6. కోపము నొందినవాఁడు; 7. దీనులయెడ దయగలవాఁడు; 8. సఖ్యమునకే; 9. ప్రయత్నింతము, నీచాః = నీచులు, కలహం = కయ్యమును, ఇచ్ఛన్తి = కోరుదురు, సాధవః = మంచివారు, సన్ధిం = సంధిని, ఇచ్ఛన్తి = కోరుదురు, సాధవః + అని = సాధవయని; 10. వేఱుపాటుకై; 11. ఎదురుకొని లేచుట.

తదనుభావంబునకు[1] నిమిత్తంబు మానసంబుసం బరికించుచు 'మీ యంద ఱకుం గుశలంబే?' యనిన దమనకుండు విని 'పరాధీన వర్తనులకుం[2] గుశలంబున కెంత యంతరంబు? రాజసేవాపరుండు మృత్యుగ్రస్త తుల్యుండు[3] జేని మచ్చిక[4] నచ్చిక[5]యిడి పెద్దకాలంబు సుఖింపం గాంక్షించువాఁడు మృగతృష్ణికా ప్రవాహంబు[6]గాంచి యుదన్యాపనోదనంబుకయి[7] ప్రధావించు వాఁడు[8] గాఁడె? ఏకతంబు[9]ననేని జేని సాకతంబునకు[10] మోఱకు[11] తీరున ధీరుండు మోసంబొందఁడు.' నా విని గోవల్లభుండు[12] 'నీ వచనభంగి[13] విచారింప నేదియొా యొుక్క విశేషంబు గలుగంబోలునని తోఁచెడు' ననుచు నేకాంతకాంక్షాసూచకంబుగం[14] దన యిరుపక్కియలుం[15] బిఱుచక్కియు[16] నాలోకింప, బిఱిందిదెసనున్న కాటకపాటకు లల్లనలేచి యెడగలుగంబోవుడు దమనకుండు వారిదెస యపాంగ వీక్షణంబున[17] సూచించుచు 'వీరలఁ జేర్చుటయె నీ యిడుమకు మూలంబయ్యె.' నావుడు సంజీవకుండు భయాధీన మానసుండయి 'యచ్చట జరిగిన వృత్తాంతంబేమి? యని యల్లన నడిగిన దమనకుండిట్లనియె : 'చే టెఱుంగనిపాటు వడియెదవు. కాటకపాటకులు రాజద్రోహులని యెఱింగియుండియు వారలతోడ సఖ్యంబు చేయుచున్న వాఁడవు. ప్రభువునకెకా దెవ్వరికయిన నిది యనుచితంబని తోఁపకుండునా? ఈ యర్థంబు పార్థివుండెఱింగి దుర్వార క్రోధభీషణుండయి[18] యున్నవాఁడు. తొల్లి నా వచనంబునందు విశ్వాసం బిడి జేనిపాలం జేరితివి. కావున నున్నరూపు వచియించెద వినుము. 'సంజీవకు పక్షం బవలంబించి మత్సమ్ముఖమ్మున వసియించువారి నెవ్వరినేనిం దత్క్షణంబ కృతాంతనిశాంతావేశికులం[19] జేసెద'

---

1. అతని యభిప్రాయమును దెలుపు ముఖచిహ్నమునకు; 2. ఇతరుల కధీనమైన ప్రవర్తనము గలవారు; 3. మృత్యువుచే మ్రింగఁబడిన వానితో సమానుఁడు; 4. అనుగ్రహము; 5. నమ్మిక; 6. ఎండమావులందలి ప్రవాహము; 7. దప్పిని బోఁగొట్టుకొనుటకై; 8. పరువెత్తు వాఁడు; 9. ఏకాంతము; 10. అనుగ్రహము; 11. మూర్ఖుఁడు; 12. వృషభరాజు; 13. మాటతీరు; 14. ఏకాంతమును గోరుటను దెలుపునది; 15. రెండుప్రక్కలు; 16. వెనుకచోటు; 17. క్రీఁగంటి చూపు; 18. వారింపరాని కోపముచే భయంకరుఁడు; 19. యముని గృహమును బ్రవేశించువారిని.

నని హర్యక్షాధ్యక్షుండు[1] కరంబు క్రూరంబుగ సంగరం[2] బొనరించి యీక్షణంబ సంజీవకుం దోడ్కొనిరమ్మని నన్నుం బుచ్చినవాఁడు. మీఁది కార్యంబు నీ యిచ్చవచ్చినట్లు గావింపుము. ఈ యనర్థం బూరక పుట్టదు. చేరువంజేరి యెవ్వరో చెవిగఱచెదరు[3]. వెండియు నిట్టివేమి పుట్టెడునో యెఱుంగము. నేఁడు నీ కయినది తేపు మా కయ్యెడు. అతీత కార్యంబునకు[4] విచారంపడ నయ్యెడు ఫలంబేమి? ఎన్నండు తేనికి బానిసతనంబునకుం బూనికొంటిమి నాఁడె మృత్యువు నోరం జొచ్చితిమి. ఇందులకయి యిప్పుడు వగచుట గతజల సేతుబంధనంబు[5]' అని నిట్టూర్పు నిగిడించి ఖేదవిషాదంబు[6] లభినయించు వాఁడు క్రిందు చూచుచు మిన్నకుండ సంజీవకుం డవ్వచనంబు వజ్రపాతం[7] బహార్యంబునట్లు[8] ధైర్యసారం బగలింపం[9] గొంతవడి వెఱపెల్లిదంబున[10] నివ్వెఱ[11]పడియుండి యెట్టకేలకు హృదయంబు పదిలించుకొని దమనకుం గనుంగొని యిట్లనియె.

అనారతంబు[12] తేనికి లగ్గు[13] దలంతుంగాని యెగ్గుం[14] గలయం దయినం దలంచి యెఱుంగ. లాఁతివారి కయిన నొక యొప్పమి[15] గావింప మనంబు చొప్పడియుండునే? అకారణంబుగ తేని కిట్టి బెట్టిదంపుఁగ్రోధంబు[16] పుట్టించి సాధువులం జెఱుప నొడిగట్టిన పుణ్యాత్ము లాబ్రహ్మకల్పాంతంబు[17] మనియెదరు[18] గాఁబోలు! సర్పంబులకు విషంబుంబోలె, ఖలులకు దోషంబు సహజంబు. వారిఁ జెప్పనేల? తేని యవివేకంబు సర్వానర్థంబులకు మూలంబు. పార్థివుం డె ద్దీనెననినం గొట్టంబునం గట్టింపు మనువాఁ డయ్యెనేని లెంకలు[19] కొంకు[20]మాని యిచ్చకు వచ్చినట్లు తేని నకార్యంబులకు లోఁచి[21] యశోహానిం[22] బుట్టించి పరలోకదూరుం జేయుదురు. ఇంత కాలంబు పార్థివు ననుగ్రహంబు[23]

1. సింహరాజు; 2. ప్రతిజ్ఞ; 3. కొండెములు చెప్పుదురు; 4. కడచిన పనికి; 5. పోయిన నీటికి వారధిఁ గట్టుట - నిష్ప్రయోజనమని భావము; 6. దుఃఖమును, విచారమును; 7. వజ్రాయుధము పడుట; 8. కొండను వలె; 9. బ్రద్దలు చేయు; 10. భయాతిశయము; 11. నిండు+వెఱ; 12. ఎల్లప్పుడు; 13. మేలు; 14. కీడు; 15. ఆపద; 16. బెట్టిదము + క్రోధము = అధిక క్రోధము; 17. బ్రహ్మకల్పము తుది వఱకు; 18. జీవింతురు; 19. సేవకులు; 20. జంకు; 21. లోఁగునట్లు, వశపడునట్లు - చేసి; 22. యశస్(ః) + హాని = కీర్తి నాశనము; 23. పార్థివు + అనుగ్రహము = రాజుయొక్క దయ.

సంపాదింపఁగోరి నా పడినపాటు లెల్లం బొల్ల[1]యయ్యె. వివేకరహితుండగు దొరం గొలుచుట నిష్ఫలంబగుట మాత్రంబు కాదు - ప్రాణహానియు నాపాదించు మనోవాక్కర్మంబుల[2] నొకప్పుడయిన నీషత్తయిన[3] దోషంబు చేసి యెఱుంగ, సంతతంబు స్వామికి క్షేమంబ కాంక్షింతును. అట్టి నాకిప్పుడు మృత్యువు వక్త్రబిలంబు[4] చొరవలసివచ్చెఁగాదె? అన్యులకు నెన్నండును గీడురోసి యెఱుంగను నా కొరుఁడు సెరగు[5] వెదకునె యనంజనదు. రాగద్వేష దూషితాత్ముల[6] మానసంబులు సాధువులయందును వికృతిం[7] బొరయును[8]. తొల్లి కాకవ్యాఘ్రజంబుకంబులు[9] పరమసాధువగు లొట్టియం[10] గపటోపాయంబుఁ బన్ని తమ స్వామియగు సింగంబుఁ ద్రుంగించె' నన విని దమనకుం డాకథ ససాకల్యంబుగ వినిపింపు మనిన సంజీవకుం డిట్లనియె :

### సింహము - ఒంటె

"మలయంబునుపత్యకావిపినంబున"[11] దర్పసారంబను కంఠీరవంబు గలదు. దానిం గాకవ్యాఘ్రజంబుకంబులు మంత్రులయి కొలుచుచుండును. అవి యొక్కనాఁడు గహనంబున[12] విహరించుచు నొక్క యుష్ట్రంబుం[13] గాంచి 'నీ నామంబేమి? నీ వెక్కడనుండి వచ్చెద'వని యడిగిన నా క్రమేలకం[14] బిట్లనియె : వర్తకుం డొకండు నామీఁద ననారతంబు మహాభారం బెక్కించి మోపించుచుండును. ఇట్లు పెద్దకాలంబు భారవహక్లేశంబు[15] సహింపంజాలక వాని మొఱంగి[16] యీ యరణ్యంబునకు వచ్చి డాఁగియున్నవాఁడను. ఈ శార్దూలవల్లభుండు[17] లోకభీకరుండు. మీరు మహాప్రాజ్ఞులరు. మీ యనుగ్రహంబు వడసి త్రాసంబు[18] వాసి మనువాఁడ. నాకు మీరు దక్క వేఱుశరణంబులేదు. శరణాగతరక్షణంబు సర్వధర్మంబులం దుత్తమం బని

1. నేను పడిన పాట్లు వ్యర్థమయ్యె; 2. త్రికరణములు; 3. కొంచెమైన; 4. గుహవంటి నోరు; 5. కీడు; 6. ప్రేమము, వైరము అనువానిచే నిందింపఁబడిన వారు; 7. వికారము; 8. పొందు; 9. కాకియు, పులియు, నక్కయు; 10. లొట్టి = ఒంటె; 11. మలయంబు + ఉపత్యకా - విపినంబునన్ = మలయపర్వత సమీప ప్రదేశము నందలి యడవియందు; 12. అడవి; 13. ఒంటెను; 14. క్రమేలకము = ఒంటె; 15. బరువు మోయు కష్టము; 16. మోసగించి; 17. పులిఱేఁడు; 18. భయము.

ధర్మవిదులు వక్కాణింతురు. నావుడు జంబుకం బిట్లనియె : ఈ యరణ్యంబునందు మృగరాజొకరుండు గలఁడు. అతఁడు ప్రతీప ప్రతాప దీప నిర్వాపణ మహాబలుండగు[1] మహాబలుండు. మే మాతని భృత్యులము. నీవు తద్దర్శనం బవశ్యంబుగం జేయుము. మా వలన నయినయంత యుపకారంబు గావించెదము. నీకు సర్వంబు మేలయ్యెడు. వెఱవకుము. మావెంట రమ్ము.' నా విని మహాంగం[2] బంతరంగంబునం బొంగి వాని పిఱుందం జనుడు నయ్యవి మృగనాథు పాలికింబోయి యథాశ్రుతంబుగ[3] దాని వృత్తాంతంబు సాంతంబుగం[4]జెప్పి ముందటికిం ద్రోచి మ్రొక్కు మనుడు సవినయంబుగ మ్రొక్కి నిలువఁబడియున్నవానసంతంబుం[5] గాంచి పంచాస్యంబు[6] కృపాయత్తచిత్తంబయి[7] యభయం బొసంగి కొంతతడవు సల్లాపంబు గావించి 'నీ కమాత్యపదం[8] బొసంగితిమి. మా పూర్వ మంత్రుల తోడం గూడి యైకమత్యంబు వడసి యస్మత్కార్యంబులు నిర్వహించుచు సుఖంబుండుము, నావుడు నుష్ట్రంబు మహాప్రసాదంబని తదుక్తప్రకారంబునం బ్రవర్తించుచుండె.

పెద్దకాలం బివ్విధంబునం బ్రవర్తిల్లుడు నొక్కనాఁడు సింహంబు మంత్రులతో నిట్లనియె : 'నా కిప్పుడు వ్యాధికతంబున దేహంబునం బాటవంబు[9] లేక యున్నయది. అరణ్యంబున సంచరింపంజాలను. ఆరోగ్యంబు గలిగి కొంత సత్త్వవ[10] వచ్చి నడయాడునంతదనుక నా కాహారంబు సంపాదించి తెచ్చియిండు.' నా విని వాయసాదు లిట్లనియె : "స్వామీ! మేము క్షుద్రులము. మీకు వలసినంత యాహారం బొకపూఁటకయినం దెచ్చి యిచ్చునంతవారమె? మీ పాదచ్ఛాయ[11] నుండి మీ రారగింప మిగిలినది భుజియించి జీవించుచున్న వారము. మా సత్త్వంబుకొలంది[12] దేవరకుం దెలియనిది కాదు.' అనవుడు

1. ప్రతీప = శత్రువుల యొక్క, ప్రతాప = పరాక్రమమనెడి, దీప = దీపముయొక్క, నిర్వాణప = ఆర్పుటయందు, మహాబలుండు = వాయువు; 2. ఒంటె; 3. విన్నదాని నతిక్రమింపక; 4. పూర్తి; 5. ఒంటె; 6. సింహము; 7. దయ కధీనమైన మనస్సుగలదై; 8. మంత్రిస్థానము; 9. పటుత్వము; 10. శక్తి; 11. పాద+ఛాయ = అడుగుల నీడ; 12. పరిమితి.

మృగేంద్రుండు వానిం జూచి 'దొరకినంతయె కానిండు తోడెంబు[1]తోడనె ప్రొద్దుపుచ్చికొనియెద. నేనేమి చేయుదు? నా పురాకృతకర్మంబు వ్యాధిరూపంబున నన్ను బాధించుచున్నయది. కొంతపాటి నడయాడుటకు శక్తి యుండిన మిమ్ము శ్రమంపఱుపను[2]. జంకుమాని కానకుం జని యే యెఱచి[3]యయిన దొరకినంత కొనిరండు. పొండు.' అని శాసింప మాఱువలుక వెఱచి యా జంతువులు వనంబునకుంజని యెల్లప్రదేశమ్ములం గ్రుమ్మరి యుఱవగు నెర[4] దొరకమిం[5]గరంబు నిర్వేదించి[6] చెఱియొక్కదిక్కునకుం జెదరిచని వెదకుచుండ నండజ పుండరీక జంబుకంబు[7] లొక్క చక్కటిం[8] జేరుడు బలిభుక్కు[9] తక్కువానిం గనుంగొని 'మీరెంత మాత్రం బేనిం బలలంబు[10] సేకరించినజాడఁ గానము. మీ యంతవారి కసాధ్యంబగు కార్యంబు క్షుద్రంబగు పక్షికి సాధ్యంబగునె? మధ్యాహ్నంబయ్యె. ఇంకం గ్రుమ్మరిన దాన వ్యర్థాయాసంబుగాని ఫలంబులేదు. ఱేఁడు మనరాక వేచియుండును. అతని పాలికిం జెనంటిచేతులం[11] జనంజనదు. మనమింత కాలంబు ఱేఁడు తెచ్చియిచ్చిన మాంసంబు బరులుబ్బ[12] భుజియించి కాలుగదలింపక నిశ్చింతంబుగ నుండితిమి. ఱేని కొక్క యిక్కట్టు వాటిల్లిన తఱి యొక్కపూఁటకయిన గ్రాసంబు[13] తెచ్చి యీనోపమేని[14] మన భృత్యభావంబు[15] గాల్పనె ? ఇప్పు డొక్కచొప్పు నా డెందంబునకుం[16] బొందుపడి కానంబడియెడి. దాని విని మీకుంబోలిన తెఱంగు గావింపుఁడు' అని నలువలంకులు కలయ విలోకించి మఱికొంత చెంతకుంజరిగి చెవిడాసి యిట్లనియె : 'మన మీ లొట్టియను సరిపెట్టి నేఁటికి ఱేనికార్యంబు జరిపితిమేని ఱేపు పోలినయట్లు చూచుకొందము. ఱేఁ డుపయోగింప శేషించిన యామిషంబు మనము కొన్ని దినంబు లనన్యాపేక్షంబుగ[17] భక్షింపవచ్చును.' అన విని

---

1. అల్పము; 2. శ్రమము + పఱుపను; 3. మాంసము; 4. ఉరవు+అగు+ఎర = తగిన ఆహారము; 5. దొరకక పోవుట; 6. దుఃఖించి; 7. పక్షియు (కాకియు), పులియు; నక్కయు; 8. ప్రదేశమున; 9. కాకి; 10. మాంసము; 11. వట్టి చేతుల; 12. బరులు + ఉబ్బన్ = ప్రక్కలు పొంగ; 13. ఆహారము; 14. ఈన్ + ఓపము + ఏనిన్ = ఈఁ జాలమేని; 15. సేవకత్వము; 16. హృదయమునకు; 17. వేఱుదానిమీఁదఁ గోరికలేనియట్లు.

జంబుకం బిట్లనియె : 'మన యధీశ్వరుం డా క్రమేలకంబు నమాత్యపదం బొసంగి కరంబు గారవించుచున్నవాఁడు. మనము దానికొక్క యపాయంబు గావించితిమేని మానసంబునకు నొవ్వు[1] పుట్టించి ద వ్వగుదుము. కావున నీ చెప్పిన చొప్పు చొప్పడదు.' అన బలిభుజం[2] బిట్లనియె : "క్షుధాబాధితుండు[3] కృత్యాకృత్యంబు[4] లారయం జాలఁడు. స్వజన హననంబున[5] కయినం బాలుపడుంగాని యిది యకృత్యంబని తలంపండు. వ్యాళియు[6], శార్దూలియు[7] నిజాండశాబకంబుల[8] క్షుధాబాధంజేసి[9] కాదె భక్షించెడు?' నా విని వ్యాఘ్రం బిట్లనియె : క్షుధితుండయి[10] తద్ధననంబునకు[11] మృగనాథుండు పాల్పడినం గానిమ్ము. మన కది కార్యంబుగాదు. మన మాతని సమ్ముఖమున కుంజని మొఱఁగక మనపడిన[12] తెఱఁగు నివేదింతము. తదనంతరకర్తవ్యం బాతండును మనమును గలిసికొని విచారింతము.' అనిన వల్లెయని లేచి చని క్రమేలకంబు చనుదేకమున్న[13] తారు మృగరాజుంగాంచి 'స్వామీ! ఏమి చేయుదుము. తిరుగరానిచోట్లెల్లం దిరిగితిమి. పడరానిపాట్లెల్లం బడితిమి. ఇన్ని పాట్లు పడినదాన ఫలంబేమి? సర్వదా కరుణోదారుండవయి మా భరణరక్షణంబులు స్వకృత్యంబులుగ నిర్వర్తించు దేవరకు మావలన నావంతయుయినఁ బ్రయోజనంబు లేదయ్యె. అయినను మా విన్నపం బొక్కండు కాదనక యవధరింపుఁడు. దేవరవా రాఁకలిచే మిక్కిలి వాడం బాఱియున్నవారు. మాలోపల నొక్కనిం దమగర్భంబుఁ జొప్పించి ధన్యం గావింపుఁడు.' అనవుడు మృగనాథుండు హరిహరియని చెవులు మూసికొని 'యెంతమాట విన వలసివచ్చెను? చిరకాలంబు మిమ్ము రక్షించి యిప్పు డొక్కనాఁటి యాహారంబుకయి మీ కొక్క కీడు దలంచితినేని లోకంబునవారు నన్ను నిందింపరె? పరలోకంబునకుం దొలంగనె? ఇట్టిమాటలు తలపెట్టకుఁ'డన జంబుకంబు కాకంబుంగాంచి 'నీవు సైకంబవు.[14] ని న్నుపయోగించుట వలన

---

1. నొప్పి; 2. కాకి; 3. ఆఁకటిచే బాధపడువాఁడు; 4. చేయఁ దగినవియుఁ, జేయఁదగని వియు; 5. తనవారిని జంపుటకు; 6. ఆఁడుపాము; 7. ఆఁడుపులి; 8. తమవైన గ్రుడ్లను, బిల్లలను; 9. ఆఁకటి బాధచేత; 10. ఆఁకలి గొన్నవాఁడయి; 11. తద్ + హన నంబునకున్=వానిని జంపుటకు; 12. మనము పడిన; 13. రాకముందే; 14. చిన్నదానవు.

తేనికిఁ గడుపుఁజి చ్చుడుగంబోదు[1]. తొలంగుము. నా మేను తేనికిం భోజ్యంబుఁజేసి కృతార్థుండ నయ్యెద' ననవిని శార్దూలం బిట్లనియె : 'కాకంబుకంటె నీవు కొంత పెద్దజంతువవైన నాతని యాఁకలి పోకార్ప[2] నీ నంజుడుం[3] జాలదు. నేను రాజునకు భోజనంబయ్యెద' నన వెండియు జంబుకం బిట్లనియె : 'నీవు లావుగలవాఁడవు. నేఁడుగాకున్న తేపైన తేనిం బోషింప వలంతివి[4]. నీ యనంతరంబు మే ముండినఁ గొండొకయేనిం బ్రయోజనంబు లేదు. కావున నీ వచనంబు గ్రాహ్యంబు గా'దని కుమ్మెసుద్దు[5] లాడుచుండఁ జిత్రవర్ణుండు సనుదెంచి తద్వృత్తాంతంబు సొంతంబుగ వారివలన విని 'యూరక యేల పొలువోక పెనంగెదరు? నే నిక్కార్యంబునకుం జాలియున్నవాఁడ. నా మనుగడవలన తేని కొక్క ప్రయోజనంబు లే'దనిన జంబుకంబు తేనిం గాంచి 'యీ కార్యంబు నాకుం బోలియున్నయది. ఇందుల దేవరకు దురితంబు[6] లేదు. శరీరరక్షణంబు పరమ ధర్మంబు. శరీరంబు గల్గిన నెల్లధర్మంబులు సాధింపవచ్చు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధన" మ్మని[7] ప్రాజ్ఞులు వక్కాణింతురు. భృత్యుండు స్వామికార్యహతప్రాణుం[8] డయ్యెనేని నాకలోకసుఖం[9] బనుభవించును. ఇంతకంటె నొండు శ్రేయంబుగలదె? మీ రొల్లకుండిన[10] మే మెల్లరము ప్రాణంబులు దొఱంగెదము. నావుడు మృగనాథుండు చిత్రవర్ణుని యాననం బవలోకింప జంబుకరాజు చెప్పిన చొప్పు దప్పదు. సంశయింపక నా చెప్పినచొప్పు గావించి నన్ను ధన్యుం జేయుఁడు.' నావుడు నెట్టకేలకు క్షుధాబాధ దుస్సహంబగుడు మృగేంద్రంబు లొట్టియం జంపి భక్షించెను.

ఎట్టివానితోడనేని, నవీనసేవకునితోడ రాజును దద్భృత్యులును మనంబునం గలిసియుండరు. క్షుద్రజనపరివృతుం[11]డగు పరివృఢుండు[12]

---

1. కడుపు + చిచ్చు = ఆఁకలిమంట, ఉడుగన్ + పోదు = అడఁగఁ బోదు; 2. పోఁగొట్ట; 3. మాంసము; 4. సమర్థుఁడవు; 5. సంకేత వృత్తాంతములు; 6. పాపము; 7. శరీరం = శరీరము, ఆద్యం = మొదటిదయిన, ధర్మసాధనమ్ = ధర్మసాధనము, ఖలు = కదా!; 8. ప్రభుకార్యమునందు పోయిన ప్రాణములు గలవాఁడు - ప్రభుకార్యమునందుఁ బ్రాణములు పోయినవాఁడు; 9. స్వర్గలోక సౌఖ్యము; 10. అంగీకరింపకుండిన; 11. అల్పులైన జనులతోఁ జుట్టఁబడినవాఁడు; 12. [illegible]



దండశూక సందోహ పరివేష్టిత పటీరవిటపి వడువున[1] సమాసన్నజనంబులకు[2] దెప్పరంపుముప్పు[3] పుట్టించును. కావున నట్టిని నేవారుం జేర వెఱతురు. దీనికిం దార్ష్టాణంబుగ[4] నొక్క కథ వక్కాణించెద వినుము.

## వడ్రంగి - సింహము

ఒకానొక పట్టణంబునం దొక వడ్లంగి గలఁడు. వాఁడు నానాఁడు వనంబునకుంజని తనపనికి నుఱవగు[5] తరునికరంబు[6] నఱికి స్తంభాదికంబు లొనరించి పురంబునకుం గొని వచ్చి విక్రయించుకొని జీవించుచుండు. వాఁ డొక్కనాఁడు కాననమ్మునం గ్రుమ్మరువాఁడు సుహృద్విలోచనం బను పంచాస్యంబుం[7] గనుంగొని భీతచేతస్కుండయి[8] నిశ్చేతనుండుం[9] బోలె నిలువంబడియుండ నా హర్యక్షంబు[10] వీక్షించి కృపాతరంగితాంతరంగంబయి[11] యిట్లనియె : 'హస్తి మస్తక విదళన ఖరంబులు మన్నఖరంబులు[12]; మ్రుక్కడులగుట దయనీయు[13]లగు భవాదృశుల[14] పయిం దెగవు[15]. బెగడు వడకుము[16].' నా వాఁడు[17] సాగిలంబడి మ్రొక్కి, పెక్కుభంగుల నా సింగంబుఁ బ్రస్తుతించి ముదల[18] గొనిచని యది మొదలు కృతజ్ఞుండయి నానావిధంబులగు మధురాహారంబులు దెచ్చి యిచ్చి తనుపు[19]చుండు. ఇట్లు కొన్ని దివసంబులు సన నొక్కనాఁడు మెగంబులఱేఁడు[20] తన యనుచరంబులగు కాకజంబుకంబులతోడ ముచ్చటలాడుచుండ నవి యిట్లనియె : 'దేవరవారు కొన్నిదినంబులనుండి వేఁటకుం బోవంగానము. కారణంబు దెలిసినదిగాదు.' నా విని మృగనాథుం డిట్లనియె : రథకారుం[21] డొక్కరుండు మదీయభక్తుండు గలండు. వాఁడు ప్రతిదివసంబు నా కాహారంబు తెచ్చియిచ్చుచున్నవాఁడు.'

---

1. పాముల సమూహముచేఁ జుట్టఁబడిన మంచిగంధపుఁజెట్టు విధమున; 2. సమీపమున నున్న జనులకు; 3. దెప్పరము+ముప్పు = అధికమైన ఆపద; 4. నిదర్శనముగా; 5. యుక్తము; 6. తరు - నికరంబు = చెట్ల సమూహము; 7. సింహమును; 8. భయపడిన మనస్సు గలవాఁడై; 9. నిశ్చేష్టుఁడు; 10. సింహము; 11. దయచే నతిశయించిన హృదయము గలది; 12. ఏనుఁగుల శిరస్సులను బ్రద్దలు చేయుటలో వాఁడియైనవి, మత్+నఖరములు=నాగోరులు; 13. దయనీయులు=కనికరింపఁదగినవారు; 14. భవాదృశులు=మీవంటివారు; 15. తెగవు = సాహసింపవు; 16. భయపడకుము; 17. నాన్+వాఁడు; 18. ఆజ్ఞ; 19. తృప్తి పఱచు; 20. మృగరాజు; 21. వడ్రంగి.

నా విని కాకజంబుకంబు లిట్లనియె. 'మీ కిట్టి యుపకారం బొనరించు పుణ్యుండు సజ్జనాగ్రగణ్యుండు[1] గాఁడె? దేవర యనుగ్రహంబు గలిగిన నాతని సందర్శనంబునంజేసి మా నేత్రంబులు సాఫల్యపాత్రంబులు[2] గావించెదము.' నా విని మృగవల్లభుం 'డట్ల కానిం డాతండు కొండొక తడవునకు రాఁగలండు. వేచియుండుఁ'డని పలికి యొక్కయెడ వానితోడం గూర్చుండియుండ నా వడ్లంగి చనుదెంచి కాంచి భీతచేతస్కుండయి సత్వరంబుగ నేదిష్ఠపాదపంబు[3] నారోహించిన సింగంబు డాయంబోయి 'యోయి, చెలికాఁడా! ఏల యీ సాలంబు నధిరోహింతివి?' నావుడు 'నన్వర్థాభిధానంబులగు[4] నరిష్టవంచకంబులు[5] భవత్పార్శ్వచరంబు[6] లగుటంజేసి వృక్షంబు నారోహించితి. దుష్టపరివృతుండగు[7] రాజును సర్వదా విశ్వసింపంజన' దని వచియించి యచ్చటం గదలక వేచియుండి యొక్క చనుప[8] చనుదేర[9] దానింగూడి యయ్యరణ్యంబు వెడలి చనియె.

సజ్జనుండయ్యు దుర్జనులతోడి సంసర్గంబునంజేసి దుర్జనుండు నాఁబడు. బకోటఝూటంబుతోడ[10] వసియించు హంసంబును బకం బండ్రు గాదె? భూనాథుండు సాధుచరిత్రుం డయ్యేనేఁ బ్రకృతివర్గంబు నట్లగు "యథా రాజా తథా ప్రజా[11]" యని నీతికోవిదులు వక్కాణింతురు. జేనిపాల నెవ్వండో ఖలుండు కల్లనిజంబులు[12] విపరీతంబులుగం[13] బలికి యాతనికి నాయం దప్రతిరోధంబగు క్రోధంబు పుట్టించినవాఁడు. మించిన కార్యంబునకుం జింతించి ఫలంబేమి? ఊరక మరణంబునొందనేల? రణంబు గావించి లబ్ధవిజయుండనయి యశోలక్ష్ములం[14] బడసి యిష్టసుఖంబు లనుభవించెదనొండె. వే యొండయిన శూరలోకశ్లాఘ్యుండనయి[15] నాకలోక

1. మంచివారిలో మొదట లెక్కింపఁదగినవాఁడు; 2. సఫలతకుఁ దగినవి; 3. మిక్కిలి దగ్గరనున్న చెట్టు; 4. సార్థకములైన పేరులు గలవి; 5. అరిష్టమనఁగా అశుభప్రదమైనది - కాకి, వంచకము = మోసగించునది - నక్క; 6. నీ ప్రక్కను జరించునవి; 7. దుర్మార్గులచే జుట్టఁబడినవాఁడు; 8. వణిజుల సమూహము; 9. రాఁగా; 10. కొంగల సమూహముతోడ; 11.రాజెట్లో ప్రజలు నట్టివారే; 12. అసత్య సత్యంబులు; 13. తార్మాఱుగ; 14. యశస్(:) + లక్ష్ములు = కీర్తిని సంపదను; 15. సూర్యలోకమ్ము వారిచేఁ బొగడఁదగినవాఁడు, శూరుల సమూహముచేఁ బొగడఁదగినవాఁడు, యుద్ధమరణము నందినవాఁడు సూర్యలోక మార్గమున స్వర్గమును జేరునని శాస్త్రము.

భోగంబు లనుభవించెద నొండె' నా విని దమనకుండు 'నీవు చెప్పినయది శూరలోకశ్లాఘనీయంబ[1]. అయిన నుపాయాంతరంబుచేఁ[2] బగఱ[3] సాధింప నొండెఁ దప్పించికొని తొలంగనొండెఁ గొలందిగానియెడం గడ యుపాయంబు[4] సమాధ్యశణీయంబుగాని సాహసంపడి రణమరణంబు శ్రేయంబని కడింది మార్తురతో[5]నొరసి[6] యుసుఱు[7] దొఱంగుట ధర్మంబు గాదు. 'జీవ న్భద్రాణి పశ్యతి'[8] యను వచనంబుం బాటింపవలదె? తన తరంబుం బగఱతరంబు నెఱింగి కరంబు జయంబు నిశ్చయించుకొని మార్కొనవలయు. విపరీతం బయినం బరాభవంబు తప్పదు. తొల్లి సముద్రుండు కరం బారయక యొక్క టిట్టిభంబుం[9] బరాభవింపంబూని తాన పరాభూతుం[10] డయ్యె. అయ్యది సవిస్తరంబుగ వివరించెద నాకర్ణింపుము.

### టిట్టిభము - సముద్రము

పారావారంబు[11] తీరంబున మహీరుహంబు[12]మీఁదం దీతు వొక్కండు గూఁడు వన్నికొని తన చేడియం[13]గూడి వసించుచుండు. అంతం గొంతకాలంబున కా శకుంతంబు[14] తన కాంత గర్భశ్రాంత[15] కావుటంగాంచి సంతసించి 'నీ యిష్టంబు వేఁడు మది యెట్టి కడిందియైన నా గట్టి కడిమిమెఱసి[16] తెచ్చి యిచ్చెద' నావుడు నా పులుఁగుఁజెలువ[17] తన చెలువునితో[18] నిట్లనియె : 'నా యభిమతం బొక్కండు గలదు. వక్కాణించెద నవధరింపుఁడు. పర్వదివసంబుల[19] సముద్రుఁడు సముత్తుంగ రంగత్తరంగంబులు[20] చెలంగ నింగి[21] ముట్టి పొంగి వచ్చును. మన యావా సంబు[22] కరం బాసన్నం[23] బగుటంజేసి నా యిడిన[24] యండంబులు

---

1. పొగడఁదగినది; 2. మఱియొక యుపాయముచే; 3. శత్రువులను; 4. సామ దాన భేద దండము లనెడి నాలు గుపాయములలోఁ జివరిది; 5. మార్తురు=అధికులైన శత్రువులు - మార్తుఁడు (ఏకవ); 6. ఢీకొని; 7. ప్రాణము; 8. బ్రదికియుండువాఁడు మంగళములను జూచును; 9. తీతువు; 10. పరాభవింపఁబడినవాఁడు; 11. సముద్రము; 12. చెట్టు; 13. స్త్రీ-భార్య; 14. పక్షి; 15. చూలునలన శ్రమించినది; 16. పరాక్రమము మెఱయించి; 17. ఆఁడుపక్షి; 18. భర్తతో; 19. అమావాస్య, పూర్ణిమ దినములు; 20. మిక్కిలి యెత్తుగా నెగురు అలలు; 21. ఆకాశమును; 22. ఇల్లు; 23. సమీపము; 24. నే నిడిన.

కాండాక్రాంతంబు లగు[1]. వేళంబ[2]పోలిన యిరవు[3] పరికించుకొని చనవలయు. మసలం జనదు. ప్రసూతి[4] సమయంబు డాసిన దేశాంతరగమనంబు సుకరంబు గాదు.' నావుడు నా విహంగంబు[5] తనయంగన పలుకు లాలంబుసేసి[6] మందహాససుందరవదనంబుతోఁ గువలయనివహంబు[7] నకుఁ దుహిన కిరణుండును[8], పుండరీకషండంబునకుఁ[9] జండభానుండును[10], జాతకవ్రాతంబునకుం[11]జీమూతంబు[12] నెట్లట్లు శకుంతసంతానంబునకు[13] నాగాంతకుండు[14] ప్రభుండు. అతండు నిజపక్షవిక్షేపజాతవాతోద్ధూత కాండచండబలుండు[15]. తదాశ్రయుల మనల నీ జడాశయుండు[16] చెనకి[17] మయిమయిం[18]బోవనోపునే? ఏల యీలీల[19] నాతరం[20] బెఱుంగక కొఱమాలిన[21] విచారంబులఁ జిత్తంబు హత్తించెదు[22]. సమాహిత చిత్తంబున[23] నుండుము.' నావుడుం డిట్టి[24] యిట్లనియె : 'ఎట్టివాఁడయిన భావ్య నర్థంబునకుం[25] బ్రాహాణకం[26] బగు సాధనంబు పరికించి కృతనిశ్చ యుండయి యుండవలయుఁగాని బలదర్పంబునం బ్రమత్తుండయి కన్నుగానకుండుట నయవిజ్ఞానసంపన్నులు[27] కరంబు గర్హింతురు[28] నా నస్మాదృశ దుర్బలులం[29] జెప్పనేల ? హితవచనంబులు వినని బాలిశుండు[30] కోలవిడిచి పడిన తామేలుం[31]బోలెం గాలధర్మంబు నొందు. ఆ కథ సాకల్యంబుమీఱ వాక్రుచ్చెద వినుండు.

---

1. జలములచే నాక్రమింపఁబడినవి; 2. శీఘ్రమే; 3. స్థానము; 4. పురుడు; 5. పక్షి; 6. ఉపేక్షించి; 7. కలువల సమూహము; 8. మంచు కిరణములు గలవాఁడు - చంద్రుఁడును; 9. తెల్లదామరల సమూహమునకు; 10. తీక్ష్ణములైన కిరణములు గలవాఁడు - సూర్యుఁడు; 11. వానకోయిలల సమూహమునకు; 12. మేఘము; 13. పక్షుల గుంపునకు; 14. గరుత్మంతుఁడు; 15. నిజ = తనదైన, పక్ష = ఱెక్కలయొక్క, విక్షేప = ఆడించుట వలన, జాత = పుట్టిన, వాత = గాలిచే, ఉద్ధూత = ఎగురఁగొట్టఁ బడిన, కాండ = నీళ్ళు గలవాఁడగుటచే, చండ = తీవ్రమైన, బలుండు = బలము గలవాఁడు; 16. జడాశయుండు = సముద్రుఁడు, మందబుద్ధి - జడ = జల - 'లడయో రభేదః; 17. ఎదిరించి; 18. తేలికగా; 19. విధము; 20. శక్తి; 21. ప్రయోజనములేని; 22. పొందించెదవు; 23. సమాధానపడిన చిత్తము; 24. ఆఁడులకుముకిపిట్ట; 25. భావి+అనర్థము = రాఁగల ఆపద; 26. చెఱుచునది; 27. నీతిజ్ఞాన సంపద గలవారు; 28. నిందింతురు; 29. మావంటి బలహీనులను; 30. మూర్ఖుఁడు; 31. తాఁబేలు.

## హంసలు - తాఁబేలు

భువనసారంబను నొక్క కాసారంబుగలదు. అయ్యది *చక్రచక్రాంగ ప్రముఖ వివిధ జలవిహంగమ సంచార రమ్యంబై[1] *పుండరీకషండ సాంద్ర మరందధారాసార సంభ్రమద్భ్రమరఝుంకార సంకులంబై[2] యెసంగు అందుఁ దడవులంబట్టి కంబుగ్రీవంబను కూర్మంబు వికటసంకటంబులను హంసములతో బద్ధసఖ్యంబయి[3]యుండు. పిదపం గొన్ని వాసరంబులకు[4] వఱపు[5]నంజేసి కాసారంబు వారిపూరం[6] బివురం బాఱుడు[7] నా మరాళంబులు దేశాంతరజిగమిషం[8] బూని యా కచ్ఛపంబు[9] కడకు వచ్చి తమ యిచ్చంగల యర్థంబు వాక్రుచ్చి వియోగదుఃఖంబు[10] మీఱం దీఱమి[11] పరికించి యెలుంగు కుత్తుకం దగుల[12] 'సఖ్యంబు మఱవకు పోయివచ్చెదము.' నా విని కమఠంబు[13] కరం బాననంబు దీనభావంబునఁ గదుర నిట్లనియె : 'పెద్దకాలం బేకోదరులంబోలెం[14] జెలిమి సలిపితిమి. దీని కొక్కదాసంగు[15] పాసంగునని కలనేనిం దలంచి యెఱుంగ. మీ తోడంగూడ వచ్చెదనంటినా పక్షంబుల బలిమి కలిమింజేసి వలయునెలవు[16]లకుం బోవ వలంతు లగు మీకు నాకు నెంత యంతరము. నా కొలంది విచారించుకో ల[17]టుండనిండు. మిమ్ము నొక్కటి వేఁడెదం జిరకాలకృతంబగు చెలికారంబున కనురూపంబుగ నా ప్రార్థితార్థంబు తుదముట్టింపవలయు. వెరవు పరికించి యెట్లయిన మీతోడ నన్నుం గొంపొండు మీ వియోగంబు క్షణంబయిన సయిరింపఁజాల' నావుడు నాయంచ లించుక

---

1. *చక్ర = జక్కవలు, చక్రాంగ = హంసలు, ప్రముఖ = మున్నగు, వివిధ = పెక్కు విధములైన, జల - విహంగమ = నీటి పక్షుల యొక్క, సంచార = తిరుగుటచే, రమ్యంబు + ఐ = అందమైనదయి; 2. *పుండరీక = తెల్ల దామరలయొక్క, షండ = సమూహము యొక్క, సాంద్ర = దట్టమైన, మరంద = మకరందము యొక్క, ధారా = ప్రవాహము యొక్క, ఆసార = జడిచేత, సంభ్రమత్ = తిరుగుచున్న, భ్రమర = తుమ్మెదలయొక్క, ఝుంకార = ఝుమ్మను ధ్వనిచేత, సంకులంబు + ఐ = కలఁగినదయి; 3. కట్టఁబడిన చెలిమిగలది; 4. దినములకు; 5. క్షామము; 6. జలప్రవాహము, 7. ఇగిరిపోఁగానే; 8. అన్యదేశమునకుఁ బోవనిచ్ఛ; 9. తాఁబేలు; 10. ఎడఁబాటు వలన దుఃఖము; 11. అక్కఱ; 12. స్వరము డగ్గుత్తికపడఁగా; 13. తాఁబేలు; 14. ఒక కడుపునఁ బుట్టినవారు; 15. ఆపద; 16. చోటు; 17. కోలు = కొనుట.

చింతించి 'యిది యెట్లయ్యెడు? ముక్కునం గఱచికొని యుండె టెక్కల నెక్కించుకొని యుండెం గొంపోవలయు. విప్రకృష్టదేశగాములకు[1] మాకు దుస్సాధంబు[2]. సాహసంబు చనదు. ఎటువోయి యెటువచ్చునో యెఱుంగము. వినుము. హృదయంబు వదిలించుకొని కుదురు[3] గదలకయుండుము. భాగ్యంబు గలిగినం బునర్దర్శనంబయ్యెడు' నని యెంత దూరంబు చెప్పినను వినక కడుం గక్కసించిన[4] నా యండజంబులు కొండొక డెందంబుల విచారించి యెట్టకేలకుం దామేటింగాంచి 'యొక్క వెరవు పరికించితిమి. అది కొంత మదికి సరిపడియున్నది. ఒక్క యష్టి[5] సేకరించి దాని యగ్రంబులు చెఱియొక ప్రక్క ముక్కునం గఱచికొని పఱచెదము. దాని నడుము ప్రమాదంబుం[6] బొరయక కఱచికొని రానోపుదె?' యనవుడు వల్లెయని తదానీతంబయిన[7] కాష్ఠంబు[8] నడుము గఱచికొని వ్రేల నా యంచలు చంచువులం[9] దదంచలంబులు[10] పొంకించి[11] యంబరతలంబున సత్వరంబుగఁ బాఱుచుండ నొక్క పట్టణమందలి జనంబులు వీని విలోకించి విస్మయంపడి[12] కావించు సల్లాపంబుల యలబలంబు[13] క్రందుగ[14] వినంబడుడుం గూర్మం 'బీ కలకలం బెక్కడిది?' యని హంసంబుల నడుగ నోరివట్టు వదలి నేలవ్రాలి మాంసలుబ్ధులచే హతంబయ్యె. మతిమంతుఁ డనర్థావహంబగు[15] నభిజనంబు మానికొనవలయు నొండె ననర్థంబు దలంగు[16] నుపాయసంపన్నుండు గావలయు నొండెం గాని దైవపరుండయి యుండంజనదు. దైవపరున కనర్థంబు తప్పదు. ఈ యర్థంబు తేటపడ నొక్క కథ చెప్పెద వినుము.

## దైవపరున కాపద

ఒక్క జలాశయంబునం దనాగతవిధాతయుఁ బ్రత్యుత్పన్నమతియు యద్భవిష్యంబు నని మూఁడు మత్స్యంబులు వసించుచుండు. ఒక్కనాఁ డనాగతవిధాత ప్రత్యుత్పన్నమతియద్భవిష్యంబులం గాంచి 'యీయేఁ

1. దూరదేశములకుఁబోవువారు; 2. సాధింపరానిది; 3. స్థానము; 4. బాధించు; 5. కఱ్ఱ; 6. పరాకు; 7. వానిచేఁ దీసికొని రాఁబడినది; 8. కఱ్ఱ; 9. పక్షి ముక్కు; 10. దాని కొనలు; 11. పొందుపఱిచి; 12. ఆశ్చర్యపడి; 13. సందడి; 14. అధికముగా; 15. హానిని గలిగించునది; 16. తొలఁగించు.

డింతవఱకు వాన లేబరంబయ్యె[1]. మీఁదనయినను గురియునను నాసలేదు. నిమిత్తంబులు[2] ప్రతికూలంబులయి[3] కానంబడియెడు. ఈ కొలని జలంబులు తుదముట్ట నడుగుఁబట్టకమున్న మెలంకువ పడవలయు. మసలిన మోస వాటిల్లు. ఇటకుం గొంతదూరంబున ధ్రువోదంబను హ్రదం[4] బన్వర్థాభిధానంబు గలదు. ఇచ్చటికి వరవ యచ్చటినుండి వచ్చుచున్నయది. అదియు వెనుమూయం దోయంబు లేక యుండెడు. నడికిరేయిట నల్లల్ల నా వరవంబడి[5] యా మడువుంజేరి యీ బారిం దలంగుదము. ఇంతకుం గొంతముందు కొందఱు మైనికులు[6] వచ్చి యిచ్చటి జలంబుకొలంది పరికించి పది దినంబులకు నివురంబాఱెడు నప్పటికి వత్తమని యెుండొరులతో నాడికొనుచుంబోయిరి. అది మొదలుగ నా యల్లంబు పెల్లుగ నుడికిల్లెడు?' నా విని ప్రత్యుత్పన్నమతి 'దీనికింతయేల? అంత వచ్చినప్పుడు చూచికొంద' మనియె. యద్భవిష్యుండు మిన్నకుండె. అంతట ననాగతవిధాత[7] యా రాత్రి జలాశయంబు నిర్గమించి యొయ్యొయ్యం బోయి ధ్రువోదంబుం బ్రవేశించె. ఇట నానాఁట నెండల మెండున సలిలం బల్పావశేషంబుగ[8] శోషిల్లుడు[9] రేవుబోయలు వల, యెత్తెల[10], కొడమ[11], గట్టె[12], మావు[13]లోనగు సాధనంబులు గొనివచ్చి పెచ్చువేఁడుకం జొచ్చి మీలం బట్టిపట్టి గట్టునకుం జేర్చుచుండ నందు యద్భవిష్యంబు[14] మిట్టిమిట్టిపడం బడియంగొట్టి కెడయించిరి[15]. ప్రత్యుత్పన్నమతి[16] మృతకల్పంబుగ[17] జలంబులం దేలగిలంబడియుండం గని నీరంబు చేరువం దీరంబునకుం బాఱంజిమ్మి మీనసంతానంబు

---

1. వానలు శూన్యమయ్యె; 2. శకునములు; 3. వ్యతిరేకములై; 4. మడుఁగు; 5. నీళ్ళువచ్చెడి కాలువ గుండ; 6. చేఁపలఁబట్టువారు; 7. రాఁగల కార్యమును చేయువాఁడు; 8. కొలఁదిగా మిగులునట్లు; 9. ఇంకిపోఁగానే; 10. అడ్డువల; 11. ముఖభాగమునఁ గట్టు లేక నడుమ వలవలె నల్లిక గల యూఁతవంటి సాధనము; 12. తాటియీనెలతో నల్లిన పెద్దబుట్టవంటి సాధనము; 13. క్రింది సన్నముగాను, మీఁదు విరివిగాను జువ్వలతో నేర్పఱుపఁబడిన సాధనము; 14. కర్మానుసారముగా జరుగునది; 15. చంపిరి; 16. అప్పుడు పుట్టిన బుద్ధి గలవాఁడు; 17. కొంచెము తక్కువగాఁ జచ్చినదానితో సమానము.

నిరవశేషంబుగం[1] బట్టుకొని గట్టుచేరుడు నా మత్స్యం బల్లల్ల జరిగి వారింబడి బారిఁ దప్పించుకొని చనియె.

అని చెప్పిన విని టిట్టిభంబు 'నీ విందులకయి కొందలం[2]పడకుము. బూటకపు మాటలమూట యని నన్నుఁ దలంపకుము. కార్యంబుతఱి నానెఱమగంటిమి మెఱయించి నీ మెచ్చు వడయువాఁడ. మిన్నకుండు' మనవుడు నా విహంగాంగన తన భర్తకు మాఱువలుక వెఱచి యూరకుండె. అంతం గొన్నిదినంబులకు నా విహంగి[3] ప్రసవించుడు సముద్రుండు టిట్టిభంబు పంతంబు పరికింతమని కల్లోలమాలాభీలంబుగం[4] బొంగి తదీయాండంబు లపహరించె, అనంతరంబు 'పులుఁగువెలంది[5] తన పెనిమిటిం[6] గనుంగొని 'తొల్లి నా వచనంబులు వినరయితిరి. ఇంక నేమి చేయవచ్చు' నని చొటచొటం గన్నీరు దొరఁగ నంగలార్చుడు[7] నా ఖగంబు దాని మిగుల నూఱడించి పులుంగుబలంగంబులం[8] గూర్చి తనకు సముద్రుండు గావించిన పరిభవంబు తెలియం బలికి 'యజాండసహితంబుగ[9] నావరణవారిపూరంబు[10] నిశ్శేషంబుగ గండూషింపం[11] జాలిన చండవిక్రముండు వజ్రతుండుండు[12] మనకు రక్షకుండని యీ జడాత్ముం[13]డెఱుంగఁడు గాఁబోలు? నిప్పు డవశ్యముగ నెఱింగింత మెఱింగింపకున్న గర్వంబు మానండు. ఇది యల్పంబు, దీనికింత యుద్యమం బేలయని యొప్పరికింపరాదు. నేఁడు గోరంతకు వచ్చినది. తేపు కొండంతకు వచ్చు[14] మనమందఱ మవహితచిత్తంబులతో వినతానందసంధాయకుం[15] డగు వినతానందనుం[16] బ్రార్థింత మా దయాళుం డా మహామహుండు మన యనిష్టంబు[17] దలంగి, యిష్టంబు చేయంగలఁ'డని యొడంబఱిచి యా

1. మిగులకుండ; 2. దుఃఖము; 3. ఆఁడుపక్షి; 4. కలఁగిన అలల వరుసచే భయంకరమైనది; 5. ఆఁడుపక్షి; 6. భర్తను; 7. దుఃఖించినంతనే; 8. పక్షుల పరివారములు; 9. బ్రహ్మాండముతోఁ గూడ; 10. బ్రహ్మాండము నావరించియుండు మహాజలము; 11. పుక్కిటఁబట్ట; 12. గరుత్మంతుఁడు; 13. మందబుద్ధి, జలస్వరూపుడు; 14. నేఁడల్పముగా నున్నది తే పధికముగావచ్చును; 15. వంగినవారికి సంతోషమును గూర్చువాఁడు; 16. వినత కొడుకు - గరుత్మంతుఁడు; 17. ఆపద.

ఖగంబులుం, దానును భక్తితాత్పర్యంబు మీఱ నిరంతర ధ్యానం బొనరిం చుండుం బక్షిస్వామి[1] సాక్షాత్కరించి 'హృష్టుండనైతి[2]. మీ యిష్టం బొసంగెద. వేఁడుం'డనవుడు నండజాతంబులు[3] ఖిన్నగులం బ్రీతంబులయి తమకు సముద్రుండు గావించిన యవజ్ఞ[4] విజ్ఞాపించిన[5] నాతండు కుపిత చేతస్కుండయి నదీనేతం[6]గాంచి నిజాదేశంబున[7] నయ్యండంబులు దెప్పించి యప్పక్షుల కిప్పించి 'యిప్పటికి క్షమియించితి నిటమీఁన నస్మజ్జనంబులకు[8] నెగ్గు దలంపకు. నీకది లగ్గుగా'దని నుడివి యంతర్హి తుండయి[9] చనియె.'

### మానహాని కోర్వరాదు

నా విని సంజీవకుం డిట్లనియె : దమనకా! వినుము. కలకాలంబు బ్రదుకంబోము. చావు నిక్కంబు. మన కన్నుల ముందరం బుట్టి గిట్టిన[10]వారి నెందఱం గానము. నిన్న యున్నవాఁడు నేడు లేఁడు. నేఁడు పగతు[11] మొగంబునకుం దొలంగిన తేపు మృత్యువు మొగంబునకుం దొలంగవచ్చునే? దానంజేసి యపయశంబు[12] దప్పం బ్రయోజనంబు గలదె? పగతు కడిమి దడవక[13] కడఁగినవాఁడం గాను. లాఁతివెరవు లావుగామింజేసి ప్రకృతో ద్యమంబుం[14] బూనవలసె. కడమాట యొక్కటి వినుము. ప్రాణహానికయిన నోర్తుంగాని, మానహాని కోర్వంజాల. ఇది నిక్కంబు. నీ వింక నా కడంకకు[15] నడ్డవాట్లు[16] వ్రేయకుము. నే నిదె వచ్చెదఁ గట్టాయితం[17] బయి యుండుమని తేనికింజెప్పుము - వేగిరింపుము. లెమ్ము. పొమ్ము." నావుడు దమనకుండు సరభసగమనంబునం[18] జనువాఁడు తేని యిరవు మోసలం[19] గరటకుం గనుంగొని 'లోనికిం బోవచ్చునె - యసమయంబు గాదుగద?' నావుడుం

---

1. పక్షిరాజు - గరుత్మంతుఁడు; 2. సంతోషించినవాఁడనైతి; 3. పక్షులు; 4. అవమానము; 5. విన్నవింప; 6. నదీనేత = నదుల నాయకుఁడు - సముద్రుఁడు; 7. తనదైన ఆజ్ఞచే; 8. అస్మద్ + జనంబులు = మా వారు; 9. అదృశ్యుఁడు; 10. చచ్చిన; 11. శత్రువు యొక్క; 12. అపకీర్తి; 13. ఎన్నక; 14. ప్రస్తుత ప్రయత్నము; 15. ప్రయత్నము; 16. అడ్డంకులు; 17. కడు + అయితము = సంసిద్ధము; 18. వేగముతోఁ గూడిన నడక; 19. ముఖశాల, ద్వారము, మొగసాల, మోసాల (రూపాం).

'బోవచ్చును. సమయంబ. తేఁడు నీరాక వేచియున్నవాఁడు. పోయినపని యేమయ్యె?' నని కరటకుం డడుగ దమనకుండు మొగంబునం జిఱునగవు మొలతేర[1] విలోకించి 'యేమో యే లయ్యెడుఁ? గార్యంబు పండించుకొని వచ్చితిం బిదపఁ దుదముట్టఁ జెప్పెద. నీవుపోయి సన్నిధానంబున నుండుము. వెంబడి నే వచ్చెద' నని కరటకుం బుత్తెంచి కొంతవడికిం దానుంజని తేనిం గనుంగొని 'రమ్ము. గూర్చుండు. వృత్తాంతంబేమి?' యని యాతం డడుగఁ జేరువకుఁజేరి యోరసిలం గూరుచుండి యల్లన నిట్లనియె.

**పింగళకునికిఁ గ్రోధము గల్గుట**

"నేను బోయిన సమయంబున సంజీవకుఁడు లోని యిరవునఁ గాటక పాటకులతోడ మాటలాడుచుండి ననుం గనుంగొని వారితోడ సల్లాపంబు సాలించి, ప్రత్యుత్థానమ్ము గావించి, యుచితాసనాసీనుం జేసి, కుశలప్రశ్నంబు గావింపఁ దదవసరోచితంబుగం[2] గొన్ని మాటలాడి యేకాంతం బాకాంక్షించు మా జాడ యెఱింగి కాటకపాటకులు లేచి యెడగలుగం బోవుడు నయభయంబులు దోఁప వచనీయం[3] బశేషంబు వచియించితి. ఆతండును దనకుంబోలిన వచనంబులు తెంపరితనంబు[4] దోఁపం బెక్కులు వచియించె. అవి యెల్ల నాకు వాకొన[5], మీకు నూఁకొనఁ[6] బోలవు. ప్రయోజనంబును లేదు. అతని యుద్యమంబు సమస్తంబు ప్రతికూలంబగుట తద్వచనభంగి నెఱింగితిని. చిరకాలంబు సంగాతంబు[7] గావించినవాఁడం గావునఁ గానిచేఁతకు నాతండు చేయు నుద్యమంబునకు మనంబునం దాళంజాలక నాతనికి హితంబుగ నాకుం దోఁచినయంత యొత్తిచెప్పితి. ఎంత చెప్పిన నతండు 'తాను బట్టిన కుందేటికి మూఁడేకా'[8] ళ్ళనుచున్నవాఁడు. 'వినాశకాలే విపరీతబుద్ధి'[9] యను వచనం బేల తప్పు? కాలం బాసన్నంబైన నాతని కిట్టి కుబుద్ధి[10] పుట్టెం గాబోలు, అతండు పర్యవసానంబునం[11] దన యుద్ధోద్యమంబు

---

1. అంకురింపఁగా; 2. ఆ సమయమునకుఁ దగినట్లు; 3. చెప్పఁదగినది; 4. సాహసము; 5. చెప్ప; 6. విన; 7. సాంగత్యము, స్నేహము; 8. తాను జెప్పినదే సత్యమనుట; 9. పోఁగాలమున వ్యత్యస్తమైన బుద్ధి; 10. దుర్బుద్ధి; 11. అంతము.

తెల్లంబుగం బలికి 'యింక నా కడంకకు నడ్డవాట్లు ప్రేయకుము. నే నిదె వచ్చెదం గట్టాయితం బై యుండుమని తేనికిం జెప్పుము. లెమ్ము. పొ'మ్మని దిట్టతనంబుమీఱం బలికె. ఆతం డింతకుం గృతసన్నాహుండై[1] డాయ వచ్చుచుండు కర్తవ్యాంశంబు దేవర చిత్తంబునకె విదితంబు[2]."

## పింగళక సంజీవకుల యుద్ధము

నా విని 'యహహా! సాహసంబు! ప్రళయజ్వలనంబు[3] పయి శలభంబు[4] విలంఘింపం[5] దలంచె. ఔర! కావరం' బని యధిక్షేపించుచుం గ్రోధదుర్నిరీక్షుండయి[6], హర్యక్షవల్లభుండు[7] విపక్షశిక్షాదీక్షం[8] బూని, సముత్థితుం[9] డయి నిర్గమించి[10] ఖురప్రహారంబుల[11] దుమారంబు లాకాశంబు నిరవకాశంబుగం[12] దిరోహించి, ప్రావృషేణ్య ధారాధరవారంబు విడంబింప[13] ధరాతలం బదుర, దురవలోకభీకరాకారంబు[14] మీఱంబాఱుతెంచు[15] నుక్ష్యాధ్యక్షు[16] వీక్షించి ధరాధరంబులు[17] మాఱుచెలంగ క్ష్వేళరావంబు[18] గావించి నటాఝూటంబు[19] నిక్కం గర్ణంబులు ఱిక్కించి[20] పింగళేక్షణంబుల[21] విస్ఫులింగంబు[22] లెగయ నరాళదంష్ట్రాకరాళంబుగ[23] నాస్యగహ్వరంబు[24] దెఱచి జిహ్వా పల్లవం[25] బల్లార్చుచుం గుప్పింపం జొప్పుందప్పించి వృషభేంద్రుండు సముక్షిప్తవాల విక్షేపంబు[26] మీఱం బెల్లుద్రుళ్ళి వెనుకటి కాళ్ళ బయల జాడించుచు భూనభోంతరంబు[27] బూరటిల్ల[28] నుదారారావంబు[29]

---

1. చేయఁబడిన యుద్ధప్రయత్నము గలవాఁడు; 2. తెలిసినది; 3. ప్రళయ సమయము నందలి అగ్ని; 4. మిడుత; 5. దుముక; 6. కోపముచేఁ జూడరానివాఁడు; 7. సింహరాజు; 8. శత్రువులను శిక్షించుట యందుఁ బట్టుదల; 9. లేచినవాఁడు; 10. బయలు వెడలి; 11. గిట్టల దెబ్బలచేత; 12. అవకాశము లేనిది; 13. వర్షాకాలపు మేఘముల సమూహమును అనుకరింపఁగా; 14. చూడశక్యము కాని భయమును గలిగించు రూపము; 15. పరువెత్తి వచ్చు; 16. గోరాజును, సంజీవకుని; 17. కొండలు; 18. ప్రతిధ్వనింపఁగా, క్ష్వేళరావంబు = సింహనాద ధ్వని; 19. కేసరముల సమూహము; 20. నిక్కించి; 21. పచ్చని కన్నులందు; 22. మిడుఁగురులు; 23. వంకరలైన కోఱలచే భయంకరముగా; 24. గుహవంటి నోరు; 25. చిగురువంటి నాలుక; 26. మిక్కిలి యెత్తఁబడిన తోఁకయొక్క ఆడించుట; 27. భూమికి ఆకాశమునకు నడిమి ప్రదేశము; 28. నిండ; 29. గొప్పధ్వని.

గావించుచు మస్తకంబు[1] వాంచి యేటవాలుగం గొమ్ము లొడ్డుకొని మెఱపు మెఱసిన తెఱఁగున నుఱికి యురమ్ము[2] గ్రుమ్మ నమ్మెకమ్ముల యెకిమీఁడు[3] సొమ్మసిల్లి తెప్పునం[4] దెప్పిఱి ముప్పిరిగొను కోపంబు దీపింప నాటోపించి లాఘవంబున లంఘించి వజ్రసఖంబులగు[5] నఖంబు లూడుకొన మూఁపురంబు చఱచినం దొరుఁగు కీలాలజాలంబు[6] నగశృంగ నిస్సరజ్ఝరీపూరంబు[7] ననుకరింప గోవల్లభుండు తొలంగక మలంగి శాతశిఖరంబు[8] లగు ఖురంబులు[9] కరంబుడిగ నురంబు దాఁచిన నత్తాఁపుకంటెం దత్పరాభవంబు గుండియ లవియింప[10] బెండువడి[11] కంఠీరవవల్లభుండు[12] దండతాడిత భుజగంబుభంగి[13] రొఁజుచు నిలువం గరటకుండు దమనకుం జూచి 'యవలోకించితే?'

## దమనకునిఁ గరటకుఁడు దూషించుట

భవదీయ దుర్మంత్రశ్రవణఫలంబు[14] తేఁ డనుభవించెడు. ముంటు నీవు మృగరాజుతోడ సంజీవకునకు మైత్రి పుట్టించితివి. పిమ్మటం జూపోపక[15] యిరువురకు భేదముఁ బుట్టించితివి. మొదల దూరము విచారింపవయితివి. పండితమాని[16] యగు భృత్యుండు తనక కాదు-స్వామికి సహితము హాని పుట్టించును. ఆహాహా! మన యధీశ్వరుం డిప్పుడు మహాపదంబొంది యున్నవాఁడు. ఇప్పు డీ యిడుమకు[17] రాజును దలంగు[18] వెరవు పరికించితిమేని వలంతులము[19]. పొంకంబుగా బింకంబులు నూ ఱడ వచ్చును గాని యొక్క పోరామి[20] వచ్చినప్పుడు కార్యంబు పయిమ్రేసికొని సంబళించుట[21] సుకరంబు

---

1. తల; 2. ఱొమ్ము; 3. ఆ+మెకమ్ముల+ఎకిమీఁడు = ఆ మృగరాజు; 4. శీఘ్రముగా; 5. వజ్రమునకు మిత్రములు - వజ్రసమానములనుట; 6. రక్త సమూహము; 7. కొండకొమ్ము నుండి వెడలి పాఱుచున్న సెలయేటి ప్రవాహము; 8. వాఁడికొనలు గలవి; 9. గిట్టలు; 10. బ్రద్దలు చేయ; 11. బలహీనతఁబొంది; 12. సింహరాజు; 13. కఱ్ఱచేఁ గొట్టఁబడిన పామువలె; 14. నీదయిన దురాలోచనముయొక్క వినుట వలని ఫలము; 15. చూడలేక-అసూయపడి; 16. పండితుఁడు గాకున్నను పండితుఁడ నని తలఁచువాఁడు; 17. ఆపద నుండి; 18. తొలఁగించు; 19. సమర్థులమే; 20. ఆపద; 21. నిర్వహించుట.

గాదు. రాజును గుణవంతునేని దుర్జనసేవితుని[1], హ్రదంబును[2] గమలషండ మండితంబునేని[3] గ్రాహాక్రాంతంబుం బోలెం[4] బ్రజలు డాయ వెఱతురు. స్వార్థపరుండవయి యిట్టియనర్థంబు పుట్టించి రాజు నేకాకిం జేసితివి. భృత్యుల నేరిం జేరనీవు. ఏవారిం జేరనీక యందఱి కార్యంబులు పయిఁ వేసికొని తిరుగువాఁడు తన రాజునకుఁ బగవాఁ డగును. అసాధువులకు[5] హితంబు గావించువాఁడుం బోలె సాధువుల కహితంబు[6] గావించువాఁ డవశ్యంబుం గీడువొందును. భృత్యుండు స్వామికి హితాపాది[7]యయి తత్ప్రసాదంబునం బడసిన సంపద యెన్నఁటికి నశింపదు, అహితంబు గావించి గడియించినది కడువడిం జెడిపోవును. కొంద అర్థశాస్త్రానభిజ్ఞు[8]లయ్యుం బండితమానులయి తామ[9] కృత్యాకృత్యంబులు నిర్ణయింతురు. ఫలవైపరీత్యంబున[10] దైవప్రాతికూల్యంబు[11] నిమిత్తంబుగ వచియింత్రు గాని తమ యజ్ఞానంబు దలంపరు. అట్టి మూర్ఖులకు బుద్ధిఁజెప్పఁ గడంగువాఁడు వానరములకు బుద్ధిఁజెప్పంబోయిన సూచీముఖమువలె[12] హానిఁ జెందును. నీ కా కథ చెప్పెద వినుము.

## కోఁతులు - పక్షి

హిమవంతంబు ప్రాంతంబునం గుసుమఫలసంతానకాంతం[13]బగు కాంతారంబు[14] గలదు. అందలి కపిసందోహం[15] బొక్కనాఁడు శీతంబుచే[16] బాధితంబయి జ్యోతిరింగణసంఘంబుం[17] గనుంగొని, యనలంబను బుద్ధింజేసి డాసి చలిగాఁచికొనుచుండ సూచీముఖంబను పక్షి వీక్షించి, 'యోయి వెఱ్ఱులారా! ఇవి నిప్పుకలుగావు. మిడుంగుఱుంబురువులు. చూడుం డా చాయ నల్ల మహీరుహంబు చేరువున[18] నింగలంబు[19] గానంబడియెడు. అటకుఁ

1. దుష్టులచేఁ గొలువఁబడువానిని; 2. మడుఁగును; 3. పద్మముల సమూహముచే నలంకరింపఁబడినది; 4. మొసళ్ళచే నాక్రమింపఁబడినదానివలె; 5. దుర్జనులకు; 6. కీడు; 7. మేలు కలిగించువాఁడు; 8. అర్థశాస్త్రము నెఱుఁగనివారు; 9. తాము+అ = తామే; 10. ఫలము యొక్క మాఱుపాటు - ఫలింపమి; 11. దైవముయొక్క అననుకూలత; 12. సూది ముక్కుగల పక్షి; 13. పూల, పండ్ల సమూహముచే మనోహరమైనది; 14. అడవి; 15. కోఁతుల సమూహము; 16. చలిచే; 17. మిడుఁగుఱుల సమూహము; 18. దగ్గఱ; 19. అగ్ని.

జని చలి గాఁచికొం డన నందొక్క మర్కటం బా మాటలకు గాటంబగు[1] కోపంబు దీపింప 'నీవా మాకుఁ గర్తవ్యోపదేష్ట'[2] యని నిక్కి నెక్కిరించి గ్రక్కున లంఘించి, దానిం బట్టి నేలం గొట్టి కాలంబు తుదముట్టించె.

బుద్ధిహీనునికి బుద్ధిమంతుఁడు చెప్పిన వచనము హితంబుగాఁ దోఁపదు. లోకంబునందుఁ బ్రియవాదులు[3] పెక్కండ్రు గలరు. హిత మాడువాఁడు[4] దుర్లభుండు. హితవాదికంటె హితశ్రోత[5] కడు దుర్లభుండు. తనకు మేలుగోరి పరులకుఁ గీడు రోయువాఁడు తప్పక చెడిపోవును. తొల్లి నందిగుప్తుండనువాఁడు సుదర్శనగుప్తుండనువాని మోసపుచ్చ దలంచి తన తండ్రిని ధనంబును గోలుపోయెను. ఆ కథ నీకు సాకల్యముతో వాక్రుచ్చెద నాకర్ణింపుము.

## వర్తకులు

జనావతియను పట్టణంబునందు సుదర్శనగుప్తుండును, నందిగుప్తుండును నను బేహారు[6] లిద్దరు తద్దయు సౌహార్దంబు[7] గలిగి వర్తింతురు. వారు ధనంబు సంపాదింపం దలంపుగొని లాఁతివిలాతికిం[8] జని కొంతకాలంబు పాలిబేరంబుం గావించి యభిమతం బొడఁగూడుడు నభిజనంబునకు[9] మరలి యరుదేర నందిగుప్తుండు సుదర్శనగుప్తున కిట్లనియె: 'మనము ధనం బానయించుట[10] ప్రకటింపం జనదు. న్యాయార్జితం బియ్యది యెవ్వరెఱింగినం గొఱంత యేమి యనకుము. నరఘాసముత్కర సమార్జితంబగు మధువుం[11] గరుణఁ దొఱంగి లోకులు చేకొండ్రు[12] గాదె? కావున నగరంబు పఱగడ[13] నెక్కడనే నొక్క యెడ మన రొక్కంబు గుప్తంబు గావించిపోవుదము. వలసినతఱి వచ్చి పుచ్చుకొందు' మనిన నొడంబడి యాతండు నాతండును ధనంబు సర్వం బొకబిందియం బొందుపఱిచి సాభిజ్ఞానంబుగ[14] నొక్క వటమహీరుహంబు[15] చేరువ నాఁతు లెఱుంగకుండం

---

1. అధికము; 2. చేయఁదగినదాని నుపదేశించు వాఁడు; 3. ఇచ్చకము లాడువారు; 4. మేలు చెప్పువాఁడు; 5. మేలు వినువాఁడు; 6. వణిజులు, వ్యాపారులు; 7. స్నేహము; 8. అన్యదేశము; 9. స్వస్థానము; 10. సంపాదించు; 11. తేనెటీఁగల గుంపుచే సంపాదింపఁబడిన తేనె; 12. స్వీకరింతురు; 13. ప్రక్క; 14. గుఱుతుగా; 15. మఱ్ఱిచెట్టు.

బాఁతి తమ యిరవుల కరిగి యెప్పటిచొప్పు దప్పక చెలిమిగలిగి సుఖంబుండిరి. ఇట్లు కొంతకాలంబు గడచిన నొక్కనాఁడు నందిగుప్తుండు గుప్తప్రకారంబునం[1] జని యా బిందియం గ్రొచ్చి[2] పుచ్చికొనివచ్చి డాఁపటికం బొనరించి పిదపం గొంతకాలంబునకు సుదర్శనగుప్తుం గనుంగొని "మనము ధనంబు గొనివత్తము. మనకింక శంకింపం బనిలేదు. పెద్దకాలంబు లోకులం గనుమూసితిమి[3]. ఇప్పుడు మనయొద్ద రొక్కంబు లేదని యల్లంబులం దెల్లరు విశ్వసించి యున్నవారు. పెఱ లెఱింగినం గొఱంతలేదు. రాజన్వంతంబగు[4] విషయంబున[5] వసించుచున్నవారము. చనుదె"మ్మని తోకొని చని గుఱుతు పరికించి యచ్చటం గ్రొచ్చిచూడ ధనంబు గనంబడదయ్యె. అంత నందిగుప్తుండు తనముందట విషణ్ణుండయి[6] నిలుచున్న సుదర్శనగుప్తుంజూచి కరంబున నురం బప్పళించికొని[7] 'యోరీ! మిత్రద్రోహీ! యాహా యెంత పని చేసితివిరా? ఎప్పుడో యొంటి వచ్చి ధనం బపహరించి యేదియు నెఱుంగనివాని తెఱంగున నా కెదుర విషాదం బభినయించి దక్కించుకొనం జూచెదవే? ఇచ్చటం బాఁతిన ధనంబు మనముదప్ప నన్యులెవ్వరయిన నెఱుంగుదురే? అది నీ వెఱుంగకుండం గాళ్ళువచ్చి నడచిపోయెం గాఁబోలు. కానిమ్మురా నిన్నుం బోనిచ్చెదనే! వారి వీరివలె నందిగుప్తుఁ డలంతులం బోవువాఁడని[8] తలంపకుము. నా సొమ్ము నీ చేతం గ్రక్కింపకున్న నే నొక్క మగవాఁడనే' యనుచుం గినుక[9] మెచ్చుగం[10] దెచ్చుకొని గ్రక్కున బయిరవాసంబు[11] పుచ్చి నడుమునం బిగియంజుట్టుకొని సుదర్శనగుప్తునిం గటివస్త్రంబునం[12] గరంబునం జొప్పించి "దివాణంబునకు[13] రమ్ము. నీ వక్కడంగాని చక్కంబడ' వని యాకర్షింప[14] సుదర్శనగుప్తుండు మనంబునం దేవగించి[15] 'యూరక యేల నేల విడిచి సాము చేసెదవు? తాళుము. నా పలుకులు విని యావల నీకుం బోలినయట్లు చేయుము. పట్టువదలు' మన

1. రహస్య విధము; 2. త్రవ్వి; 3. వంచించితిమి; 4. మంచిరాజుగల; 5. దేశమున; 6. విషాదము నొందినవాఁడు; 7. చఱచుకొని; 8. తేలికగాఁబోవు వాఁడని; 9. కోపము; 10. అధికముగ; 11. అంగవస్త్రము, బహిర్వాసస్సు; 12. మొలగుడ్డ; 13. ఆస్థానము; 14. లాఁగ; 15. రోఁతపడి.

నందిగుప్తుండు 'నాలుక మిగుల ర్యానీకుము. నీకుం దాళిక[1] యుండుంగాని, సొమ్ము గోలుపోయిన నాకుం దాళికకు నెంత దూరంబు.

బళీ! యింతచాలక నీ పలుకులు సహితము వినవలయుఁగా! నిన్ను విడిచెదనే' యన సుదర్శనగుప్తుండు 'నీవు రమ్మన్నచోటికి వచ్చెదం బోదము. చేపట్టు విడువు' మని విడిపించుకొని వెంబడింబోవ నాతండు నృపుని పాలికిం బోయి తన వృత్తాంతంబు సమస్తంబు నివేదింప రెండవ యాతండును 'మహాప్రభూ! అట్లు మే మిద్దఱము ధనంబు గుప్తంబు గావించి యిప్పుడు గ్రొచ్చిచూడం గానంబడదయ్యె. నేనింత యెఱుంగుదు. మఱియొక్క పాపం బెఱుంగ' నా విని పార్థివుండు[2] ధర్మాధికృతుల[3] రావించి వాది ప్రతివాదుల నప్పగించి 'వీరల తగవు దీర్పుం'డని నియోగింప వారు వారి వివాదం బవధానంబుతోడ నవధరించి వాదిం జూచి 'ప్రతివాది ధనము ద్రవ్వికొని నందులకు సాక్షులున్నారా?' యని యడిగిరి. 'అయ్యలారా! దొంగ పెఱలెఱుంగ దొంగిలించునా? మేము ధనంబుఁ బాఁతినచోట వటవృక్షం[4] బొక్కండుదక్క నన్యంబులేదు. కటకటా! ఇంక నేనెక్కడనుండి సాక్షిఁదెత్తు'నని యాననంబు దీనంబు గావించుకొని పలికి కొంత చింతించి వెండియు నిట్లనియె: 'ఇదే నా శపథంబు వినుండు. నేను మాతాపితలకు[5] భక్తుండనేని, స్వప్నావస్థయం దయినం బరద్రవ్యంబు హరియింపం దలంపనేని, సత్యశీలుండనేని నవ్వటవృక్షంబ గుణ గణ్యులరగు[6] మీరెల్లరు విన సాక్షిభావం బవలంబించి సత్యంబు పలుకుం గావుత' మని[7] యెలుఁగెత్తి పలుక 'నీతఁ డెట్టి మహాను భావుండొ యట్టి శపథంబు గావింప మఱియొక్కనికి శక్యంబే' యనియు 'శపథ మాత్రంబున నేమయ్యెఁ జెప్పినచొప్పు తుదముట్టఁ జూడక యిదమిత్థమ్మని[8] నిశ్చయింపరాదు. కల్లనిజంబులు దైవం బెఱుంగు' ననియుం 'బరికింప నీతండె ధనం బపహరించి యాతనిపయి నిందమోపి తాను సత్యశీలుఁ డనిపించుకొనవలయునని యింతగొంతు గావించెడుం[9] గాఁబోలు!

1. ఓర్పు; 2. రాజు; 3. న్యాయాధికారులు; 4. మఱ్ఱిచెట్టు; 5. మాత్రపితలు = తల్లిదండ్రులు - మాతాపితలు (రూపాం); 6. గుణవంతులలో లెక్కపెట్టఁదగినవారు; 7. కావుతన్+అని; 8. ఇదమ్ + ఇత్థమ్ + అని = ఇది యిట్లు అని; 9. ఇంత అఱచు.

బంకుటాలికిం[1] గ్రొత్తడిసుద్దులు[2] పెక్కులుగావె?' యనియు నచ్చటం జూపఱు[3] పెక్కు తెఱంగుల నాడికొనుచుండ సభాసదులు కరంబు వెఱంగుపడి యన్యోన్యముఖావలోకనంబు[4] గావించి యట్టి శపథం బశ్రుతచరంబని[5] ముచ్చటించుచు నవ్వణిజులం జూచి 'నేఁడు మిక్కిలి ప్రొద్దువోయె. రేపు వఱువాత[6] రండు. మీ వివాదంబుఁ బరిశీలించెద' మనవుడు వల్లెయని వారలు తమ నిలయంబుల కరిగిరి. అంత నందిగుప్తుఁడు నాఁటిరేయి నిజగృహబహిర్ద్వారంబు[7] కవాటపిహితంబు[8] గావించి గర్భాగారంబుం[9] జేరి తన జనకుని రావించి యతనితోడ భూగుప్తధనాపహరణం[10] బాదిగ స్వకృతంబు[11] సర్వంబు నివేదించి యిట్లనియె: 'అర్థంబు సకలపురుషార్థ సాధనంబు. ధనమునకు దుస్సాధం బొక్కండు లేదు. లోకులు కులవిద్యా రూపగుణ విహీనునేని ధనవంతుని సర్వసంపన్నుండని వచియింతురు. సకలదురితంబులకు దారిద్ర్యంబుంబోలె సకల దురిత క్షపణంబునకు[12] నర్థంబు నిదానంబు[13]. తదార్జనంబున కయి చేయు దురితంబు పాచితంబునం[14] బాచికొనవచ్చుం గాన నెవ్విధంబున నేనిఁ బురుషుండు ధనం బార్జింపవలయునని నీతికోవిదులు వక్కాణింతురు. దానంబట్టి యొక్కమయి రొక్కంబు సమార్జించితి. హస్తగతంబగు విత్తంబు దక్కించుకొను వెరవు గలిగియు వీఱిఁడితనంబునం[15] జాఱవిడువ నేల? ఒక్క సదుపాయంబు చింతించియున్నవాఁడ వినుము. జాగుసేయక వేగకమున్న[16] పోయి యా మఱ్ఱి తొఱ్ఱ నడంగి యదృశ్యుండవయి యుండుము. ఱేఁపు[17] ధర్మాధికృతులు చనుదెంచి యా వృక్షంబు నడుగుతఱి జంపు[18]గావింపక 'యిచ్చట ధనంబు సుదర్శనగుప్తుఁడు హరించె' నని యెత్తి పలుకుము. ఇంతమాత్రంబు నా

---

1. వ్యభిచారిణి; 2. పతివ్రతా సూక్తులు; 3. చూచువారు; 4. ఒకరి మొగమొకరు చూచుకొనుట; 5. మునుపు విననిది; 6. ప్రాతఃకాలమున; 7. బహిస్(ః) + ద్వారము = బయటి వాకిలి; 8. తలుపుచే మూయఁబడినది; 9. లోపలి యిల్లు; 10. భూమిలో దాఁచఁబడిన ధనమును దొంగిలించుట; 11. తనచేఁత; 12. సర్వపాప నాశనము; 13. మూలకారణము; 14. ప్రాయశ్చిత్తము; 15. వెఱ్ఱితనము; 16. తెల్లవారకమునుపే; 17. వేకువ; 18. ఆలసము.

చెప్పినచొప్పు గావించితేని[1] మన పక్షంబు జయించు' నన విని యాతం డిట్లనియె : 'ఉపాయంబు చింతించుచో రాఁగల యపాయంబు సహితము చింతింపవలయు. లేనిచో శాబకంబులం[2] గాచికొనఁబోయి కోలుపోయిన బకంబు చందంబగు. ఆ కథ నీకుఁ జెప్పెద నాకర్ణింపుము.

**ఉపాయము - అపాయము**

ఒక నింబవృక్షంబు[3] మీఁద బకమిథునంబు[4] చేరి వాసంబు చేయుచుండు. అంతం గొంతకాలంబునకు బకాంగన[5] గర్భంబుదాల్చి తన భర్తతోడ నేఁగి యక్కడక్కడం జిదుగులు ముక్కునం గఱచికొని కొనివచ్చి గూఁడు పన్నికొని యండంబు లిడి పొదిగి బోదలం[6] గావించి యేదుచు[7] నొక్కనాఁడు తన పెనిమిటి కిట్లనియె : 'వినరుగా? నేఁడొక విహంగమాంగన[8] చెప్పవింటి. తొల్లి యీ వృక్షంబుమీఁదం బక్షు లనేకంబులు వసించుచుండ వాని పిల్లలనెల్ల నీ క్రింది పుట్టలోని కాలభుజంగంబు[9] భక్షించిపోవ దాని రాయిడిం[10] బడంజాలక యీ పులుంగులెల్ల వలసపోయెనఁట. ఈ వృత్తాంతంబు విన్నయప్పటంగోలె[11] నా మనం బెరియి[12] చున్నయది. ఎఱుంగక యీ తరువుం జేరితిమి. అక్కటా! యీ నెత్తురుఁగందుల నొక్క యిడుమ దొడరిన నే నెట్లు సయిరింతు[13]'నని చొటచొటం గన్నీరు దొరుఁగ నెలుంగు కుత్తుకందగుల మాట రామి నూరకున్న దయితం[14] గనుంగొని బకోటంబు[15] దానుం గొంత చింతించి 'యేల యూరక' యమ్మలించెదు[16]? మన ముమ్మలికం[17]బడి కొండొక కార్యంబు సాధింపంబోయెదమె? ఊఱడుము. శత్రువుం బరిమార్పు[18] వెరవు మనంబునం దొక్కటి పరికించితి వినుము. ముంగిపొద దొరఁకొని యీ పుట్టదనుక నక్కడక్కడ నొక్కొక్క మీనంబును వయిచియుంచెద. అట్లు చేసిన మన యిష్టంబు సిద్ధించు' నని పలికి యా క్షణంబపోయి కొలంకుల మీలం బట్టి యట్లు వయిచియుంచుడు ముంగిస

---

1. కావించితివి + ఏని; 2. పిల్లలను; 3. వేఁపచెట్టు; 4. కొంగల జంట; 5. ఆఁడుకొంగ; 6. పక్షులు లోనగు వాని పిల్లలను; 7. కాపాడుచు; 8. ఆఁడుపక్షి; 9. నల్లత్రాఁచు; 10. ఉపద్రవము; 11. విన్న సమయము మొదలుకొని; 12. మండు; 13. సహింతు; 14. ప్రియురాలు; 15. కొంగ; 16. విచారించెదు; 17. విచారము; 18. చంపు.

పొదరు వెడలి యమ్మీనంబులం దినుచు వచ్చి పుట్టపట్టుం జేరి యా యురగంబుం[1] బరిమార్చి యా భూరుహం[2] బారోహించి[3] బకశాబకంబుల[4] భక్షించి చనియె.

## మోసమునకుం దగిన ఫలము

కావున నొకండు సేయంబోయిన మఱియొక్కం డగు. వ్యవహారం బడుసునం బాఁతిన కంబంబు[5]. తుదకు నేవంకకు నొఱఁగునో యెఱుఁగం బడదు. కావున నిక్కార్యంబు శ్రేయంబుగాదని నాకుం దోఁచెడు' ననిన నందిగుప్తుం డిట్లనియె : 'మొదలం దోఁచిన యుపాయంబుంబట్టి పురుషుండు ప్రవర్తింపవలయుంగాని యుపాయంబున కపాయంబు నపాయంబున కుపాయంబును జింతింపం దొరఁకొనిన నెక్కడికి మందల[6]. సందియంబు నొందకుము. కాదనక నా వచనంబు నడపుము. మనకు సమస్తంబు శస్తంబయ్యెడు[7]' నని బోము[8] గావించి యెట్టకేలకు నీకొన్న[9] పితరుని దొంగరేయిటం[10] గొంపోయి యా మ్రానిలోని కోటరంబున[11] మాటువఱిచి[12] యిరవున కరుగుదెంచి కొఱరేయిం[13] బుచ్చి జేపకడ[14] ధర్మాధికృతుల కడకుం బోవుడుం బ్రతివాదియు నరుదేర వారు వారిద్దఱం దోఁకొని దిదృక్షానుయాయి జన కలకలంబు[15] రోదోంతరంబు[16] నిండం బురంబు వెలువడి శ్రుతచరాభిజ్ఞానంబుంబట్టి[17] యవ్వటవృక్షంబు చేరంబోయి నిలిచి 'యో వృక్షరాజంబ! ఈ వాది ప్రతివాదు లిచ్చట ధనంబు గుప్తంబు గావించి యనంతరం బేమిగావించిరి? ఈవు సాక్షి వగుటంజేసి యెఱింగినది సర్వంబు సత్యంబుగం బలుకు మనుటయు 'నిచ్చట బాఁతినధనం బొక్కనాఁ డర్ధరాత్రంబున నొక్కరుండు సుదర్శనగుప్తుండు వచ్చికొంపోయె'నని యావృక్ష విటప[18] మధ్యంబునుండి శబ్దంబు నీతేరం[19] దత్రత్య[20] జనంబులు

---

1. పాము; 2. చెట్టు; 3. ఎక్కి; 4. కొంగ పిల్లలను; 5. స్తంభము; 6. మేర; 7. మేలయ్యెడు; 8. బలవంతము; 9. అంగీకరించిన; 10. అర్ధరాత్రమున; 11. తొఱ్ఱలో; 12. దాఁచి; 13. మిగులు రాత్రి; 14. వేకువ; 15. చూడఁగోరి కూడవచ్చు జనుల కోలాహలము; 16. రోదస్(:) + అంతరము = భూమ్యాకాశ మధ్యభాగము; 17. ముందు విన్నగుర్తు; 18. కొమ్మ; 19. రాఁగా; 20. అచ్చటి.

చిత్రంపడి,[1] చిత్రప్రతిమల[2] రూపంబునం జూపట్ట సుదర్శనగుప్తుండు కొండొక[3] మనంబున విచారించి ధర్మాధికారులం గాంచి 'యార్యులారా? ఇది నిక్కంబని తలంపకుండు. వృక్షంబన నెక్కడ? సాక్ష్యంబు పలికెనన నెక్కడ? "వృష్ఠతాడనా ద్దన్తభఙ్గ"[4] యన్నట్లున్నది. మొదల యిచ్చితిరే నిప్పుడ యీ వృక్షంబు సాక్షిభావంబు మీకెల్లం దెల్లంబు గావించెద'నని వేడికొని తదనుజ్ఞాతుండయి యావృక్షం బారోహించి దాని కొమ్మలయుఁ బడుగొమ్మలయు నంతరంబులెల్ల[5] నారసి స్కంధశాఖ[6] నొక్కంట[7] మహాగుహయుంబోలె విశాలాంతరాళంబగు[8] తమోమయంబగు[9] కోటరంబుంగాంచి, లోనంజన వెఱచి యెండుగాదంబు[10] సందేఁడు[11] దెప్పించి యందుఁ జొప్పించి యింగలంబిడి దరికొలుపుడు[12] మహాభీలంబగు జ్వాలాజాలంబుచేఁ బొదువంబడి[13] మేను గమర[14] నంతర్వర్తియగు[15] ముదివగ్గు[16] బెగ్గిలి[17] బెగ్గలంపుఁదాపంబున[18]కోపక మొరయిడుచు వెలినేలంబడి 'నీ వెవ్వండవు? నీ వృత్తాంతం బేమి?' యని ధర్మాధికృతులచేత ననుయుక్తుండయి[19] 'యేను నందిగుప్తుని పితరుండ. వాఁడు నా మాట పెడచెవింబెట్టి నాకిట్టి యాపదం బుట్టించె'నని చెప్పి కరం బారటంపడుచుం బ్రాణంబులు దొఱంగె. అంత ధర్మాధికృతులు సుదర్శను నకుఁ బాఁతిన ధనంబెల్లం దెప్పించి యిప్పించి నందిగుప్తుం గొఱుత వ్రేయించిరి[20]'

అని చెప్పి కరటకుండు వెండియు నిట్లనియె : 'మొదల దూరంబు విచారింపక నీ పలుకు లీకొంటి నిది యకార్యంబని ముందు దోఁపదయ్యె. సంజీవకుం డెన్నఁడే నొక్క యపకారంబు మనకుఁ గావించినవాఁడె? నిర్దోషుం డాతని కెడరు[21] పుట్టించితివి. పాపిష్ఠుండ నేనును సహాయుండ నయితిని,

---

1. చిత్రము + పడి = ఆశ్చర్యపడి; 2. చిత్తరువు బొమ్మల; 3. ఇంచుక; 4. పిఱ్ఱలను గొట్టుట వలన పండ్లురాలిక; 5. నడిమిచోటు లెల్ల; 6. బోదెకొమ్మ; 7. ఒకదానియందు; 8. పెద్దనడిమిచోటు గలది; 9. తమస్(ః) + మయము = అంధకారముతో నిండినది; 10. ఎండుగట్టి, ఆకులు; 11. సందిలి + ఎఁడు = సందిటి కొలఁది; 12. రగులుకొల్పఁగనే; 13. ఆక్రమింపఁబడి; 14. కాలఁగా; 15. లోపలనున్నవాఁడు; 16. ముసలి బక్క; 17. దుఃఖించి; 18. అధికమైన వేఁడిమి; 19. ప్రశ్నింపఁబడినవాఁడు; 20. శూలములతోఁజంపు; 21. ఆపద.

ఇది మనకు శ్రేయంబుగాదు. పరుల వంచింపఁబోయినవాఁడు తాన వంచితుండగు. ఇందులకు నిదర్శనంబుగ నొక్క కథ వక్కాణించెద వినుము.

## మోసగించువాఁడు తానే మోసపోవును

అజస్తుదంబను పట్టణంబునం దింద్రపాలితుండను వణిజుండు గలఁడు. అతనికి ధనగుప్తుం డనుమిత్రుండు గలండు. ఇంద్రపాలితుండు తన యింటనున్న యఱువది బారువలు లోహంబు కూలివాంద్రచే నెత్తించుకొని తన మిత్రునికడకుంబోయి 'యో యన్న! యున్నట్టుండి[1] దేశాంతరము పోవలసినపని వచ్చినది. మాన నయితి[2]గాదు. ఱేపు పయనము. ఈ లోహము నీ యొద్ద నుంచుకొనుము. నిరు డీ సరకు నీతోఁగూడి కొన్నది. వెల యెఱుఁగుదువు కదా? వరహాకు[3] లాభము దుగులము[4] వచ్చినంజాలు. కొను మొదలున[5] కప్పటి కయిన వడ్డితో నేఁజెప్పిన లాభము వచ్చెనా విక్రయింపుము. పరులవలన నీవు పుచ్చుకొను వాడుక చొప్పున నడితో[6] పుచ్చుకొనుము. నేఁజెప్పిన చొప్పున వెల రానిపక్షమునకు సరకు కదలింపఁ బోకు. లోహము చెడిపోవునది గాదు. నేఁడు దప్పిన ఱేపు నిలుకడమీఁద మంచివెలకు విక్రయించుకోవచ్చు. పయనము దాపు[7] గనుక మిక్కిలి పని యున్నది. క్షణమయిన నిలువం దీఱదు. సరకొప్పగించుకొనుము.' నావుడు నవ్వర్తకుం డిట్లనియె : 'నేను నీ కన్యుఁడనా? నా కింత చెప్పవలయునా ? నీ విచ్చునట్టి యడితికా పని చూడవలె' గురువు సాక్షిగాఁ జెప్పెద వినుము నీ సొమ్ము నా సొమ్ముగాఁ జూతును గాని వేఱుగాఁ జూడను. నమ్ము'మని యినుము నొప్పగించుకొనియె. అంత నింద్రపాలితుం 'డన్నా! నా వలన నీకు మిక్కిలి శ్రమంబయ్యె. పోయివత్తునా, సెలవిచ్చెదవే?' యని పలికి 'పోయి శీఘ్రము సురక్షితముగా వచ్చిచేరు' మని యాతనిచే నాజ్ఞాతుండయి[8] వీడ్కొనిచని మఱునాఁడు వేఁబోక[9] లేచి దేశాంతరముపోయి తన కార్యంబు నెఱవేర్చుకొని కొంతకాలంబునకు మరలి యరుదెంచి యవ్వర్తకునిఁ గానంజని

1. ఆకస్మికముగా; 2. వలను; 3. నాలుగు రూప్యములు; 4. వీసము = పదియాఱవ భాగము; 5. కొన్నవెల; 6. అడితి, అడతి - తఱుగు; 7. దగ్గఱ; 8. పంపఁబడిన వాఁడు; 9.వేకువ.

తత్కాలోచితంబుగ నాతం డభ్యుత్థానం[1] బొనరించి, కుశలప్రశ్నంబు గావించి, ప్రయాణవృత్తాంతం బడుగం దదనురూపసల్లాపంబు కొంత దడవు తాను నాతని వాణిజ్యమందలి యోగక్షేమంబులు విచారించి 'యిప్పు లోహము కొంత వెల హెచ్చియున్నదని విన్నాఁడను. మన లోహ మేమయ్యె?' నన వాఁడు మొగంబున విన్నఁదనంబు[2] దెచ్చుకొని యిట్లనియె : 'మునుపు నీతోఁ గొన్న లోహంబు నిలువ కొంచెముండఁగా దానితో నీ లోహము గదిలోఁబెట్టి తలుపుమూసి తాళముఁబెట్టి పదిలము చేసితిని. నిన్న కొందఱు వర్తకులువచ్చి లోహము కావలెనని యడిగిరి. ఆ మీఁదట గదితలుపుదీసి చూతుఁగా లోపల లోహ మనుపేరు లేదు. నా సొమ్ము పోయినదానికి నాకంత వెనుఁబాటులేదు[3]. మిత్రుఁడు విశ్వసించి యిల్లడవెట్టిన[4] సర కాతఁడు రాఁగానే 'నాయనా! యిదిగో నీ సొ'మ్మనక పోయినదని చెప్పవలసివచ్చెఁగాయని యేది తోఁపక రాపడి[5] నిలిచితిని. నా యందు విశ్వాసము చేత నీవు నష్ట మొప్పు కొంటివిపో లోకులు మెత్తురా? నాడెము[6]దక్కునా?' యని చింతాకులితుండుం[7] బోలెం గొంతసే పూరకుండి నిట్టూర్పు నిగిడించి యిట్లనియె : 'గదితలుపు మూసి పెట్టినతాళము పెట్టినట్టుండఁగానే లోని సరకు మాయమయి పోకకు నిమిత్తమేమని నిపుణముగా నాలోచించి చూచితిని. మా యింట నెలుకల రాయిడి మెండు. ఏ సరకుగాని బ్రదుకనీవు. అవి మన లోహమును వాతఁ బెట్టుకొని[8] పోయెనని నిశ్చయించితిని' నా విని యింద్రపాలితుండు వాని మోసము తెలిసికొని యిట్లు చింతించెను.

'వీఁడు నా సొమ్ము దక్కించుకోవలెనని యీవఱ కిన్నిమాటలు పన్నినాఁడు. మాఱుమోసముచేసి వీనివలన సొమ్ము రాఁబట్టికోవలెఁ గాని లాఁతి యుపాయముచేత రాఁబట్టరాదు.' అని తలంచి భావవికారంబేమియు మోమునఁ దోఁపనీక యడఁచికొని యిట్లనియె : 'అన్నా! దీనికింత దూరము నీవు చెప్పవలయునా? నేను గ్రొత్తవాఁడనా? నీ స్వభావ మెఱుంగనా?

---

1. లేచియెదురేఁగుట; 2. దీనభావము; 3. దుఃఖము; 4. ఇల్లడ = న్యాసము - మరలఁ బుచ్చుకొందునని యొకరి యొద్ద దాఁచినది; 5. నిశ్చేష్టత నంది; 6. నాణెము - యోగ్యత; 7. విచారముచేఁ గలఁగిన వాఁడు; 8. తిని.

దైవమువలన వచ్చిన సేగికి[1] మనమేమి చేయుదము? దీనికి నీవు చింతపడకు పోయివచ్చెదను' అని చెప్పి సెలవు పుచ్చుకొని తన యింటికిఁబోయి యా మఱునాఁడు మొదలుకొని యెప్పటివలె మిత్రభావ మెక్కించుకొని[2] యా వర్తకునింటికి రాకపోకలు చేయుచుండెను. ఒకనాఁ డింద్రపాలితుండు ధనగుప్తునితో ముచ్చట లాడుచుండఁగా వీథియందు 'గొలుగుఁబండ్లో గొలుగుఁబండ్ల'ని పండ్లమ్ముశబ్దము వినఁబడెను. అది విని ధనగుప్తుని బిడ్డఁడు గజ్జెలు గల్లుగల్లన నజ్జలు[3] ద్రొక్కుచుఁ గుసిలించుచు[4] నేడ్చుచుఁ దండ్రిని బట్టుకొని పండ్లు గొనియిమ్మని లాగుచు బొచ్చువెట్టెను[5] అంతట నింద్రపాలితుం డా బిడ్డనిఁ జంక నెత్తుకొని 'నా తండ్రిగా, నా బంగారుగా యేడువ కేడువకు. పండ్లుకొని యిచ్చెద ర'మ్మని పండ్లగంప దూరము పోవుటఁబట్టి వెంబడించు నెపమునఁ గొనిపోయి యొక్క యేకాంత స్థానంబున దాఁచి యాననంబున దీనభావంబు దెచ్చుకొని మరలి యరుదెంచుడు ధనగుప్తుండు గనుంగొని 'బిడ్డఁ డేఁడీ?' నావుడు నాతం డిట్లనియె : 'చంకబిడ్డని నేలదించి పండ్లు బేరమాడుచుండితిని. ఇంతలో నెక్కడనుండియో యొక పాడుగద్ద వచ్చి బిడ్డనిఁ దన్నికొనిపోయెను.' అనఁగానే ధనగుప్తుఁడు చేత బొమ్మప్పళించు కొనుచు నిట్లనియె : "ఓరి పాపీ! ఎంత పాతకమున కొడిగట్టితివిరా? సొమ్మున కాశపడి యింత తెగువకుం[6] బాలువడుదువా? ఆ నిసువు[7] మొగముఁ జూచి మెడవిఱువ నీకు మనసు వచ్చెనా? నీ చేతులాడెనా? ఓరి ద్రోహీ! ఓరీ చండాలుఁడా! బిడ్డని గద్ద తన్నుకొనిపోవునా? ఈ మాట యెవరయిన నమ్ముదురా?' యని శోకక్రోధపరీతమానసుండయి[8] కన్నుల నీరుదేఱం బటబటఁ బండ్లు కొఱుకుచు వెండియు నిట్లనియె : 'కానీరా, సొమ్ము దక్కినదనుకోకు మిదిగోఁ గ్రక్కించెదఁ జూడు' మని లేచి సత్వరముగాఁ బోయి ధర్మాధికృతుల కీ వృత్తాంతము వినిపించెను. అంత వా రాశ్చర్యపడి యింద్రపాలితుని రావించి యాతనివలన నా వృత్తాంతంబు విని యిట్లనిరి : ' ఓయి! యిప్పటి నీ చెప్పినయర్థం

---

1. ఆపదకు; 2. తెచ్చిపెట్టుకొని; 3. అజ్జ = అడుగు; 4. బిడ్డలు చనవుచేఁ దొందరపెట్టు; 5. బాధపెట్టెను; 6. సాహసము; 7. నిసువు = నిసుఁగు = బిడ్డ; 8. దుఃఖ కోపములచే నాక్రమింపఁబడిన మనస్సు గలవాఁడయి.

బశ్రుతదృష్టచరంబు[1] మా కాశ్చర్యంబు వొడమించెడు' నా విని యింద్రపాలితుం డిట్లనియె : 'అఱువది బారువుల లోహ మీతనియింట దాఁపఁబెట్టి పోయితిని. ఆ లోహ మెలికలు దినిపోయెనఁట! పసిబిడ్డని గద్ద తన్నికొనిపోవు టాశ్చర్యమా?' నా విని యధికారులు జరిగిన యర్థం బెఱింగి లోహంబును బాలకునిం దెప్పించి వారి కొప్పించి[2] ధనగుప్తు నకుఁ జోరదండంబు[3] గావించిరి.

అని చెప్పి కరటకుండు మఱియు నానాప్రకారంబుల దమనకు నుపాలంభించు[4] చుండె.

## సంజీవకుని వధ

తదవసరంబున మెగంబులరాయండు పొడవొందిన కాంతాళం బనం[5] గడునడరి[6] మెడ జుంజుఱులు నిక్క బెడిదంపు టుఱుము[7] నుఱని[8] నెఱబొబ్బయిడి చంగున నెగిరి 'కోల గగ్గరకుంబోలె[9] నేలం గూలంద్రోచి ముంగాళ్ళ నొత్తిపట్టి కుత్తుకం గఱచి నెత్తురు గుటగుటం ద్రావి యా బసవని[10] నుసుఱునకుంబాచి[11] ప్రశాంతక్రోధుండయి[12] మరలి యిరవున కరిగి యనుతాపపరీతమానసుం[13] డగుచు డాయవచ్చిన కరటకదమనకులం జూచి యిట్లనియె :

"కటకటా! ఎంత దారుణ కర్మంబు గావించితిని. భరణ రక్షణంబులం[14] బ్రకృతిరంజనంబు[15] గావించువానికిం జెల్లుంగాని నాకు రాజనామంబు[16] గాల్పనే? దూరము విచారింపక సంజీవకునిఁ జంపుకొంటిని. విషవృక్ష మేని సంవర్ధించి[17] తాన ఛేదింపఁ[18]జనదు. ఎఱిఁగియే నెఱుఁగకే నేరమి యొక్కండు వొనరించిన భృత్యుని నయంబు భయంబుఁజూపి వాని

1. మున్ను విననిది చూడనిది; 2. ఇప్పించి; 3. దొంగకు వేయు శిక్ష; 4. నిందించు; 5. రూపుగాంచిన కోపమున; 6. విజృంభించి; 7. బెడిదము + ఉఱుము = భయంకరమైన ఉఱుము; 8. లెక్కపెట్టని; 9. లాడముగొట్టుటకుఁ బసువులను బడవేయుట; 10. వృషభమును; 11. చంపి; 12. ఉపశమిల్లిన కోపము గలవాఁడు; 13. పశ్చాత్తాపముచేఁ జుట్టు కొనఁబడిన మనస్సు గలవాఁడు; 14. పోషించుటయుఁ గాపాడుటయు ననువానిచేత; 15. ప్రజాసంతోషము; 16. రంజించువాఁడను పేరు; 17. మిక్కిలి పెంచి; 18. నఱుకు "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్" అను కాళిదాస కుమార సంభవము నందలి శ్లోక భాగమునకుఁ దెలుఁగు.

వేఁడుకోలునం దెలవంబడిన ట్ల[1]భినయించి తొలుత మిన్నక విడువవలయు. ఆవలమరి కావించినవాని నిజాధికారంబువలనం దలంగవలయు. ఇంతకు మెచ్చు తీండ్రంబు[2]గానుపింపం బోలదు. కానుపించినం దక్కుంగల లెంకకూటువు[3] కాయువుం[4] దొఱంగు. దాన జేనికి దొసంగు పొసంగు. ఇందు సందియంబు లేదు. ఎట్టి కడిందికర్జంబయిన[5] సాధింపవచ్చుఁగాని తగిన భృత్యుని గడియించుట సుకరంబుగాదు. అది యట్లుండనిమ్ము. లోకంబునందుఁ గల కాలంబు దుర్వారంబయిన దుర్యశంబు[6] దెచ్చుకొంటి నింక నేమిచేయుదు' నని మిన్నక క్రిందు చూచుచుండె.

అంత దమనకుం డిట్లనియె : 'స్వామీ! దాయం[7] బరిమార్చి యివ్వడువున నుమ్మలంపడం బోలదు. తేఁడు తను సెరగుపఱుపం[8] గడంగువాని నేనినేని[9] నొప్పరికింపక దోరింపవలయునని పాడి[10]నెఱి నెఱిఁగిన గఱువలు[11] వలుకుదురు. నేరమిం బొనరించినవారియం దోరిమి తాపసులకుం గాని భూపాలురకుంజనదు. రాజ్యలోభంబువలనంగాని స్వామిపదంబుం గోరువానికి వధంబు దక్క దండంబులేదు. ఈ యర్థంబు సర్వసమ్మతంబు' నా విని పింగళకుండు సంతుష్టుఁడయి భద్రాసనంబు నధిష్ఠించె. దమనకుండు ప్రహృష్టుండయి 'మహాస్వామీ! దేవరకు లోకంబులకు స్వస్తి[12]యగుంగావుత' మని వచియించి తానును సకలపరిజనంబులును సుఖంబుండె.'

అని విష్ణుశర్మ సుహృద్భేదంబు[13] సాంతంబుగ వచియించి "యిట్టి భేదంబు మీరు మీ శత్రువులందుం బ్రయోగించి విజయంబుఁ బొందుం" డన రాజపుత్త్రులు కరంబు హర్షంబు[14] నొందిరి.

పరవస్తు చిన్నయసూరి విరచితంబగు
నీతిచంద్రిక యందు మిత్రభేదము సంపూర్ణము.



1. తేర్పఁబడిన విధము; 2. వేఁడిమి; 3. సేవకుల సమూహము; 4. కాయువు = కాయ్మ్వు = అనురాగము; 5. కష్టకార్యము; 6. అపకీర్తి; 7. శత్రువు; 8. బాధించు; 9. ఏనిన్+ఏనిన్ = ఎవ్వని నైనను; 10. ధర్మము; 11. పెద్దలు; 12. శుభము; 13. సుహృద్భేదము = మిత్రభేదము; 14. హర్షంబు = సంతోషము.

శ్రీ

పరబ్రహ్మణే నమః

# విగ్రహము

క. శ్రీ కళ్యాణ గుణుఁ డఖిల
లోకారాధ్యుఁడు సాధులోకావన దీ
క్షాకలితుఁడు నిత్యుఁడు జగ
దేకగురుఁడు దేవదేవుఁ డిచ్చుత శుభముల్. 1

శ్రీ కళ్యాణ గుణుఁడు = శోభావంతములు, మంగళకరములు నైన గుణములు గలవాఁడు, అఖిల లోక + ఆరాధ్యుఁడు = ఎల్లలోకములచేతఁ బూజింపఁదగినవాఁడు, సాధు - లోక + అవన - దీక్షా - కలితుఁడు = మంచివారి సమూహములయొక్క రక్షణమునందలి పట్టుదలతోఁ గూడినవాఁడు, నిత్యుఁడు = శాశ్వతుఁడు, జగత్ + ఏక - గురుఁడు = లోకములకుఁ బ్రధానుఁడైన గురుఁడు.

గీ. మొదల వాగనుశాసను మదిఁ దలంచి
సోమయాజిని భాస్కరు సోము నెంచి
భీముఁ గొనియాడి శ్రీనాథు వినుతిచేసి
తక్కుఁగలయట్టివిబుధులఁ దవిలి కొలుతు 2

వాగనుశాసనున్ = నన్నయను, సోమయాజిన్ = తిక్కనను, భాస్కరున్ = రామాయణకర్తయైన భాస్కరుని, సోమునిన్ = ఉత్తరహరివంశ కర్తయగు నాచన సోముని, ఎంచి = తలఁచి, భీమున్ = వేములవాడ భీముని, వినుతి = ప్రశంస, విబుధులన్ = పండితులను, తవిలి = వదలక,

ఉ. చిన్నయసూరి ధీరు లెదఁ జీరిచి సారెకు గారవింపఁగా
మున్ను రచించి మించె సగము న్వచనంబుగ నీతిచంద్రికన్;
సన్నుతికెక్క దాని కిదె సాటి యటంచు బుధు ల్మనంబులం
దెన్నఁగ నిప్పు డేను రచియించెదఁ దక్కినయుత్తరార్ధమున్. 3

చిన్నయసూరి = బాలవ్యాకరణకర్త, నీతిచంద్రికలయందలి మిత్రలాభ మిత్రభేదములను

రచించినవాఁడు, ధీరులు = పండితులు, ఎదన్ = హృదయమునందు, సొరెకున్ = మించెన్ = అతిశయించెను, సగమున్ = నీతిచంద్రికలో సగభాగమును - మిత్రలాభ మిత్రభేదములను, సన్నుతికిన్ + ఎక్కన్ = పండితుల పొగడ్తకు వచ్చునట్లుగా, ఉత్తర + అర్ధమున్ = రెండవ సగమును, - విగ్రహము, సంధి అనువానిని,

ఉ. పేరిచి సావకాశముగ విగ్రహ మీయది వ్రాయఁబూని నే
నారసి పెక్కు లాంధ్రకృతు లంతటఁబోక హితోపదేశమున్
భారత పంచతంత్రములు బల్మఱునుం బరికించి వానిలోఁ
గోరిక యా కథల్గొనియుఁ గూర్చితిఁ గొన్నిటి నూతనంబుగన్. 4

అంతటన్ + పోక = దానితో నూరకుండక, పల్మఱునున్ = పెక్కుమాఱులు, కోరికయా కథల్ = ఇష్టము వచ్చిన కథలను, నూతనంబుగన్ = క్రొత్తగా,

గీ. దీన సామాన్యముగఁ దొంటి తెలుఁగుకవులు
వాడియున్నట్టి పదవాక్యపద్ధతులనె
యేర్చి కూర్చినవాఁడఁ గవీంద్రులకును
మించుగా డెందముల రుచియించుకొఱకు. 5

దీనన్ = దీనియందు, తొంటి = పూర్వపు, మించుగా = అధికముగా, డెందములన్ = హృదయములందు,

క. ఎందైన నిందుఁ దొల్లిటి
చందంబుల రచన లున్న సైరించి యెదం
బొందింపకుండ పీనుల
వందన మొనరింతు నార్యవర్యుల కెల్లన్. 6

తొల్లిటి చందంబుల = పూర్వ విధములైన, సైరించి = సహించి, ఓర్చి, ఎదన్ + పొందింపక + ఉండన్ = మనస్సునఁబెట్టుకొనకుండ.

శ్రీః

# విగ్రహము

## ప్రథమ భాగము

అనంతర మా నరేంద్రనందను[1] లమందానందకందళితహృదయార విందు లయి[2], విష్ణుశర్మం గని, యిట్లనిరి. "దేవా! తావకంబగు[3] సేవా విశేషంబున నిరవశేషంబుగ[4] మిత్రభేదంబును వినంగని మనంబున ఘనంబగు మోదంబు నొందితిమి. ఇంక విగ్రహంబుంగూడ ననుగ్రహించి, మమ్ముఁ గృతార్థులం జేయ వేఁడెదము. వేగిర మీ నవకథాసుధారసంబు[5] వెల్లిగొలిపి[6], యాఁకొన్న[7] మా వీనులకు విందుసేయుఁడు." అనిన నా యవనీసురసత్తముం[8] డాదరాయత్తచిత్తుండయి[9] యిట్లు వినిపింపఁదొడఁగె -

తొల్లి తుల్యబలవిక్రమంబు[10] లగు మయూరమరాళంబులకు[11] సమీకంబు[12] చేకుఱినతఱి నొక యరిష్టమును[13] నమ్మి యా హంసమ్ము పరాజయమ్ము నందెను. మీ కక్కథ వక్కాణించెద; చక్కఁగా వినుండి.

కర్పూరద్వీపమునందుఁ బద్మకేళి యను కొలను గలదు. అందు హిరణ్యగర్భుం డను మానసౌకస్స్వామి[14] వాసముచేయుచుండును. అందలి జలవిహంగమంబు[15] లా యంచలరాయనిం[16] దమ కందఱకు దొరఁగాఁ

1. ఆ సుదర్శనుఁడను రాజు కొడుకులు; 2. తక్కువకాని ఆనందముచే మొలకెత్తిన పద్మములవంటి హృదయములు గలవారు; 3. మీది, 4. సంపూర్ణముగా, 5. క్రొత్త కథలనెడి అమృతరసము; 6. వెల్లి + కొలిపి = ప్రవహింపఁజేసి; 7. ఆఁకలిగొన్న; 8. బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు; 9. ఆదర + ఆయత్త-చిత్తుండు = ఆదరమునకు (అనుగ్రహమునకు) అధీనమైన మనస్సు గలవాఁడు; 10. సమానములైన బలపరాక్రమములు కలవి; 11. నెమలికి, హంసకు; 12. యుద్ధము; 13. కాకిని; 14. మానస + ఓకస్ + స్వామి = మానస సరస్సు స్థానముగాఁ గల (హంస) రాజును; 15. నీటి పక్షులు; 16. హంసరాజును.

జేసికొని, వాసిగని యుండును. ఆ పరమహంసావతంసుఁ[1] డాశల[2] జయించి, నైజతేజం[3] బెల్లకడల[4] వెలుంగ, నొక్కనాఁడు సూర్యుండు పూర్వపర్వతశృంగం[5] బలంకరించిన యనంతరంబు నిజాప్తద్విజనికరపరివేష్టితుండయి[6], రాజయోగంబు మెఱయఁ బుండరీకాసనంబున[7] సుఖాసీనుం డయి, నిండుకొలువుండఁ గతిపయ[8]మాసంబులకు మున్ను దేశాంతరం బరిగి మరలి యరుదెంచిన దీర్ఘముఖుండను బకముఖ్యుఁడు, వాకిట నిలిచి, ప్రతీహారుల[9] వలనఁ దనరాక యెఱిఁగించి పుచ్చి, సముచితప్రకారంబునఁ గొలువు సొచ్చి, వినయవినమితగాత్రుండయి[10], దండప్రణామంబుఁ[11] గావించిన, రాజును సాదరాహ్లాద మేదుర నిరీక్షణంబుల[12] నాతని వీక్షించి[13], 'రమ్ము కూర్చుండు' మని, చేయి చూపి, దాపునఁ[14]గూర్చున్న యతని కిట్లనియె. "ఓయీ! దీర్ఘముఖా! సేమమా నీకు? బహుకాలంబునకు నేఁడు నీజాడఁ జూడఁగంటిమి! విదేశవాసాయాసక్లేశంబున[15] భృశంబును[16] జెన్నుఁదఱిగి[17]నట్టున్నవాఁడవు. ఇంతతడవు నేయే దేశమ్ములఁ గ్రుమ్మరుచుంటివి? ఏయే సీమల నేయే విచిత్రంబులు నేత్రంబుల కపూర్వపర్వంబు[18] లొనరించె? ఎక్కడను మిక్కిలి యక్కజంబులు[19] లేవుగా? నీ మోముపాలఁకువఁ[20] దిలకింప[21] నెప్పట్టునో యొక గొప్పవిశేషం బున్నట్టు పొడకట్టుచున్నది. నీ వేగినచోట విశేషంబు లేలపుట్టకపోవును? సరగ[22] నెఱిఁగింపుమా వింద్ము." అనిన, తేనిమొగంబున దృష్టి వఱపి, యాతం డిట్లనియె.

1. పరమహంస + అవతంసుఁడు = ఉత్కృష్టుఁడైన హంసశ్రేష్ఠుఁడు - పరమహంస (సన్న్యాసి)లలో శ్రేష్ఠుఁడు, అవతంసము = పూఁగమ్మ - శ్రేష్ఠతావాచకము; 2. దిక్కులను, కోరికలను; 3. తనదైన తేజస్సు; 4. అన్ని దిక్కులను; 5. తూర్పుఁగొండకొన; 6. తన మిత్రులైన పక్షుల సమూహములచేతఁ జుట్టఁబడినవాఁడయి; 7. పుండరీక+ఆసనంబునన్ = తెల్లదామర పీఠమున; 8. కొన్ని; 9. ప్రతీహారి (ప్రతిహారి రూపాం) = ద్వారపాలకుఁడు; 10. అడఁకువచే మిక్కిలి వంగిన శరీరము గలవాఁడు; 11. కఱ్ఱవలె సాగిలఁబడి చేయు నమస్కారము; 12. ఆదరణతోఁడి సంతోషముచేతఁ జక్కనైన చూపులతో; 13. చూచి; 14. సమీపమున; 15. విదేశ-వాస + ఆయాస - క్లేశము = పరదేశమునందు నివసించుట వలని బడలికవలని కష్టము; 16. మిక్కిలి; 17. ఒప్పు నశించు; 18. మున్నులేని పండువు; 19. వింతలు; 20. జాడ; 21. చూడఁగా; 22. శీఘ్రముగా

"ఏలిక పాలనంబు సేయునేల నేమూలం గుశలం బణుమాత్రంబును గుంటువడ[1] దన, సార్వకాలము దేవరపాదము[2] లాశ్రయించి సన్నిధానంబునన[3] మెలంగు నస్మదాదులను[4], 'సేమమా' యని వేఱ యడుగనేల? ఇఁక దేశాంతరమం దున్ననాఁటి నా కుశలమో, శశ విషాణ ప్రరోహంబు[5]. అది యంతయు దేవర కీ తనుద్యుతియే[6] తెలుపుడు సేయుచున్నది. అది యుండనిండు. నాఁ డట్లు స్వామిపాదంబుల యాదేశంబు గొని చనినదాదిగా నీ యా దేశం బననేల? అశేషావకాశమ్ములు[7] గ్రుమ్మరి[8], క్రమ్మఱి[9], భాగ్యవశమ్మున సమ్ముఖమ్ముఁ[10] జేరఁగంటిని. అంతరాంతరంబుల[11], నే నెడనెడ[12] గాంచినవింత లసంఖ్యాకంబులు గలవు. అవియన్నియు నెన్న, నేండ్లను బూండ్లనుం[13] బట్టు నిలుకడమీఁద విన్నపంబు[14] చేసికొనియెద. త్రోవను సేవకుం డొక్క యపరాధంబుఁ గావించుకొని వచ్చినవాఁడు. ముహూర్తమాత్రంబు మార్గఖేదం[15] బపనయించి[16], యామూలాగ్రంబుగఁ[17] గార్యనివేదనం బొనరించెడు. దేవర దివ్యచిత్తంబున లెస్సగా నవధరింపవలయును." అని యరమోడ్పుఁ[18] గన్నులతో వేడి నిట్టూర్పు నిగిడించి, క్షణ మూరకుండి, యల్లన నిట్లనియె.

జంబూద్వీపంబున వింధ్యం బను ధరాధరంబు[19] గలదు. ఆ గిరివర శిఖరంబున గహనవిహగంబుల[20] కెల్ల వల్లభుండయి[21], చిత్రవర్ణుం డను శిఖావళతల్లజుండు[22] కాఁపురముండును. తదంతికకాంతకాంతారంబున[23],

---

1. కుంఠితమగు - చెడు; 2. ప్రభువుల అడుగులు; 3. సమీపమునందే; 4. అస్మద్ + ఆదులు = మావంటి వారిని; 5. శశ - విషాణ - ప్రరోహంబు = కుందేటికొమ్ము; 6. శరీరకాంతి; 7. ఎల్లచోట్లు; 8. తిరిగి; 9. క్రమ్మఱి = మరలివచ్చి; 10. ఎదురు; 11. లోపల లోపల; 12. అక్కడక్కడ; 13. ఏండ్లను + పూండ్లను = అనేక సంవత్సరములు; 14. విజ్ఞాపనము, మనవి; 15. మార్గ - ఖేదము = మార్గాయాసము - ప్రయాణపు బడలిక; 16. పోఁగొట్టుకొని; 17. మొదటి నుండి చివరి వఱకు; 18. సగము ముడిచిన; 19. కొండ; 20. అడవి పక్షులకు; 21. రాజయి; 22. శిఖావళతల్లజుండు = నెమళ్ళలో శ్రేష్ఠుఁడు; 23. ఆ దగ్గఱి మనోజ్ఞమైన అడవియందు.

నతని యనుజీవు[1] లగుఖగంబులు[2] కొన్ని, నన్ను బహుయోజనాధ్వగామిం[3] గాంచి, యాతిథేయసత్కారంబు[4] లాచరించి, యమృతకల్పంబులగు[5] పరిపక్వఫలంబు లొసంగి[6], మెసంగి[7] విశ్రమించియున్న నన్నుం జూచి, కుశలప్రశ్న పూర్వకంబుగా నిట్లనియె. "ఓ బకోత్తమా! యే దేశంబు భవజ్జననంబునకుఁ[8] దావలంబై[9], పుణ్యంబు వహించినది? ఏయే దేశములను నీ వియోగవ్యథపాలు[10] చేయుచు వచ్చి, యిప్పు డీ దేశము నలరించు[11] చున్నాఁడవు? ఇంకను నీ పాదము లే దేశమును బవిత్రము గావింప నున్నవి? ధర్మపరిపాలనంబు గ్రాల మీ నేల నేలుచు, నినుబోటి శుచిమూర్తుల[12] సేవకులనుగాఁ బడయునంతటి భాగ్యము వహించి, సత్పురుషశిరోమణి[13] యనిపించుకొనుచు, మీ రాజ్యము నలంకరించుచున్న రాజరత్న మెవఁడు? మా యందఱ కర్ణంబులు[14], భవదీయ వృత్తాంతశ్రవణ కుతూహలాధీనంబులయి[15] వేచియున్నయవి. ప్రయాణత్వర యొక్కింత గుదియింప[16] వలనుపడునేని, నిమిషమాత్రం బిందు నిలిచి, నీ యుదంతంబు[17] సాంతంబుగా వానికిం బ్రసాదింపుము. నావుడు నే నిట్లు వాక్రుచ్చితిని.

"కర్పూరద్వీప మన మును వినియుందురేకదా? నే నా దీవికి దేవర యగుహిరణ్యగర్భుం డను చక్రాంగపుంగవుని[18] యనుంగుభృత్యుఁడను. మా రాజు బలపరాక్రమాదు లాబాలప్రసిద్ధంబులు[19]; కాన నాతం డొకవేళ మీకు శ్రుతపూర్వుండై[20] యుండనోపు. అందఱు నన్ను దీర్ఘముఖుఁ డందురు.

---

1. అనుసరించి బ్రదుకునవి; 2. పక్షులు; 3. బహు - యోజన + అధ్వ - గామి = పెక్కు యోజనముల మార్గము నడచిన వాఁడు, యోజనము = ఆమడ, ఎనిమిది మైళ్ళు; 4. అతిథికి యోగ్యములయిన మర్యాదలు, అతిథి = తిథి నియమములేక ఇంటికి వచ్చిన వాఁడు, ఆతిథేయుఁడు = ఆతిథ్యమిచ్చువాఁడు; 5. అమృతముకంటెఁ గొంచెము తక్కువ అయినవి; 6. బాగుగాఁ బండిన పండ్లనిచ్చి; 7. తిని; 8. భవత్ + జననంబునకున్ = నీ పుట్టుకకు; 9. చోటు; 10. ఎడఁబాటు వలని బాధ, 11. సంతోషింపఁజేయు; 12. పరిశుద్ధరూపులను; 13. మంచివారిలోఁ దలమానికము (శ్రేష్ఠుఁడు); 14. చెవులు; 15. నీ కథను వినుటయందలి వేఁడుకకు వశమైనవి; 16. తగ్గించుటకు; 17. వృత్తాంతము; 18. హంసరాజుయొక్క; 19. పిల్లలవఱకుఁ బ్రసిద్ధములు; 20. మున్ను వినఁబడినవాఁడయి.

ఆ జాలపాద నాయకుండు[1] నన్నుఁ బ్రాణంబు ప్రాణంబుగా మన్నింప, సన్నిధానవర్తినై[2], మెలఁగుచుందును. అట్లు సుఖైకభాజనంబనై[3] యుండి, యొక్కనాఁ డశేషవిషయంబులం గల విశేషవిషయంబుల[4] నీక్షింప నపేక్ష[5] వొడమి, మా యొడయని వీడుకోలు[6] వడసి, యా పుడమి[7] వెడలి, యెండ నాక[8], వాన నాక, దేశమ్ములుగాని దేశమ్ము లెల్ల సంచరించి తత్తద్విశేషంబులకు డెందంబున[9] నానందించుచు, వచ్చి వచ్చి, యదే పనిగ నేఁ డీ దీవియఁ జొచ్చితి. ఇచ్చటి విశేషంబు లెల్లఁజూడ నా యుల్లంబు[10] కడు వేడుక పడుచున్నది. పక్షివరులారా! యీ దినశేషంబు మీ సమక్షంబున నీ దీవి వినోద వీక్షావిహారంబునఁ గాలక్షేపంబుచేసి, రాత్రియు మీతోడఁగూడ నిష్టకథాగోష్ఠి నడపి, యెల్లి[11] ప్రొద్దున యా సీమ కేగెద." అనవుడు నా విహంగంబులు ప్రహృష్టాంతరంగంబు లయి[12], "యట్ల యగుంగాక" యని, గమనపరిశ్రాంతి[13] కొంత శాంతిపొందిన పిమ్మట, నన్ను ము న్నిడుకొనిపోయి, యా ధాత్రింగల[14] విలోకనపాత్రంబు[15] లగు చిత్రంబు లెల్ల నాకుం గ్రమంబునఁ జూపి, యా పిదప నన్ను మగుడఁ దమ మనికిపట్టునకుం[16] దోకొని, వచ్చి, యచ్చేరువ నివ్వల దవ్వుల[17], నిలిపి, లోనితమతేనిం గానిపించి, యిట్లనియె. "ఓ యండజకులమండనా![18] మీ భువనంబును[19] మా భువనంబును లెస్సగాఁ జూచితివి గదా. ఏది యీ దీవులరెంటిలో, నీ కంటి కింపును సొంపును మిగుల నింపుచున్నది? ఏవాఁడు మనతేఁడు లిద్దఱిలోఁ దద్దయుఁ[20] బెద్దఱికంబు వహియించి మించును? అభిజనాభిమానంబును[21], ననుమానంబును మాని,

---

1. హంసరాజు; 2. సమీపమున నుండువాఁడు; 3. సుఖ+ఏక-భాజనంబును + ఐ = సుఖమునకు మాత్రమే పాత్రుఁడనై; 4. విషయము = దేశము; 5. కోరిక; 6. రాజుయొక్క సెలవు; 7. భూమి; 8. నాక = అనక (ఎం డనక, వా ననక); 9. హృదయము; 10. ఉల్లము = మనస్సు; 11. ఎల్లి = రేపు; 12. ప్రహృష్ట + అంతరంగములు = మిక్కిలి సంతోషించిన మనస్సులు గలవి; 13. నడకవలని బడలిక; 14. ధాత్రి = భూమి; 15. చూడఁదగినవి; 16. ఉండుచోటు; 17. దూరమున; 18. పక్షివంశమున కలంకారమైనవాఁడా! 19. లోకము, దేశము; 20. మిక్కిలి; 21. స్వదేశాభిమానము.

నీ మానసంబునఁ గలయది తప్పక చెప్పుము." అనినఁ, బ్రహసభాసుర ముఖుండ[1] నయి నే నిట్లు పలికితిని.

"నెచ్చెలులారా! మీరు కూపకూర్మంబులవలె[2], సదా యిందుండి, దేశాంతరవృత్తంబులఁ గలనైనఁ గని విని యెఱుంగమింజేసి, యీ లాగున బేలతనంబునఁ[3] బలుకుచున్నారు. మీ డెందంబులఁ గ్రందుకొన్న[4] సందేహంబు వాపికొన, మిక్కిలి యక్కఱపడి యడిగితిరి. కాన, మైత్రిం బురస్కరించి, యున్నది యున్నట్టు వాక్రుచ్చెద, ఆలింపుఁడు. నిజముగా మా దీవికి మీ దీవికి హస్తిమశకాంతరము[5] గలదు. మా యావాసంబు జనశరణ్యాభువనంబు[6]; మీ నివాసము మహారణ్యము. ఇఁక రాజుల నడుగుదురేని - మా ఱేనికిని, మీ ఱేనికిని, బర్వతంబునకుం బరమాణువునకుం గలవాసి[7]. మా యధీశ్వరునికి నిలయము కేవలము పద్మాకరము[8]; ఆహార మమృతము[9]; అనుచరులు నిరంతరము సరసుల సంగతి[10] నుండుకవికులంబులు[11]. మా విభుని వైభవము సమగ్రముగా నెన్న వేనోళ్ళవాఁడును[12] నేరఁ డన[13] మనమా యిఁక వాకొనఁ గలవారము? పట్టిచూడ, మీ దొరయం దివియన్నియు విపరీతంబు లయి[14] యున్నవి, నిలయంబు నట్టడవి[15]: అశనమో[16], కాయలు గడ్డలు; భృత్యు లందుమా[17], యనవరతము[18] కుజనుల[19] సంగతిం దిరుగు

1. పెద్దనవ్వుచేఁ బ్రకాశించు ముఖము గలవాఁడను; 2. నూతి తాఁబేలువలె; 3. మూఢత్వమున; 4. అతిశయించిన; 5. ఏనుఁగునకును దోమకును గల భేదమును - మా దీవి యేనుఁగైన, మీ దీవి దోమ యనుట; 6. జనులకు శరణు పొందఁదగిన లోకము - జనులకు శరణు కోరఁదగిన నీరని యర్థాంతరము; 7. వాసి = భేదము; 8. పద్మములకు స్థానమైనది, చెఱువు; 9. సుధ, నీరు; 10. రసయుక్తులైన వారియొక్క కూడికతో, కొలఁకుల దగ్గఱ నని యర్థాంతరము; 11. కవుల సమూహములు - జలపక్షుల సమూహములు; 12. ఆదిశేషుఁడును; 13. తెలియఁడు; మా విభుని... వాకొనఁగల వారము:- కావ్యార్థాపత్తి (అలం.); 14. తారుమారై; 15. నడు+అడవి; 16. ఆహారము; 17. సేవకులు; 18. ఎల్లప్పుడు; 19. దుర్జనులు.

పలుగాకిమూఁకలు[1]. ముంజేతికంకణమున కద్ద మేల[2]? ఇట్టి మీ ప్రభువు వైభవము మీ యుల్లంబులకే తెల్లంబు[3]. అది యటుండ నిండు. మీ రీ శిఖి[4] చెంతఁ జేరి, చెట్ల గట్ల నీ రీతిఁ బరితపింపనేల[5]? కాయగసురు లేఱుకొని తిని మననేల? మిమ్ముఁ గన్నప్పటినుండియు, నా హృదయంబున కిదియ విచార మగుచున్నది. ఏమి సేయవచ్చు? ఇది యంతయు మి మ్మిట్టు పుట్టించిన దైవంబు గాని మీ దోషంబు గాదు. లోకములో సజ్జనులతోడి సఖిత్వంబు[6] సంభాషణ మాత్రసిద్ధంబు[7]; కావున, మీరు నా కిపుడు పరమాప్తు లయితిరి. సత్పురుషులైనవారు[8] పరుల కష్టంబులైనఁ జూచి సహింపఁజాల రన, నాప్తుల యాపద లెట్లు చూచి సైఁపఁగలరు[9]? ఈ దేహమును ధరించుటయుఁ బరోపకారార్థమె యగుటను, మీ కొక్క హితోపదేశంబు చేసెద. నా పలుకులు కుఱుచసేయక[10], చెవులం జొనుపుఁడు. బుద్ధిమంతులరు, మీకు విస్తరించి చెప్పఁ బనిలేదు. బాగుపడఁ గోరెదరేనిఁ, గీడు మేలాడక, శైఘ్రంబ[11] పయనంబయి[12], రేపకడ[13] నాతోడఁగూడ మానేలకు రండు. ఆ కడ మీ కనన్యాపేక్షంబుగ[14] వలయునట్లు జీవనము[15] నడుచును. మా యొడ యండును[16], సర్వజనసంస్తవనీయుండు[17]; పరమకృపానిరతుండు[18]; సులభుండు[19]; మి మ్మందఱఁ దనపరివారంబులోనివారిఁగా మన్నించును. అతని పాలంబడి, మీకుఁ బోలినలీల మేలుగం గాలం బచ్చుటఁ బుచ్చవచ్చును. దీనికిం దగిన యుత్తరం బంగీకారంబ. ఒండుతలఁపుఁదక్కి, ప్రయాణంబై

---

1. దుష్టుల సమూహములు - పెక్కు కాకుల సమూహములు; 2. ఎదురుగాఁ గనఁబడు దాని నద్దములోఁ జూచుకొనవలయునా? 3. స్పష్టము; 4. నెమలి, అగ్ని; 5. దుఃఖించు; 6. మిత్రభావము, మైత్రి; 7. మాటలాడుటచేతనే కలుగునది; 8. సత్పురుషులైనవారు - సైఁపగలరు. కావ్యార్థాపత్తి (అలం.); 9. సహింపఁగలరు; 10. తక్కువ చేయక; 11. శీఘ్రమే; 12. ప్రయాణము; 13. ఉదయము; 14. ఇంకొకదానిమీఁదఁ గోరిక లేనియట్లుగా; 15. బ్రదుకు, నీరు; 16. ఒడయఁడు = ఱేఁడు; 17. ఎల్లజనులచేఁ బొగడఁదగినవాఁడు; 18. గొప్పదయయం దాసక్తిగలవాఁడు; 19. ఆశ్రయించినవారికి బాగుగా దొరకువాఁడు.

రండు. ఆడుచుం బాడుచుం బోవుదము." అనిన, రోగార్తులకుఁ[1] బథ్య పదార్థంబులుం[2] బోలె, నా హితవచనంబులు, రుషారోగపీడితంబు[3] లగు నా పక్షుల శ్రవణంబుల[4] కసూయాజనకంబు లయిన, ముఖంబులఁ గోపంబులు ముడివడ[5], శుష్కహసితంబు[6] తెచ్చుకొని, కన్నుల మిడుఁగుఱులు రాల నన్నుఁ దూష్ణీంభావంబున[7] వీక్షించుచు నా పక్షులెల్ల, నోరికి వచ్చినట్లు నన్నును దేవరను గొన్ని నికృష్ట వాక్యంబు[8] లాడెను. అవియెల్ల నిండిన యోలగంబున[9] నుగ్గడింపఁ బోలవు[10]. ఆ కుక్క లటు మొఱఁగిన మాత్రంబున, నేలినవారి[11] గౌరవంబున కొక్కతక్కువయుఁ గలుగదు. అవి తమ నైజగుణంబులే వెడలనాడుకొన్నవి. పాములకుఁ బాలు వోయ విషవృద్ధి యగునట్లు, వివేకశూన్యులకు హితవాక్యంబులు గఱప[12] దుర్మదం[13] బెక్కును. సర్పంబుల కొక్కనోరనెగాని, ఖలులకు[14] నిలువెల్లను విషంబే యని, మనీషులు[15] నుడువుదురు[16]. కావున క్షుల్లకజనంబులకుఁ[17] బాడిఁ[18] గఱపఁబోవుట నోరిచాపలంబు[19] గాని వేఱుకాదు; అట్టి హితోపదేశంబువలనఁ జలంబు[20] బలియుం[21] గాని, లవంబును [22] గుణం బలవడదు. కాఁబట్టి బుద్ధిమంతుఁ డెల్లవిధంబుల వివేకిలోకంబునకే[23] బోధింప యత్నపడవలయును. కానినాఁ డసితాననంబులకుఁ[24] తెలువఁబోయిన చెవులపోతురీతిని, దప్పక ముప్పుఁజెందును. ఆ కథ యాకర్ణింపుఁడు.

మాల్యవంతంబుపొంత సంతతపరిణతఫలకలితతరుషండమండితం బగువనం[25] బొండు గలదు. అచ్చటి గోలాంగూలజాలంబు[26], మండు

---

1. రోగ + ఆర్తులు = వ్యాధిచే బాధితులు; 2. పథ్యములైన పదార్థములు; 3. కోపమనెడి వ్యాధిచే బాధింపఁబడినవి; 4. చెవులకు; 5. పెనఁగొను; 6. లేని నవ్వు; 7. ఉపేక్షాభావము; 8. నీచ వాక్యములు; 9. నిండు సభలో; 10. చెప్పఁదగవు; 11. ప్రభువులయొక్క; 12. బోధించు; 13. దుర్గర్వము; 14. దుష్టునకు; 15. విద్వాంసులు; 16. చెప్పుదురు; 17. అల్పులైన జనులకు; 18. పాడి = ధర్మము; 19. నోరి చాంచల్యము; 20. చలము = పంతము; 21. బలియు = వృద్ధిపొందు; 22. లవంబును = లేశమైన, 23. వివేకవంతుల సమూహమునకే; 24. అసితాననము=నల్లని ముఖము గలది-కోఁతి; 25. ఎడతెగని పండిన పండ్లతోఁ గూడిన చెట్ల సమూహముచే నలంకరింపఁబడినది; 26. కోఁతుల సమూహము.

వేసవి నొక్క వాసరమధ్యంబున[1], మెండుగఁ దృష్ణార్దితంబయి[2], బయలు వెడలి, కడు దవ్వునఁ బొడఁగన నగు మృగతృష్ణా ప్రవాహం[3] బాలోకించి, నదీప్రవాహం బని భ్రమియించి, మించినయెండవేఁడిమి నడుగు లొక్కమొగిఁబొక్క మిక్కిలి దూరము నడచి, యెక్కడను నిక్కంపువారిపూరంబు[4] గాననేరక, యూరక డస్సి[5], యుస్సు రనుచు నడు గామడగా నా చాయ నున్న యొక్క న్యగ్రోధపాద పచ్ఛాయాశీతలం[6] బగుసికతాతలంబున[7] కల్లన నొడళ్లుసేర్చి[8], జటాఝూటంబు[9] లూఁతగాఁ గూరుచుండియుండఁ, గొండ్రముచ్చొక్కటి తక్కటివానితో నిట్లనియె : "చూచితిరా? మలినముఖులారా![10] మన మిపు డెంతదూర మరుదెంచినారమో! మన యావాసంబున కీ వసుమతీరాజంబు[11] యోజనం[12] బుండునని వినుచుందుము. ఎండతాఁకునం గడుబడలియు, జలంబు లాననౌనను తలంపున, నిదెయిదె కాసారంబు[13] డాసెద మని, యాసాసలం[14] దటిమి నడిచితిమి. నడచినకొలందిని జలంబు లంతకంతకు ద వ్వగుచున్నట్లు నా మదికిం గప్పట్టు చున్నవి. ఇప్పటిచొప్పు పరికింప, నడుగు తీసి యడుగిడుజాడ పొడగానరాదు. మధ్యందినదినక రాతపతైక్ష్ణ్యం[15] బునఁ గాళులు[16] కాలి చాల బొబ్బ లెక్కినవి; నాలుక తడియాఱి పిడుచ వాఱు[17] చున్నది. నేఁ డీ దప్పి కెట్లు దప్పువారము? ఏమి సేయుదము?" అని మిగుల వగలం బొగులు[18]చుండ, నా వటకుటజకోటరాభ్యంతరంబున[19] వసియించు శశకం[20] బొకం డా దీనాలాపంబు లాలించి, స్వాంతరంగంబు కరుణాతరంగితం

1. వాసర - మధ్యము = మధ్యాహ్నము; 2. తృష్ణార్దితంబు = దప్పిచేఁ బీడింపఁబడినది; 3. ఎండమావుల ప్రవాహంబను; 4. నిక్కంపు వారిపూరంబు = నిజమైన జలప్రవాహము; 5. డస్సి = అలసి; 6. న్యగ్రోధపాదపచ్ఛాయాశీతలము = మఱ్ఱిచెట్టు నీడచేఁ జల్లనిది; 7. ఇసుక తిన్నె; 8. ఒడళ్ళు = శరీరములు; 9. జటా-ఝూటము = జడల (ఊడల) సమూహము; 10. మలినముఖము = నల్లని మోము గలది - కోఁతి; 11. వృక్ష శ్రేష్ఠము; 12. యోజనము = ఎనిమిది మైళ్ళు; 13. చెఱువు; 14. ఆసాసలన్ = అధికమైన ఆశతో; 15. మధ్యాహ్నసూర్యతాపతీవ్రత; 16. కాళులు (బహువ.), కాలు (ఏకవ.), కాళ్ళు (రూపాం.); 17. పిడుచవాఱు = ముద్దకట్టు; 18. పొగులు = దుఃఖించు; 19. వటకుటజ కోటరాభ్యంతరంబున = మఱ్ఱిచెట్టు తొఱ్ఱలోపల; 20. శశకము = కుందేలు.

బగుడు, మనసుపట్టలేక, విధిప్రేరణంబునఁ దొట్టి వెడలి వచ్చి, యఱుత[1] నిలిచి, కర్ణంబులు టిక్కించి[2] యిట్లనియె, "ఓ బుద్ధిహీనులారా! మీ రా యెండమావులం గని కాఁబోలు, నీటితావులని యాసపడుచున్నవారు. అవి మరీచికలు[3] కాని వీచికలు[4]గావు. ఇదిగో - నా చెయిచాయం దిన్నఁగఁ జూడుఁడు. అల్లదె - యా పల్లంబున, ననతిదూరంబున[5] వారిజాకరం[6] బొకండు గలదు. అం దరిగి, మీ పెందగఁ[7] దీర్చికొండు; పొండు." అన, నొక యసితాననంబు ప్రహసితాననంబై, కాలానలజ్వాలలీల[8] మండిపడి పటపటఁ బండ్లు గీటుచుఁ, గుటిలభ్రుకుటి[9] యయి, చదలు[10]న నదరులు[11] సెదరఁ జూచుచు లేచి, కప్పరపాటున[12] నా కుందేటిమీఁదికిఁ గుప్పించి యుఱికి, దానికడకాళ్ల తనకేలఁ గీలించి, పైకెత్తి చూపి - "వింటిరే? యీ శశాధముండు నో రఱుగ మనల నెన్నికాఱు[13] లఱచెనో. మన మెల్లరము బుద్ధిహీనుల మఁట! మనకుఁ దనకున్నపాటి వివేక మున్నదే? మనకుఁ జక్కట్లు[14] దిద్దఁ దాఁగాక మఱియెవ్వ రున్నారు? ఏమి దీని త్రుళ్లు?" అని నిందాగర్భంబుగాఁ దోడి మసికోఁతులతోడ[15] నాడుచు, గేలిగొనుచు[16]. నిర్దాక్షిణ్యచిత్తంబున నా చెవులపిల్లిని బిట్టుగ[17] నేలంగొట్టి కాలం జమరి[18], కృతాంతనిశాంతంబున[19] కతిథిం జేసి యవియన్నియుఁ గదలి జలాశయంబునకుం బోయి, తోయంబు[20] లాపోవఁ[21] ద్రావి, యథేష్టంబుగం[22] జనియె. కావున, నెంతమాత్రము మూర్ఖుల కుపదేశింపఁ బూనరాదు. అట్లు పూనువానికి మానక కీడుమూఁడును[23].

---

1. అఱుతన్ = సమీపమున - అఱుతుశబ్దసప్తమ్యేకవచనము; 2. టిక్కించి = నిక్కించి; 3. మరీచికలు = ఎండమావులు; 4. వీచికలు = అలలు; 5. కొలఁది దూరము; 6. వారిజాకరము = పద్మాకరము - సరస్సు; 7. పెందగ = పెను+దగ = పెద్దదప్పి; 8. ప్రళయసమయమునందలి అగ్నిశిఖ, 9. వంకరయైన బొమముడి గలది; 10. చదలు = ఆకాశము, 11. అదరులు = మిడుఁగుంఱులు; 12. తొట్రుపాటు; 13. కాఱులు = దుర్భాషలు; 14. చక్కట్లు = కార్యములు; 15. మసికోఁతి = నల్లకోఁతి; 16. పరిహసించు; 17. బిట్టుగన్ = అధికముగా; 18. చమరి = నలఁచి; 19. యముని గృహము; 20. తోయము = నీరు; 21. ఆపోవు = తృప్తిపడు; 22. ఇష్టము ననుసరించి; 23. కీడుమూఁడును = ఆపదగలుగును.

అట్లు దూఱి[1] యప్పక్షు లెల్ల నన్ను రూక్షవీక్షణంబుల[2] వీక్షించుచు, సరోషపరుషాక్షరంబుల[3] మఱియు నిట్లనియె, "ఓరీ! దుర్మతీ! నీవు మతిభ్రమ గప్పి, మా కడ గోరంతలు కొండంతలుగాఁ జదువఁజొచ్చితివి. అంతతోనైన నిలువక, నిర్భయంబుగ మా దేశమ్మును మమ్మును నూరక మీఱనాడితివి[4]. నీవు పాపవర్తనుండవు, నీ బుద్ధి పోనిచ్చుకొందువే? నీ వారలంగాని వారినింబట్టుకొన్న నైసర్గిక[5] దోషంబులు విడువవు. నీవును బక్షపాతలోలబుద్ధి[6] నీ మనంబువెలితి[7] యందఱకుం దేటపఱిచితివి. సర్వజనసమాదరణీయుండు[8] చిత్రవర్ణుండు నీ కాదరణమాత్రుండు గాకపోయెఁగా! విపరీతచేతస్కులకుఁ[9] బూజ్యులే యక్షిగతు[10] లగుదురు. నీవు నితరం బెఱుంగక, యెక్కుడువారల ధిక్కరించెదవు. నీ కింతదురాగతంబు[11] కొఱ[12]గాదుసుమీ మింటఁ[13]బాఱు మొయిలుం[14] జూచి బాఱు సహజభీరువు[15]నా నాన[16] లేక, మా కడనేమో గొప్పపౌరుషశాలి యని, యింతతడవును వర్ణించితివి! అట్టి మీ రాజహంసంబున[17] కెవరు రాజ్యాధికారం బొసంగిరి? అతఁడు రాజ్యభారంబు భరియింప నెట్లు సమర్థుం డగును? ఏవారు దేనిఁ బూన నర్హులో, వారు దానిఁ బూనఁ బొసంగి[18] యుందురు. అట్లు గానిచో, హాస్యాస్పదు లగుదురు. మీ హిరణ్యగర్భుఁడా మమ్మాపదలవలనం బాచి, యేలఁజాలువాఁడు? మొగులునీరు[19]నమ్మి, చెఱువునీరు పాఱఁ జల్లించునంతటి బుద్ధిమంతుఁ డిం దెవ్వాఁడును లేఁడు. మీ రాజువంటి వారు వేవురైన్న[20], మా రాజున కెత్తు[21]

---

1. దూరు = నిందించు, తూఱు = ప్రవేశించు; 2. కోపపుఁజూపు; 3. కోపముతోఁ గూడిన కఠినములైన అక్షరములు; 4. మీఱనాడు = నిందించు; 5. నైసర్గిక = సహజ; 6. ఒకవైపున మాటాడుటయందుఁ జంచలమైన బుద్ధి గలవాఁడు; 7. తక్కువ తనము; 8. ఎల్లజనులచే మిక్కిలి ఆదరింపఁదగినవాఁడు; 9. విరుద్ధమైన, చేతస్సు = మనస్సు గలవారు; 10. కంటి కగపడినవారు; 11. దౌష్ట్యము; 12. కొఱ = ప్రయోజనము; 13. మింటన్ = ఆకాశమున; 14. మొయిలు = మేఘము, మొయులు, మొగిలు, మొగులు (రూపాం.) 15. ప్రకృతిసిద్ధముగాఁ బిఱికివాఁడు, హంస ఆకాశము మేఘావృతము మయినప్పుడు పాఱిపోవును; 16. నాన = సిగ్గు; 17. రాజశ్రేష్ఠము, రాయంచ; 18. పొసంగి = ఒప్పి; 19. మొగులు నీరు = మబ్బు నీరు; 20. వేవురు = వేయిమంది; 21. ఎత్తు = సాటి.

వత్తురే? చాలుఁ జాలు, ఈ పాటి నీ మాట లుడుగుము[1]. మాకుఁ గాదు - నీకే మే మొక్కహితోపదేశంబు చేసెదము. తగవరివైతేని[2], మా పలుకు సేయుము. మా రాజు మీ రాజుబోఁటివారి నూఱువుర రక్షింప దక్షుండు[3]. మా మాటఁబట్టి నీవును మీ యెకిమీఁడును[4] గూడ మా ఱేని నాశ్రయించి బ్రదుకుండు" అని యా పలుగుపులుఁగులు[5] దేవరం దూఱు[6]నప్పు డేమిచెప్పుదు? నాకు నాకసంబును భూమియు నొక్కగ్రుక్కను మ్రింగవలె నన్నంత కోపంబు వచ్చినది. ఐన నే నప్పటి వెనుకముందరలేమి విచారించి, చేయునది లేక, యా కన[7] లెల్ల నుల్లంబుననె దిగఁద్రావి[8], పొరలి పొరలి వచ్చు పరుషోక్తుల నాలుకతుదకు రాకుండఁ గ్రుక్కి, కొంత శాంతం బవలంబించి, మది కలంగియు గాంభీర్యంబు తెచ్చుకొని, యిట్లంటిని. "ఆ ఏటిమాట లివి! మీ రందఱుం జేరి యుపచార[9] పూర్వకంబుగాఁ బ్రార్థించి యడిగిన, లోకంబుతోడిపాడిగా నాకుం దోఁచినది పలికితిని. మీ కది మనస్సు వచ్చి చేయుదురేని మేలు; చేయకుండినం గడుమే లయ్యె. అంతియకాని, యింతమాత్రంబునకె కోపమెత్తి, యిట్టి తెఱంగుమాలిన[10] పలుకులు నోర వెడల నిచ్చుట మీ యట్టి యుచితజ్ఞులకు ధర్మ మగునె? మా రాజు గౌరవంబు పేర్కొన మీ రేపాటివారు? ఏల నిర్నిమిత్తంబుగ[11] నసాధారణగౌరవోదారుం డగు మా ఱేని నోరికొలఁదు లాడి[12], వలవని[13]పాపంబు కట్టుకొనియెదరు? లోకంబున సాధునిందకంటె మిక్కిలిపాతకం[14] బెద్ది? వృథాప్రయాసంబు; ఇట్టి నోరిచేటేల? నా బుద్ధి విని, యిఁక నైన మృదుమార్గంబు పట్టుఁడు. లోకంబున నెట్టిదిట్ట[15]లకును వాతివాఁడితనంబు[16] చెట్ట[17]లం బుట్టింపక పోదు. ఎవ్వరును

1. ఉడుగు = మాను; 2. తగవరివి+ఐతివి+ఏనిన్ = న్యాయము గలవాఁడవయినచో; 3. దక్షుఁడు = సమర్థుఁడు; 4. ఎకిమీఁడు = రాజు; 5. పులుఁగులు = దుష్టపక్షులు; 6. దూఱు = నిందించు; 7. కనలు = కోపము; 8. అణఁచుకొని; 9. ఉపచార = సమ్మాన; 10. విధముచెడిన; 11. కారణము లేకుండ; 12. నోరి కొలఁదులు + ఆడి = నోరికి వచ్చినవి పలికి; 13. వలని = అనిష్టమైన; 14. పాతకము = పాపము; 15. దిట్ట = గొప్పవాఁడు; 16. వాతివాఁడితనము = నోటి పదను వాక్పారుష్యము; 17. చెట్ట = చెడు-కష్టము.

ఊాల రువ్వినవానిఁ బూలరువ్వరు![1] కాన, నేనును మిమ్మొక్కటి నడుగవలసి వచ్చెడును. మా రాజుమాట పిమ్మటఁ జూచుకొందము. ఏ దిట్ట మీ నట్టువపిట్ట[2]ను బక్షిరాజ్యంబునకుఁ బట్టము గట్టెనో మొట్టమొదట దాని నుడువుండు," అను నా నోటిమాటలు నోట నుండఁగనె, కట్టలుక[3] నొక పలుగాకికాకి కనుగీట, వేగ నా సైగ[4] గైకొని నగౌకము[5] లెల్లఁ బెల్లురేఁగి[6], చివ్వకుం జేఁ జాఁచుడు[7], లాఁతిచో[8] శాంతంబునట్ల యవమానంబగుచోటఁ బరాక్రమంబ పురుషులకు భూషణం బగుటం దలపోసి, నేనును వెనుకఁదీయక కలని కాయితం బయి[9], ప్రతిఘటించి నిలిచితిని. అనవుడు సస్మితాస్యుండై[10], చక్రాంగపుంగవుండు[11] కొంగ కిట్లనియె. "ఎవ్వఁడు క్రొవ్వునఁ బరనిజశక్తుల కొలంది[12] గణింపక, యెక్కుడువారల డీకొన నుంకించునో[13], యాకట్టిఁడి మత్తుఁ[14] డిక్కట్టుల[15] కెల్లం బుట్టినిల్లగును. తొల్లి యొకకపోతంబు[16] పోతరంబున[17] నంతరం[18] బెఱుంగక, సాలువంబుతో[19] నెదిరి మద మఱెను[20]. నీ కా కథఁ జెప్పెద వినుము.

## పావురముల జంట - డేగ

పాండ్యమండలంబున మధుర యను పురవరంబు గలదు. ఆ వీటికోవెల[21] నాశ్రయించి, యొక పారావతమిథునము[22] వాసము చేయు చుండును. ఆ ఖగయుగ్మం[23] బొక్కనాఁడు ముఖమండపసమీపంబున

---

1. ఊాలరువ్విన వానిఁ బూల రువ్వరు = అపకారికి నుపకారము చేయరు; 2. నట్టువ పిట్ట = నెమలి; 3. కడు+అలుక = కట్టలుక - అధిక కోపము; 4. సైఁగ = సంజ్ఞ; 5. నగ + ఓకము = నగౌకము - కొండ స్థానముగాఁ గలది, మెట్టపక్షులు; 6. మిక్కిలి విజృంభించి; 7. చివ్వ = కలహము; 8. ఇతరమైన చోట - సమ్మానమగుచోట; 9. యుద్ధమునకు సిద్ధమయి; 10. సస్మిత + ఆస్యుండు + ఐ = నవ్వుతోడి ముఖము గలవాఁడయి; 11. హంసశ్రేష్ఠుఁడు; 12. కొలంది = పరిమితి; 13. ఉంకించు = యత్నించు; 14. కట్టిఁడి మత్తుఁడు = క్రూరుఁడైన మదించినవాఁడు; 15. కష్టము; 16. పావురము; 17. గర్వమున; 18. భేదము; 19. సాళువము = డేగ; 20. మదమఱు = మదము + అఱు = గర్వము కోల్పోవు; 21. కోవెల = గుడి; 22. పావురముల జంట; 23. పక్షుల జంట.

దేవాలయములో నేల ప్రాలి చెఱలాడు[1] చుండ, నొక్క శ్యేనంబు[2] వాని దవ్వుదవ్వుల[3] వీక్షించి, చేరవచ్చి దుర్గసమాశ్రయబలంబునఁ[4] బట్టనలవికాక, యప్పటికి నొడుపుదప్పి 'వంటయింటి కుందే ళ్ళివి[5] యెందేగఁగల' వనియెంచి, నాఁటి కెందేనియుం జనియె. అదియంతయు ఱెప్పలిడక[6] చూచి, వెఱచి,[7] పారావతి[8] పతి కిట్లనియె. "చూడరుగదా? ఇప్పు డొక్కజాలియ[9] జాలిమాలి[10], మనలం బట్ట నీ పట్టున[11] కేతెంచి దుర్గబలంబులు[12] మనలం జెనకరామికిఁ[13] దల యూఁచి, మహాకోపంబున మనవైపునకె చూడ్కి[14] నిగిడించుచుం జనియెడు. పుణ్యవశంబున నిప్పటి కా శశాదనాపమృత్యుదేవతవాతం[15] బడక బ్రదికితిమి. అది ముం దెప్పుడును మనమీఁదనే కన్నువేసియుండును. ఇఁక నీఖోటు వాయకుండిన, నెన్నఁడో మన మా యోరణంబు[16] బారి కగ్గ మగుదుము.[17]. ఏ వారికిఁగాని బలవద్విరోధంబు[18] లగ్గు[19]గాదు. ఈ తావు తరలి, వేగ నీ డేగ సేగి[20] తలంగు[21] దము. తాత త్రవ్వించిన తటాకంబని పొంగి బ్రుంగం[22] దగదుగదా? అందుల కొప్పుకొన్నను, ఇది పెద్ద లార్జించిన కాణాచి[23]యుఁగాదు. నిలయంబు వదలలేక, యిందుండి మిన్నక[24] లయం[25] బంద నేల? ఇంక నీ సేగికి వేగిర[26] ముఱవగు వెరవు[27] పరికింపక మసలరాదు. మసలితి[28]మే నుసుఱులు[29] తొఱఁగవలసివచ్చును. కావున, మునుముట్ట[30]

---

1. సంచరించు; 2. శ్యేనము = డేగ; 3. దూరదూరమున; 4. బలవంతముగా; 5. వంటయింటి కుందేళ్ళు = అతి సమీపమున నున్నవి; 6. కనుఱెప్పలు మూయక; 7. వెఱచి = భయపడి; 8. పారావతి = ఆఁడు పావురము, కపోతి; 9. జాలియ = జాలె = ఒక జాతి డేగ; 10. దయలేక; 11. పట్టు = స్థానము; 12. దుర్గబలములన్ = దుర్గము యొక్క బలముగల వారిని; 13. ఎదిరింప రాకుండుట; 14. చూడ్కి - చూడికి = చూపు; 15. శశాదన + అపమృత్యుదేవత - వాతన్ = డేగయనెడి అపమృత్యువనెడి దేవత యొక్క నోరను; 16. ఓరణము = ఒక జాతి డేగ; 17. అధీనమగుదుము; 18. బలవంతులతోడి పగ; 19. లగ్గు = మేలు; 20. సేగి = కీడు; 21. తలఁగు = తొలఁగు; 22. బ్రుంగు = మునుగు; 23. జన్మభూమి; 24. ఊరక; 25. లయము = నాశము; 26. త్వరగా; 27. యుక్తమయిన ఉపాయము; 28. మసలు = ఆలస్యము చేయు; 29. ఉసుఱులు = ప్రాణములు; 30. మునుముట్ట = ముందే.

మెలఁకువ పడవలయును. ఏమి బుద్ధి!" అని, కన్నుల నీరు పెట్టుకొని, గద్గదవచనయై[1] యుమ్మలించు[2] తనబోటి[3]మాటలు గీటునంబుచ్చి[4], మగపులుంగు మొగంబున కలంతినగవు[5] చెలువు గొలుపఁ[6] దన చెలువ[7] కిట్లనియె. "ఏల యీలాగున వలవనివెఱపు[8] గట్టుకొని, నా లా వెఱుఁగక రిత్తయుత్తలపాటు[9] చిత్తంబునకు హత్తించెదు? ఉన్నయూరును గన్నతల్లియు నొక్కరూ పన వినవె? పాటివాని పోటున[10] కోహటించి[11], గృహంబు పాడఱజేసి[12] పాఱినఁ దోడివారు మనలం గని నగరే? దానిచే నగుఁబాటు[13] దక్క నొక్కకార్యంబు[14] లేదు. దైవంబు తప్పఁజూచిన[15], మన యత్నంబు లన్నియు నీటివ్రా ల[16]గును. వెరవులు[17] వేయును[18] నొసలు వ్రాలు[19] తుడువ నేరవు. దేహికి[20] సుఖదుఃఖంబు లీశ్వరేచ్ఛాయత్తంబులు[21]. సుఖమ్ములు రమ్మని తెచ్చు కొన్న వచ్చి, దుఃఖమ్ములు పొమ్మని త్రోచివైచినఁ బోవునే? మఱియొక్కటి వినుము. ఎట్టి విక్రమధురంధరులును[22] నా కట్టెదుటఁ[23] దలచూప[24] నోడుదురు[25]. ఈ తుచ్ఛంబగు డేగ యెంత? ఆ సాళువంబును నొక్క ఖగంబకాని దయ్యంబుగాదు. నీ మది నాయధమశాదనం[26]బున కింత భీతిల నేల? అదియు శకుంతంబ[27]; నేనును శకుంతంబను. ఎక్కడనేనియు వజ్రంబునకు వజ్రంబు తక్కువగునె? ఏల యూరక కొఱమాలిన[28] పిఱికితనంబుఁ గఱపెదవు[29]? అక్కఱటిపక్కి[30] నిక్కంబ మనదిక్కునకు

---

1. డగ్గుత్తిక పడిన మాట కలది; 2. దుఃఖించు; 3. బోటి = ఆఁడుది, భార్య; 4. లెక్కచేయకుండు; 5. లేఁతనవ్వు; 6. అందమును గూర్చు; 7. చెలువ = స్త్రీ భార్య; 8. తగని భయము; 9. వ్యర్థ విచారము; 10. పోటు = దెబ్బ; 11. జంకు; 12. పాడొనరించు; 13. అపహాసము; 14. ప్రయోజనము; 15. నిర్దయమగు, ప్రతికూలమగు; 16. నీటిపై వ్రాఁతలు = వ్యర్థములు; 17. వెరవు = ఉపాయము; 18. వేయును = వేయియును; 19. నుదుటి వ్రాఁత; 20. దేహి = మనుష్యుఁడు; 21. దేవుని యిష్టమునకు అధీనమైనవి; 22. పరాక్రమముయొక్క భారమును వహించువారు; 23. కడు + ఎదుటన్ = ఎట్టయెదుర; 24. తోఁచు; 25. జంకుదురు; 26. తుచ్ఛమైన డేగ; 27. పక్షియే; 28. పనికిమాలిన; 29. బోధింతువు; 30. అక్కఱటి పక్కి = అ+కఱటి = మోసపుఁ బక్షి.

వచ్చెనేని, నే నొక్క ముక్కుపోటునం గీ టడంచెద[1] నొండె; కులిశ సఖంబులగు[2] నిశాతనఖంబులం[3] జించి చెండాడెదనొండె. ఆర్యులు కార్యమ్ములం దమశౌర్యమ్ములం బ్రకటింతురుగాని, మాటలం బ్రకటింప నొల్లరు[4]. నా కిప్పుడూరక నీతోడ వాగ్వాదమేల? నీవుచూచి మెచ్చుతఱి[5]యును వచ్చును. నా వచనములు విశ్వసించి, యా వంత[6] యావంతయు[7] లేక, నిశ్చింతమ్ముగ నుండుము. మన కిప్పుడు వచ్చిన భయమేమియు లేదు; అని, యూఱడించిన నా పులుఁగుచెలువ[8] చెలువునిమాటకు మాఱాడ వెఱచి, లోనియారటంబున[9] కూరటఁగానక, డెందంబున[10] డోలాందోళనంబు[11] నొంద, మొగము వెలవెలపా టెలనగవున[12] నడంచి, యూరకుండెను. అంత నా డేగయుఁ బగచాటి[13], మఱునాఁడు రేపాడి[14] వెడలివచ్చి, యాలయప్రాసాదంబుమీఁద[15] నిర్గమ ద్వారంబువలనికి[16] దృష్టి సారించి, పొంచి చూచుచుండెను. అప్పు డక్కలరవంబు[17] లరుణోదయంబున[18], నెప్పటియట్ల సంచారార్థంబు మంద మందగమనంబుల[19] దిక్కుల కరుగ వెడలుడు, నాఁటితోఁ బావురపుసతికిం బతితోడి ఋణానుబంధంబు తీఱుటంజేసి, యయ్యెఱుజు[20], పోతుబకదారి[21] నుక్కున[22] ముక్కునం గఱచికొనిపోయి, నాఁటిబోనంబునకుం[23] దానిఁ దొలి ముద్దఁగాఁ జేసికొని, యాప్యాయనంబుగ సాపడియె[24]. ఆ కలరవాంగనయుఁ[25] బులినోరికండ[26] జాఱిపడ్డట్టు చావునకుం దప్పి, దేవళంబుం దూఱె. ఎంతవారికిఁగాని, యాత్మకృతదోషఫలం[27] బవశ్యభోక్తవ్యంబ కదా[28]. కావున,

---

1. చంపు; 2. వజ్రమునకు మిత్రము; 3. వాఁడి గోరు; 4. ఒల్లరు = ఇష్టపడరు; 5. తఱి = సమయము; 6. వంత = విచారము; 7. ఆవ + అంత = కొంచెము; 8. ఆఁడుపక్షి; 9. ఆరటము = కలఁత - ఆరాటము (రూపాం.); 10. మనస్సు; 11. ఊయల ఊఁపు; 12. ఎల-నగవు = చిఱునవ్వు; 13. దూషించు; 14. రేపాడి = ప్రాతఃకాలము; 15. గుడిదేవళము; 16. బయల్వెడలు ద్వారము దిక్కునకు; 17. కలరవము = పావురము; 18. సూర్యోదయమున, 19. మెల్ల మెల్లని నడలతో; 20. ఆ+ఎఱుజు = ఆ డేగ; 21. మగపావురము; 22. ఉక్కునన్ = బలముతో; 23. బోనము = భోజనము; 24. సాపడు = భుజించు; 25. కలరవ + అంగన = ఆఁడు పావురము; 26. పులినోటిలోని మాంసము; 27. తనచేఁ జేయఁబడిన పాపఫలము; 28. తప్పక భుజింపఁదగినది.

బలవంతునితో నొంటమిఁ[1] గొంట దుర్మరణంబునకే కారణం బగును.

మఱియు నెంతటి బల్లిదులకును[2] వాక్పారుష్యంబు[3] మేలుగాదు. దానివలన సర్వకార్యంబులును విఫలంబులై చనును. గొడ్డంట నఱకిన తరువైన[4] మరలఁ జిగిరించుంగాని, మాటలు విఱిగిన మనసు తిన్నఁబడనేరదు. మున్ను వాగ్దోషంబునంగాదె యొకగర్దభంబు[5] మర్దింపఁ[6]బడియె. నీ కా కథ వాక్రుచ్చెద నాలింపుము.

## పులితోలు కప్పికొనిన గాడిద

కరిపురంబున విలాసుం డను రజకుం డొకండు గలఁడు. ఆ మడివేలు[7] చేరువగ్రామమునుండి క్రొత్తగా నొకగాడిదను విలిచి[8] తెచ్చి, దాని బలిపింపవలె[9] నను తలంపునఁ జక్కనియుపాయం బొక్కండు వెదకి, పొడగాంచి, యా గాలిగానిమేన[10] నొక్కపులితోలు వ్రేలం గప్పి యప్పుడప్పు డరణ్యప్రాంతసస్యక్షేత్రంబుల రాత్రులు త్రోలుచుండును. క్షేత్రరక్షకులును[11] విభావరిం[12] బులికళాసంబు[13]లోనిదాని దూరమునుండి విలోకించి, చిత్తమున వ్యాఘ్ర మను[14] భ్రమ గప్పి, యప్పుడు భయోత్కంపంబున[15] డాయ నోడి[16], యూడనిఁబాడుదురు[17]. కాఁబట్టి నిరంతరాయముగా[18] నిచ్చలుఁ[19] బచ్చగందని పయిరు కడుపార దొరకుచుంటంబట్టి, కఱవాఱ మేసి పోసరించి[20], యా రాసభంబు[21] యథేచ్ఛముగాఁ గ్రుమ్మరుచుండును. ఇట్టు కొంతకాలము కడచిన పిమ్మట నొక్కనాఁడు క్షేత్రస్వామి యొక్కఁడు ఱాగుండియవాఁడు[22] తన

---

1. ఒంటమి = విరోధము; 2. బల్లిదుఁడు = మిక్కిలి బలము గలవాఁడు; 3. మాటదురుసుతనము; 4. తరువు = చెట్టు; 5. గర్దభము = గాడిద; 6. కొట్టు; 7. రజకుఁడు, మడివేలు = చాకలివాఁడు; 8. విలుచు = కొను; 9. బలిసినదిగాఁజేయు; 10. గాలిగాఁడు + మేను = గాడిద శరీరము; 11. పొలము కాఁపరి; 12. విభావరి = రాత్రి; 13. పులికళాసంబు = పులితోలు; 14. పులియనెడు; 15. భయము వలని మిక్కిలి వణఁకు; 16. డాయన్ + ఓడి = సమీపింప భయపడి; 17. ఊడనిఁబాడు = తొలఁగు; 18. నిర్విఘ్నము; 19. నిచ్చలు = నిత్యము; 20. పోసరించు - పోతరించు = బలియు; 21. రాసభము = గాడిద; 22. ఱాతి గుండెవాఁడు - కఠినాత్ముఁడు.

పయిరు నిచ్చలుఁ బొలివోవుచుంటకు[1] మనంబున దుఃఖించి, దూరము, విచారించి, యెట్టకేలకు మనంబు గట్టిపఱుచుకొని, నెట్టన[2] సాహసించి, దుర్గమం బగు ప్రయత్నంబునఁ బొలంబు సొచ్చి, ధూసరకంబళంబు[3] మెయినిండం[4] గప్పుకొని, యప్పొలంబు నవలతటి నొకవృక్షంబు క్రీనీడ[5] నధిజ్యశరాసనుండయి[6] కనుమోసములేక పొంచి కూర్చుండి యుండెను. అప్పు డెప్పటియలవాటు చొప్పున ఖరంబు[7] చేను చొచ్చి, యచ్చేరువ బూదివన్నె యగొంగళిలో నున్న పొలముకాఁపున వే ఱొక్క గర్దభంబుగా వగచి[8], కాలపరిపాకం బగుటను వాని కభిముఖంబుగాఁ[9] గూయుచు డాయ వచ్చెను. ఆ కూఁత విని పొలముకాఁపు కలరూపు[10] తెలిసి, దరహాసచంద్రికా సుందరవదనేందుండయి[11], "యీ కిగ్గాడి[12] గాడిదా యిన్నాళ్ళును మా యందఱ కన్నులను గప్పినది?" అని నిర్భయంబుగ డాయఁబోయి, యా బాలేయము[13] నవలీల నొక్కకోలం[14] గూలనేసి, కృతాంతదర్శనంబునకుం[15] బుచ్చి కృతకార్యుండయి[16] చని నాఁటఁబట్టి[17] కరము[18] సుఖంపడియుండె[19]. కావునఁ బలుకుఁబ్రల్లద[20] మెప్పుడుం దప్పక గొప్పయొప్పమిఁ[21] బుట్టించును. శ్రేయస్కాముం[22] డది యుడిగి[23], యడఁగిమడఁగి యుండవలెను. అది యట్లుండె; తదనంతర వృత్తాంతంబు వినిపింపు మనిన, హంసంబునకు బకోటం[24] బిట్లనియె.

1. నశించు; 2. నెట్టన = అనివార్యముగా; 3. బూడిద రంగు కంబళి, 4. మెయి = శరీరము, మై (రూపం.) శరీము నిండ; 5. క్రీనీడ = క్రింది + నీడ; 6. ఎక్కుపెట్టఁ బడిన విల్లు గలవాఁడు; 7. గాడిద; 8. వగచు = తలఁచు; 9. ఎదురు; 10. కలరూపు = యాధార్థ్యము; 11. చిఱునవ్వు అనెడి వెన్నెలచే నందమయిన చంద్రునివంటి ముఖము గలవాఁడు; 12. కిగ్గాడి = దిట్టతనములేని; 13. బాలేయము = గాడిద; 14. కోల = బాణము, కఱ్ఱ; 15. యమునియొక్క దర్శనంబునకు; 16. చేయఁబడిన పని గలవాఁడు; 17. నాఁటఁబట్టి = వాఁడు మొదలు; 18. కరము = మిక్కిలి; 19. సుఖము + పడి = సుఖము పొంది; 20. పలుకు + ప్రల్లదము = వాక్పారుష్యము; 21. ఒప్పమి = ఆపద; 22. శుభముఁ గోరువాఁడు; 23. ఉడుగు = విడుచు; 24. బకోటము = కొంగ.

అట్లు వాని పరుషభాషణంబులకు రోషించి[1] యుద్ధసన్నద్ధుండనయి నిలిచిన నన్ను వీక్షించి, యా పక్షు లిట్లనియె. "ఓరీ! స్వామిద్రోహీ! యింటఁ గుడిచి యింటివాసము లెన్నిక యిడిన వడువున[2], మా దేశమునఁ గ్రుమ్మరుచు మా స్వామినే యాక్షేపింపఁ జొచ్చితివి. కావున, నీవు సద్యోవధార్హుండవు[3]; పాపకర్ముండవు; నీ యెడ నించుకయిన దయఁ జూడఁదగునె? కుడిచి[4] కూర్చుండి యుబుసుపోక, నోరిక్రొవ్వున[5] నింత తెచ్చుకొంటివి. చేసికొన్న దనుభవింపక తీఱదు. మ మ్మెవరిఁగాఁ జూచితివి? శౌర్యాలంకారుండగు[6] చిత్రవర్ణుని బంట్లను మ మ్మెఱుంగవే? ఇప్పు డెట్టును నీ ప్రాణంబులు పుచ్చుకొనక విడువము. నిమిష మడిచివడకుండ[7] నిలువుము. నీపడు బాములు[8] చూచెదవు." అనుచుం గవిసి[9], దురాగ్రహగ్రస్తంబులై[10] యా ఖగంబులు నఖరముఖవిదారణంబులఁ బక్షతాడనమ్ములఁ[11] నన్ను నొంచి[12] మఱియు నిట్లనియె. మీ రాజు మరాళంబు[13] మిగుల మెత్తనివాఁడు. అట్టివానికి రాజ్యాధికారపూజ్యత యెక్కడిది? సంతతక్షముండైనవానిం[14] గని, భృత్యులు[15] వెఱవక యెల్లిదంబుగఁ[16] జూతురు. క్షమాతేజంబు[17] లాయాయి యెడలఁ[18] బ్రయోగించుట రాజధర్మంబు. అట్టి రాజే ప్రజానురంజకుం డగును. సంతతతేజుం[19] డగుటయు క్షేమంబు గాదు. తేజంబు కడుఁ జూపిన వాని నతిక్రూరుఁగా భావించి, వానిపొత్తు నహిపొత్తుగా[20] నెంతురు. కావున, నిలాపాలనంబుఁ[21] బూనువాఁ డవసరోచితంబుగ[22] క్షమాతేజంబులు రెండును

---

1. కోపించు; 2. తిన్నయింటికే నాశనము తలపెట్టు విధమున; 3. సద్యస్(ః) + వధ + అర్హుఁడు = వెంటనే చంపఁదగినవాఁడు; 4. కుడుచు = తిను; 5. వాక్పారుష్యము; 6. శౌర్యము అలంకారముగాఁ గలవాఁడు; 7. త్వరపడు; 8. నీవు పడు కష్టములు; 9. కవియు = ఎదిరించు; 10. దుష్టకోపముచే మ్రింగఁబడినది; 11. గోటికొనల్లఁ చీల్చుట, ఱెక్కల దెబ్బ; 12. నొంచు = నొప్పించు; 13. హంస; 14. ఎప్పుడును సహనము గలవాఁడు; 15. సేవకులు; 16. పరిహాసము; 17. సహన పరాక్రమములు; 18. ఆయాచోటుల; 19. ఎల్లప్పుడును బరాక్రమించువాఁడు; 20. పొత్తు = స్నేహము, అహిపొత్తు = పాముతోడి స్నేహము; 21. భూపరిపాలనంబు; 22. సమయోచితంబుగ.

వెలయించుచు[1], వీరశాంతాదిగుణంబుల, సరఘా సమాశ్రిత మధుకోశంబు[2] చందంబున నధృష్యుండును[3] నభిగమ్యుండును[4] నయి చూపట్టవలెను. ఏకాంతమృదువగు[5] వాఁడు కరస్థమగు[6] నర్థమునేని[7] దక్కించుకొన సమర్థుండు గాఁ డనఁ, బ్రజాపాలనదక్షుండయి[8] రాజ్యభారంబు భరియింప నెట్లు శక్తుం డగును? అప్పులఁ[9] బడియుండు తెలిపిట్ట[10]యా రాజనామంబుఁ దాల్ప నర్హుండు? దానిఁ బూనువాఁ డెంతటివాఁడు కావలెను? అట్టి దుర్బలుని పాదసేవకుండవయి నీ వేమి భాగ్యమనుభవించితి వని, నిక్కంపు హితుం డవుఁబోలె మా కీ వెడబుద్ధులు[11] గఱపవచ్చితివి? లోకమున నెవ్వరైనఁ బ్రబలునిం జేపట్టుదురు గాని దుర్బలుని పొంతలం బోనైన నొల్లరు. ఆశ్రయించినను, ఫలచ్ఛాయాసమన్వితం బగు[12] మహావృక్షమునే యాశ్రయింపవలెను. ఒకవేళ దైవికంబుగ ఫలంబులు లభింపకపోయినను, ననివార్యంబగు దానినీడ నేఁడు[13] మాప[14]నోపును? సింహప్రసాదంబున[15] నజంబును[16] వనంబున నిర్భయంబుగఁ జరియించుటఁ గానమె? అట్లె ప్రబలులం జేరిన లాఘవాస్పదునకును[17] గౌరవం[18] బబ్బును; ద్వేష్యులును[19] సర్వజగన్మాన్యు[20] లగుదురు; ఇఁక నార్యులు ప్రశంసనీయు లగుదురని యుగ్గడింప[21] నేల? ఎప్పుడును హీనుని మాత్రము చేరరాదు. చేరినచో, మునుగల గౌరవము సైతము పోవును. శౌండుని కరంబున నున్న పాలముంతనేని కల్లుముంతయే యందురు[22]. నీచసేవ కేవలము శ్వవృత్తి[23].

---

1. ప్రకటించు; 2. తేనెటీఁగలచే నాశ్రయింపఁబడిన తేనెపట్టు; 3. అధృష్యుఁడు = తిరస్కరింపఁదగని వాఁడు; 4. చేరఁదగినవాఁడు; 5. మిక్కిలి మెత్తనివాఁడు; 6. చేతనున్నది; 7. అర్థము = ధనము; 8. దక్షుఁడు = సమర్థుఁడు; 9. అప్పులు = నీళ్లు; 10. తెలిపిట్ట = హంస; 11. వెడబుద్ధులు = అల్పబుద్ధులు; 12. పండ్లతోను, నీడతోను గూడినది; 13. ఏఁడు = ఎవఁడు; 14. మాప = మాయఁజేయు; 15. అనుగ్రహము; 16. అజము = మేక; 17. తక్కువతనమునకుఁ జోటయిన వాఁడు; 18. గౌరవము = గొప్పతనము; 19. ద్వేష్యులు = ద్వేషింపఁదగినవారు; 20. అన్నిలోకములచేత గౌరవింపఁదగినవారు; 21. ఉగ్గడించు = చెప్పు; 22. కల్లు త్రావిన వాని చేతనున్న పాలముంత నైన కల్లుముంతనియే యందురు; 23. శ్వవృత్తి = కుక్క వర్తనము.

పడిన యాయాసం బెల్ల నిష్ఫలం బగుటయేకాక దాన మనోఽభీప్సితం[1] బెప్పుడును సఫలంబు కాదు. హీనమానపదాశ్రయులకుఁ[2] గొన్ని యవసరంబుల దొసంగులును[3] బొసంగును[4]; అట్టివారి జన్మంబు లెప్పుడును దుఃఖ భాజనంబు[5] లగును. ఎప్పుడైనఁ దప్పిదారి, యించుక యభీష్టఫలసిద్ధి యయిన నది తుదముట్టనేరదు. అల్పజలాశయంబుఁ[6] జేరిన విసారంబు[7] నట్టుల, యల్పు నాశ్రయించువాఁడును వానితోడన తీఱును[8]; అట్లు తీఱకమున్నను, నా గండకమున[9] కెట్లు వానికి నట్లు గండములు మెండుగా నుండును. అల్పులతో క్షణమాత్రంబును నిలువను, సంభాషింపను, బోలదు. సజ్జన సాంగత్యంబున సర్వార్థసిద్ధులుఁబోలె, దుర్జనసంగమంబున సకలానర్థములును బ్రాప్తము లగును. ఆధారాధేయభావంబునంజేసి[10] యాదర్శంబున[11] ద్విరదం[12] బన్నువయయి[13] కనుపట్టునటుల, యలంతులఁ[14] జేరినవలంతులను[15] నలంతులయి కానఁబడుదురు. కాన హీనసేవ[16] యావంతయుఁ గర్తవ్యంబు గాదు. పొట్టకయి యట్టిహీనుని కాళ్ళుపట్టుకొని, కష్టపుజీవనము జీవించుట కంటె, మానవంతునకు నిశ్చంచలంబగు నిశ్చయంబున నడవిలో నుండి, వన్యాహారంబుల[17] సుఖముగాఁ గాలము గడపుట సర్వలోకసమ్మతమైన పక్షము; లేదా కీర్తిధను[18] నొక్కని పాదభక్తుఁడ నని పేరుపెట్టుకొని, తక్కువపాటులేక బ్రతుకుట యంతకంటె నుత్తమపక్షము. మఱియు లోకములో రాజునాశ్రయించుట, కష్టకాలంబులఁ దమ్మాతం డపాయంబులవలనం బాపి కాపాడునని కదా? అట్టి రక్షణ మా రాజువలనం గలుగకపోయెనా, వానితోడి

---

1. మనస్(ః) + అభీప్సితము = మనసునందలి కోరిక; 2. మానహీనులైన వారి అడుగుల నాశ్రయించినవారు; 3. దొసఁగు = ఆపద; 4. పొసఁగు = కలుగు; 5. దుఃఖమునకుఁ బాత్రము; 6. తక్కువ నీరు గలది; 7. విసారము = చేఁప; 8. వానితోపాటే నశించును; 9. ఖడ్గమృగము; 10. ఆధార + ఆధేయ - భావము = ఉండునది, ఉంచఁదగినది - ఉదా:- పాత్రము ఆధారము, నేయి ఆధేయము; 11. ఆదర్శము = అద్దము; 12. ద్విరదము = ఏనుఁగు, రెండు దంతములు గలది యని వ్యుత్పత్తి; 13. అన్నువ = కొంచెము; 14. అలఁతి = తక్కువవాఁడు; 15. వలఁతి = సమర్థుఁడు; 16. తక్కువవానిని గొలుచుట; 17. అడవికి సంబంధించిన ఆహారము; 18. కీర్తి ధనముగాఁ గలవాఁడు.

ప్రయోజన మేమి? అట్టి పరివృఢుండు[1] లేక పోయినను, వ్యపదేశంబున[2] నైన బ్రతుకవచ్చును. తొల్లి శశమ్ములు వ్యపదేశం బునంగాదే, యభిమతార్థసిద్ధిఁ[3] బడసి నితాంతసౌఖ్యం[4] బనుభవించెను? ఆ కథ ససాకల్యముగా[5] వినిపించెదము వినుము.

## కుందేలు - ఏనుఁగు

పూర్వ మొకప్పు డవగ్రహనిగ్రహంబు[6] సంభవించి, జలాశయంబులెల్ల జలశూన్యంబు[7] లైన, దైన్యంబున గహనంబునం[8] గల మతంగజ నివహంబులు[9] యూథనాథు[10] పాలికిం బోయి, సకరుణంబుగా[11] నిట్లనియె. "స్వామీ! యేమని చెప్పుదుము? ఈ నికటంబున[12] మే మజస్రంబును[13] స్నానపానంబులు సేయుతటిని[14] యీ యేఁటివఱవుచే[15] నిదాఘంబగుడుఁ[16] బ్రబలాతపతాపంబున[17] జంబాలమాత్రావశిష్టంబయ్యె[18]. అల్పకాసారంబుల గతి[19] తడవ నేల? తావకచరణసేవకులముగాఁ[20] గాఁజాలియు, ననతిక్రమణీయం[21]బగు మా యభాగ్యంబుకతంబునఁ దృష్ణాతిరేకంబున[22] మా కిట్లాకులపాటు[23] పాటిల[24]వలసిన కాలంబు సంప్రాప్తమయ్యెను. ఇట్టి దుష్కాలంబు ప్రాప్తమగునని కలనేనిం దలఁచి యెఱుంగము. ఏ కాలమున నేమివచ్చునో యెవ్వఁ డెఱుఁగును? ఆహా! కాలంబుఁ బోలుదాఁ

1. పరివృఢుఁడు = రాజు; 2. వ్యపదేశము = మిక్కిలి కపటము; 3. కోరిన ప్రయోజనము నెఱవేఱుట; 4. నితాంత సౌఖ్యము = అధిక సుఖము; 5. ససాకల్యము = సంపూర్ణము; 6. అవగ్రహ నిగ్రహము = వఱపు వలని బాధ; 7. జలశూన్యము = జలముచేత శూన్యము - నీరులేనిది; 8. గహనము = అడవి; 9. మతంగజ నివహంబులు = ఏనుఁగుల గుంపులు; 10. యూథము = గుంపు, నాథుఁడు = నాయకుఁడు; 11. దయతోఁ గూడుకొనునట్లు; 12. నికటము = సమీపము; 13. అజస్రము = ఎల్లప్పుడు; 14. తటిని = నది; 15. ఏటివఱవు = సంవత్సరపు వానలేమి; 16. నిదాఘము = వేసవి, అగుడున్ = అయినంతనే; 17. అధికమైన ఎండ వేఁడిమి; 18. (జంబాల) = బురద మాత్రమే మిగిలినది; 19. చిన్న చెఱువుల; 20. మీ పాదసేవ చేయువారు; 21. అతిక్రమింపరానిది; 22. దప్పియొక్క అతిశయము; 23. ఆకులపాటు = కలఁత; 24. పాటిలు = సంభవించు.

గాలంబుఁదక్క నింకొక్క చానిం గానము గదా? ఇత్తఱి మమ్ము భవదీయ ప్రసాదోపజీవుల[1] పిపాసం[2] గాసిలకుండ[3] నేది[4], యీ బారిఁ గడవఁబెట్ట దేవరచరణంబలుదక్క నన్యంబు శరణ్యంబుఁ గానము. మే మందఱము మా మనఃపరితాపంబు నివేదించి, దేవరకృప నాశ్రయింప వచ్చితిమి. వేళంబ దీనికిం దగిన సదుపాయంబు చింతింపవలయు. అనన్యగతికులమగు మమ్మింక మంచినం దేల్చినను దేవరదే భారము." అని యూరకున్న యూథనాయకుండును సంక్షుభితం[8] బగుహృదయంబునఁ, గార్యభారమగ్నుండై కొండొకవడి చింతించి, యొక్క జంఘాలునిం[9] బిలిచి, నీ విప్పుడతిత్వరితగతింబోయి, "యీ కుఱంగల[10] నెందైన మధురశంబరపూరితం బగుసరోవరం[11] బారసి, మాకడనున్నట్లు[12] చనుదెమ్ము. అట్లు సేయఁ బ్రాలుమాలి[13] యూరకరాక, నీ యసువర్గంబులపోక సుమీ." అని పంచిన, వాఁడును వినయనయభయంబులు హృదయంబునం గదుర[14], జేనియానతిని శిరసా వహించి తత్క్షణంబునఁ గదలి మనోవేగముతో నేగి, విపినం[15] బెల్ల వెదకి తుద కచ్చేరువ నొక్కమడువు పొడగని, హర్షోత్కర్షంబునఁ[16] బఱతెంచి[17], యూథపతి కిట్లనియె.

"దేవా! సేవకుం డీ వనమధ్యంబున నిర్మలజలపూర్ణహ్రదం[18] బొక్కటిచూచి, యిదిగో సఫలప్రయత్నుఁ డయి వచ్చె; ఇంక భృత్యులతోడఁ గూడి దేవర విచ్చేయు నవసరంబు. మనవారెల్ల నాప్యాయంబుగఁ[19] బానీయంబులు గ్రోలఁ గాంచిరి." అన సామజస్వామియు[20], గడుఁబ్రమోదించి,

1. మీ అనుగ్రహముచే జీవించువారు; 2. పిపాస = త్రావనిచ్చ; 3. గాసిలు = బాధపడు; 4. ఏదు = పెంచు; 5. కడవఁబెట్టు = దాఁటునట్లు చేయు; 6. వేళము = శీఘ్రము; 7. అనన్యగతికులు = వేఱుగతి లేనివారు; 8. సంక్షుభితము = కలఁగినది; 9. జంఘాలుఁడు = మిక్కిలి వడిగా నడచువాఁడు; 10. కుఱంగలి = సమీపము; 11. తీయని నీటితో నిండిన చెఱువు; 12. మాదగ్గఱ నున్న విధమున - అతి శీఘ్రముగా నని భావము; 13. సోమరితనము పొందు; 14. కదురు = కలుగు; 15. అడవి; 16. సంతోషాతిశయము; 17. పఱతెంచు = వచ్చు; 18. స్వచ్ఛమైన నీటితో నిండిన మడుఁగు; 19. ఆప్యాయనము = తృప్తి; 20. ఏనుఁగుల ప్రభువు.

యతని నభినందించి, గజవ్రజంబుల[1] వెంటఁ బెట్టుకొని మడువుకడకు నడచి, జలమ్ముల డిగి, తోయమ్ము[2] లాకంఠమ్ముగఁ[3] గ్రోలి, కంఠదఘ్నమ్ము[4] లగునంబువులం[5] దేలి, యోలలాడం దొడంగెను. అప్పుడు, యాతాయాత గజవ్రాత పదతలాఘాతమ్ములం[6] జదిసి[7] సమసిన[8] శశకవిసరమ్ముల[9] నాలోకించి, శోకానలసంతప్తస్వాంతుండయి[10], శశకేంద్రునిమంత్రి రోమకర్ణుఁడు బెగ్గలం బగ్గలింప[11] రోఁజుచుఁ[12] బాఱుతెంచి[13], నిజాధీశ్వరుని శిలీముఖునిఁ గాంచి, వినయవినమితోత్తమాంగుఁడయి[14] నమస్కరించి, తమవారికిఁ బాటిల్లిన ముప్పు చెప్పఁబోయి[15], డగ్గుత్తిక పడి, కొంతవడి యూరకుండి, యెట్టకేలకు నెలుంగు తెచ్చుకొని యిట్లనియె "దేవరప్పారు కంటిరో కానరోకాని, గజ విసరములచే మన శశములకుం బ్రళయము ప్రాప్తమయ్యెను." - అనుడు, నా దారుణభాషణము[16] శ్రవణములం[17] దూఱి హృదయదారుణము[18] గావింపఁ, గరగుప్తకర్ణుండై[19] 'హరిహరీ' యని కన్నులు మూసికొని, కొంతసేపు చిత్రాయమానగాత్రుండయి[20] ఱిచ్చవడి[21] యుండి, మంత్రి ప్రయత్నంబునం దెలిసి, దీర్ఘవిశ్వాసపురస్సరముగా[22] నలుదెసలుం జూచి, యల్లన[23] లేచివచ్చి కార్యచింతావరత్వమున సమాత్యులంగని శిలీముఖుం డిట్లనియె. "మంత్రులారా! యీ యేఁడు వేసవి వేఁడిమిఁ బోఁడిమిచెడి[24], యెల్లవంకల

1. ఏనుఁగుల గుంపు; 2. తోయము = నీరు; 3. అకంఠము = కంఠమువఱకు; 4. కంఠదఘ్నము = కుత్తుకబంటి; 5. అంబువు = నీరు; 6. యాతాయాత = పోవు, వచ్చు, గజవ్రాత = ఏనుగుల గుంపుయొక్క, పదతల = అడుగుల, ఆఘాతమ్ములు = దెబ్బలు; 7. చదియు = నలఁగు; 8. సమయు = చచ్చు; 9. శశక విసరము = కుందేళ్ళ సమూహము; 10. దుఃఖమనెడి అగ్నిచే మిక్కిలి క్రాఁగిన మనస్సు గలవాఁడు; 11. బెగ్గలము = భయము, అగ్గలింపన్ = అధికముకాఁగా; 12. రోఁజుచు = నిట్టూర్చుచు; 13. పరువెత్తుకొని వచ్చి; 14. అడంకువచే మిక్కిలి వంగిన శిరస్సు గలవాఁడు; 15. ఆపద చెప్పఁబోయి; 16. భాషణము = మాట; 17. శ్రవణము = చెవి; 18. హృదయమును జీల్చుట; 19. కరగుప్త కర్ణుఁడు = చేతులతోఁ గప్పఁబడిన చెవులు గలవాఁడు; 20. బొమ్మవలెనైన శరీరము గలవాఁడు; 21. ఱిచ్చ + పడు = నిశ్చేష్టత చెందు; 22. నిట్టూర్పులు ముందగునట్లు; 23. అల్లనన్ = మెల్లఁగా; 24. పోఁడిమి = అందము.

వంక[1] లింకంబాఁ మీఱినదగ[2] పెల్లిదమున[3] నుల్లములు పల్లటిల్ల[4] వదనములు[5] వఱువట్లువట్ట[6], వేదండతండములు[7] నడగొండపిండువడువున[8] వెడలి, పుడమి[9] యీనిన చందమున నెల్లెడలఁ దామ యయి, మెండుకొని[10] యున్నవి. ఇప్పుడు వానియడుగుల యడుగునం బడి మడిసిన[11] మన చెవులపిల్లల సుద్ది[12] వినినయప్పటినుండి నా యుల్లము పెల్లు[13] తల్లడిల్లు చున్నది. పిపాసాపరాయత్తచిత్తము[14] లగు నీ మత్తదంతావళసంతానముల[15] నశ్రాంతము[16] నంబుపానార్థము[17] వచ్చుచుఁ బోవుచు నుండనిచ్చితిమేని, యచిరకాలమున మన కులం బెల్లఁ బ్రాణములు గోలుపోయి, నామమాత్రావ శేషం[18] బయి యుండవలసివచ్చును. ఇప్పటికే కించిదూనముగాఁ[19] బొలిసి[20], పారావారమ్మఁ[21] బురుడించుబలంగమ్మ[22] గోష్పదాకృతి[23] యయ్యె. ఇంకఁ దడసినఁ[24], గార్యంబు తప్పును. బలహీనులము కావున, మనకు వాని మాఱుకొను[25] పాటిబలిమి లేదు. ఏమి సేయువారము? ఎట్లయిన నీ వారణం[26] బులబారికిం దగు ప్రతీకారంబు సత్వరంబుగ నారయం జను." అన, శోక విస్మయపరీతస్వాంతులయి[27] యెద్దియుం దోఁచక, మంత్రు లన్యోన్య ముఖావలోకనంబులు[28] సేయుచు, మన కియ్యెడ దైవంబకాని వేఱొండు శరణంబు లేదని వగగూరి[29], మొగంబులు తెలివి తప్పి యుండ,

1. ఎల్లవంకల వంకలు = అన్నిచోట్లఁగల వాఁగులు; 2. దగ = దప్పి; 3. పెల్లిదము = అతిశయము; 4. పల్లటిల్లు = చలించు; 5. ముఖము; 6. వఱువట్లువట్టు = మిక్కిలి యెండు; 7. ఏనుఁగుల గుంపు; 8. నడచు కొండల సమూహము విధమున; 9. పుడమి = భూమి; 10. అతిశయించు; 11. మడియు = చచ్చు; 12. సుద్ది = వృత్తాంతము; 13. పెల్లు = అధికముగా; 14. దప్పి కధీనములైన మనస్సులు గలవి; 15. మదించిన ఏనుఁగుల సమూహములు; 16. అశ్రాంతము = ఎల్లప్పుడు; 17. నీరు త్రావుట కొఱకు; 18. పేరు మాత్రమే మిగులునది; 19. కించిత్ + ఊనము = కొంచెము తక్కువగా; 20. పొలియు = చచ్చు; 21. సముద్రము; 22. పురుడించు = పోలు, బలంగము = సేన; 23. గోవు పాదము నాకారము; 24. తడయు = ఆలసించు; 25. ఎదుర్కొను; 26. వారణము = ఏనుఁగు; 27. దుఃఖము, ఆశ్చర్యము అనువానిచేఁ బట్టుకొనఁబడిన మనస్సులు గలవారు; 28. ఒకరి మొగము నొకరు చూచుకొనుట; 29. వగగూరి = దుఃఖమును బొంది.

నాదరవినయసంభ్రమంబులు ముప్పిరిగొన నాతఁడి విజయుం డను ముసలి కుందేలు శిలీముఖున కిట్లనియె. "ఓ మహాప్రభూ! దేవరదివ్యచిత్తంబున నిది యొకపనిగా నెంచి చింతింపవలదు. దేవరదయ గలుగ, నాకీ యమిత్రుల[1] నోర్చు టెంతపని[2]? లోకంబునఁ బ్రజ్ఞాసాధ్యంబులు[3] కాని కార్యంబు లేవియు లేవు. దేహబలంబు లేనివాఁడయ్యు, శేముషీమంతుం[4] డెంత ఘనకార్యంబు నైనఁ దృణప్రాయంబుగ నిర్వహింప సమర్థుండై యుండును. దేశకాలజ్ఞులమై[5] యనారతము[6] దేవర యోలగంబునం[7] గొలువుసేయు మముబోఁటి వారి కీ నాగమ్ములఁ[8] దొలఁగఁద్రోలుట యొక దుష్కరము గాదు. స్వామి కనుగిఱి పినం[9] జాలు ఏలినవారి నియోగబలంబున[10] నశ్రమంబున[11] నెంతటి కార్యంబు నైన ననివార్యంబుగా[12] సాధించుకొని, నీ లెంకలలెంక[13] రాఁగలఁడు." అని యనిపించుకొని చనువాఁ డయి యాజ్ఞయే యనఁ గుందేళ్ళరాయండును నాతనిఁ బ్రీతిశీతలంబగు[14] నాలోకనంబునం[15] జూచుచు, నంగీకార పిశునమందహాసనకందళసుందరంబగు[16] మొగంబు పంకించి[17], "సరగ[18] నరిగి కర్జంబు[19]సఫలంబు చేసికొని రమ్ము. నీ తలంపునకు దైవం బనుకూలం బయ్యెడు"మని[20] దీవించిన, 'మహాప్రసాదం' బని పనివిని[21], మార్గంబున నిట్లు చింతించెను. - ఆ దంతి[22] రాజు మహాజంతువు; నేను గడు నల్పజంతువను. ఆ గౌరుం[23] దారసించి[24] నా కెట్లు మాటలాడఁ

---

1. అమిత్రులు = శత్రువులు; 2. ఓర్చుట = ఓడించుట; 3. తెలివిచే సాధింపఁదగినది; 4. శేముషీమంతుఁడు = తెలివిగలవాఁడు; 5. దేశకాలజ్ఞులు = దేశకాలములు తెలిసినవారు; 6. అనారతము = ఎల్లప్పుడు; 7. ఓలగము = సభ; 8. నాగము = ఏనుఁగు, పాము (నానా.); 9. కనుగిఱుపు = కన్ను కదలించు; 10. నియోగ బలము = ఆజ్ఞాబలము; 11. అశ్రమము = కష్టము లేకుండ; 12. అడ్డులేని విధమున; 13. లెంక = సేవకుఁడు; 14. ప్రేమముచేఁ జల్లనిది; 15. ఆలోకనము = చూపు; 16. సమ్మతిని సూచించు చిఱునవ్వు మొలకచే నందమైనది; 17. పంకించి = ఊఁపి; 18. సరగన్ = శీఘ్రమే; 19. కర్జంబు = కార్యము; 20. అగుఁగాకయుని; 21. పనివిను = పోయెద నను; 22. దంతి = ఏనుఁగు; 23. గౌరు = ఏనుఁగు; 24. తారసించు = కలియు.

దలకూడును? తలక ౦ెబో[1], కార్యసంఘటనం[2] బెట్లు సాధ్యమగును? నే నందని(మ్రానిపండ్లు గోయం[3] దలపెట్టితి. నా కోరిక యీడేఱునో[4] యీడేఱదో గదా? - అని చింతాడోలాయమాన్యమానసుండయి[5], కడకుఁ బరమోపాయం బొక్కటి బుద్ధికిం దవిలినఁ జక్కంగాఁ బరికించి, యది మనసునకు సరిపడ్డ తరువాతఁ గదలిపోయి, 'స్పృశించుచునె ద్విపంబును, నాఘ్రాణించుచునె యురగంబును, బాలించుచునే నృపాలుండును, నవ్వుచునె దుర్జనుండును, హింసింతు'రని విచక్షణులు పలుకుదురు[6]. - కాన, నే నీ నగాగ్ర[7] మెక్కి కరిరాజుతో[8] ముచ్చటించెద నని నిశ్చయించి, వేగ నా గిరిశృంగం బధిరోహించి, రాగమనంబు ప్రతీక్షించుచుండె[9]. ఆ పగిదిం[10] గొంతతడ వాతనిరాక కెదురుచూచుచుండి, దంతినాయకునితో మడువున కేతెంచి పానీయంబులు గ్రోలి మరల నిరవున[11] కరుగుచున్నవానితోఁ గొండకొమ్మున నుండి యిట్లనియె. 'ఓ మాతంగపుంగవా![12] నీకు సమస్తంబును శస్తంబగుఁ[13] గాక! ముహూర్తమాత్రంబు నిలిచి, నా వచనంబులు విని పొమ్ము" నా విని[14] యా పలుగొమ్ముల మెగమ్ములఱేఁడు[15] మొగమ్మెత్తి చూచి, "నీ వెవ్వఁడవు? మాతోడ నేమికార్యము గలిగి మాటలాడ వచ్చితివి? కాలవిలంబనంబు[16] సేయక నీ యుదంతం[17] బంతయు నొకటి రెండు మాటల నుడువుము" అనిన, విజయుం డిట్లనియె. "ఎవ్వని పేరు విన్న

---

1. తలకూడు = సిద్ధించు; 2. పనిచేఁత; 3. అందని మ్రానిపండ్లు గోయు = అలవికాని పనిచేయు; 4. ఈడేఱు = నెఱవేఱు; 5. విచారముచే నూఁగులాడు మనస్సు గలవాఁడు; 6. స్పృశించు = తాఁకు, ద్విపము = రెంటిచేఁ (తొండము, నోరు) ద్రావునది, ఆఘ్రాణించు = వాసనచూచు, ఉరగము = పాము; విచక్షణులు = నేర్పరులు; 7. నగ + అగ్రము = కొండకొన; 8. కరి = ఏనుఁగు - కరము = తొండము గలది అని వ్యుత్పత్తి; 9. ఎదురుచూచు; 10. పగిది = విధము; 11. ఇరవు = స్థానము; 12. ఏనుఁగులలో శ్రేష్ఠుఁడు; 13. శస్తము = శుభము; 14. నాన్ + విని = అన విని; 15. ఏనుఁగుల రాజు; 16. సమయపు జాగ్సు;17. ఉదంతము = వృత్తాంతము.

నహితచక్రంబులు[1] నిచ్చలుఁ[2] దల్లడిల్లుచుండు, నా కువలయైకాధినాథుం[3] డగు రాజు దూతను[4] నేను; దూత యయినవాఁడు విరోధి[5] యనిరోధ క్రోధంబునఁ[6] గృపాణపాణి యయి ప్రాణంబులుగొన గమకించుచున్న నైనఁ, ద్రాసంబు[7] వాసి వాయోడక[8] యథార్థంబె వచియింప వలయుం గాన, నా నిశానాథుండు[9] తానుగ నీతోడ నాడుమని నాకుం గఱపి[10] పుత్తెంచిన[11] వార్తలు కొన్ని గలవు; వచించెద. వాని సావధానముతో నవధరింపుమ - మదీయాజ్ఞా పరిపాలితం బగుటంజేసి, యీ సరోవరంబెట్టి భీమబలులును[12] నా యనుమతంబు[13] వడయక కదియ శంకింతురు. మీరు నన్నుఁ బూరికింగొనక[14], నేఁటితే పోట[15] లేక యీ కొలను సొచ్చి, కలగుండు[16] వఱచితిరి. అంతియ కాక, పథంబున[17] నస్మదీయపాదభక్తుల శశంబుల ననేకంబుల రూపుమాపి నాయెడ మహాపరాధంబు గావించితిరి. బుద్ధిగలిగి బ్రదుకఁదలంతురేని, యీక్షణంబ మడుంగువిడిచి యొండుకడకు నడచునది. ఇది మొదలెన్నఁడును నా ముదలఁ[18]గొనక కొలఁకుఁ జొరకుండునది. ఎఱిఁగి యెఱుఁగములం[19] జేసి, మీరింతదనుకం జేసిన నేరంబు సైరించితి[20]. ముందు నా పసుపు[21] చేసి, మొక్కలంబు[22] మాని ప్రాణంబులు గాచికొండు. అట్లుగాక యింకను మదాంధకారంబునఁ[23] గన్నుగానక మదీయాజ్ఞోల్లంఘనంబుఁ[24] గావింపఁ

---

1. అహిత - చక్రంబులు = శత్రు సమూహములు; 2. నిచ్చలు = ఎల్లప్పుడును; 3. కువలయ + ఏక + అధినాథుండు = భూవలయమునకు ముఖ్య ప్రభువు; 4. రాజు = ప్రభువు, చంద్రుఁడు; 5. విరోధి = శత్రువు; 6. అనిరోధ - క్రోధము = అడ్డులేని కోపము; 7. త్రాసము = భయము; 8. వాయోడక = (వా+ఓడక)+ - మాటపిఱికికాక; 9. చంద్రుఁడు; 10. కఱపి = చెప్పి; 11. పుత్తెంచిన = పంపిన; 12. భీమబలులు = భయంకరమైన బలము గలవారు; 13. అనుమతము = ఆజ్ఞ; 14. పూరికిం గొనక = లెక్కచేయక; 15. తేపు = ఉదయము, ఓట = జంకు; 16. కలగుండు = కలఁత; 17 మార్గమున; 18. ముదల = ఆజ్ఞ; 19. ఎఱిఁగి ఎఱుఁగములు = తెలియుటయు, తెలియకుండుటయు; 20. సైరించు = ఓర్చు; 21. పనుపు = ఆజ్ఞ; 22. మొక్కలము = ముష్కరత్వము; 23. గర్వమనెడి చీఁకటి; 24. ఉల్లంఘనము = దాఁటుట.

బాలుపడుదురేని, మి మ్మందఱు నస్మదీయ[1]ప్రతాపానలంబున[2] కొక్కటఁ[3] బూర్ణాహుతిఁ జేసెద. మీఁద మీకుంబోలినగతిఁ జూచుకొండు. - అని రోషాతిభీషణుండయి, సంవర్తసమయభీషణహుతాశనకీలపోలిక[4] మండిపడు చున్నవాఁడు కాలాతిపాతంబు గాకుండఁ[5], బరమకృపానిరతుం డగు హిమకరుని[6] శరణుసొచ్చి తదనుగ్రహంబునకు భాజనంబ[7] వగుము.

ఆతని యానతి మన కందఱకు నవిలంఘనీయము[8]. మీకుఁ బ్రాణములు చేఁ దగునేని, యాయనయాజ్ఞ నన్యథాకరించునది[9]." అనుడు, దంభోళిపాతతుల్యంబు లగు[10] నా వాక్యముల హృదయంబు పగిలి, బెగడు[11] గదిరి, కంపంబు సర్వాంగీణం[12] బై యెలయ[13], వివశం[14] బగు డెందంబు[15] నెట్టకేలకు నూలుకొల్పి[16], గద్గదిక[17] నెలుంగు[18] దగులువడఁ గుంజరపతి[19] చెవులపోతుం గని యిట్లనియె. "క్షుద్రులము మే మా మహామహుని కోపంబున కెంతవారము? తనయు లెం దయిన బుద్ధిదోషమున నెదురుపడి యాజ్ఞ మిగిలినఁ, దండ్రి యది మనసునఁ బెట్టునే? ఆ శీతాంశునకు[20] బుధుఁ[21] డొకఁడును మే మొకరముఁ గాము. మే మజ్ఞానకృతంబున మి మ్మాయాసపెట్టి కడునవజ్ఞఁ[22] జేసితిమి. మా చేసిన[23] యా వ్యతిక్రమమ్ము[24] క్షమియింప నీవే మా మాఱుగా క్షపాకరుం[25] బ్రార్థింపుము. ముం దెప్పుడు నీ తటాకంబు[26]

---

1. అస్మదీయ = మా; 2. ప్రతాప + అనలము = పరాక్రమ మనెడి అగ్ని; 3. ఒక్కటన్ = ఒక్క మాఱుగా; 4. ప్రళయ కాలమునందలి భయంకరమైన అగ్నిజ్వాల; 5. కాల + అతిపాతము = సమయాతిక్రమణము; 6. హిమకరుఁడు = చంద్రుఁడు; 7. భాజనము = పాత్రము; 8. అవిలంఘనీయము = దాఁటరానిది; 9. అన్యథాకరించు = వేఱు విధముగాఁ జేయు; 10. దంభోళి-పాత-తుల్యములు = పిడుగుపాటుతో సమానములు; 11. బెగడు = భయము; 12. సర్వాంగీణము = అన్ని అవయవములకు సంబంధించినది; 13. ఎలయు = వ్యాపించు; 14. వివశము = వశము తప్పిన; 15. డెందము = హృదయము; 16. నూలుకొల్పి = కుదురు పఱిచి; 17. డగ్గుత్తిక; 18. ఎలుఁగు = కంఠస్వరము; 19. ఏనుఁగుల ఱేఁడు; 20. చంద్రుఁడు; 21. బుధుఁడు = చంద్రుని కొడుకు; 22. అవజ్ఞ = అవమానము; 23. మేము చేసిన; 24. అక్రమము; 25. క్షపాకరుఁడు = చంద్రుఁడు - రాత్రిని జేయువాఁడు (వ్యుత్పత్తి); 26. చెఱువు.

చెంతలం జేరము. దీనిం బ్రాణభయమునం బలుకు కార్యవశంపు మాటనుగాఁ బాటింపఁబోకుము. ఏ నిన్ని మాటలవాఁడం గాను ఇంక నీ పలుకుఁ ద్రోచిన, నీ పాదములకుం దప్పినవార మగుదుము. మీరాజు సమ్ముఖమ్మున మా మీఁద దయ పుట్టునట్టుగా నెట్టు ప్రసంగించెదవో నీదే భారము. మదీయవిజ్ఞాపనము[1] విని వాఙ్మాత్రంబున[2] నీవు మాకీ యుపకారము తప్పక చేయవలయును. మఱవకుమీ పోయివత్తుము." అనిన, శశకం బిట్లనియె. "ఓ యూథనాథా! మా నాథుం డగు సుధాంశుండు[3] సన్మార్గవర్తి[4]; దయా సుధానిధి[5]; శరణాగతభరణైకబిరుదాంకుండు[6]; భక్తు లెంతలెంతలు తప్పులు చేసినను, ననుతాపపడిరేని[7] నెరసు లెన్నక[8] మన్నించును. తలం[9] కొందకుము. నీవారును నీవును గావించిన యవగడంబు[10] లెల్ల నిస్సంశయముగా లోఁగొనును[11]. ఈ సరోలలామం[12] బాయన పేరనె చంద్రసరస్సు నాఁ బరఁగుచున్నది. మా మ్మాతండు దీనికిం గావలిపెట్టి, నిచ్చోట నున్నవారము. మే మందఱ మాయనభృత్యులము. ఆ దయాలుండు[13] మ మ్మనవరతము బహిఃప్రాణం[14] బులుగాఁ జూచుకొని, పుత్త్రవాత్సల్యంబునం బ్రోచుచుండును. శశంబులం గలిగియుంటనే, యా శశధరునకు[15] శశి యను నామము జగమునఁ బ్రథితం[16] బయ్యె. ఇప్పు డాతం డతిదూరం బగు గగనపథంబున[17] వర్తించుచుండును. మన కా ప్రదేశంబు బహుతరప్రయాసగమ్యంబు[18].

---

1. విన్నపము; 2. వాఙ్మాత్రము = వాక్ + మాత్రము; 3. సుధాంశుఁడు = అమృత కిరణుఁడు; 4. సన్మార్గవర్తి = మంచిత్రోవ నుండువాఁడు - ఆకాశమార్గమున నుండు వాఁడు; 5. దయా - సుధా - నిధి = దయ యనెడు అమృతమునకు నిధానము; 6. శరణ + ఆగత + భరణ + ఏక - బిరుద + అంకుఁడు = శరణుకయి వచ్చిన వారిని పోషించు వాఁ డను బిరుదు చిహ్నముగాఁ గలవాఁడు; 7. అనుతాపపడిరేనిన్ = పశ్చాత్తాప పడినచో; 8. నెరసులు = తప్పులు; 9. తలఁకు = భయము; 10. అవగడము = అపరాధము; 11. లోఁగొను = క్షమించు; 12. సరస్(ః) + లలామము = శ్రేష్ఠమైన సరస్సు; 13. దయాళుఁడు = దయా స్వభావము గలవాఁడు; 14. బహిఃప్రాణము = వెలుపలి ప్రాణము; 15. శశధరుఁడు = చంద్రుఁడు; 16. ప్రథితము = ప్రసిద్ధము; 17. గగన - పథము = ఆకాశ మార్గము; 18. మిక్కిలి శ్రమముచేఁ బోఁదగినది.

ఆతఁ డెడపదడప[1] నీ మడుఁగునకు వచ్చి చూచిపోవు చుండును. ఈ నిశాసమయమున నీ సరోవరంబునకు విజయము చేయఁ[2]గలవాఁడు. సమ్ముఖమున రాయబార మేటికి? అప్పు డాతని పాదసందర్శనంబు చేసికొని, మీ యపరాధంబు సర్వంబును నివేదించి తదీయానుగ్రహంబు వడసి చనుట మంచిది. అందాఁక నిందు నిలువుము." అని, యొడఁబఱిచి, ప్రొద్దు వాలిన పిమ్మట గజరాజును వెంటఁ బెట్టుకొనిపోయి, సంజవేళకు జలాశయంబుఁజేరి, కొలనిజలంబుల ననిలవశం బునం[3] గదలునరుణంబగు[4] నిశాకర ప్రతిబింబంబుఁ జూపి, యిట్లనియె. "అదె చూడుము. కుముదబాంధవుండు[5] క్రోధరసం బుట్టిపడ నెట్లు కోపప్రకంపమానాంగుఁ డయి[6] యున్నవాఁడో. ఇది నీవు సంభాషింప నవసరంబుగాదు[7]. కినుక[8] తీఱిన వెనుక సమయము చూచి, నీ చందం[9] బీ చందమామకు విన్నవించి, నీదెసఁ బ్రసన్నహృదయుం గావించెద. ఇక్కడ నీవు మఱేమియుఁ ద్రవ్వక, గ్రక్కున[10] మ్రొక్కి నీ యిక్క[11]కుం జనుము. కడమపని నా మీఁద విడువుము." అని సమయోచితముగాఁ బలికి యేనుఁగును మ్రొక్కించి వీడుకొలిపి, విజయుండును దనజన్మంబు సఫలం బయ్యెఁ గదాయని యులరి[12], వికసన్ముఖుండయి[13] చని, శిలీముఖమునకు నమస్కరింపుడుఁ గార్యనివేదనం[14] బొనరించునంతకు మానసంబు పట్టఁజాలక, విస్మయసూచనలోచనరోచులు[15] నిట్టవొడువ[16] నిట్టనియె. "కార్యము గోట మీటుకొని వచ్చుట నీ ముఖవికాసంబె చెప్పక చెప్పుచున్నది.

---

1. ఎడప దడప = అప్పుడప్పుడు; 2. విజయము చేయు = వచ్చు; 3. అనిల - వశమునన్ = గాలి వలన; 4. అరుణము = ఎఱ్ఱని; 5. కలువల చుట్టము, చంద్రుఁడు; 6. కోప - ప్రకంపన + అంగుఁడు = కోపముచే మిక్కిలి చలనము గల అవయవములు గలవాఁడు; 7. అవసరము = సమయము; 8. కినుక = కోపము; 9. చందము = విధము; 10. గ్రక్కునన్ = శీఘ్రముగా; 11. ఇక్క = స్థానము; 12. అలరు = సంతోషించు; 13. వికసత్ + ముఖుఁడు = వికసించుచున్న ముఖము గలవాఁడు; 14. కార్య నివేదనము = చేయఁదగినది నివేదించుట; 15. ఆశ్చర్యమును సూచించు కన్నుల కాంతులు; 16. నిట్టవొడువన్ = అతిశయింపఁగా.

అమోఘసంకల్పుండవు?[1] నీ తలం పెన్నఁడయినఁ బొల్లు[2]గునే? నీయంతటి హితుండు కలుగంబట్టికదా, నేఁడు మే మందఱము మృత్యువక్త్రగతులము గాక[3], బ్రతుకుఁగంటిమి. నీ ఋణంబు మేము పదివేల జన్మంబు లెత్తి యయిన నీఁగఁ[4]గలమె?" అని మఱియు బహువిధంబుల నాతనివిన్నాణంబుఁ[5] బ్రశంసించుచుండ, రాజున కభిముఖుం డయి విజయుండు సవినయంబుగా నిట్లనియె. "ఆశ్రితపక్షముచే దేవర యి ట్లానతిచ్చెదరు, గాని నిక్కంబునకు దేవరప్రశంస సేయఁదగినంత శక్తియుక్తుండను గాను. అనామకుల మగు మాదృశులకును[6], బ్రశంసకు నెంతదూరము? ఒక వేళ మా కట్టి శక్తి గలిగిన, నదియు మీ సేవవలననే కదా? దేవరయాజ్ఞ కన్యథాత్వం[7] బేలగలుగును? కార్యంబు పండించుకొని వచ్చితి." అని తన వృత్తాంతం బాద్యంతంబును[8] విజ్ఞాపనం[9] బొనరించి, పారితోషికంబు వడసి, విజయుం డపరిమిత సంతోషంబునం బొదలి[10] యుండె. అది దొరంకొని[11] లంబకర్ణంబు[12] లెల్ల నతివేల[13] సమ్మోదమ్మునం[14] దేలుచు, సుఖంబు పడియుండె. కావున, రాజు లేకున్నను నెపమ్ము[15] వెట్టియయిన సుఖింపవచ్చును.

అనుడుఁ దదీయవచనశ్రవణానంతరంబున[16] నుద్దీపితం[17] బగు నాటోపంబు[18] లోలోపలన యడంచుకొనుచు, మనోవికారం బేమియుఁ దోఁపనీక, నే నిట్లంటిని. "ఆర్యజనమిత్రుండగు నా హంసకులపవిత్రుండు వీరాధివీరుండు; *నిజప్రతాప దీపాంకుర నిరస్తసమస్తవైరివీరదుర్వారగర్వాంధ

1. అమోఘ - సంకల్పుఁడవు = వ్యర్థముగాని తలఁపు గలవాఁడవు; 2. పొల్లు = వ్యర్థము; 3. మృత్యుదేవత నోరఁబడినవారము గాక; 4. ఈఁగు = తీర్చు; 5. విన్నాణము = విజ్ఞానము - తెలివి; 6. మాదృశులు = మావంటివారు; 7. అన్యథాత్వము = వేఱురీతి; 8. ఆది + అంతము = మొదటినుండి తుదివరకు; 9. విజ్ఞాపనము = విన్నపము; 10. పొదలు = ఒప్పు; 11. దొరంకొని = మొదలు; 12. లంబకర్ణము = ఏనుఁగు; 13. అతివేల = అపార; 14. సమ్మోదము = సంతోషము; 15. నెపము = మిష; 16. మాట వినిన తరువాత; 17. ఉద్దీపితము = మిక్కిలి ప్రకాశించినది; 18. ఆటోపము = విజృంభణము.

కారుండు[1] విక్రమాఢ్యు[2] నొరు నాతనిఁ జెప్పి చెప్పవలెను; పిఱికితనం బాయన యున్నయూరనైన లేదు; అతం డించుక కాలు గదిపెనేని, భువనంబు[3]లెల్ల నల్లలనాడుచుండును. ఉబుసుపోకకు మీ రూరక పుట్టనిబొట్టె[4]లకుం బేళ్ళు పెట్టెదరుగాని, యాతండు నలుపో తెలుపో యెఱుంగరు. భవాదృశులు[5] ప్రాజ్ఞులే[6] యిట్లు భావ్యంజ్ఞులు కాని పలుకులు పలుకుచుండ, నింక నజ్ఞులగతి[7] యేమనవచ్చును? పరాక్రమగుణంబున నాతం డొక్క కర్పూరద్వీపంబునకె కాదు, త్రిలోకాధిపత్యమునకైనం దగినవాఁడు. ఇంక నాతనిం బేరు గ్రుచ్చి యేమైన నన్న, నపచారం[8] బగును. మీ ప్రల్లదంబు[9] లుడిగి యూరకుండుండు.' అన, నా యండజంబులు[10] మండిపడి, నన్నుఁ దెగటార్పఁ[11] గృతనిశ్చయంబు లయి, తమతేని యెఱుకమీఁద మఱి పరిమార్చు తలంపునఁ బెడతెక్కలు విఱిచికట్టి, కొట్టి కంఠగతప్రాణుం[12] గావించి, హతదంష్ట్ర మహాభుజంగంబు భంగి[13] రొఁజుచున్న నన్నుఁ బ్రసభాచరణంబున[14] దుష్టభూయిష్ఠం[15] బగు సభాస్థలికిం గొనిపోయి, తమ రాజు ముందఱఁ బెట్టి, సభాస్తారు[16] లందఱు విన నిట్లనియె. "స్వామీ! మేము భవదాజ్ఞాధీన కృత్యులముగాన[17], నెఱిఁగినయర్థము చెప్పక కప్పిపుచ్చి మాయంతన యొకటి చేయుట భృత్యుధర్మంబు గాదని, యీ మత్తునివృత్తంబు దేవరకు నివేదించి భవదుక్తమార్గంబున[18] నడవఁ జనుదెంచితిమి. ఈ మొక్కలీఁడు[19],

---

1. * నిజ = తనదైన, ప్రతాప = పరాక్రమమనెడి, దీప = దివ్వెయొక్క, అంకుర = మొలకచేత, నిరస్త = పోయిన, సమస్త = ఎల్ల, వైరి-వీర = శత్రువీరులయొక్క, దుర్వార = అడ్డగింపరాని, గర్వ = గర్వమనెడు, అంధకారుండు = చీఁకటి గలవాఁడు; 2. పరాక్రమ సంపన్నుఁడు; 3. లోకము, నీళ్ళు, 4. బొట్టె = సంతతి, లేనిది కల్పించు; 5. మీవంటి వారు; 6. పండితులే; 7. తెలియని వారి గతి; 8. అపచారము = తప్పు; 9. ప్రల్లదములు = పరుష వాక్యములు; 10. పక్షులు; 11. తెగటార్చు = చంపు; 12. కంఠగతప్రాణుఁడు = కంఠమును బొందిన ప్రాణము గలవాఁడు; 13. కొట్టఁబడిన కోఱలు గల పెనుబాము; 14. బలాత్కారపుఁజేఁతచేత; 15. దుర్జనులతో నిండినది; 16. సభ్యులు; 17. నీ ఆజ్ఞకు లోఁబడిన పనులు గలవారము; 18. నీచేఁ జెప్పఁబడిన త్రోవ; 19. మొక్కలీఁడు = ముష్కరుఁడు.

సమయుటకు[1] సమయంబై, యుచితానుచితవివేకంబు లేక, ధర్మస్వరూపుల రగుదేవరయెడఁ గొడిమెలు[2] గడియింపఁ దొడఁగినవాఁడు. "అన్యదోషకారి తనకిల్బిషంబునఁ[3] దానె కాలిపోవు; చచ్చినవానిఁ జంపనేల? యనరాదు. ఒకప్పుడు దైవంబును దోసకారులకె[4] తోడు చూపును. ఈ మూర్ఖబకంబు మనసీమం దిరుగుచుఁ దేఁకువ[5]మాలి[6], యేలినవారి పాదంబులనె యధిక్షేపించుచుఁ బలుకరాని పలుకులెల్లం బలికె. కావున, నీ బకాధముం డవశ్యవధ్యుం[7] డయ్యెను. కలహశీలుండగు నీతనిఁ బొలియింప[8] మేము సంజాతనిశ్చయులమై[9] యున్నవారము. ముక్కు పొడువఁగా లేని ముంగోప[10] మది యెన్నఁటికి? వీనియెడ లేశంబును దయ తలంపవలదు.

ఆజ్ఞయైన వీనిఁ గడతేర్చె[11]దము, అని యన్నియు నేకవాక్యతగాఁ బలికిన నాలించి, వావి వారించి, భయాధీనమానసుండనై మాఱుమొగమువెట్టి వజవజ వడఁకుచున్న నన్నుఁ గరుణాతరంగితాపాంగుండై[12] కాంచుచుఁ, జిత్రవర్ణుండు 'వీఁ డెవఁడు? ఏ దేశమునుండి వచ్చుచున్నవాఁడు? తెలుపుఁడు. అన నవియు 'హిరణ్యగర్భుండను రాజహంసంబు ననుచరుండఁట; కర్పూరద్వీపమునుండి వచ్చినవాఁడు' అని విన్నవించు సమయంబునఁ బరిసరవర్తి యగు నా శిఖండిప్రకాండుని[13] మంత్రి దూరదర్శియనుగ్రద్ధ న న్నుపలక్షించి[14], 'మీ యధ్యక్షుని సమక్షంబున ముఖ్యామాత్యుఁ డేవాఁడు?' అని యడిగిన, నేనట్లు చెప్పితిని. "వివిధవిద్యావిశారదుండగు సర్వజ్ఞనామక చక్రవాకప్రశస్తుండు[15]. అతండు సర్వధర్మములను మూలముట్టుగ నెఱుంగును; సత్యశౌచాదిసద్గుణగరిష్ఠుండు[16]; స్వదేశసంభవుండును, ఉపధాశుచియు[17],

---

1. సమయు = చచ్చు; 2. కొడిమె = అపనింద; 3. కిల్బిషము = పాపము; 4. దోసకారి = తప్పుచేసినవాఁడు; 5. తేఁకువ = భయము; 6. మాలి = లేక; 7. అవశ్య - వధ్యుఁడు = తప్పక వధింపఁదగినవాఁడు; 8. పొలియింపన్ = చంపుటకు; 9. సంజాతనిశ్చయులము = పుట్టిన నిర్ణయము గల; 10. ముందు + కోపము; 11. కడతేర్చు = చంపు; 12. దయ తొణికిసలాడు క్రీఁగన్నులు గలవాఁడు; 13. నెమలులలో శ్రేష్ఠుఁడు; 14. ఉపలక్షించి = చూచి; 15. చక్రవాకశ్రేష్ఠుఁడు; 16. సత్యము, శౌచము (శుచిత్వము) మున్నగు మంచి గుణములచే గొప్పవాఁడు; 17. ఉపధాశుచి = పరీక్షచే శుద్ధుఁడైనవాఁడు.

అఖిలార్థసంవేదియు[1], అభ్యస్తసమస్తవ్యవహారుండును[2], సుప్రసిద్ధుండును, సర్వజనసమ్మతుండును, ధైర్యశౌర్యధుర్యుండును[3], ప్రతిభావంతుండును, ధర్మాధర్మవిశారదుండును, స్వామికార్యైకతత్పరుండును, నగువాఁడు మంత్రిపదంబున కర్హుఁ డని నీతిశాస్త్రవేత్తలు చెప్పుదురు. దైవానుగ్రహంబున నీ సకలసద్గుణములును నా జక్కవదొరయందుఁ[4] బొందుపడియున్నవి.' అని చెప్పునవసరంబున, నా యాస్థానంబున నున్న యరుణముఖుం డనుకీరంబు[5] మయూరరాజున[6] కిట్లనియె. "దేవా! యవధరింపుము. కర్పూరద్వీప ప్రముఖాంతరీపంబులెల్ల[7] నీ జంబూద్వీపాంతర్గత లఘు[8] ద్వీపంబులె కావున, నా కప్పురపుదీవియు[9] దేవరవారిద యయియుండును. దాన, నా మానసౌకస్స్వామి[10]యు నౌనుగాదనక స్వామియానకులోనై మెలఁగఁదగినవాఁడు. నేఁ డాదిగా నేఁడేఁడును[11] దేవర కరి[12]వెట్ట నాజ్ఞాపింప హిరణ్యగర్భునిపాలి కొక్క వేగరిని[13] వేగఁ బుచ్చుట ప్రధానానుష్ఠేయమైన[14] కార్యము. వీతిహోత్రుండు[15] కాష్ఠంబు[16]లఁ దృప్తి పొందనిచందంబున, భూకాంతుండు[17] రాజ్యంబునఁ దనివిసనక[18] యుండవలెను. అసంతుష్టుం డగుభూసురునట్ల[19], సంతుష్టుండగు పార్థివుండును[20] జెడును. కావున, మహీకాంతుఁడు సంతతోత్సాహవంతుండై, యార్జవం[21]బునంగాని, యనార్జవంబునం గాని, దుర్జయులగు పగఱ నిర్జింప[22]వలయును. అంతియగాక, వేఱొక్క ధర్మ సూక్ష్మత గలదు; సావధానమతివై యాకర్ణింపుము. 'రాజ్యంబు

---

1. అఖిలార్థసంవేది = ఎల్ల విషయములు తెలిసినవాఁడు; 2. అభ్యసింపఁబడిన ఎల్ల వ్యవహారములు గలవాఁడు; 3. ధైర్యశౌర్యముల భారము వహించినవాఁడు; 4. జక్కవ దొర = చక్రవాక ప్రభువు; 5. కీరము = చిలుక; 6. మయూర రాజు = నెమలి ఱేఁడు; 7. కర్పూరద్వీపము మున్నగు ద్వీపములు; 8. లఘు = చిన్న; 9. కప్పురపుదీవి = కర్పూర ద్వీపము; 10. మానసౌకస్స్వామి = హంసరాజు; 11. ఏఁడేఁడును = ప్రతి సంవత్సరమును; 12. కరి = పన్ను; 13. వేగరి = చారుఁడు; 14. ముఖ్యముగాఁ జేయఁదగినది; 15. వీతి హోత్రుఁడు = అగ్ని; 16. కాష్ఠము = కట్టె; 17. రాజు; 18. తనివి పనక = తృప్తిపడక; 19. భూసురు + అట్లు + అ = బ్రాహ్మణుని వలెనే; 20. పార్థివుఁడు = రాజు; 21. ఆర్జవము = ఋజుత్వము; 22. నిర్జించు = జయించు.

వీరభోజ్యంబు' అని ధర్మశాస్త్రమర్మపారగులు[1] వచింతురు. కాన, సముచిత సైన్యసమన్వితులరై[2] కదలి, దేవర చేవమెయి[3] నా దీవి నావరించుట యర్హకృత్యము. అతండు మంచిమాటలం జక్కఁబడెనేని మేలయ్యెడు. అట్లుగాక, కాదు కూడదని దేవరపలుకు సేయక యవధీరణము[4] చేసెనేనిఁ దత్ఫలం బాతండు చేసేఁతం[5] గుడువఁ గలాఁడు[6]. మదీయ ప్రార్థనాభంగంబు సేయక, యొకదూతం బనిచి యెదిరి హృదయం బెఱుంగుట యపరిహార్య కార్యంబు[7], అనిన వికాసహాసభాసురాననుండై[8], చంద్రకీంద్రుండును[9]. "అవు; అది కార్యంబు" అని తలయూఁచె. ఔరా; 'రాజ్య మదాంధుండును, బాలుండును, ధనగర్వితుండును, నున్మదుండును[10], శక్యాశక్య విచారంబుసేయక యలభ్యంబు లలభ్యంబులఁగాఁ దలంతు' రనుకోవిదుల[11] పలుకుల కేల యన్యథాత్వంబు గలుగును? రాజ్యలోభంబెకదా, యీ దుర్విచారంబులకెల్ల మూలంబు. కోటరస్థానలంబు[12] కుజంబుంబోలె[13], హృదయస్థతృష్ణానలంబు[14] మనుజు దగ్ధంబుచేయును. ఆశయే సర్వానర్థంబులకు నాకరంబు[15], అట్టియాశను దిగనాడి[16] ప్రాప్తలాభముదిత హృదయుండై[17] యుండువాఁడె కృతార్థతముండు[18]. అప్పుడు దేవర యక్షీణరణదక్షతావిశేషంబు[19] తలంచి, నాకు వారు తనువు[20] లొల్ల రోకో యను

1. ధర్మశాస్త్ర రహస్యము, తీరమును ముట్టినవారు, ధర్మశాస్త్ర రహస్యములు బాగుగా నెఱిఁగినవా రనుట; 2. తగిన సైన్యముతోఁ గూడిన వారు; 3. చేవమెయిన్ = బలముతో; 4. అవధీరణము = తిరస్కారము; 5. చేసేఁత = అప్పుడే; 6. కుడువంగలాఁడు = అనుభవింపఁ గలఁడు; 7. అపరిహార్య కార్యము = పరిహరింపఁదగని కార్యము; 8. వికాసముతోడి నవ్వుచేఁ బ్రకాశించు ముఖము గలవాఁడు; 9. చంద్రకి + ఇంద్రుడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 10. ఉన్మదుఁడు = పిచ్చివాఁడు; 11. కోవిదులు = పండితులు; 12. కోటరస్థ + అనలంబు = తొఱ్ఱలో నున్న నిప్పు; 13. కుజము = చెట్టు; 14. హృదయస్థ తృష్ణా + అనలంబు = హృదయమున నున్న ఆశయను నిప్పు; 15. ఆకరము = స్థానము; 16. దిగనాడి = విడిచి; 17. లాభించిన లాభముతో సంతోషించిన హృదయము గలవాఁడు; 18. కృతార్థతముఁడు = అందఱిలోను ధన్యుఁడు; 19. తక్కువ కాని యుద్ధ సమర్థతాధిక్యము; 20. తనువు = శరీరము.

బుద్ధి జనించె. అది యుండ నెండు. ఆ విషోపమంబులగు[1] దుష్టాలాపంబులు[2] మనస్తాపంబు సేయు. నన్ను నేన యుపశమించుకొని[3], రాజునంక మరలి "నే నొక్కటి నిస్నపించెద; కోపంబు లేదుగదా' యని హెచ్చరించి, యాయనచే లే దనిపించుకొని, మితహితోక్తుల[4] ని ట్లంటిని. "లోకంబున నెందైన నొరుల[5] సొమ్ములు[6] రమ్మన్న వచ్చునె? ఏల, యఘటమానంబగు[7] కార్యంబునందు నిరర్థకప్రయాసంబు వడియెదరు? చెప్పెడివా రొకవేళఁ జెప్పినను, వినెడు వారికైన వివేక ముండవలెనుగదా! అట్లుగాక, 'దున్న[8] యీనిన దన, దూడను గట్టుమన్న' మతిపస[9] యొక్కటే రచ్చ కెక్కుంగాని, దాన నభిమత కార్యకరణంబు చేకూరనేరదు. అఖిల విదుండవు; నీ వెఱుంగని ధర్మా ధర్మంబులు గలవే? దుర్దాంతరిపుస్ఫురణహరణపరిణతుం డగు[10] హిరణ్యగర్భుండు వారువీరుంబోలె నసదని[11] తలంపవలదు. విక్రమంబున నాతం డతిలోకుం డని[12] స్మరణకుఁ దెచ్చుకొని, పిమ్మట నొక్కత్రోవ త్రొక్కుము. కాలనియోగప్రేరితుండై[13], నిజజీవితనిస్స్పృహత్వంబునఁ[14] గడుపూఁదఁ[15]దీఱఁ బ్రేలిన యంతనె రాజ్యంబు రాఁబోదు. మదిమది[16] నుండి, యేల నిర్నిమిత్తంబ[17] చెట్టుగొట్టి పై వేసికొనెదరు? తదీయప్రభావం బెంత వారికి నపరిభావ్యంబు[18]. మీమీ పంతంబులెల్లఁ దదీయభ్రూభంగ పర్యంతంబులుగాని[19], యామీఁదం జెల్లవు. అతనికడవారును

1. విషోపమము = విషము ఉపమ (సాటి)గాఁ గలది; 2. చెడుమాటలు; 3. ఉపశమించుకొని = శాంతింపఁజేసికొని; 4. మితహితోక్తులు = తక్కువయైనవి, మేలైనవియైన మాటలు; 5. ఒరులు = ఇతరులు; 6. సొమ్ములు = ధనములు; 7. అఘటమానము = కూర్పరానిది; 8. దున్న = పోతు; 9. మతి-పస = బుద్ధిబలము; 10. అణఁపరాని శత్రువిజృంభణమును హరించుటయందుఁ బండినవాఁడు; 11. అసదు + అని = అసదని = తక్కువని; 12. అతిలోకుఁడు = మిక్కిలి గొప్పవాఁడు; 13. కాల-నియోగ-ప్రేరితుఁడు = యముని యాజ్ఞచేఁ బ్రేరింపఁబడినవాఁడు; 14. నిజ జీవిత నిస్స్పృహత్వము = తనదైన జీవితమునందుఁ గోరికలేమి; 15. కడుపూఁద = కడుపుబ్బ; 16. మదిమది = నిశ్చింత; 17. నిర్నిమిత్తంబు = కారణము లేకుండఁగనే; 18. అపరిభావ్యము = తిరస్కరింపఁదగనిది; 19. అతని బొమముడిపాటు వఱకే ఉండునవి-కోపము వచ్చునంతవఱకే యుండుననుట.

నుగ్రరణకోవిదులు[1]; మీ దురభిమానంబుమాని, మా యొడయనిం[2] గడవ నాడక[3], ప్రాణపరిత్రాణంబు[4] చేసికొండు. లోకంబున వచనమాత్రంబుననె యాధిపత్యంబు[5] సిద్ధించునేని, మత్ప్రభుం డగుహిరణ్యగర్భునకును నీ నేరెడుదీవి[6] యందు స్వామ్యంబు[7] గలదనవచ్చును. ఈ చప్పిడి మాటలతోడ నేమి ప్రయోజనము? ఈ చాలెడువారికెల్ల నోరికి మాఱు[8] లేదుగనుక, నేలినవారి మెఱమెచ్చు[9]నకె యోలగంబున వలసినట్లెల్ల వదర[10] వచ్చుంగాని, తమ దుర్వ్యవసాయంబులc[11] గార్యపాకంబు తప్పి, స్వామి కొక్క యొప్పమి వచ్చినప్పుడు దానికిం దగుప్రతీకారంబుc గానక, విస్మయపరీతచేతస్కులై[12] మిన్ను[13] చూచుటదక్క నొకటి శక్యంబుగాదు. చిత్రవర్ణునకు మా కర్పూర ద్వీపమునc బ్రాజ్య[14] రాజ్యాధికారంబు గలదో, హిరణ్యగర్భునకు మీ తొలుదీవిని[15] నెఱదొరతనంబు[16] గలదో, యెట్లు నిర్ణయింపనగును!" అనినc జిఱునవ్వు నవ్వి యవ్విషధరభుగ్వల్లభుం[17] డి ట్లనియె. "త్వరయేల? యుద్ధంబుననె యెల్లయర్థంబులును నిర్ధారణంబులగును. ఇప్పుడుపోయి, నీయేలిక నాలంబున[18] కాయితంబు[19] చేయుము. ఇదె నీతోడ మా దూతుcడు[20] నేతెంచెడు. క్షణమాత్రంబు నిలుపుము." అని పలికి, మంత్రిమొగంబు చూచి యిట్లనియె. "మంత్రివరా! మన కిపు డొక దూతకార్యంబు[21] ప్రభూతం[22] బయినది. దక్షతయుc, గార్యవాదిత్వంబును, బ్రగల్భతయుc[23]

---

1. ఉగ్ర-రణ-కోవిదులు = భయంకరయుద్ధపండితులు; 2. ఒడయcడు = రాజు; 3. కడవనాడు = తిరస్కరించు; 4. ప్రాణరక్షణము; 5. ప్రభుత్వము; 6. జంబూద్వీపము; 7. స్వామ్యము = అధికారము; 8. మాఱు = ఎదురు; 9. మెఱమెచ్చు = ముఖప్రీతి; 10. వదరు = వాగు, ప్రేలు; 11. దుర్వ్యవసాయము = దుష్కార్యము; 12. ఆశ్చర్యముచేc జుట్టcబడిన మనస్సు గలవారలు; 13. మిన్ను = ఆకాశము; 14. ప్రాజ్య = అధిక; 15. తొలుదీవి = జంబూద్వీపము; 16. నెఱదొరతనము = సంపూర్ణ ప్రభుత్వము; 17. విషధరభుగ్వల్లభుcడు = పాములను భుజించు నెమలుల ఱేcడు; 18. ఆలము = యుద్ధము; 19. అయితము = సిద్ధము; 20. దూతుcడు = దూత (రూపాం.); 21. దూత కార్యము = దౌత్యము; 22. ప్రభూతము = ఏర్పడినది; 23. ప్రగల్భత = ప్రౌఢి.

బరమర్మజ్ఞతయు[1], సద్వచోగౌరవంబును[2], గలవాఁడు సందేశహారకృత్యం[3]బున కత్యంతార్హుండు. హిరణ్యగర్భునియొద్ద కీ కొక్కర[4]తోడఁగూడఁ బనుప, మనవారిలో నేరుపరి[5] నొక్కనిఁ బేరుకొమ్ము." అనిన శుకంబు మొకంబు చూపి, దూరదర్శి యిట్లనియె. "ఈ యరుణముఖుండె మీయెన్నినట్టి సర్వలక్షణ సంపన్నుండు; కాలము చెల్లినవాఁడు; గుణజ్యేష్ఠుఁడు; మనకుం బరమవిశ్వాసి. కావున దూతభావంబున కీతండె యోగ్యుండు. ఈతనిఁ బనుపఁజను." అనిన వినయంబు మీఱ నా కీరం బిట్లనియె. "దేవా! నా యెత్తువిత్తమ్ముఁ గ్రుమ్మరించినను, నీ మదోన్మత్తునితోడఁగూడి యడుగువెట్ట నొడంబడనేరను. సర్వవిధంబుల న న్నీ కార్పణ్యాదోషాపహతస్వభావం[6] బగు దుష్ట బకంబుతోఁ బంచుట యించుకయుఁ గళ్యాణదాయుకము[7] గాదు. దేవరమాటకు మాఱుపల్కితినని కాఁకసేయక[8], నా మాటలు తేటపడ విని, మీఁద దేవర యిచ్చవచ్చినట్టు చేయవచ్చును.

ఈ టక్కరికొక్కర ముం దరుగుటయె మిక్కిలి యుక్తము. వీని వెనుకనె నేనునుం జనియెద. సర్వధర్మవిదులు దేవరకు ధర్మములు సెప్పునంతటివాఁడఁ గాను; నా నేరము సైరింపుఁడు. దుర్జనునితోడం గూడి నడచుట యెడరు[9] తొడరుటకె[10] కారణం బగును. మన మీతనిగుణము లెల్ల మనవారివలనఁ గథలుగా విన్నవారము. కొంతదారి సాఁగనిచ్చి, యచ్చట నన్నుఁ బొడవడఁగించిన[11] నెద్దిదిక్కు? అదియుఁగాక, ననఁ[12]గూడి నార తలకెక్కిన ట్లెక్కువవారిం జేరినతక్కువవారికి గౌరవమును, నినుమును గూడిన వేఁడివేల్పు[13]నకు సమ్మెటపె ట్లబ్బినట్లు హీనునిఁగూడిన మాననీయునకు

1. పరమర్మజ్ఞత = ఇతరుల మర్మములు తెలియుట; 2. సద్వచో గౌరవము = మంచిమాటల గారవము; 3. సందేశహార కృత్యము = సందేశమును దీసికొని వెడలు పని, రాయబారము; 4. కొక్కర = కొంగ; 5. నేరుపరి = నేర్పరి; 6. కార్పణ్య - దోషాపహత స్వభావము = కుత్సితత్వదోషముచేఁ గొట్టఁబడిన స్వభావము గలది; 7. కల్యాణ దాయకము = శుభప్రదము; 8. కాఁక + చేయక = కోపపడక; 9. ఎడరు = ఆపద; 10. తొడరు = కలుగు; 11. పొడవడఁగించు = రూపుమాపు; 12. నన = పువ్వు; 13. వేఁడి వేల్పు = అగ్నిదేవుఁడు.

లాఘవంబును[1], గలుగుట సహజము గౌరవలాఘవంబు లెందును సంసర్గాధీనంబులె[2] కావే? ఖలులు సలుపు దుర్వృత్తంబుల ఫలంబు తప్పక సన్నికృష్టు[3] లగు సత్పురుషులం బొరయును. తొల్లియొక్క వాయసముతో[4] సావాసము[5] చేసి, హంస హింసింపఁబడియె. ఆ కథ యాకర్ణింపుఁడు.

## దుష్టసాంగత్యము దుఃఖమూలము

ఉజ్జయిని వజ్జ తెరువు[6]ప్రక్క నొక్క గొప్ప పిప్పలవృక్షము[7] గలదు. ఆ పాదపంబుమీఁద నొక వాయసంబును హంసంబును గూండ్లు కావించుకొని, వాసము చేయుచుండును. అట్లుండ భీష్మంబగు[8] నొక్క గ్రీష్మవాసరంబున[9], నధ్వనీనుం[10]డొక్కరుండు మిక్కిలి యధ్వపరిశ్రాంతుం[11]డయి, యెక్కిడినవి ల్లక్కడ నిడి, త్రోవక్రేవం దనరు నా రావినీడ నిద్రించుచుండఁ, గొండొకవడికి ఛాయ[12] తొలంగి, యరుణకిరణములు తెరువరి[13] మోమునం బడఁదొడఁగె. అయ్యది వీక్షించి, వనస్పతిస్థితచక్రాంగంబు[14] దయాంతరంగంబయి, గఱులువిచ్చి[15] యచ్చెట్టుక్రింద నిదురించు పాంథుని[16] మొగమున కెండసోఁకకుండఁ బట్టె. అప్పు డప్పథికుని[17] సౌఖ్యంబు కన్నుగుట్టి[18], చూపోపక[19], యశ్వత్థంబుమీఁది[20] పికవర్ధనంబు[21] స్వభావదౌర్జన్యంబున[22] వాని యాననం బునం[23] బురీషోత్సర్గంబు[24] చేసి, యాచోటువాసి యాకసంబున కెగసి,

1. లాఘవము = తక్కువతనము; 2. సంసర్గాధీనములు = కూడికకు వశమైనవి; 3. సన్నికృష్టులు = దగ్గఱనున్నవారు; 4. వాయసము = కాకి; 5. సావాసము = సహవాసము, మైత్రి, సజ్జన సమీపము; 6. తెరువు = మార్గము; 7. పిప్పల వృక్షము = రావిచెట్టు; 8. భీష్మము = భయంకరము; 9. గ్రీష్మవాసరంబున = వేఁడి దినమున; 10. అధ్వనీనుఁడు = బాటసారి; 11. అధ్వ - పరిశ్రాంతుఁడు = మార్గమున శ్రమము నొందినవాఁడు; 12. ఛాయ = నీడ; 13. తెరువరి = బాటసారి; 14. వనస్పతిస్థిత చక్రాంగము = చెట్టుపై నున్న హంస; 15. గఱులు = ఱెక్కలు - గఱి (ఏక.వ.); 16. పాంథుఁడు = బాటసారి; 17. పథికుఁడు = బాటసారి; 18. కన్నుగుట్టి = ఈర్ష్యపడి; 19. చూపోపక = చూడలేక; 20. అశ్వత్థము = రావిచెట్టు; 21. పికవర్ధనము = కాకి - కోకిలలను బెంచునది (వ్యుత్పత్తి); 22. సహజమైన దుర్జనత్వము; 23. ఆననము = ముఖము; 24. పురీష + ఉత్సర్గము = మలవిసర్జనము, రెట్ట విడుచుట.

మాయమయిపోయెను. ఆ చెన్నఁటికాకి[1] తనదౌష్ట్యం[2] బందులకు నెఱిఁగించెఁగాని, దాన నేమి కట్టుకొనియె? ఏదియు లేకున్నను, దుర్జనులకుఁ బరపీడయే[3] పరమలాభంబు గదా? అంత, నా జాలపాదశ్రేష్ఠము[4]నకుం గాలావధి[5]యైన, నా యధ్వగుండు మేలుకాంచి, యుప్పరము[6] విలోకించి తన యాస్యమున[7] రెట్టవైచిన దా తెలిపిట్ట[8]యే యని యెంచి, కోపావేశమున నప్పట్టున మోపెట్టి పెట్టియున్న విల్లు దిగిచికొని[9], యొక్క భల్లంబున[10] నే పాపము నెఱుంగని యీ యంచతల డొల్లనేసిన[11], నది బాంధవరాజహంసావళి దృష్టి[12] నీఱు[13] సేయుచు నేలఁగూలి, ప్రాణములు విడిచె. కంటిరిగదా కాలవక్రత ప్రకారము? దైవకృతమునకు మాఱుగలదె? అపరాధి[14] యగు కాక ముండఁగా, ననపరాధియగు[15] హంసము హింసింపఁబడియె! "పాపీ చిరాయు" వను[16] పండితుల మాట కేనాఁటికైన బొంకు[17] గలుగునే? ఎట్టును, జెడుగులతోడి సంగాత మిడుమలకే[18] మూలం బగును.

తదనంతరము నేఁ జిలుకవల నవలోకించి[19] యట్లు పలికితిని. "సంగడీఁడా[20]! నాకు మాస్వామి హిరణ్యగర్భుఁ డెట్టివాఁడో నీవు నట్టివాఁడవే; లోకములోన మహాత్ముల కందఱు నాత్మసమానులు గాక, పెఱవా[21] రొకరు గలరె? ఆత్మపరభేదబుద్ధిఁ[22] గల్పించుకొంట[23] మందబుద్ధులకుం గాని,

---

1. చెన్నఁటి కాకి = చెన్నఁటి = కుత్సితమైన, చెనఁటి (రూపాం.); 2. దౌష్ట్యము = దుష్టత్వము; 3. పరపీడ = ఇతరులను బాధించుట; 4. జాలపాద శ్రేష్ఠము = హంస శ్రేష్ఠము; 5. కాల + అవధి = ఆయువు మూఁడుట; 6. ఉప్పరము = ఆకాశము; 7. అస్యము = నోరు; 8. తెలిపిట్ట = హంసము; 9. తిగిచికొని = లాగి; 10. భల్లము = బాణము; 11. డొల్లనేయు = ఖండించు; 12. చుట్టములైన రాయంచల వరుస యొక్కచూపు; 13. నీఱు = బూది; 14. అపరాధి = తప్పుగలది, 15. అనపరాధి = తప్పులేనిది; 16. పాపీ చిరాయుః + అను = పాపీచిరాయు వను = పాపము చేసినవాఁడు చిరకాలము బ్రదుకు నను; 17. బొంకు = అసత్యము; 18. చెడుగు = దుష్టుఁడు, సంగాతము = సాంగత్యము, స్నేహము, ఇడుమ = కష్టము; 19. వల నవలోకించి = దిక్కునకు చూచి; 20. సంగడీఁడా = మిత్రుఁడా; 21. పెఱవారు = ఇతరులు; 22. ఆత్మపరభేదబుద్ధి = తనవాఁడు, ఇతరుఁడు అనుభేదము గల తలఁపు; 23. కొంట = కొనుట.

మహాబుద్ధుల కట్టి భేదభావములేదు, ఆత్మవత్సర్వభూతాని[1] యను నీతి దలంప వలదె? నా మనంబు లోఁతు గానక, వలవని కొలలు[2] కట్టెదవు. నిమిష భంగురంబగు[3] శరీరము నమ్మి, నీ యుసులు పోసికొని, యెవ్వఁడు శాశ్వత నరకకూపంబునంబడి[4] వెతకు[5]డువఁ గడఁగును[6]! నాయెడ నీకుఁ బ్రత్యయ[7] మేల పుట్టదు? సత్పురుషులతోడి మైత్రి సాప్తపదీనం[8] బన వినవే? ఫలభంగములు[9] సేయుట నీకు నైజంబ[10] కాన నీ వెల్లర నట్లుగాఁ దలంచెదవు. నీ వెడకఱద[11] లుడిగి[12] పయనము[13] తూఁగింపుము. అనినఁ బకబక నవ్వి, శుకం బిట్లనియె. "నీవు దర్దురస్వర దర్వీకరంబవు[14]; నీయెడ నెవ్వరికైన నమ్మిగ[15] పుట్టునే? ఏది యెట్లయిన, నాత్మరక్షణోపాయం బేమఱి[16] యుండఁగూడదు. నీ విప్పటిపగ మనంబునఁ బెట్టుకొని పైకిఁగానరానీక, దారి సాఁగనిచ్చి, యొక్క విజన[17] ప్రదేశంబునఁ గికురువెట్టి[18], నన్ను మట్టుపెట్టుట[19] కిన్ని యెన్ను చున్నాఁడవు. ఇంతతడవు మమ్మును మా యొడయనిని నోరికసిదీఱ దూఱి, యింతలో, నేనోరు పెట్టుకొని మరల నెయ్యంబు[20] నెఱపెదవు? నీవు పరమధూర్తాగ్రగణ్యుండ[21] వౌట నీ వాలకమే[22] చెప్పుచున్నది. 'అతి వినయము ధూర్తలక్షణ' మనియ కదా సుధీజనులు[23] పలుకుదురు. ప్రియంబులు

---

1. ఆత్మవత్సర్వభూతాని = ఎల్లప్రాణులు తనవంటి వారు; 2. వలవని కొలలు = ఇష్టముకాని పాపములు; 3. నిమిషభంగురము = తెప్పపాటుకాలములో నశించునది; 4. నరక కూపము = నరకమనెడి నూయి; 5. వెత = ఆపద, వ్యథ (ప్రకృతి.); 6. కడఁగు = యత్నించు; 7. ప్రత్యయము = విశ్వాసము; 8. సాప్తపదీనము = ఏడడుగులతో నేర్పడునది; 9. ఫలభంగము = పండ్లు చెఱుచుట, ఫలితమును జెఱుచుట; 10. నైజము = సహజము; 11. వెడకఱదలు = అల్పబుద్ధులు; 12. ఉడిగి = మాని; 13. పయనము (వికృతి.), ప్రయాణము (ప్రకృతి); 14. కప్పయెలుఁగు గల పాము; 15. నమ్మిగ = నమ్మిక; 16. ఏమఱు = మఱచు; 17. విజన = జనులు లేని; 18. కికురు + పెట్టి = మోసగించి; 19. మట్టుపెట్టు = చంపు; 20. నెయ్యము = స్నేహము; 21. గొప్ప తులువలలో మొదట లెక్కింపఁదగినవాఁడు; 22. వాలకము = వేషము; 23. సుధీజనులు = పండితులైన జనులు.

నామోదజనకంబులు[1] గ్యు, గుజనవచనంబు[2] లకాలకుసుమంబులుం బలె[3], నవసానంబున[4] ననర్థదాయకంబులై[5] పరిణమించును. నీ దుర్జనత్వము వాగ్వ్యాపారముచేతనే ప్రత్యక్షీకృతం[6] బగుచున్నది. చిత్రవర్ణ హిరణ్యగర్భుల మహోగ్ర విగ్రహంబు[7] నకు నీ వచనములె కదా నిదానములు[8]. అల్పుఁడు[9] గోల్పుచ్చుట[10] కయి యెన్ని పన్నుగడలైనం బన్నును. ధారుణి[11] పయిం జిరకాలము జీవింపఁగోరువా రా నుడుల[12] కెడ[13] మీరు. ము న్నొక మువ్వన్నె మెకం[14] బొక బకంబును బలవంతంబునంగాదె యంతంబు నొందించె. నీ కా కథ వినిపించెద సమాహితమతి[15]వై యాలింపుము."

## మిత్రద్రోహము

జంబూద్వీపంబునఁ గామ్యకం బను లోకైకరమ్యంబగు వనంబు గలదు. అందు * నిరంతరపరిఫుల్ల వనమల్లికావల్లికా మతల్లికా వేల్లిత నికుంజపుంజరంజితం[16]బయి, * కుసుమవిసరపరిమళమిళితగళితమకరంద బిందుసందోహాస్వాదనాగతమిళిందబృందసుందరంబై[17] * నికటవిటపివిటప

---

1. సంతోషమును గూర్చునది; 2. కుజన - వచనము = దుర్జన వాక్యము; 3. కాలము గాని కాలమునందలి పూలవలె; 4. అవసానము = తుది; 5. అనర్థదాయకము = హాని కలిగించునది; 6. ప్రత్యక్షము చేయఁబడినది; 7. మహోగ్ర విగ్రహము = మిక్కిలి భయంకరమైన యుద్ధము; 8. నిదానములు = మూల కారణములు; 9. అనుకూలుఁడు కానివాఁడు; 10. కోల్పుచ్చుట = చంపుట; 11. ధారుణి = భూమి; 12. నుడుల = మాటల; 13. ఎడము = చోటు; 14. పెద్దపులి; 15. సమాహితమతి = శ్రద్ధతోఁ గూడిన బుద్ధిగలవాఁడు; 16. * నిరంతర = ఎల్లప్పుడు, పరిఫుల్ల = బాగుగా వికసించిన, వనమల్లికా = అడవి మల్లెల, వల్లికా మతల్లికా = శ్రేష్ఠములైన తీఁగలచేత, వేల్లిత = కదల్పఁబడిన, నికుంజ = పొదలయొక్క, పుంజ = సమూహముచేత, రంజితము = రంజించినది (ఆనందింపఁ జేయునది); 17. * కుసుమ = పూలయొక్క, విసర = సమూహము యొక్క, పరిమళ = సువాసనతో, మిళిత = కూడిన, గళిత = జాఱిన, మకరంద = తేనెయొక్క, ఆస్వాదన = త్రాగుట కొఱకు, ఆగత = వచ్చిన, మిళింద = తుమ్మెదల యొక్క, బృంద = సమూహముచేత, సుందరంబు + ఐ = అందమయిన దయి.

చ్ఛటారటచ్ఛకుంతసతతానాక్రాంత తతరవాక్రాంతదిగంతరాళంబయి[1], పొదలు[2] పొదరుటడవి[3] యొక్కటి యుండును. దాని నడుమ, *నాయతచ్ఛాయా నిరస్తసమస్తతీవ్రగభస్తిగభస్తిచయం[4] బగునొకకుజంబు[5] క్రింది యీరమ్ములో[6], దీర్ఘకాలమునుండి పుండరీకం[7] బొకండు నివసించుచుండును. ఆ చెంగట[8] జువ్విచెట్టుమీఁద గులాయంబు[9] నిర్మించుకొని, యొకకొంగ కాఁపుర ముండును. ఆ శార్దూలం బొక్కనాఁ డొక్క యురణంబును[10] మరణంబు నొందించి, దానిపిశితంబు[11] మెసవుచుండ[12], దైవయోగంబున సూక్ష్మకీకసం[13] బొక్కటి దశనమధ్యంబునఁ[14] జిక్కుకొని మిక్కిలి వ్యథపఱుపఁజొచ్చెను. పులి దాని వెలువరించుకొను వెరవు[15] దొరకక, శిరంబు ధరణీతలంబున వ్రేలవైచుకొని, పొరలుచుఁ, దీవ్రవేదనానలంబున[16] మలమల మఱుంగుచు[17], దిక్కులు ప్రతిశబ్దంబులీన నంగలార్చు[18] చుండెను. ఆ యార్తస్వరంబున[19] నంతరంగంబు గరంగి, ప్లక్షవృక్షంబుమీఁది[20]

---

1. *నికట = సమీపమునందలి, విటపి = చెట్లయొక్క, విటప = కొమ్మలయొక్క, ఛటా = సమూహమునందు, రటత్ = కూయుచున్న, శకుంత = పక్షులయొక్క, సతత = ఎల్లప్పుడు, అశ్రాంత = ఎడతెగని, తత = అధికమైన, రవ = కూఁతలచేత, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన, దిక్+అంతరాళంబు = దిక్కుల నడిమిభాగము కలది; 2. పొదలు = ఒప్పు, 3. పొదరుటడవి (పొదరు+అడవి); 4.* ఆయత = అధికమైన, ఛాయా = నీడచేత, నిరస్త = పోయిన, సమస్త = ఎల్ల, తీవ్రగభస్తి = సూర్యునియొక్క, గభస్తి = కిరణముల యొక్క, చయంబు = సమూహము గలది; 5. కుజము = చెట్టు; 6. ఈరము = పొదరిల్లు; 7. పుండరీకము = పెద్దపులి, తెల్లఁదామర, వెల్లగొడుగు (నానా.); 8. చెంగటన్ = సమీపమున - చెంగలి సప్తమ్యేకవచనరూపము; 9. కులాయము = గూఁడు; 10. ఉరణము = పొట్టేలు; 11. పిశితము = మాంసము; 12. మెసవు = తిను, మెసఁగు (రూపాం); 13. సూక్ష్మ-కీకసము = చిన్న యెముక; 14. దశన - మధ్యము = పండ్ల నడుమ; 15. వెరవు = ఉపాయము; 16. తీవ్ర - వేదనా + అనలము = తీవ్రమైన వేదన యనెడు అగ్ని; 17. మఱుంగు = గూఁడు; 18. అంగలార్చు = దుఃఖించు; 19. అర్త - స్వరము = దీనమైన ఎలుఁగు; 20. ప్లక్ష - వృక్షము = రావిచెట్టు.

బకోటంబు[1] వ్యాఘ్రంబుం[2] గనుంగొని, కరుణమీఱ నిట్లనియె. "ఓ శార్దూల కులోత్తమా! ని న్నీ యరణ్యంబునఁ జిరకాలమునుండి పొడగనుచున్నాఁడను. మున్నెన్నఁడుగాని యిట్లు వావిడిచి[3] కస్తి[4] వడినవాఁడవుగావు. ఇప్పటి నీచొప్పు[5]చూడ, నా కత్యద్భుతమ[6]గుచున్నది. నీ వాపోవుటకు[7] నిమిత్తమేమి? తెలుపుము. అనినఁ గొంత చింతాశల్యంబు[8] వాసి, ప్రమోదమగ్నమానసం బయి[9], నాలుక తొట్రుపడఁ బులి యిట్లనియె. "ఓ దయామయా! నా యభాగ్య మేమని చెప్పుకొందును? నిన్నరే యే నొకతగరుం[10] దెగటార్చి[11], నంజుడు[12] గుడుచుచుండ, నా పాపకర్మ మేమోకాని యొకయెముక నా రదనంబుల[13] సందునం దగులుకొనియె. దానిఁ దీయునుపాయంబు దోఁపక, యప్పటి నుండియు నిప్పగిదిం[14] దెప్పరం[15] బగు వెతఁ గుడుచుచున్న వాఁడను.

ఇంక న న్నీ యపాయంబువలనం దలఁగి రక్షింపఁజాలు కరుణాళు వెవ్వరు[16] గలుగుదురొకో యని వ్యాకులపడు[17] చుండ, నా పాలిట భాగ్యదేవత యన్నిటికి నీ సన్నిధానం బనునాధారంబు గల్పించినది. అరసి చూడ నీవు బకమాత్రంబవె? నన్ను బ్రతికింప మూర్తిమంతం[18] బయి నిలిచిన *బహుజన్మకృతసుకృతఫలస్వరూపంబవు[19] గాక, నా కింక నీవుదక్క నన్యంబు

---

1. బకోటము = కొంగ; 2. వ్యాఘ్రము = పులి; 3. వావిడిచి = నోరు విడిచి; 4. కస్తి = దుఃఖము; 5. చొప్పు = విధము; 6. అత్యద్భుతము = అతి+అద్భుతము - యణాదేశసంధి; 7. వాపోవు = దుఃఖించు; 8. చింతాశల్యము = దుఃఖమనెడి బాణము; 9. ప్రమోద - మగ్న - మానసము = సంతోషమున మునిఁగిన మనస్సు గలది; 10. తగరు = పొట్టేలు; 11. తెగటార్చు = చంపు; 12. నంజుడు = మాంసము; 13. రదనము = దంతము, రదము (రూపాం.); 14. ఇప్పగిది (ఈ+పగిది) = ఈ విధము; 15. దెప్పరము = దుస్సహము - డెప్పరము (రూపాం.); 16. కరుణాళువు = దయాళువు, దయా స్వభావుఁడు; 17. వ్యాకులపడు = కలఁతఁజెందు; 18. మూర్తిమంతము = రూపుగలది; 19. * బహు = పెక్కు, జన్మ = పుట్టువులందు, కృత = చేయఁబడిన, సుకృత = పుణ్యములవలని, ఫల = ఫలముయొక్క, స్వరూపంబవు = స్వరూపము గలవాఁడవు.

శరణ్యంబు లేదు. నాకు దిక్కైనను గాకున్నను నీవ. నా మనోరథంబు వ్యర్థంబు సేయక, సదయహృదయుండవై[1] ప్రాణదానంబుచేసి, పుణ్యంబుఁ గట్టుకొమ్ము. నా కింతమాత్రము నీచేత నైన యీ యుపకారంబుఁ జేసితివా, యావజ్జీవము[2] నీ మేలు మఱచిపోను. జాగేల[3] ప్రసన్నుండ[4] నగు న న్నవిపన్నుం[5] జేయుము.' అని యతికరుణంబుగా బహువిధదీనాలాపంబులు పలికినఁ, బట్టరాని దయ పుట్టి, చెట్టు దిగివచ్చి, యా కొంగ తనగొంతు క్రోల్పులినోరఁ జొనిపి, యా యస్థిశకలంబు[6] మెలపున[7] నూడఁబెఱికె. అది దొరంకొని, యా ద్వీపియుఁ[8] గొక్కెరయు[9] బద్ధసఖ్యంబున నుండి, సౌహార్దసౌఖ్య[10] మనుభవించుచుఁ, బ్రత్యేకముఁ గడుపుం బ్రోచుకొనుచుండెను. అట్లు కొంతకాలముండి, యొక్క నాఁ డా చాఱలమెకం[11] బెక్కడ నాహారంబు చేకూఱమి, నంగద[12] నలంగుచు[13], నంతర్గతంబున నిట్లు చింతించెను. 'నేఁ డెంత దుర్దినమో! ఒట్టు పెట్టినట్టు లెంతతిరిగిన నొకకబళమాత్రం[14] బైన మాంసం బీవఱకు దొరకలేదు; ఇంకనుం జిక్కుజాడ[15] గానరాదు, ఇన్నాళ్ళయినది; ము న్నెన్నఁడైన నెఱచి[16] పుట్టనిదినంబు గలదే? దైవంబు ప్రతికూలం బైనయప్పుడు పౌరుషం బేమియుఁ గొఱగాదు గదా! ఏమి సేయుదు? నేఁ డీయెరియు[17] జఠరాగ్ని[18] కుఱవగునెర[19] యరయకున్న, మిన్నక[20] యసువు లీవలసివచ్చును. "మా హింస్యాత్సర్వ భూతాని[21]" యను ధర్మంబు గలదు. అయినను దనప్రాణంబులు నిలిచిన

1. సదయ హృదయుఁడు = దయతోఁ గూడిన హృదయము గలవాఁడు; 2. యావజ్జీవము = బ్రదికినంత కాలము; 3. జాగు = ఆలస్యము; 4. ప్రసన్నుఁడు = ఆపదనొందినవాఁడు; 5. అవిపన్నుడు = ఆపద లేనివాఁడు; 6. అస్థి-శకలము = ఎముక ముక్క; 7. మెలపునన్ = ఉపాయముతో; 8. ద్వీపి = పులి; 9. కొక్కెర = కొంగ; 10. సౌహార్ద సౌఖ్యము = మైత్రీ సుఖము; 11. చాఱలమెకము = పులి; 12. అంగద = ఆఁకలి; 13. నలఁగు = బాధపడు; 14. కబళము = ముద్ద; 15. చిక్కు జాడ = దొరకు సూచన; 16. ఎఱచి = మాంసము; 17. ఎరియు = మండు; 18. జఠరాగ్ని = ఆఁకలిమంట; 19. ఉఱవు = తగిన, ఎర = ఆహారము; 20. మిన్నక = ఊరక; 21. మా హింస్యాత్ సర్వభూతాని = ఎల్లప్రాణులను హింసింపకుము.

పిమ్మటఁగదా సర్వధర్మములును. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధన'[1] మన మును వినమే? తానుగలిగినఁ, బదివేలు గలుగును. కావున, ధర్మపథంబుఁ[2] దప్పఁ ద్రొక్కియైనఁ[3], దన్నుఁ దాఁ గాపాడుకొనుట పరమ ధర్మంబు. ఒడలికొఱకుఁ[4] బుడమినైనను[5] విడువఁజనును. "ఆత్మార్థం పృథివీం త్యజే" త్తని[6] నీతివేత్తలు[7] వాక్రుత్తురు. నేనిప్పు డొక్క యుపాయంబున నీ కవ్వాంబు[8] కాయంబున[9] కపాయంబు కల్పించి, మృత్యుముఖంబునకుం దప్పి ప్రాణంబులు నిల్పికొనియెద. ప్రాణంబులు దక్కినఁ దక్కిన పాతకంబు[10] లే పాచితంబుల[11]నైనఁ బాచికొన[12] వచ్చును" అని నిశ్చయించి, తద్ద్రోహచింత నానుకూలంబగు నుపాయంబు చింతించి, పూర్వప్రకారమ్మునఁ గ్రమ్మఱఁ దల నేల వ్రేలవైచి, తొంటికంటె నినుమడి[13]గా గుహలు మాఱుమ్రోయఁ గుహనావిలాపంబు[14] సేయఁ జొచ్చెను. ఆ విలాపం బాలించి ప్రాణంబులు గలఁగఁబాఱి, యప్రతీకారం[15] బగు శోకంబున బమ్మరవోయి[16], క్రమ్మఱఁ దెలివొంది మిత్రం బగు బకంబు నిర్మలాంతఃకరణంబుతోఁ జేర వచ్చి సమాదరణపూర్వకంబుగా నిట్లనియె. 'చెలికాఁడా? నేఁ డేల యీలాగునఁ జింతాస్తిమితమూర్తి[17]వై మగుడఁ[18] దల్లడ కుడుచు[19]చున్నవాఁడవు? నీ మనికితంబు[20] నా కడ దాఁపురము సేయనేల? నీకు నే నొకవింతవాఁడనె?

---

1. శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్ - శరీరమ్ = శరీరము, ఆద్యం = మొదటిదైన, ధర్మసాధనమ్ ఖలు = ధర్మసాధనము గదా!; 2. ధర్మపథము = ధర్మ మార్గము; 3. తప్పఁద్రొక్కు = విడుచు; 4. ఒడలు = శరీరము; 5. పుడమి = భూమి; 6. ఆత్మార్థం పృథివీం త్యజేత్ = తనకొఱకు భూమిని విడువవలయును; 7. నీతివేత్తలు = నీతి తెలిసినవారు; 8. కవ్వాము = కొంగ; 9. కాయము = శరీరము; 10. పాతకము = పాపము; 11. పాచితము (వి.) ప్రాయశ్చిత్తము (ప్ర.); 12. పాచికొను - పోఁగొట్టుకొను; 13. ఇనుమడి = రెట్టింపు; 14. కుహనా - విలాపము = కపటపు టేడ్పు; 15. అప్రతీకారము = మాఱుచేఁతలేనిది; 16. బమ్మరవోయి = భ్రమపడి; 17. చింతాస్తిమితమూర్తి = విచారముచేఁ గదలికలేని ఆకారము గలది; 18. మగుడన్ = మరల; 19. తల్లడకుడుచు = కలఁతఁజెందు; 20. మనికితము = దుఃఖము.

గొబ్బున[1] నీ యుమ్మలం[2]బునకుఁ గారణం బెఱిఁగింపుము. ఇత్తఱి, మదాయత్తం[3] బగు కార్యం బొక్కటి గలిగిన, నీ నిమిత్తమై నా ప్రాణంబుల నైన నిచ్చెద.' అనిన, బెబ్బులి యంతరంగంబున నుబ్బి, యాననంబున దీనభావం బభినయించుచు, నెలుంగురాలుపడ[4] నిట్లనియె. "నేను గృతం[5] బెఱుఁగనివాఁడఁగాను. సందేహము లేదు; ఈ దేహము నీవు పెట్టిన చెట్టు. మీఁద నే జీవించుటయు నీయాధారముననె. నీ విప్పు డిచ్చిన వరంబు మఱచిపోక చెల్లించి, సత్యసరస్వతి[6] వగుము. ఓ ప్రాణసఖా! ప్రాణప్రదాత యగు మహోపకారి కింతవఱకుం బ్రత్యుపకారము[7] సేయ నద[8] నొదవక పోయెఁగదా యని, నా హృదయంబున నాకే లజ్జ వొడముచున్నది. లోకమున నెంతటివాఁడును నేను బలవంతుఁడ; నా కితరులతోడి దేమి?' యని విఱ్ఱవీఁగ[9] రాదు. బలవంతులకును బలహీనులవలనఁ బ్రయోజనంబులు నిచ్చలు నపేక్షణీయం[10]బులై యుండును. వీవు నాఁ డట్లు ప్రాణాంతంబుఁ జెందకుండ నన్ను నిలిపితివి. బల్లిదుండనయ్యు, వ్యర్థుని[11] కైనడి నేను దానికి బదులు సేయఁ జాలకుంటిని. కటకటా! నా బ్రతుకింకఁగాల్పనే? ఏమో యీశ్వరమాయ యెఱుంగ! అది యట్లుండ, వెండియు నేఁడు నీ సాయంబె నాకు స్పృహ ణీయం[12] బయి యున్నది. చూచితే[13] కాలగతి? కాల మెంతవారికి దుస్తరంబు[14] గదా? అది యట్లుండె. ఇప్పటి నా దురవస్థ వినుము. తొల్లింటిచందముననే, నా దంతంబులయంతరంబున[15] నేఁ డొక్కయెంపముక్క[16] చిక్కుపడి,

1. గొబ్బునన్ = శీఘ్రముగా; 2. ఉమ్మలము = దుఃఖము; 3. మదాయత్తము (మత్ + ఆయత్తము) = నాకు వశమయినది; 4. ఎలుఁగురాలుపడన్ = డగ్గుత్తిక యేర్పడఁగా; 5. కృతము = చేయఁబడినది; 6. సత్య సరస్వతి = సత్యవాక్కు; 7. ప్రత్యుపకారము - ప్రతి+ఉపకారము = మాఱుమేలు; 8. అదను=సమయము; 9. విఱ్ఱవీఁగు=వీఁగు+వీఁగు = మిక్కిలి గర్వించు; 10. అపేక్షణీయము=కోరఁదగినది; 11. వ్యర్థుఁడు=చేతఁగాని వాఁడు; 12. స్పృహణీయము = కోరఁదగినది; 13. చూచితే=చూచితివి+ఏ; 14. దుస్తరము=దాఁట శక్యము గానిది; 15. అంతరము=నడుము; 16. ఎంపముక్క = ఎమ్ము+ముక్క, కొండకచో 'సమాసంబుల నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు ప బ్బవర్ణంబు లగు'. బాల, సమాస19. ఎ+పఙ్ +ముక్క, 'జిత్తు బిందుపూర్వం బగు.' బాల. తత్సమ.19 ఎంపముక్క.

మిక్కుటంబుగ బాధించుచున్నది. నాయట్టి సత్త్వసంపన్నున కుపకారం బొనరించి, యింతతడవు నీ వుదరపోషణంబునకై యిటునటుఁ జనుచుండఁ గన్నులు పెట్టుకొని చూచుచు, నిన్నాళ్లు సైఁచిన నా తప్పు మన్నింపుము. నీ యడుగులాన యింకఁ దొంటియట్ల ని న్నాహారార్థం బిందునందుఁ దిరుగులాడనీయను. నేఁటితో నీ కష్టము గట్టెక్కును. నా హృదయంబునఁ గలయది నిక్కముగా వచియించితి. నామాట విశ్వసింపుము. ఇదె మిత్రకార్యము సమకూర్ప సమయము వచ్చినది. కాలవిలంబనము[1] సేయక, మిత్రరక్షణతత్పరుండవై నా వక్త్రబిలంబు[2] సొచ్చి, చెచ్చెర నీ యంగద[3] నార్పుము.'' అని నెనరు[4] దవులఁ[5] బలికిన నా బకోటంబు గాటం[6] బగు సంతోషంబున, వ్యాఘ్రంబున కిట్లనియె. "మిత్రరత్నమా! యిది యెంతపని? విషాదంబు మానుము. ఇట్టి పాటులు లోకమున నీ తలనె పుట్టునే? విధి త్రిప్పులకు లోనుగాక కడతేఱినవా రేరు? నా చేతిలో నున్న యీ మాత్రపుఁబనికి, నన్యునట్లు నన్నును నీ వింతదూరము వేఁడికొనవలయునా? ఉత్తమచరిత్రునకు మిత్రమనోరథపూరణంబుకన్న నవశ్యకర్తవ్యం[7] బొక్కటి గలదే? నేఁడుగా నా తను[8]వెత్తిన ఫలంబుఁ గాంచఁగంటిని? నా పుణ్య మేమి చెప్పను? చూడు మే నిదె నిమిషమాత్రంబున ని న్నీ యాపదవలనం బాపి ప్రాణసమానుం డగు మిత్రుని ఋణంబుఁ దీర్చికొనియెద. ఇది నీయట్టి శక్తి సంపన్నునకు రాఁదగినయాపద కాదు' అని పలుకుచుం దానినోరఁ జొరబాఱుడుఁ బసిదిండి[9] కఱుక్కున మెడం దెగఁగొఱికి యా క్షణంబ యా బకంబును భక్షించెను. దురాత్ము లాత్మంభరిత్వంబునకై[10] మిత్రద్రోహం బునకైనఁ బాలుపడుదురుగదా! కాఁబట్టి దుష్టులు పలుకునిష్టాలాపంబులు చెవిఁ బెట్టరాదు. తప్పిదారి చెవిఁ బెట్టితిమా, బెట్టిదం బగు చెట్ట[11] పుట్టక మానదు.

---

1. విలంబనము = ఆలస్యము; 2. వక్త్ర-బిలము = ముఖరంధ్రము; 3. అంగద = ఆఁకలి; 4. నెనరు = ప్రీతి; 5. తవులు = తగులు; 6. గాటము (వి.) = గాఢము (ప్ర.) = ఎక్కువ; 7. అవశ్య కర్తవ్యము = తప్పక చేయఁదగినది; 8. తనువు = శరీరము; 9. పసిదిండి = పులి; 10. ఆత్మంభరిత్వము = తన్నుఁ దాఁ బోషించుకొనుట; 11. చెట్ట = ఆపద.

అని మఱియు నా చిత్రవర్ణుని కొలువుడుకాండ్రు[1] పెక్కండ్రు రోషదూషితులై నన్ను దిసంతులు గొట్టుచుఁ[2], బెక్కులు దురాలాపంబులు[3] పలికిరి. అనియెల్ల నుల్లంబునంబట్టి, ప్రత్యర్థి[4] నంతకు[5] చెంతకుఁ బుచ్చు[6] నంతకు నెంతయు దేహదాహంబు సేయుచుండును. నే నశక్తుఁడఁ గావున, లాఘవాస్పదుండనై[7] భంగంబు[8] మ్రింగి, యెప్పటియొప్పున[9] నందఱిలో నౌనని తలయెత్తి తిరుగుచుంటిని. నే నొక పౌరుషశాలినే? ఈ యవమానంబు మానవంతుం డోర్చునట్టిది కాదు. అచేతనమయ్యును, సూర్యకాంతము తపనుపాదములు[10] సోఁకినంతనే ప్రజ్వరిల్లుననఁ, జేతనుం డగునభిమాన వంతుఁ డె ట్లహితకృతతిరస్కారంబుఁ[11] జూచి సైఁచును? అయిన, నా భంగపాటు[12] స్వామికి నివేదింపవలె ననునభిలాషపాశంబు[13] ప్రాణంబుల వెడలనీక బొందితో బంధించి న న్నికడ కీడిచితెచ్చెను.

ఆహా! విధిచెయిద[14] మేమనవచ్చును? నాకుఁ గొండంతబలఁగంబు గలిగియు లేనివాఁడనై, కాని దేశములలో దిక్కుమాలిన పక్షినై నిలిచితిని. అది యట్లుండె. నీ యట్టి జనవిశ్రుతుని[15] యడుగులు పట్టఁగలిగియు, విధివశంబున నొప్పనివారి[16] ముందఱఁ గొలువులో నన్నిరోఁతమాటలకు[17] వీను[18] లొగ్గవలసివచ్చెను. గతవృత్తంబులకు విచారపడ[19] నయ్యెడు కార్యము లేదు కాని, మఱచినను మఱపునకు రాక, యా కష్టపాటు నా హృదయంబున

---

1. కొలువుడుకాండ్రు = సేవకులు; 2. దిసంతులు + కొట్టు = నిందించు; 3. దురాలాపము = దుర్భాష; 4. ప్రత్యర్థి = శత్రువు; 5. అంతకుఁడు = యముఁడు; 6. పుచ్చు = పంపు; 7. లాఘవ + ఆస్పదుఁడు = తక్కువతనమునకుఁ జోటయినవాఁడు; 8. భంగము = అవమానము; 9. ఒప్పు = విధము; 10. తపను - పాదములు = సూర్యకిరణములు - సూర్యుని అడుగులు; 11. అహిత - కృత - తిరస్కారము = శత్రువుచేఁ జేయఁబడిన అవమానము; 12. భంగపాటు = భంగము + పాటు = అవమానము; 13. అభిలాష - పాశము = కోరిక యనెడు త్రాడు; 14. చెయిదము = చేష్ట; 15. జన - విశ్రుతుఁడు = జనులలోఁ బ్రసిద్ధుఁడు; 16. ఒప్పనివారు = శత్రువులు; 17. రోఁతమాటలు = అసహ్యమైన మాటలు; 18. వీనులు = చెవులు; 19. విచారపడు = విచారము + పడు - విచారంపడు, విచారముపడు (రూపాం.)

నాటుకొని, మనశ్శల్యం బయి యలయించు[1] చున్నది. నాకిన్ని త్రవ్వనేల? కానివారిచే గాసిఁ[2] బొందుమని విధి[3] యట్లు వ్రాసియుండ, నెవ్వఁడు తప్పింపనేర్చును? ఇది దేవర మొగంబునం దెలిపి, మనంబు నొగిలించుట[4] కెంతయు నా స్వాంతంబు[5] దురపిల్లె[6]డును. అచ్చోఁ జిత్రవర్ణుం డించుక యక్కటికంబు[7] వహించి, వైదేశికుండ[8] నని నన్ను మన్నిగొన[9] మదిగొల్ప[10]క, విడిచి పుచ్చె. స్వామిపాదపద్మంబులు మరల దర్శించు భాగ్యంబు కరంబు[11] కల్గుటఁబట్టి, యీ సంగ్రామవార్తాహరత్వంబు వహించి, యి ట్లేతెంచఁ గాంచితిని. మార్గాయాసనిమిత్తంబునఁ జిత్తంబు స్వాయత్తంబు కాకున్నయది; అందులకుఁదోడు, విషాదవేదనా దోదూయమానమాన[12]సుండ నయి యున్న వాఁడను. ఇంక మిక్కిలి విన్నవింపనేరను. స్వామికి వార్తావిశేషంబులు నివేదింపవలయు నను నుత్సాహమును, స్వామి సన్నిధాననివసనాభిరతియు[13], నవలంబంబులుగా[14] నింతతడవు నిలువఁగలిగితిని. ఎఱింగినంతవఱకు మొఱంగక[15] జరిగిన సర్వవృత్తాంతమును దేవరకు విన్నవించి, కృతకృత్యుఁడ నైతిని. ఆ చంద్రకీంద్రుండు[16] నన్ను వీడ్కొల్పునపుడు 'నీ వెనుకనే కీరంబుఁ[17] బుత్తు. ముందు పొ'మ్మని పంపెను. అదియు నింతకుఁ జనుదెంచుచుండును. ఇఁకఁ గర్తవ్యాంశంబు దేవరచిత్తమునకే విదితంబు[18] పోయివచ్చెద." అనిన హిరణ్యగర్భుండును నాతనిఁ గృపాకటాక్షవీక్షణంబులం[19] జూచుచు నిట్లనియె. "దీర్ఘముఖా! దైవతంత్రం బైనపని కార్తిఁ[20]జెందఁ బనిలేదు. సమస్తము

---

1. అలయించు = బాధించు; 2. గాసి = ఆపద; 3. విధి = బ్రహ్మ; 4. నొగిలించు = నొప్పించు; 5. స్వాంతము = మనస్సు; 6. దురపిల్లు = దుఃఖించు; 7. అక్కటికము = దయ; 8. వైదేశికుఁడు = విదేశీయుఁడు; 9. మన్నిగొను = చంపు; 10. మదిగొల్పు = తలంచు; 11. కరము = మిక్కిలి; 12. దోదూయమాన = మిక్కిలి బాధపెట్టఁబడుచున్న; 13. నివసన + అభిరతి = నివసించుటయందుఁ గోరిక; 14. అవలంబము = ఆధారము; 15. మొఱఁగక = దాఁచక; 16. చంద్రకీంద్రుఁడు - చంద్రకి + ఇంద్రుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 17. కీరము = చిలుక; 18. విదితము = తెలిసినది; 19. కృపా - కటాక్ష - వీక్షణము = దయతోడి క్రీఁగంటిచూపు; 20. ఆర్తి = దుఃఖము.

దెలిసినవాఁడవు; నీకు నేఁ జెప్పవలయునె? నీవు మిక్కిలి ధైర్యశాలివే. యిట్లు పేదమాట[1] లేల యాడెదవు? ఆ చిత్రవర్ణుఁడు సమిత్రామాత్యపుత్రంబుగాఁ[2] జావఁదలంచి కాఁబోలు, నీ యట్టి సాధువున కపకారంబు దలంచె. ఏమయిన నేమి? ఇంతటితో మునిఁగిపోయిన దేమియు లేదు. రేప చని, యా పాఁప మేపరిదొర[3] యవలేపంబు[4] మాపుదము[5]. ఊఱడుము. సర్వజనసత్కారార్హుండ వగు నీవంటివానికా, యిట్టిపాటులు పాటిలవలె?" అని శ్రవణరసాయనముగాఁ[6] బలుకుచు విషాదాపనోదము[7] సేయుచున్న జేనియనుజ్ఞ వడసి దీర్ఘముఖుండు కొంత మనసునందుఁ గొఱకొఱమాని విశ్వసించుచు నిజాగారంబు[8]నకుం జనియె.

అంత నక్కడ దీర్ఘముఖునిఁ బనిచిన వెనుకఁ బర్హీంద్రుం[9] డరుణ ముఖుఁ జేరఁజీరి, హిరణ్యగర్భుని కొలువులోఁ బలుకవలయు పలుకు లెల్లఁ దేటపడఁ గఱపి, 'నీ వవియన్నియు నీళ్ళు నమలక దిటంబున[10] నోలగమునఁ[11] బలుకవలయుఁజుమీ' యని పుచ్చి యంత మంత్రి కేకాంత మిచ్చి, తద్వచనానుస్మృతిని[12] మేఘవర్ణుం డనుకాకమును రప్పించి, బహుమాన పురస్సరముగా[13] నిట్లనియె. 'మనకిప్పు డక్కప్పురపుదీవి[14] నావరింప యత్నము కలిగియున్నది. దానికి నీతోడుపా[15] టవశ్యము గావలసి యున్నది. ఈకార్యంబు కడముట్ట నిర్వహింప భవదన్యుండు[16] సమర్థుండు లేఁడు. కావున సర్వప్రయత్నముల నీ వీ పనికి వేగు[17] నడపవలయును. నీవు ప్రచ్ఛన్న

---

1. పేద మాటలు = తక్కువ మాటలు; 2. సమిత్రామాత్యపుత్త్రము = స్నేహితులు, మంత్రులు, కుమారులు అనువారితో; 3. పాఁపమేపరిదొర = నెమలి ఱేఁడు; 4. అవలేపము = గర్వము; 5. మాపు = పోఁగొట్టు; 6. శ్రవణరసాయనముగా = చెవుల కింపుగా; 7. విషాద + అపనోదము = దుఃఖమును బోఁగొట్టుట; 8. నిజ + అగారము = తనదైన యిల్లు; 9. బర్హీంద్రుఁడు = బర్హి + ఇంద్రుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 10. దిటము = ధైర్యము; 11. ఓలగము = సభ; 12. అనుస్మృతి = అనుసరణము; 13. బహుమాన పురస్సరము = గౌరవము ముందగునట్లు; 14. కప్పురపుదీవి = కర్పూర ద్వీపము; 15. తోడుపాటు = సాయము; 16. భవదన్యుఁడు = భవత్ + అన్యుఁడు = నీకంటె నితరుఁడు;

వేషమునఁ[1] జని, యేలాగునైనను హిరణ్యగర్భుని చెలిమి[2] కలిమి కుపాయంబు గావించుకొని వేషభాషల నచ్చిక[3] పుట్టున ట్లటమటించుచు[4], నెందుఁ జనవరివై[5] యుండి, యానుకూల్యప్రాతికూల్యంబుల తెఱం గెఱింగి మనకార్యసిద్ధి యెవ్విధంబున నగు నవ్విధం బీవ సంఘటించి, కార్యనిర్వాహకుండ వగుము. నీవచ్చట తేనిదండనుండు నేనిక[6]నయిన దోమనయిన నెడసి[7] పోనాడుకోక, కూడఁగట్టుగొని, వారివారి మనసు కనిపట్టి తిరుగవలయును. వారి కించుక వెగటు[8] దోఁచెనేనిఁ, దగునవసరంబున నీమీఁద నేమేనియు నావగింజలు తాటికాయలుగా నేలిక[9] చెవులం బోసి, యెగపోసి, నీవలన నొక్క కొఱగామిఁ[10] గల్పించి, ని న్నాతనిమది కెడఁజేయుదురు[11]. దానంజేసి, సకలోద్యమఘ్నంబు[12] లగువిఘ్నంబులు దొట్టి[13], మన ప్రయత్నమెల్ల నాఱడిపోవును[14], కార్యము మించిన వెనుక, నేమనుకొంటిమి పో యేమి కార్యము? రాజుల చిత్తంబులును క్షణక్షణంబులు[15], ఎప్పు డెప్పగిది[16] నుండునో తెలిసి మెలఁగుట కడుఁబ్రేఁగు[17]. కావున నయ్యాజియ్యాలువెట్టుచు[18], నైనదానికిఁ గానిదానికి నడ్డమువచ్చి పైఁబూసికొనక, వాలుపయి[19] నడచునట్లు మెలఁకువ గలిగి మెలఁగవలయును. రాజుదయ గలిగినన్నాళ్ళును నందఱు మిత్రులే యగుదురుగాని, యది యింత గొఱఁతవడిన[20] మిత్రులే యమిత్రు[21] లగుదురు. వనంబులు దహించు దహనునకు[22] మిత్రుఁడగు మారుతుండ[23] దీపంబున నన్నువయయి[24]

---

1. ప్రచ్ఛన్న వేషము = మాఱు వేసము; 2. చెలిమి = స్నేహము; 3. నచ్చిక = నమ్మిక; 4. అటమటించు = వంచించు; 5. చనవరి = చనవు గలవాఁడు; 6. ఏనిక = ఏనుఁగు; 7. ఎడయు = తొలఁగు; 8. వెగటు = కోపము; 9. ఏలిక = రాజు; 10. కొఱగామి = తప్పు; 11. ఎడఁజేయు = దూరము చేయు; 12. సకల + ఉద్యమ-ఘ్నము = ఎల్ల ప్రయత్నములను జంపునది; 13. తొట్టి = మొదలుకొని; 14. ఆఱడి + పోవు = వ్యర్థమగు; 15. క్షణక్షణములు = క్షణమునకొక విధముగా నుండునవి; 16. పగిది = విధము; 17. ప్రేఁగు = భారము; 18. అయ్యాజియ్యాలు + పెట్టు = అయ్య, జియ్య = దేవుఁడు అను-వినయమును సూచించు; 19. వాలు = కత్తి; 20. కొఱఁత + పడు = తక్కువగు; 21. అమిత్రులు = శత్రువులు; 22. దహనుఁడు = అగ్ని; 23. మారుతుఁడు+అ = వాయువే; 24. అన్నువ = తక్కువ.

యున్నప్పుడు మారుతుండు[1] గాఁడే? కావున, నీ వే వారికి వేఁడిదాఁకనట్లుగాఁ జరింపక, రాజు కన్నెఱింగినవాఁడవై, యాతని చిత్తవృత్తి ననువర్తింపవలయును. ఎందును నీ వెఱుఁగని నయానయంబులు[2] లేవు. అచట నీమనసు గూడినవారికైన, హృదయ మీకుము; మఱచియైన నిచ్చటమాట లచ్చట వాక్రువ్వకుము[3]; నీవు బుద్ధిమంతుఁడవు. ఒరులచేతఁ జెప్పించుకొనునర్థంబు లేదు. పొమ్ము. మేము నిత్యము నీరాకయే కాచియుందుము. వెనుక మఱ చెదవు సుమీ." అని పనిచి[4], చిత్రవర్ణుండు స్వకార్యంబునం బ్రవర్తించు చుండె.

అంత నిచ్చట దీర్ఘముఖుండు కొలువు దాఁటినపిమ్మటఁ, గోక[5] మ్మించుక హసించి[6] హంసప్రకాండునితో[7] నిట్లనియె. "చిత్తగించితిరా? మన బాలిశుండు[8] పరదేశ మరిగి యేమి కొనివచ్చెనో! 'తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచిన' దన్నట్లు, దుర్జనుండు తానుజెడుట చాలక, తనవారికింగూడ వీడనికీడు దెచ్చిపెట్టును. అందున కీ బ్రుక్కడి[9] కొక్కెరయె తార్కాణంబయి కానఁబడుచున్నది. కారణము లేకయే కలహమునకుఁ గాలుద్రవ్వుట క్షుద్రుని లక్షణము. పండినవృక్షంబు చందంబున, సజ్జనుండు వంగియుండును. మూర్ఖుండు, శుష్కకాష్ఠంబుంబలె[10], భేద్యుం డగుంగాని, నమ్రుండు[11] గానేరఁడు. పండితమాను[12] లెఱుక లోకఫణివే లుపచరించినను, వారిని బట్టిన నైజదోషంబు[13] లీషన్మాత్రంబును[14] విడువవు. నూఱుమాఱులు నీరంబులం గడిగిన, నంగారంబుల మలినత్వంబు[15] వాయదు." అని మఱియుం

---

1. మారుతుఁడు = శత్రువు; 2. నయ+అనయములు = నీతి, అవినీతి; 3. వాక్రువ్వకుము = చెప్పకుము; 4. పనుచు = ఆజ్ఞాపించు, పంపు; 5. కోకము = చక్రవాకము; 6. హసించు = నవ్వు; 7. హంసప్రకాండుఁడు = హంసలలో శ్రేష్ఠుఁడు; 8. బాలిశుఁడు = మూర్ఖుఁడు; 9. బ్రుక్కడి = నీచ; 10. శుష్క-కాష్ఠము = ఎండుకట్టె, బలె = వలె; 11. నమ్రుఁడు = వంగినవాఁడు; 12. పండితమానులు = పండితులు కాకున్నను, పండితుల మనుకొనెడి వారు; 13. నైజ-దోషము = సహజ దోషము; 14. ఈషన్మాత్రము = ఈషత్ + మాత్రము = కొంచెమయినను; 15. అంగారము = బొగ్గు, మలినత్వము = నలుపు.

దూఱుచుండ వారించి కలహంసనాయకుండు నిజామాత్యున కిట్లనియె, "ఇప్పు డీ యుపాలంభనవచనంబులతోడఁ[1] బ్రయోజన మేమి? ఇదియంతయుఁ గాలప్రాప్తంబుకాని. హితకార్యధూర్వహుం[2] డీతనియెడ నీఁగకాలంతయు నపకార్యంబు[3]లేదు. లేనిది పైఁబెట్ట రాదు; కాలవిపర్యయమ్ముల[4] నుద్యమమ్ములెల్లఁ బ్రతికూలంబు లగును. ఈతండు మన సదయవాక్యసంభావనకుఁ[5] బాత్రుండు[6]గాని గర్హణార్హుండు[7] గాఁడు. నీవును బహువిలోకివి[8]; లోకంబున నీకుఁ దెలియనిది లేదు; పోయినదాని మరలఁ ద్రవ్వుట చర్వితచర్వణంబు[9]; దాన సారంబేమియుఁ గనుపట్టదు; అందులకయి వందురుటయు[10] గతజలసేతుబంధనంబు[11]. కాన, దాని మాని, ప్రస్తుతకార్యవిచారంబునకు గోచరం బగునంతయుఁ గార్యసూత్ర మెఱిఁగింపుము." అనిన నా జక్కవల రాయం[12] డా రాయంచదొర కిట్లనియె.

బుద్ధిమంతు లగువారు వర్ణాకారప్రతిధ్వానంబుల[13] వలనను, నేత్ర వక్త్రాదివికారంబుల[14] వలనను, బరుల మనోగతంబు[15] లూహింప సమర్థులయి యుందురు కావున, మంత్రరక్షణం బత్యంతావశ్యకంబు. అభిగుప్త మంత్రులకు[16] సర్వార్థసిద్ధులును సుకరంబు[17]లగును." అనుడు, నమ్మాటల

---

1. ఉపాలంభన వచనములు = నిందావాక్యములు; 2. హితకార్యధూర్వహుండు = మిత్రుని పనిని వహించువాఁడు; 3. అపకార్యము = చేయఁగూడనిది; 4. కాల విపర్యయము = కాలము మాఱుపాటు; 5. సదయ వాక్య సంభావన = దయతోడి మాటల యాదరము; 6. పాత్రుఁడు = తగినవాఁడు; 7. గర్హణ + అర్హుఁడు = నిందకుఁదగినవాఁడు; 8. బహువిలోకి = పెక్కు చూచినవాఁడు; 9. చర్వితచర్వణము = నమలినదే నమలుట - జరిగిపోయినవానినిగూర్చి విచారించుట; 10. వందురు = దుఃఖించు; 11. గత జల సేతు.బంధనము = పోయిన నీటికి వంతెన కట్టుట, వ్యర్థమని భావము; 12. జక్కవల రాయఁడు చక్రవాకాధిపుఁడు; 13. వర్ణ+ఆకార-ప్రతిధ్వానములు = రంగు, రూపము, ప్రతిధ్వని; 14. నేత్ర - వక్త్ర + ఆది వికారములు = కన్నులు, నోరు మున్నగువాని మార్పులు; 15. మనోగతము = మనసులో నున్నది; 16. అభిగుప్త మంత్రులు = దాఁచఁబడిన మంత్రము (ఆలోచనము) గలవారు; 17. సుకరము = సులభము.

వెంబడినె యొడయని[1] చూపు దీపితైకాంతకాంక్షంబయి[2], నలుగడల[3] నీగిడిన, నా చూడ్కితోడన యా యెడకుం గడునెడ గలుగ నడుచు నందలి మాననీయుల[4] వెంట నంటి, తక్కటివారును దూరదూరముల కేగిరి. అంత మంతిరి[5] మఱింత చెంతకు జరిగి/యేలిక మోమునఁ జూపు మోపి, యిట్లనియె. దేవా! యవధరింపుము. నా బుద్ధికిం జూడ, నిప్పటి కప్పగవానిపాలికిఁ బ్రణిధి[6] నొక్కనిఁ బనుచుట యుచితంబుగాఁ దోఁచుచున్నది. పదింబదిగ[7] విమర్శింపక, పదరి[8] కర్జంబు[9] పూనుట కార్యజ్ఞుని[10] లక్షణంబు గాదు. వైద్యకర్మంబున కనాలస్యంబు[11]నట్ల కార్యనిశ్చయంబున కాలస్యంబ కరంబు శ్రేయంబు. ఒకానొకచో నల్పకార్యంబు సహసారబ్దంబైనఁ[12] గావచ్చుంగాని, మహాకార్యంబు సాహసక్రియాసాధ్యంబు[13] గాదు. సువిచారపూర్వారబ్దకార్యంబునకు[14], దైవంబును ననుకూలం బగును. అంతియగాక, యెదిరితలంపుఁ బదిలంబుగా నెఱుంగక, యొక సాహసంబునకుం జొచ్చుటయుఁ గానిపనియె. క్షితితలాధ్యక్షుం[15] డాత్మచ్ఛిద్రంబుల[16] బయలఁబడకుండఁ గాపాడుచు, విపక్షపక్షచ్ఛిద్రంబుల[17] భద్రంబుగా మున్మున్న చారదృష్టిని[18] వీక్షింపవలయును. దూరస్థులయ్యును, గార్యంబు లనిశంబును[19] గొట్టికాండ్రచే[20]

---

1. ఒడయఁడు = రాజు; 2. దీపిత+ఏకాంత-కాంక్షము = ప్రకాశింపఁజేయఁబడిన యేకాంతము నందలి కోరిక గలది; 3. నలుగడలు = నాలుగు దిక్కులు; 4. మాననీయులు = మాన్యులు; 5. మంతిరి (వికృతి) - మంత్రి (ప్రకృతి); 6. ప్రణిధి = దూత; 7. పదింబదిగన్ = గట్టిగా; 8. పదరి = త్వరపడి; 9. కర్జము = కార్యము; 10. కార్యజ్ఞుఁడు = కార్యము తెలిసినవాఁడు; 11. అనాలస్యము = ఆలస్యము లేకుండుట; 12. సహసా + ఆరబ్దము = వెంటనే ఆరంభింపఁబడినది; 13. సాహస - క్రియా - సాధ్యము = సాహసపుఁ బనిచేత సాధింపఁదగినది; 14. సువిచార పూర్వారబ్దకార్యము = మంచి ఆలోచన ముందు గలుగనారంభింపఁబడినది; 15. క్షితితల + అధ్యక్షుఁడు = భూపతి - రాజు; 16. ఆత్మచ్ఛిద్రము = ఆత్మ+ఛిద్రము = తన దోషము; 17. విపక్ష-పక్ష+ఛిద్రము = శత్రుపక్షమువారి దోషము; 18. చార దృష్టి = వేగుచూపుతో; 19. అనిశము = ఎల్లప్పుడు; 20. కొట్టికాండ్రు = వేగరులు.

గనుచుంటఁబట్టియే, పృథ్వీకాంతులు[1] చారచక్షు[2] లనం బరఁగుదురు. స్వపర రాష్ట్రమ్ముల కార్యాకార్యమ్ముల నవలోకింప రాచవారికి వేగులెకదా లోచనములు[3]? ఎవ్వని కా లోచనంబులు పూజ్యంబు[4]లో, యా మానవనాథుం డనయంబును[5] నయనంబు[6]లుండియు; నంధకల్పుం[7]డగును. ఇప్పు డరుగు చరుని[8]తోడఁ గూడ నయోపాయజ్ఞుం[9]డును, విశ్వాసపాత్రుండును[10], నగు వేఱొక్కనిఁ గూడఁ బుచ్చ[11]వలయును. అతండు సర్వథా[12] యప్రమత్తుండయి[13] విరోధివీటఁ[14] బుట్టు విశేషంబు లెప్పటి వప్పుడు మన చెవుల వేసి, వేసఱక[15] గుప్తప్రకారంబునఁ[16] జనుచుండవలయును. ఇమ్మహా కార్యంబు నిర్వహింప మన దీర్ఘముఖుండ శక్తుండు. అతండు స్థలజలసంచరణచణుండు[17]; ఆకారవికారాదులఁ బరులభావంబు లూహింపఁ జతురుండు[18]; నీటిలో జాడలు దీయు నేర్పున నీతనిఁ జెప్పి వేఱొక్కనిఁ జెప్పవలెను; ఈతని తోడ నీడగు[19]వాని నీ సభ నొం డొక్కనిం గానము. ఎల్లభంగులఁ జరకృత్యంబున[20] కీతండ యర్హుండు. ఈతనికి బాసటయై[21] చన నీతని యనుజుండు[22] ధవళాంగుండు దగినవాఁడు. ఆతండును బరేంగితజ్ఞానచతురుండు[23]. పరులు తెలియరాదు గాన, నిది యంతయు గుప్తంబుగాఁ గావించుట శ్రేయోదాయకము. పిడుగువడుతఱిన[24]

---

1. పృథ్వీకాంతులు = భూపతులు; 2. చార-చక్షులు = వేగరులే కన్నులుగాఁ గలవారు; 3. లోచనము = కన్ను, 4. పూజ్యము = శూన్యము; 5. అనయము = ఎల్లప్పుడు; 6. నయనము = కన్ను; 7. అంధ-కల్పుఁడు = గ్రుడ్డివానితో సమానుఁడు; 8. చరుఁడు = చారుఁడు = వేగు; 9. నయ+ఉపాయజ్ఞుఁడు = నీతి, ఉపాయము తెలిసినవాఁడు; 10. విశ్వాసపాత్రుఁడు = నమ్మఁదగినవాఁడు; 11. పుచ్చు = పంపు; 12. సర్వథా = అన్ని విధముల; 13. అప్రమత్తుఁడు = ఏమఱనివాఁడు; 14. వీటన్ = దేశమునందు; 15. వేసఱు = విసువుచెందు; 16. గుప్త-ప్రకారము = రహస్య విధానము; 17. స్థల జల సంచరణ చణుఁడు = నేలపై, నీటిపై సంచరించుటయందు సమర్థుఁడు; 18. చతురుఁడు = నేర్పరి; 19. ఈడు = సాటి; 20. చరకృత్యము = చారునిపని; 21. బాసట = తోడు; 22. అనుజుఁడు = తమ్ముఁడు; 23. పర+ఇంగిత-జ్ఞాన-చతురుఁడు = ఇతరుల తలఁపు నెఱుఁగుటలో నేర్పరి; 24. తఱిన = తఱిన్+అ = సమయమునందే.

యెఱుకపడునట్లు[1], రాజకృత్యంబును ఫలకాలముననె యెఱుకపడవలయును. మఱియు, మారుతుం జేరువ నునిచికొని యేమఱియుండు నాతండు ప్రమత్తత్వంబున దీర్ఘవృక్షంబు కొనకొమ్మను శయనించి కనుమోడ్చువాని యెన యగును. కావునఁ, బరివారంబునెల్ల రాజద్వారంబున నుండ శాసింపవలయును. ఇట్టి సమయంబుల భూపాలుం డెట్టివారిని నమ్మక, వైరి నివారణంబున కుపాయంబు రోయుచు నెల్లప్రొద్దు నాత్మరక్షాపరుండయి, జాగరూకత కలిగియుండవలెను. మంత్రరహస్యంబును బయలఁబడరాదుగాన, నిజరక్షాయత్న మె ట్లట్ల, మంత్రరక్షాయత్నము నేమఱకుండునది. మంత్రంబు మూఁడవనోటంబడిన, సర్వకార్యంబులు భగ్నంబులయి పొలియును[2]. ఇది యంతయు నెఱింగి, ధరావరుం[3] డాత్మమంత్రిద్వితీయుండై[4], యెంతవారికిం గర్ణగోచరంబు[5] గాకుండ మంత్రకార్యంబు నిర్వహింపవలయు. అదియ, రాజులకు విజయమూలంబు. అట్లుగాక తక్కిన రహస్యంబు కర్ణపరంపరం[6] బ్రకటంబగును. మంత్రవిభేదంబువలనం గలుగు నిక్కట్టులు[7] చక్కఁ బడుట మిక్కిలి యక్కజమని[8] నయజ్ఞులు[9] పలుకుదురు. నాకుఁ దోఁచినంతవట్టును స్వామికి విన్నవించితిని. సర్వజ్ఞులు దేవర యెఱుంగని ధర్మంబులు లోకంబున లేవు; ధర్మతత్త్వమ్ము లెల్ల స్వామికి గరతలామలకమ్ములు[10]. దేవర దివ్య చిత్తంబునకువచ్చినపని ననుష్ఠింతము[11]." అనినఁ గృపావలోకమందహాస సుందరవదనుండయి[12], వరటాధినాథుం[13] డిట్లనియె. "బాపురే[14]! నీవు నా

---

1. ఎఱుకపడు = తెలియు; 2. పొలియు = చచ్చు; 3. ధరావరుఁడు = రాజు; 4. ఆత్మ - మంత్రి - ద్వితీయుఁడు = తన మంత్రి రెండవవాఁడుగాఁగలవాఁడు = మంత్రితోఁ గూడినవాఁడు; 5. కర్ణగోచరము = చెవికిఁ దెలియుట; 6. కర్ణ-పరంపరన్ = చెవుల వరుస - ఒక చెవినుండి ఇంకొక చెవికి; 7. ఇక్కట్టు = కష్టము; 8. అక్కజము = ఆశ్చర్యము; 9. నయజ్ఞులు = నీతి తెలిసినవారు; 10. కరతల + అమలకము = అరచేతిలోని యుసిరిక - సులభ మనుట; 11. అనుష్ఠించు = చేయు; 12. కృపా + అవలోక - మంద-హాస-సుందర-వదనుఁడు = దయాదృష్టితోడి చిఱునవ్వుచే అందమయిన ముఖముగలవాఁడు; 13. వరట + అధినాథుఁడు = హంసలరాజు; 14. బాపురే! = ఆహా! బలే.

మనంబునం గలయదియె, చెట్టునంబుడికినట్టు[1] వచించితివి! నీవు దీర్ఘాయుష్మంతుండ వయి మందువుగాక![2] నీవలన నెంతయు సంతసిల్లితి. నీ వాక్యముల యందు గ్రాహ్యంబులు[3] కానివియుఁ గలవే? మనకుఁ బ్రణిధియు నుత్తముండు దొరకెను. నిశ్చితకార్యమునకు జా గేల[4]? శుభస్య శీఘ్ర"మ్మనిన, సవినయముగా మంత్రి యిట్లనియె."దేవా! యి ట్లప్రయత్నముగ సర్వానుకూలుం డగు చారుండు లభ్యమగుట, భావిజన్యవిజయసూచకంబయి[5] కానఁబడుచున్నది. సంకల్పసిద్ధులగు దేవరకే యుద్ధంబున జయంబు నిశ్చయంబు." అని ప్రశంసించు నవసరంబునఁ[6], బ్రతీహారుం[7] డొక్కరుండు ప్రవేశించి, ప్రణామంబు[8] గావించి యిట్లనియె. "దేవా! దేవర దర్శనార్థంబు జంబూద్వీపమునుండి కొండొక శుకంబు వచ్చి, తలవాకిట[9] నిలిచి యున్నది. లోనికిం గొనిరా సెలవే?" అనిన, దొర మంత్రివలనికిం[10] జూడ్కి నిగిడించుడుఁ[11], దదభిప్రాయం బెఱింగి, చక్రవాకవల్లభుం డిట్లనియె. నీ విప్పు డేగి, యచ్చిలుకం దగుచోటఁ గూరుచుండఁబెట్టుము. తేనియానతి యైనప్పుడు లోనికిం గొంచురమ్ము. పొమ్మ" అనిన, మనంబున భయభక్తులు పెనంగొన వెనుకవెనుకం జని, కీరంబును గని యిట్లనియె, మా దొరవా రిత్తతిఁ[12] దమధీసచివులతో[13] మంత్రావాసంబున నేకత ముండి[14], కార్యపర్యాలోచనము సేయుచున్నవారు. వా రిప్పుడవచ్చి బయలికొలువిత్తురు. అప్పుడు పోయి వారి చరణములు సందర్శింపవచ్చును. అందాఁక నిందు వసియింపుము' అని యుచితాసనంబు వెట్టిన, నది యందు వసించియుండె. అంత,

---

1. చెట్టునఁబుడికినట్టు = చెట్టునుండి కోసినరీతి, (స్పష్టముగా ననుట); 2. మందువు = మనుదువు = బ్రదుకుదువు; 3. గ్రాహ్యము = గ్రహింపఁదగినది; 4. జాగు = ఆలస్యము; 5. భావి - జన్యవిజయ - సూచకము = రాఁగల యుద్ధమునందలి గెలుపును దెలుపునది; 6. అవసరము = సమయము; 7. ప్రతిహారుఁడు = ద్వారపాలకుఁడు; 8. ప్రణామము = నమస్కారము; 9. తలవాకిటన్ = ద్వారమునందు; 10. వలనికిన్ = దిక్కునకు; 11. నిగిడించు = ప్రసరింపఁజేయు; 12. తతి = సమయము; 13. ధీ-సచివులు = తెలివిగల మంత్రులు; 14. ఏకతము + ఉండు = ఏకాంతముగా నుండు.

సమరసముల్లాసంబు[1] మొగంబునకు వికాసంబు నింప, మంత్రి మోముచూచి మరాళేంద్రుం[2] డిట్లనియె. "ఆహా! సుభట నివహ ముదావహంబును[3], భీరు భయావహంబును[4], నగు నాహవంబు[5] సంప్రాప్తమైనది. దురంబునం[6] బిఱిందికి[7] నడుగువెట్టని బిరుదుమగలకుం[8] దమగాత్రంబుల[9] సాఫల్య పాత్రం[10] బులం గావించుకొనను, జిరంతన[11] మగు కీర్తి గాంచను, మంచియవసరం బొడగూడినది. శాణవిఘృష్టమణియును[12], నర్థిసాత్కృత ధను లగు[13] దానఘనులును[14], రణనిహతులగు[15] శూరవితతులును[16], గృశత్వంబునం[17]గాదె కడుశోభింతురు. కావునం బిఱికికండలేని దండి[18] మగల నెల్ల భండనమున[19] కాయితం[20] బయియుండ నియమింపుము. ఉత్సాహంబు వాటింపుము." అనిన, మందహాసరోచుల[21] మొగంబునం దెలివి తొలంకాడ[22], నా జక్కవయెకిమీం[23] డిట్లనియె. "దేవర వాక్రుచ్చిన దంతయు శూరజనశ్లాఘనీయంబ[24] కాని, వేఱుగాదు. అయినను స్వామి దగ్గఱ నాకుం గల చనవరితనం[25] బొక్కహితంబ విన్నవింప నుల్లంబును

1. సమర - సముల్లాసము = యుద్ధోత్సాహము; 2. మరాళ + ఇంద్రుండు = హంసరాజు; 3. సుభట - నివహ - ముద్ + ఆవహము = మంచి వీరుల సమూహమునకు సంతోషమును గలిగించునది; 4. భీరు - భయ + ఆవహము = పిఱికివాండ్రకు వెఱపు గలిగించునది; 5. ఆహవము = యుద్ధము; 6. దురము = యుద్ధము; 7. పిఱింది = వెనుక, 8. బిరుదు - మగలు = మహాశూరులు; 9. గాత్రము = శరీరము; 10. సాఫల్య - పాత్రము = సఫలతకుం దగినది; 11. చిరంతనము = చిరకాలముండునది; 12. శాణ - విఘృష్ట-మణి = సానయందు రాయంబడిన రత్నము; 13. అర్థి - సాత్కృత - ధనులు = యాచకుల వశముగావించిన ధనము గలవారు; 14. దాన - ఘనులు = దానమునందు గొప్పవారు; 15. రణ-నిహతులు = యుద్ధమునం జంపంబడినవారు; 16. శూర-వితతులు = శూరుల సమూహములు; 17. కృశత్వము = నీరసించుట; 18. దండి = గొప్ప; 19. భండనము = యుద్ధము; 20. ఆయితము = సిద్ధము; 21. మంద - హాస - రోచులు = చిఱునగవు కాంతులు; 22. తొలంకాడు = అతిశయించు; 23. జక్కవ - ఎకిమీండు = చక్రవాకరాజు; 24. శూర - జన - శ్లాఘనీయము = శూరులైన జనులచేం బొగడం దగినది; 25. చనవరితనము = చనవుగల వాని భావము - చనవు.

బెల్లుగ(¹ బీడించుచున్నది. దేవరమాట కడ్డ మాడెనని వే(డిమిసేయక², లెస్సగా దివ్యచిత్తమున నవధరింపవలయును. తొలుదొల్త( గలహమునకు( గాలుద్రవ్వుట, యెవ్వరికి ననర్థదాయకంబు. ఇట్టి యార్యగర్హితంబగు³ పనిని, మిముబోఁటి మేటిమగ లేటికి( బాటింతురు? ఉపాయములలో నెల్ల దండోపాయం బధమోపాయంబని, యనయమును⁴ నయవిదులు⁵ పలుకుచుందురు. ఏమిసేయ(బోయిన నేమగునో!

జయాపజయంబులు నిర్ణయింప నెవ్వరిపామ్ము? విద్వేషివిజిగీషు⁶ లగు మనీషు⁷లాహవంబు శుభావహంబుగామి, సామదానభేదముల నేదాననేని( దమకార్యముల సాధింప(బాటుపడుదురు. అం దెందున( దీఱకున్న( దుదకు( గడయుపాయమునకుం⁸ గడంగుదురు, కడపట నెటు వో నెటువచ్చునో యని, యప్పుడును సంప్రాప్తమనోరథు⁹ లగుదనుక(, బాలలో( బడ్డ బల్లివిధంబున( దల్లడిల్లుచుందురు. ఇందలి మనవార లందఱు శూరాగ్రేసరు¹⁰ లని మురియరాదు¹¹. బవర¹² మొదవకమున్ను మదిమది¹³ నిండ్లకడ నుండ నెల్లవారును శూరులే యౌదురుగాని, దురమున మద మొదవ నెదు¹⁴ రెదిరినతఱి బెదరి చెదరక మది కుదుర(బెట్టుట యెట్టిదిట్ట¹⁵లకుం గట్టరిది¹⁶. పరాక్రమక్రమాసాధ్యము¹⁷లగునట్టి కర్జములు¹⁸ పెక్కు లల్పోపాయసాధ్య

---

1. పెల్లు = అధికము; 2. వే(డిమి + చేయు = కోపపడు; 3. ఆర్యగర్హితము = పెద్దలచే నిందింప(బడినది; 4. అనయము = ఎల్లప్పుడు; 5. నయవిదులు = నీతి తెలిసినవారు; 6. విద్వేషి - విజిగీషులు = శత్రుజయము గోరినవారు; 7. మనీషులు = పండితులు; 8. కడ + ఉపాయము = చివరి ఉపాయము - దండోపాయము; 9. సంప్రాప్త - మనోరథులు = నెఱవేఱిన కోరికగలవారు; 10. శూర + అగ్రేసరులు = శూరులలో మొదట నడచువారు - శూరశ్రేష్ఠులు; 11. మురియు = సంతోషించు; 12. బవరము = యుద్ధము; 13. మదిమదిన్ = నిశ్చింతతో; 14. ఎదురు = శత్రువు; 15. దిట్ట = గొప్పవా(డు; 16. కట్టరిది = కడు+అరిది = మిక్కిలి ఆశ్చర్యము; 17. పరాక్రమ + క్రమ + అసాధ్యము = పరాక్రమముయొక్క క్రమముచే సాధింపరానిది; 18. కర్జము (వి.) = కార్యము (ప్ర.);

ములయి యుండును. అనితరసాధనోత్థాప్యంబు[1] లగుమహోపలముల[2] మహోన్నతపదముల[3] కెక్కించుట యుపాయముచేతనకాదే? యుక్తకాలకృతోద్యోగమువలనఁ[4] గృషి సఫలం బగునట్లు, ప్రయత్న మల్పమయినను, సముచితసమయం బొదవుదనుక వేచి యాచరించిన నయవ్యవసాయమును[5], సహస్రగుణాధికం[6] బయిన ఫలము నిచ్చును. అట్లు కానినాఁడు, పడ్డపాటంతయు నిష్ఫలంబయి వృథావస్థ యగును. దూరభీరుతయు[7], నాసన్న శూరతయు[8], మహాత్ములకు సహజగుణములు. అల్పులయం దీగుణములు విపరీతము లయి[9] యుండును. వేమలు శపథములు పలుకుటయు, నంజలులు[10], నభివాదనములు, సామప్రియవాక్యములుఁ గాపురుషులకు[11] స్వభావసిద్ధములు. ఇఁక మిథ్యావచనము[12] లన్న, వెన్నతోడఁ బెట్టినవె[13]. మహాత్ములు విపత్కాలములయందును దమధీరత్వము విడువరు. ఆపత్కాలముల ధైర్యమును, సంపదలయందుఁ దాలిమియు[14], రాజసభల యందు సరసవచనరచనాచాతుర్యమును[15], రణరంగముల విక్రమంబును, మహానుభావులకుఁ బ్రకృతిసిద్ధములు[16] కావె? మఱియుఁ జిత్రవర్ణుండు మహాబలవంతుఁడును బలవత్సహాయసంపన్నుఁడును[17] నగుట, మన మిప్పు

---

1. అనితర - సాధన - ఉత్థాప్యము = ఇతర సాధనములచేత లేవఁదీయరానిది; 2. మహోపలము = మహత్ (మహా) + ఉపలము = పెద్దఱాయి; 3. మహోన్నతపదములు = మిక్కిలి యెత్తయిన స్థలములు; 4. యుక్త-కాల-కృత+ఉద్యోగము = తగిన సమయమునఁ జేయఁబడిన ప్రయత్నము; 5. వ్యవసాయము = కృషి; 6. సహస్ర-గుణ+అధికము = వేయిరెట్లు ఎక్కువ; 7. దూర భీరుత = దూరమైన భయము; 8. ఆసన్న శూరత = సమీపమున నున్న పరాక్రమము; 9. విపరీతములు = తాఱుమాఱు; 10. అంజలులు = దోయిళ్లు - నమస్కారములు; 11. కాపురుషులు = కుత్సితులైన పురుషులు; 12. మిథ్యా - వచనము = అసత్యపు మాట; 13. వెన్నతోడఁబెట్టినది = సహజమైనది; 14. తాలిమి = ఓర్పు; 15. సరస - వచన - రచనా - చాతుర్యము = రసవంతమైన మాటల రచనయందు నేర్పు; 16. ప్రకృతి - సిద్ధము = స్వభావముచే నేర్పడినది; 17. బలవత్సహాయసంపన్నుఁడు=బలవంతులతోడ్పాటనెడి సంపద గలవాఁడు.

డాతనిఁ దొడరఁ[1] గడంగుట గహనదహనముపయి[2] మిడుత లురవడి[3] నుఱుక నడరుట. ఎట్టి బెట్టిదుండుగాని తన్ను డీకొనువానివీఁక[4] బోకార్పఁ[5] దొడంగుంగాని, యడఁగియుండువానిపయిఁ దనవడి నిగిడింపఁ దొడఁగఁడు. నదీరయంబు[6] నిలిచిపోలుచు నిలాజంబుల[7] నున్మూలింపఁ[8] బూనుఁగాని, వంగి యడుగంటియున్న పిల్లుఁ[9] బెల్లగింపం బూనదు. క్షమాసమానంబు[10] లగునయోపాయంబు లొండు లేవు కావున వేగిరపాటు చేటు వాటిల్లుటకు మూలం బగును. మన కిప్పుడు దుర్గనిర్మాణోద్యమం[11] బత్యంతావశ్యకంబు. దుర్గస్థుం డగు నొక్కనికి, వెలివారి[12] నూఱువురనైన నోరువ[13] సుకరంబయి యుండును. దుర్గవిషయుం[14] డగుగోత్రావరుండు[15], శాత్రవాసాధ్యుండయి[16], పరిభవాస్పదుండు[17] కాకుండును. ఇంక సదుర్గవిషయుం డగుధరావల్లభుండో, ధరచ్యుతమనుష్యప్రతిముం[18]డయి, పరాభవంబునకుఁ దావలంబగును[19]. మనము నిర్మింపఁబోవు దుర్గంబును నరాతి వర్గంబునకు[20] దుర్గమం[21] బయి, యప్రభేద్యం[22] బయి, లోపల నిర్మలజలసమృద్ధం బగు కొలఁకు నొక్కటిఁ గలిగి యుండవలయును. వచనీయంబు[23] సర్వంబును వచియించితి. ఇంక దేవర సర్వక్రియాకలాప నిర్వహణధురీణులు[24] కావలయును. దుర్గంబు

1. తొడరు = ఎదిరించు, 2. గహన - దహనము = అడవినిప్పు; 3. ఉరవడి = అతివేగము; 4. వీఁక = పరాక్రమము; 5. పోకార్చు = పోఁగొట్టు; 6. నదీ-రయము = నది వేగము; 7. ఇలాజము = చెట్టు; 8. ఉన్మూలించు = పెకలించు; 9. పిల్లు = పుల్లు = కసవు; 10. క్షమా - సమానము = ఓర్పుతో సమానమైనది; 11. దుర్గ-నిర్మాణ + ఉద్యమము = కోటనుగట్టు ప్రయత్నము; 12. వెలివారు = బయటివారు; 13. ఓరువన్ = ఓడించుటకు; 14. దుర్గ - విషయుఁడు = దుర్గము దేశమందుఁ గలవాఁడు; 15. గోత్రావరుఁడు = రాజు; 16. శాత్రవ + అసాధ్యుఁడు = శత్రువులకు సాధింపరానివాఁడు; 17. పరిభవ + ఆస్పదుఁడు = అవమానమునకుఁ జోటయినవాఁడు; 18. ధర-చ్యుత-మనుష్య-ప్రతిముఁడు = కొండనుండి జాఱిన మనుష్యునితో సమానుఁడు; 19. తావలము = చోటు; 20. అరాతి - వర్గము = శత్రు సమూహము; 21. దుర్గమము = పోరానిది; 22. అప్రభేద్యము = భేదింప రానిది; 23. వచనీయము = చెప్పఁదగినది; 24. సర్వ - క్రియా - కలాప - నిర్వహణ-ధురీణులు=ఎల్లపనుల సమూహమును నిర్వహించుట యను భారము వహించువారు.

సంసిద్ధం బగువఱకు, దూత నిచ్చోటికి రప్పింప నొప్పదు. కావునఁ దడవు సేయక ముందఱ నీపనికిం బనుపవలయును." అనిన, హిరణ్యాగర్భుండును మంత్రివదనంబుఁజూచి, "కాలయాపనంబు సేయక దుర్గనిర్మాణపరిణతుం డగువాని రావించి, యాజ్ఞాపింపు" మనవుడు, 'నౌఁగా' కని యా కోకనాయకుండు[1] తత్ క్షణంబ యొక పరిచారకు నంపి సకలానల్ప శిల్పకలాకుశలు[2] వీరవరాభిధానసారసప్రశస్తు[3] నా యెడకుఁ బిలిపించి, సగౌరవంబుగా నిట్లనియె. "ఓయీ! సారసవరా! ఈ యవసరంబున నీవలన మాకొక యవసరంబు గలిగి పిలిపించితిమి. మాకు నీయంతటి హితుండు గలుగుటకు నీచేనైన యిక్కార్యంబున కక్కఱవచ్చుటయే ఫలంబు. మన కిత్తఱి నొకదుర్గంబు కావలసివచ్చినది. ఈపని యనితరసాధ్యం బగుటంజేసి, యీ భారంబు నీపయినె మోపవలసివచ్చెను. ఇది నీకుఁ బరమప్రయోజనంబు. స్వామియానతి యౌదలం[4] దాలిచి, యతిత్వరితంబుగ నొక దుర్గంబు నిర్మింపుమా. నీ నేరిమి పేరిమి[5] చూతము." అనిన నగ్గలంబగు[6] వినయంబు తోఁ బ్రణామంబుఁ గావించి, యాబెగ్గురుపక్షి యిట్లనియె. "దేవరకు నాయెడఁ గలవత్సలత్వంబున నీమాననీయ వాక్యంబు లానతిచ్చెదరుగాని, నే నంతటి శక్తియుక్తుండను గాను. నా కొండొకపని[7] యనుగ్రహింపుఁడు. నేను మీ పాదచ్ఛాయం[8] బడియుండి, మిమ్ముఁ జూపట్టుకొని చాటున బొట్టఁ బోసికోవఁబసినవాఁడనుగాని, స్వతంత్రించి యొకపని పయివ్రేసికొని సంబ ళింపఁ[9] జాలినవాఁడనుగాను" అనుచో మరాళతల్లజుండు[10] కించిదుల్లసిత వదనుం[11] డగుచు, సారసపతి కిట్లనియె. "నీ ప్రజ్ఞావిశేషంబు సర్వంబును, మా సర్వజ్ఞుండు వాక్రువ్వ విన్నవారము. నీకిప్పని త్రోచిపుచ్చినం బోవదు.

---

1. కోక-నాయకుఁడు = చక్రవాక శ్రేష్ఠుఁడు; 2. సకల + అనల్ప - శిల్ప - కలా - కుశలున్ = ఎల్ల గొప్పశిల్పవిద్యలయందు నేర్పుగలవాఁడు; 3. సారస - ప్రశస్తున్ = బెగ్గురుపక్షులలో శ్రేష్ఠమైనదానిని; 4. ఔదల = తల; 5. నేరిమి = నేర్పు, పేరిమి - గొప్పతనము; 6. అగ్గలము = అధికము; 7. ఒండొక = ఇంకొక; 8. పాదచ్ఛాయ = పాద + ఛాయ; 9. సంబళించు = సమర్థించు; 10. మరాళ-తల్లజుఁడు = హంసలలో శ్రేష్ఠుఁడు; 11. కించిత్ + ఉల్లసిత - వదనుఁడు = ఇంచుక వికసించిన ముఖము గలవాఁడు.

ఇది యనన్యవిషయం[1] బయిన కార్యంబు. మాకడ నున్న యీయందఱిలో నీవు సమర్థతముండ[2] వని నిశ్చయించి, పని పంచితిమి. ఇఁక వృథాకథ లెన్నక, క్రియాపరుండవు గమ్ము" అనిన, తేనిమాటకు మాఱాడనోడినట్లు మెత్తన నియ్యకొని[3] చని, చయ్యనఁ[4] జనుదెంచి, నమస్కరించి వీరవరుం డేలిక కిట్లనియె. "స్వామీ! భవత్ప్రసాదంబున మనకు వలయు దుర్గం బొక్కటి యారసివచ్చినాఁడను. మన నగరోపకంఠంబున[5], నొక యహార్యగహ్వరం[6] బున్నయది. అయ్యది విశాలాంతరాళంబయి[7], ప్రత్యర్థిజనదుస్సాధంబయి[8], యత్యంతరమణీయంబై యుండును. అందు నయనానందకరంబైన[9] విమల కమలపూర్ణ కమలాకరం[10] బొక్కటి మిక్కుటముగఁ గ్రాలు[11]చుండును. ఆయది దేవరచిత్తమునకు వచ్చెనేనిఁ జెచ్చెర[12] నాయత్తం[13] బొనరించెదను." అనిన, మెచ్చి పసదనంబు[14] లొసంగి, యా రాయంచదొర పలుమాఱు ప్రెగ్గడ[15] విన నా బెగ్గురు నగ్గించి[16] యిట్లనియె. "మాకు నీవంటిబంటు గలుగుట మా భాగ్యముగాదే! నీవలనం గడుఁ బ్రమోదించినారము. దుర్గపాలనాధికారంబును, నీకె యొసంగినవారము. మన్నియోగంబు[17]లందు లేశంబును బ్రమాదంబునం[18] బొరయక, స్వకృత్యం బేమఱక కన్నుగలిగి కాచుకొన్నియుండు నది. నీకు శుభ మగుఁగాత! పోయిరమ్ము." అని సెలవొసంగిన, నుదీర్ణపూర్ణహర్షుండయి[19] 'మహాప్రసాదం' బని చని, వీరవరుండు

---

1. అనన్య - విషయము = ఇతరులకుఁ జెందనిది; 2. సమర్థతముఁడు = సమర్థులందఱిలో గొప్పవాఁడు; 3. ఇయ్యకొను = సమ్మతించు; 4. శీఘ్రముగా; 5. నగర + ఉపకంఠము = పట్టణ సమీపము; 6. ఆహార్య - గహ్వరము = కొండగుహ; 7. విశాల+అంతరాళము = విశాలమైన నడిమి భాగముగలది; 8. ప్రత్యర్థి-జన-దుస్సాధము=శత్రుసమూహమునకు సాధింపరానిది; 9. నయన + ఆనందకరము = కన్నుల కానందము గలిగించునది; 10. విమల - కమల - పూర్ణ - కమలాకరము = నిర్మలమైన పద్మములతో నిండిన సరస్సు; 11. క్రాలు = ఒప్పు; 12. చెచ్చెరన్ = శీఘ్రముగా; 13. ఆయత్తము = సిద్ధము; 14. పసదనము = బహుమానము; 15. ప్రెగ్గడ = మంత్రి; 16. అగ్గించి = పొగడి; 17. మన్నియోగము = మత్ + నియోగము = నా ఆజ్ఞ; 18. ప్రమాదము = పరాకు; 19 ఉదీర్ణ - పూర్ణ - హర్షుఁడు = మిక్కిలి నిండిన సంతోషము గలవాఁడు.

తన్నియోగప్రకారంబున నాహారనిద్రల కెడములేక, రేయింబవలును దుర్గరక్షణంబె నిత్యకృత్యముగాఁ గనుపెట్టుకొనియుండెను.

అనిన, రాచకొమారులు తదనంతర వృత్తాంత శ్రవణ కుతూహలాయత్తచిత్తులై, విష్ణుశర్మంగని, యనంతరవృత్తం బెట్లునడచెఁ జెప్పుమని యడుగుటయు -

కందుకూరి వీరేశలింగ విరచితంబగు
నీతిచంద్రిక యందు విగ్రహము ప్రథమభాగము
సంపూర్ణము.



శ్రీః

# విగ్రహము

## ద్వితీయ భాగము

పరమదయాపరుండైన విష్ణుశర్మ యాదరశీతలేక్షణంబులం గాంచుచు, వీరవరుండు కొలువు విడిచి చనిన యనంతరమునఁ జెల్లిన[1] వృత్తాంతంబంతయు, నృపతిసుతులకు నిట్లు చెప్పఁ దొడఁగెను.

అంతలో ద్వారపాలకుఁ డొక్కఁడు క్రమ్మఱ నరుదెంచి, యంజలి ఘటియించి నిలిచి యిట్లనియె. "దేవా! యేలినవారి పాదసందర్శనాభిలాషంబున, సింహళద్వీపమునుండి నీలవర్ణనామకవాయసనాయకుండు వచ్చి, బహిర్ద్వారంబున నిలిచియున్నవాఁడు. ముదల[2]యేని సన్నిధానంబునకుం దోడుకొని వచ్చెద". అనిన, మనంబున నలరి, చక్రాంగపుంగవుం డంగంబు వొంగ మంత్రి కిట్లనియె. "కాకంబు కరంబు ప్రాజ్ఞంబు[3], శక్తిసంపన్నంబు. రాజు మందప్రజ్ఞుల[4] వేవురఁ[5] జేర్చుటకంటెఁ, బ్రాజ్ఞు నొక్కని గడించుకొంట లాభంబు. సింగంబును గాదని, కౌలేయకంబుల[6] వేయింటిఁ గూర్చుకొన్న నేమిప్రయోజనము? మనవారిలో నీ గుమికానికి[7] సమానుండు బలవంతుం డుండిన, వ్రేలుమడఁచి యొక్కని నెఱింగింపుము. యుద్ధోద్యోగసమయంబుల శూరసంగ్రహం[8] బవశ్యకర్తవ్యంబు, కాన సర్వప్రయత్నంబుల మన కీతనితోడుపా టభ్యర్థనీయము[9]. మనకిట్టి యవిజేయుని[10] సహాయం బొదవిన, నెవ్వఁడయిన మనల జుట్టనవ్రేలఁ[11] జూప నోవునే? నీవును విచారించి చెప్పుము.'

1. చెల్లిన = కడచిన; 2. ముదల = ఆజ్ఞ; 3. ప్రాజ్ఞము = తెలివైనది; 4. మంద - ప్రజ్ఞులు = తెలివితక్కువవారు; 5. వేవురన్ = వేయిమందిని; 6. కౌలేయకము = కుక్క; 7. గుమికాఁడు = కాకి; 8. శూర - సంగ్రహము = శూరులను గూర్చుకొనుట; 9. అభ్యర్థనీయము = కోరఁదగినది; 10. అవిజేయుఁడు = జయింపరానివాఁడు; 11. జుట్టనవ్రేలు = చూపుడువ్రేలు - తర్జని.

అనిన, మందహాస విద్యోత వదనుండయి, సర్వజ్ఞం డిట్లనియె, "మనో వాక్కాయకర్మంబుల నే నెప్పుడు స్వామికి హితంబె కాంక్షించు చుందుంగానఁ, గొంకు[1]మాని నాకుం దోఁచినది విన్నవించెద. దేవర చిత్తంబున వేఱుగా భావింపఁబోకుఁడు. కార్యవేగం బేలినవారి చిత్తంబున కుచితకార్యవివేకంబుఁ దోఁపనీకున్నట్టున్నయది. క్రొత్త వాని సాహాయ్యంబున బ్రత్యయంబు[2] నిడి కడిఁదిమార్తురఁ[3] బరిమార్తు[4] మంట, శునకవాలంబు[5] పట్టుకొని కడలిఁ[6]గడవఁ గడఁగుట. అదియునుం గాక, కాకంబు స్థలచరంబు; మనము జలచరంబులము ఈతండు మనతోడం గలియువాఁడు కాఁడు. సమానుఁడు గానివానితోడి పొత్తు విపత్తునకుఁ గారణం బగును. కావున మన మీ యరిష్ట మును జేకొనుట యరిష్టమును[7] గైకొంట[8] గాని, వేఱు గాదు. దేవర యిఁక నీతలంపు వేసిపెట్ట[9]వలయును. తనవారి మాని లాఁతి[10]వారిఁగోరుట, యమృతంబుఁ దిరస్కరించి కాలకూటంబుఁ[11] గ్రోలఁదలంపుగొంట. ఈ ప్రత్యక్షవిపక్షపక్షి యెట్లు సంగ్రాహ్యం బగునో దేవరయే చక్కఁగా విచారింప వలయును. ఎవ్వఁ డాత్మపక్షంబుఁ బరిత్యజించి పరపక్షం బపేక్షించునో వాఁడు నీలవర్ణసృగాలంబు[12] పోలికఁ గాలధర్మంబు నొందును. ఏలిక కా కథ విన్న వించెద నవధరింపుఁడు".

ఒక్క తామసీనిశీథంబు[13]న శవకబళనలోలం[14] బయి, సృగాలం బొక్కటి నగరోపాంతంబున విచ్చలవిడిఁ జెఱలాడుచుఁ[15], జీకువాలు[16] కతంబునఁ బ్రమాదంపడి, నీలపాచనభాండంబు[17]నంబడి, వెడలనేరక

---

1. కొంకు = సందేహము; 2. ప్రత్యయము = విశ్వాసము; 3. కడిఁది - మార్తురన్ = గొప్ప శత్రువులను; 4. పరిమార్చు = చంపు; 5. శునక-వాలము = కుక్కతోఁక; 6. కడలి = సముద్రము; 7. అరిష్టము = కాకి, కీడు; 8. కైకొంట = కైకొనుట; 9. వేసిపెట్టు = విడిచిపెట్టు; 10. లాఁతి = పెఱ; 11. కాలకూటము = విషము; 12. సృగాలము = నక్క; 13. తామసీ-నిశీథము = చీఁకటిరాత్రి; 14. శవ-కబళన-లోభము = శవములను దినుట యం దాసక్తి గలది; 15. చెఱలాడు = తిరుగు; 16. చీకువాలు = చీఁకటి; 17. నీల - పాచన - భాండము = నల్లని వంటకుండ.

నిరంతరచింతం బనవిపనవి[1], కొంతవడికి డెందంబు కుందు[2] డిందువఱిచి కొని[3], మాఱుచింతలేక వేగు[4]వఱకు విచారించి, వెరవొం[5]డరసి యెడఁదకు సరిపఱుచుకొని, తెల్లవాఱి భాండస్వామి[6] యేతెంచునంతకు, నూర్ధ్వ చరణంబును[7] వివృతాననంబును[8] నిష్కాసితదంతంబును[9] నయి, కన్నులు తేలగిలవైచి, యూపిరి బిగఁబట్టి, గిట్టిన[10]యట్టుల పడియుండెను. అంత, నా నీలికాఁపు వచ్చి చూచి, విస్మయగోచరుండై, యా వంచకంబు పంచత్వంబు[11] నొందెనకాఁదలంచి, వడివడిం గుండ వెడలించి, ఫేరువు[12] నూరికి దూరంబుగఁ బాఱవైచె. అంత నా మానిసి యచ్చోటు వాసి చనినవెనుక, మూసిన కన్ను లల్లన విచ్చి, యచ్చెరుపడి యాపాదమస్తకము[13] తన మేనినీలిడాలు[14] విలోకించుకొనుచు, జంబుకంబు తనలోఁ దా నిట్లుచింతించెను. "నాయదృష్ట మెంతయు మంచిది కాఁబట్టి నేఁడు నాకు యాదృచ్ఛికంబుగ[15] నేతాదృశం[16] బగునుత్తమవర్ణంబు లభ్యమైనది; నా కొలంబు[17]లోన మాన్యుఁడ నైతిని. ఇంకను, జ్ఞానహీనుని చందంబునఁ బ్రాభవశూన్యుండనై. నిరర్థకజీవుం డనై యుండనేల : ఇట్టి సర్వోత్కృష్ట వర్ణంబు సమకూరినప్పుడే మేలుం బడయంజాలకుంటినే, నింక నాక్రచ్చులు[18] సాధించుకొనుట యెన్నఁడు? నా యౌత్కృష్ట్యంబు[19] లోకంబునకుం బ్రకటింప నిదియ యదను'.[20] అని విచారించి, కార్యం బారసి, తోడిఫేరవంబులం[21] జేరఁజీరి యిట్లనియె, "విన్నారా? నిన్న రేయి న న్నొకదివ్యపురుషుండు

---

1. పనవి పనవి = దుఃఖించి దుఃఖించి; 2. కుందు = విచారము; 3. డిందువఱుచుకొను = తగ్గించుకొను; 4. వేగు = తెల్లవాఱు; 5. వెరవు = ఉపాయము; 6. భాండస్వామి = కుండ యజమానుఁడు; 7. ఊర్ధ్వచరణము = పైకిఁగల పాదములు గలది; 8. వివృత + ఆననము = తెఱవఁబడిన నోరుగలది; 9. నిష్కాసిత - దంతము = బయల్పఱుపఁ బడిన పండ్లు గలది; 10. గిట్టు = చచ్చు; 11. పంచత్వము = మరణము; 12. ఫేరువు = నక్క; 13. ఆపాదమస్తకము = కాళ్ళ నుండి తలవఱకు; 14. డాలు = కాంతి; 15. యాదృచ్ఛికము = అనుకొనకుండ; 16. ఏతాదృశము = ఇటువంటిది; 17. కొలము = కులము; 18. క్రచ్చులు = కోరికలు; 19. ఔత్కృష్ట్యము = గొప్పతనము; 20. అదను = సమయము; 21. ఫేరవము = నక్క.

స్వర్గంబునకుం గొంపోయి, ప్రసాదమందస్మితవాళక్షం బగుకటాక్షంబు[2] నాపయిం బొలయించుచుఁ, దన యనుకంప[3] పెంపున సర్వగీర్వాణ సమక్షంబునఁ[4] బూజ్యం బగు ప్రాజ్యారణ్యారాజ్యంబునకు సర్వంబునకు న న్నధ్యక్షునింగాఁ జేసి, యీ యుత్తమవర్ణంబు నాకుఁ బ్రసాదించె. సంశయంబు వాయ నా యొడలు వొడగాంచితిరిగదా! ఇఁక వినవలసినది విస్పష్టముగా వినుండు. ఇది మొదలు, మీ రందఱు మదీయాజ్ఞానుసారంబుగఁ గింకుర్వాణులై[5] ప్రవర్తింపవలయును. మఱియు నేఁడుసుత[6], యీ కానంగల జంతుసంతానంబెల్ల నా యానకు లోనై మెలంగవలయును. మీ రిప్పుడ వెడలి, యీ మేటివార్త సకలాటవులం[7] దేటపడం జాటునది." అని వీడుకోలిచ్చిన, నృగాలజాలంబులు దానిమేని విశిష్టవర్ణం బవలోకించి, రోమాంచకంచుకిత గాత్రములయి[8], యించుకయు ననుమానింపక, యా చరిత్రము, విస్రంభపాత్రము[9]గా వగచి[10], వినయభయసంభ్రమంబు లుల్లంబుల మల్లడిగొన[11] సాగిలఁబడి మ్రొక్కి, చని యక్కాననంబు దశదిశలం[12]గల సకలజంతుజాతం[13]బున కాతనివృత్తాంతంబు చిత్తంబుల కెక్కునట్టు పౌనః పున్యం[14] బుగ వాక్రుచ్చి, వచ్చి, నిర్వ్యాజవినయంబు[15] నహర్నిశం[16]బును భక్తిసేయుచుఁ, బ్రదక్షిణప్రాప్తానురాగంబు లయి, వంచసలేక యా వంచకంబు నజస్రంబు[17]ను సేవించుచుండెను. అది మొదలుకొని, యంధసరం

---

1. ప్రసాద - మంద - స్మిత - వళక్షము = అనుగ్రహముతోడి చిఱునవ్వుచేతఁ దెల్లనిది; 2. కటాక్షము = క్రేఁగంటిచూపు; 3. అనుకంప = దయ; 4. సర్వ-గీర్వాణ-సమక్షము = ఎల్ల దేవతల యెదుట; 5. కింకుర్వాణులు = సేవకులు; 6. నేఁడు సుత = నేఁడు మొదలు; 7. సకల + అటవులు = ఎల్ల అడవులు; 8. రోమాంచ - కంచుకిత - గాత్రములు = గగుర్పాటుచేఁ గవచముగలవిగాఁజేయఁబడిన శరీరములు గలవి; 9. విస్రంభ - పాత్రము = నమ్మఁదగినది; 10. వగచు = తలఁచు; 11. మల్లడిగొను = పెనఁగొను; 12. దశ దిశలన్ = పది దిక్కులందు; 13. జాతము = సమూహము; 14. పౌనఃపున్యము = మరల మరల నగుట; 15. నిర్వ్యాజ-వినయము = నెపములేని యడఁకువ; 16. అహర్నిశము = పగలు రేయి; 17. అజస్రము = ఎల్లప్పుడు.

పరావ్యవహారం[1]బున భ్రమియించి, వనంబున వసియించు సింహశార్దూలాది మృగజాలంబు లా సృగాలంబున కాజ్ఞానువర్తులై, మహోపహారంబులు[2] సమర్పించుచు, నాతనిమన సెక్కడ నోచ్చునో యని యనుసరించి సంచరించుచుండెను. ఇట్లా గోమాయువు[3], హర్యక్షాద్యుత్తమసత్త్వంబులు[4] పరిజనపదమునం[5] గుదిరి యవిరతము[6]ను దనమాటలో మెలఁగుచుఁ గొలుచుచుంటంబట్టి, తొట్టినగర్వాతిరేకం[7]బునఁ దనజాతి మెగం[8]బుల మొగంబైనఁ జూడనొల్లక, వానియం దెల్ల సతిమాత్రనిరాదరం[9]బై యుండె. అందుచే నా శివాసముదయములు[10] విషణ్ణహృదయము[11]లయి తమ ప్రమాదమునకు నిర్వేదము[12] నొందుచు, వ్రేలుమొగములుపడి తమలోఁ దలపోఁతలకుఁ జొచ్చి, రహస్యముగ నొక్కనాఁ డొక్క చక్కిం[13] గూడుకొని యుండ, నం దొక్క వృద్ధక్రోష్టువు[14] తనవారినెల్లఁ గలయం గనుంగొని యిట్లనియె. "ఇది యంతయు స్వయంకృతాపరాధము. కాలకర్మవశులమై బుద్ధిమాంద్యంబున మనమే యీతని కీ ప్రభుత్వసంపదఁ గలుగఁజేసితిమి. అందుచే నీతనికిఁ గాకియుఁ గోకిలమును నొక్కటిగా నున్నవి. ఎంత మేలు చేసినను, మన మీతనికేమైన హితులమైతిమే? మత్తచిత్తవృత్తుల[15]కుఁ జేసిన మేలు వమ్మ[16]గుటయే కాక, చేసినవారికి గోరము[17]లును బ్రాప్తములగును. విమర్శదూరమైన వానికడ నిలుచుట, మనది నేరము. ఇంతకాల మొద్దనున్న

---

1. అంధ పరంపరా వ్యవహారము = గ్రుడ్డివాండ్ర విధమున, ఒక గ్రుడ్డివాఁడు చేసినట్లే తక్కిన గ్రుడ్డివారును జేయురీతి; 2. మహా+ఉపహారములు=గొప్ప కానుకలు; 3. గోమాయువు = నక్క; 4. హర్యక్ష + ఆది + ఉత్తమ సత్త్వంబులు = సింహము మున్నగు శ్రేష్ఠములయిన జంతువులు; 5. పరిజనపదము = సేవక స్థానము; 6. అవిరతము = ఎల్లప్పుడు; 7. తొట్టిన గర్వ + అతిరేకము = కలిగిన గర్వాతిశయము; 8. మెగము = మెకము (వి.) = మృగము (ప్ర.); 9. అతిమాత్ర విరాదరము = మిక్కిలి యెక్కువయైన అనాదరము గలది; 10. శివా - సముదయములు = నక్కల సమూహములు; 11. విషణ్ణ - హృదయము=విషాదము నొందిన హృదయము గలది; 12. నిర్వేదము=దుఃఖము; 13. చక్కి = చోటు; 14. వృద్ధక్రోష్టువు = ముసలినక్క; 15. మత్త-చిత్త-వృత్తులు=మదించిన మనో వ్యాపారము గలవారు; 16. వమ్ము=వ్యర్థము; 17. గోరము (వి.)= ఘోరము(ప్ర.)

తప్పునకు ననిశము[1] వీనిచే నవమానవాక్యములం బడిపడి యెమ్ము[2]లెల్లఁ జిల్లులు పడ్డవి. ఇప్పుడు కార్యము తప్పినది. వీని నిన్నాళ్ళును భాండంబునట్ల తల మోచితిమి. ఇంకఁ దఱివేచి, కటికనేలం గూలవైవకున్న, మనకుఁ బ్రాణాంతంబువచ్చు, అపత్పరిహారార్థము[3]గా వే నొక్క యుపమ[4] సెప్పెద. అది మీ మదు[5]లం బట్టుకొలిపి, యీ పుట్టిన కలంకఁ దొలంగఁబెట్టుఁడు. ఈ మృగధూర్తకాధముండు[6] రాజ్యమదాంధకారం[7]బు కన్నులం గప్పుకొని, క్రిందును మీఁదునుం దెలియజాలకున్నవాఁడు! ఒద్ద నున్నవారినైనఁ గనఁడు. మనమెల్ల వీనిమృషావచనమ్ము[8]లు నిక్కమ్ములని నమ్మి, తెలివిలేక మోసపోయితిమి. నక్క యెక్కడ? నాగలోక[9] మెక్కడ? రాజ్యంబునకుఁ బట్టంబు గట్టుటెక్కడ? ఇది యంతయు నదృష్టశ్రుతపూర్వము[10]. ఏలాగుననో దీని కీ నీలిరంగు గలవడిన, ని ట్లిన్నిమాయ లీ టక్కరినక్కయే పన్నినది. దీనికి మూలం బెఱుఁగమిని, మన మిట్లు నితాకు[11] గదిరి[12] యుంటిమి. ఈ మతకరిబూమెలు[13] చెవి నిడి మానంబుఁ గోలుపోయితిమి. ఒక్క మనమే యన నేల? పంచాస్యాదులును[14] నీ ముక్కడినక్కచేత నవమానితంబు లయ్యెను. ఇంతవఱకు మనమే వివేకుల మనుకొంటిమి; మన మృగేంద్రాదు లంతకు మున్దే వివేకులు. కడచినగాథలఁ ద్రవ్వనేల? మన చిత్తమాంద్యమే మనల నింతకుఁ దెచ్చినది. ఇఁకను మేలుకొనకున్న, దానిచేష్ట లెప్పుడు నప్రతిహతంబు[15] లయి సాగుచుండును. ఇప్పు డాతండు పట్టినదెల్ల బంగార మగుచున్నదని, మన మాతని నంతపెద్ద సేయవలదు. అగుకాలంబున నర్థంబులు దుర్బుద్ధికైన సిద్ధించును. కానికాలంబున సుబుద్ధులకును సిద్ధింపవు. అయినను, ఋజుమార్గలె

---

1. అనిశము = ఎల్లప్పుడు; 2. ఎమ్ములు = ఎముకలు; 3. ఆపత్పరిహారార్థము = ఆపదతొలఁగు నిమిత్తము; 4. ఉపమ = పోలిక; 5. మది = మనసు (వి) మతి (ప్ర.); 6. మృగధూర్తకాధముఁడు = నీచమైన తుంటరి మృగము; 7. రాజ్య - మద + అంధకారము = రాజ్యగర్వమనెడి చీఁకటి; 8. మృషావచనము = అసత్యపుమాట; 9. నాకలోగము = స్వర్గలోకము; 10. అదృష్ట శ్రుతపూర్వము = మునుందు కనఁబడనిది, వినఁబడనిది; 11. వితాకు = నిశ్చేష్టత; 12. కదిరి = కలిగి; 13. మతకరి - బూమెలు = మాయవేషములు; 14. పంచాస్య + ఆదులు = సింహము మున్నగునవి; 15. అప్రతిహతము = కొట్టఁబడనిది.

యాపదలం బొరయక, చిరకాల బహు సౌఖ్యభాగు[1] లగుదురు. తనకుఁ గాలంబు నిండి, యాతం డాత్మవినాశ హేతువగు దౌరాత్మ్యంబున[2], హర్యక్షప్రముఖులయెడఁ గుటిలవర్తనుం డయ్యెను. 'చెట్టుచెడుకాలంబునఁ గుక్కమూతిపిందె' యన్నట్లు చేటుకాలంబు కడు నికటంబైన[3], వీని కీ దుర్బుద్ధి ఘటిల్లెఁ గాఁబోలు! 'వినాశకాలే విపరీతబుద్ధి' యను నార్యులవచన మేల వృథవోవును? పొత్తిపురుపు తెలుఁగున, నీ ఫేరువును[4] దన్నుఁగట్టఁ ద్రాళ్ళు తానే తెచ్చుకొన్నది. మఱియు హరులు గిరులు[5] దీనిఁ గొలుచుచున్నవనియును మనకు వెలువఁ బనిలేదు. మర్మజ్ఞులయెడ మానావమానంబు లెంతవారికి శుభాశుభంబుల నావహింపక[6] మానవు. కావున మర్మజ్ఞులమైన మన కీ యొప్పనివానిఁ[7] బరాభవించుట యఱచేతిలోని పనియై యుండును. మన మనోవేదనాపనోదార్థంబుగా[8] దీని కొక మందు చెప్పెద. మీ రెల్లరు దత్తావధానులరై[9] వినుండు. ఇప్పుడు మనమెల్లను గూడి, వీని కభిముఖుల[10] మయి కూసిన, జాతిస్వభావంబునంజేసి తానును గూసెడును. ఆ సన్న[11] యించుక యెఱింగెనేని, యప్పు డిప్పుండరీకాదులలో[12] నెద్దియైన నిద్దుష్టుని దిష్టాంతంబు[13] నొందింపక పోదు. ఈశ్వరసంకల్పమును ననుకూలంబై వచ్చిన, శత్రునిరాసం[14] బనాయాసంబుగఁ[15] జేకుఱును. ఇంతకన్న నిరపాయంబైన పరమోపాయం బొక్కటిలేదు." అనిన, నా వాక్యములు వీనుల

---

1. చిరకాల బహు సౌఖ్యభాగులు = చాలకాలము అనేకసుఖములు పొందినవారు; 2. దౌరాత్మ్యము = దురాత్మునియొక్క భావము; 3. నికటము = సమీపము; 4. ఫేరువు = నక్క; 5. హరులు + కిరులు = సింహములును, పందులును; 6. ఆవహించు = కలిగించు; 7. ఒప్పనివాఁడు = శత్రువు; 8. మనస్(:) + వేదనా + అపనోద + అర్థము = మనసులోని బాధను బోఁగొట్టు నిమిత్తము; 9. దత్త + అవధానులు = శ్రద్ధగలవారు; 10. అభిముఖులు = ఎదురుగానున్నవారు; 11. సన్న = (వి.) సంజ్ఞ = (ప్ర.); 12. పుండరీక + ఆదులు = పులి మొదలయినవి; 13. దిష్టాంతము = మరణము; 14. శత్రునిరాసము = శత్రు తిరస్కారము; 15. అనాయాసముగన్ = శ్రమము లేకుండ.

కమృతోపమానము[1] లయిన నిర్భరప్రమదంబునం[2] బొదలి కదలి, దివసావసానసమయంబున[3] నా భూరిమాయువు[4] దిక్కు మొగంబయి, తదీయరాజ్యావసానసామీప్యసూచకంబుగా[5] వఱడు[6] లఱచెడునోనా[7], నక్కలెల్ల నెదురుపడి కూయఁజొచ్చెను. ఆ కూఁత చెవిసోఁకుడు, నక్కలరాయండును దురతిక్రమంబగు[8] జాతిధర్మంబుఁ గడవనేరక, విధిచోదితుండయి[9], శ్రవణ విదారణదారుణారావంబుఁ[10] గావించె. ఆ రొద చెవిఁబడ్డతోడనె, తత్పార్శ్వం బున నున్న యొక్క బెబ్బులి యది నక్కయకదా యని యెఱింగి, కోపావేశంబున దంతసందష్టదారుణాననం[11] బయి లేచి, మెఱుంగుమెఱసిన తెఱంగునఁ జెంగున మీఁదికుఱికి నెత్రు వఱదలువాఱ గొంతుక్రోవి[12] యట్ట[13]కుంబాపి[14], తనదారిం బోయెను. అంతకుమున్న నిలువలేక పరువెత్తు దాని మేనిప్రాణంబులతోడనె, బంధుజనమ్ముల మనమ్ముల యుమ్మలమ్ము[15] లును బరుగువాఱె.

"కావునఁ, బరపక్షం బెందును భయావహంబు. ఈ కాకమును జేరఁ దీయుట నా మతముగాదు. ఇంతకుం గార్యంబు భవద్భావాధీనంబయి నడుచును." అని పలుకు మంత్రివాక్యము లాకర్ణించి, హంసస్వామి యిట్లనియె. "మనకు నేఁటతేపట దారుణరణంబు సంప్రాప్తంబు కాఁగలదు. అప్పుడు శూరజన సంగ్రహణంబు సమధికాపేక్ష్యంబయి[16] యుండును. రోయఁ[17]

---

1. అమృత + ఉపమానము = అమృతముతో సమానము; 2. నిర్భర - ప్రమదము = సంపూర్ణానందము; 3. దివస + అవసాన - సమయము = సాయంసమయము; 4. భూరిమాయువు = నక్క; 5. తదీయ - రాజ్య + అవసాన - సామీప్య - సూచకము = దాని రాజ్యముయొక్క అంతముయొక్క దాపును సూచించునది; 6. వఱడు = నక్క; 7. నాన్ = అనఁగా; 8. దురతిక్రమము = దాఁటరానిది; 9. విధి - చోదితుఁడు = దైవముచేఁ బ్రేరేపింపఁబడినవాఁడు; 10. శ్రవణ - విదారణ - దారుణ + ఆరావము = చెవులను జీల్చు భయంకర ధ్వని; 11. దంత - సందష్ట - దారుణ + ఆననము = పండ్లు గొఱుకుటచే భయంకరమైన ముఖము గలది; 12. గొంతు - క్రోవి = కంఠనాళము; 13. అట్ట = మొండెము; 14. పాపి = తొలఁగించి; 15. ఉమ్మలము = దుఃఖము; 16. సమధిక + అపేక్ష్యము = మిక్కిలి కోరఁదగినది; 17. రోయు = వెదకు.

బోవుతీవియ దైవయోగంబునఁ గాళ్ళం బెనఁగొన్నతీరున, నీ శూరవరుండు కోరిన కోరికగా మనకు లభ్యమయ్యెను. సిరి రా, మోఁ కా లొడ్డ నేల? మన పాలిటి పుణ్యస్వరూపంబు సన్నిహితంబైన[1] ట్లీతనిప్రాపు దొరకినది. అశుభము లట్ల శుభములు నప్రయత్నసిద్ధంబులు. 'అయాచితోపపన్నంబగు[2] మేలుఁ బరిహరింపఁగూడదు. మనము జలచరంబుల మీతండు స్థలచరుం డందువేని, వజ్రమును భేదింపఁ దలంపు గొన్నవాఁ డనన్యభేద్యంబగు[3] నద్దాని వేఱొండు వజ్రంబుచేతనె భేదింపవలసియుండుంగాన, స్థలచరుండగు చిత్రవర్ణుని దోరింపఁ[4]గోరు మనకోరిక స్థలచరుండగు నీ నీలవర్ణు తోడ్పాటులేక చేకూర నేరదు. మనము వెకలులమై యీ బలియుని చెలిమి నొల్లక వీడనాడితిమేని, యలుక యొలసి యల్ల శిఖితల్లజుం[5] గలసిన నవల వలవనివానిం[6] గలనం[7] గెలుచుట కరంబు భరంబగును. వాంఛితార్థంబును గడముట్టనేరదు. పిమ్మటఁ జేమించిన కార్యంబునకు వగగొంట నిర్వాణదీపతైలదానం[8] బయి, యత్నవైఫల్యంబెకాక మనోవేదనానర్థమును నగును. కాఁబట్టి, సర్వవిధంబుల మన కీ కరటంబు[9] పరిగ్రాహ్యంబు, ఇంక లేనిపోని శంకలు మాని, యీ ప్రయోజనం బంగీకరింపుము.'' అనిన, మంత్రియు నించుక యనుమానించి, మిక్కిలి విన్నవించిన తేనిమనసు నొచ్చునో యని హృదయానురంజకంబుగా నిట్లనియె. "సర్వధర్మమర్మజ్ఞానమాననీయులు, దేవరకుం దెలియనికృత్యాకృత్యంబులు లేవు. కార్యగతుల తెఱంగులు దేవరవారికన్న మిన్నగా నారయువారును లేరు. లెస్సగా విచారించి, కార్యంబు దేవరచిత్త వృత్తి యెత్తెఱంగున వర్తించు నత్తీరున నాచరింపవచ్చును. నా యెఱింగినంత వట్టును నేను విన్నవించితి. ఈ వఱకే ప్రణిధి నిర్ణయింపఁబడియె; దుర్గంబును సంసిద్ధం బయినది. ఇంక జంపు[10] నడపక, దూతను రావించి. యేతెంచిన ప్రయోజనంబు

---

1. సన్నిహితము = చేరువ; 2. అయాచిత + ఉపపన్నము = అడుగకయే లభించినది; 3. అనన్య - భేద్యము = ఇంకొకదానిచే భేదింపరానిది; 4. దోరించు = చంపు; 5. శిఖి - తల్లజుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 6. వలవనివాఁడు = శత్రువు; 7. కలనన్ = యుద్ధమునందు; 8. నిర్వాణ - దీప - తైల - దానము = ఆఱిపోయిన దీపమునకు నూనె యిచ్చుట, గతజల సేతుబంధనము వంటిది; 9. కరటము = కాకి; 10. జంపు = ఆలస్యము.

విమర్శించి పంపఁజను." అనిన తేఁడు 'నట్లకాని' మ్మనుడుం, జక్రవాకంబు బయలికొలువుం బ్రవేశించె. అంతకుమున్న యెకిమీఁడును జనుదెంచి, యాస్థానం బలంకరించియుంటంజేసి, పరిజనంబు లల్లనల్లనఁ బఱతెంచి, యధ్యక్షుండు యథాప్రధానంబుగా సంభావింపఁ, దమతమ నెలవులం[1] బొలిచిరి. అప్పుడు ప్రెగ్గడ ప్రతిహారు నొక్కనిఁ జీరి, "నీ వేగి వేగిర మా కీరంబును గాకంబును నేలికచెంతకుం గొనిరమ్ము.' అనుడు, 'మహాప్రసాదం' బని చని, పణిహారి[2] తెలువుడుచేసినఁ, గాకకీరంబులు కొలువు సొత్తెంచి, హిరణ్యగర్భకరనిర్దిష్టాసనంబులం గూర్చుండె. అంతఁ గుశలప్రశ్నంబుఁ గావించి నిజాగమనప్రయోజనం బడిగినయొడయని[3] కభిముఖంబై, దరవిరహితంబుగా[4] శుకం బిట్లనియె. "దేవా! నావచ్చిన కార్యం బవధరింపుము. "జంబూద్వీపాధినాథుం డగుచిత్రవర్ణనామబర్హీంద్రుం[5] డనుప, మీతోడ మాటలాడఁ బనిగలిగి వచ్చితి. ప్రయోజనాంశంబు తిరుఁడవై[6] యాకర్ణింపుము. అవసరంబగునేని విన్నవించెద; హృదయం బేకాగ్రంబు కావించి, యాతం డాజ్ఞాపించినపలుకులకుం జెవియొగ్గుము. 'మీ కప్పురపుదీవి[7] లోనుగాఁ గల చిటుదీవులెల్ల నీ నేరేడుదీవిక్రింది[8] యలంతిదీవు[9] లగుటంజేసి, యీసు[10]మాని వాని యేలిక లందఱు మాకుఁ గరం[11] బర్పింప నర్హులు. కావున, నీవును మానప్రాణంబుల కాసింతువేని, యీను గాదను వివాదంబు మాని, మా నేలకు వేళము[12] వచ్చి, యస్మచ్చరణంబుల[13] శరణువేఁడి, నేఁ డాదిగా నేఁడేఁడును[14] దప్పక కప్పం బప్పనము[15] చేయుచుండునది. సామవచనంబుల నీ మనంబు కూడియాడుట కొడంబడదేని, నే నిదె కదనంబున[16] నీ మదంబు

---

1. నెలవు = స్థానము; 2. పణిహారి = ద్వారపాలకుఁడు; 3. ఒడయఁడు = రాజు; 4. దరవిరహితముగన్ = భయము లేకుండ; 5. బర్హి + ఇంద్రుడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 6. తిరుఁడు (వి) = స్థిరుఁడు (ప్ర.); 7. కప్పురపు దీవి = కర్పూర ద్వీపము; 8. నేరెడు దీవి = జంబూ ద్వీపము; 9. అలంతి దీవులు = చిన్న ద్వీపములు; 10. ఈసు (వి) = ఈర్ష్య (ప్ర.); 11. కరము = కప్పము; 12. వేళము = శీఘ్రము; 13. అస్మద్+చరణములు = మా పాదములు; 14. ఏఁడేఁడు = ప్రతి సంవత్సరము; 15. అప్పనము (వి) = అర్పణము (ప్ర.); 16. కదనము = యుద్ధము.

సదమదంబు చేసి[1] పుడమి[2] వడయ నడతెంచుచున్నవాఁడ. వాఁడిమగండవై నిగుడునది.' అని నీ కెఱిఁగించి, మీ వాక్యంబుల తెఱం గెఱింగిరమ్మని నన్నిచ్చటికిం బుచ్చె[3]. నా కిక్కడఁ గడుం దడయఁ దీఱదు. సత్వరంబుగఁ బ్రత్యుత్తరం బొసంగి, సెలవొసంగుము. ఆ కేకిలోకాధ్యక్షుండు[4] *దుర్వారవైరివారగర్వనిర్వాపణాఖర్వశౌర్యధుర్యుండు[5]; నిగ్రహానుగ్రహసమర్థుండు[6]. కాన, నా శిఖివరు[7]మఱువు సొరుము. అతనిబుద్ధిఁ గైకొనక నిరాకరించితేని[8], నీ కీర్తి కల్పకాలంబుననె సమాప్తియొదవును." అనినం దోఁకత్రొక్కినత్రాచు చందంబున సముత్థితుండయి[9], వళక్షపక్షీంద్రుండు[10], రోషావేశంబునఁ బెదవు లదర, నద్భుతరసాక్రాంతం బగుస్వాంతంబుతో, మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. "ఎట్టెట్టూ![11] నేఁ డేమేమొ క్రొత్తలు వింటిమి!" అని కొలువు కలయంజూచి "ఆహా! వింటిరే? నేఁ డెట్టిచిట్టలు[12] పుట్టెనో! ఒక్క కూళనెమ్మి పిట్టకు[13], నవ్యాజతేజోవిరాజమానంబయి[14] క్రాలు జాలపాదోత్తమంబు[15] పాదాక్రాంతంబయి యరి[16] వెట్టవలయునట! ఔరా! ప్రతాపోక్తులు ! అట్టులైన, సింగంబులు[17] ప్లవంగంబుల[18] యడుగులం బడి, శాశ్వతపరిచర్య

---

1. సదమదము + చేయు = అణఁచు; 2. పుడమి = భూమి; 3. పుచ్చు = పంపు; 4. కేకిలోక + అధ్యక్షుఁడు = నెమళ్ళ సమూహమునకుఁ బ్రభువు; 5.* దుర్వార = వారింపరాని, వైరి - వార = శత్రు సమూహముయొక్క, గర్వ = గర్వముయొక్క, నిర్వాపణ = పోఁగొట్టుట యందు, అఖర్వ = పొట్టిదికాని -- తక్కువకాని, శౌర్య = పరాక్రమముయొక్క, ధుర్యుండు = భారము వహించినవాఁడు; 6. నిగ్రహ + అనుగ్రహ - సమర్థుఁడు = శిక్షించుటకు, అనుగ్రహించుటకు సమర్థుఁడు; 7. శిఖి - వరు = నెమలులలో శ్రేష్ఠునియొక్క, 8. నిరాకరించితేనిన్ = నిరాకరించితివి + ఏనిన్; 9. సముత్థితుఁడు = లేచినవాఁడు; 10. వళక్ష పక్షి + ఇంద్రుఁడు = తెల్లని పక్షులలో శ్రేష్ఠుఁడు, హంసశ్రేష్ఠుఁడు; 11. ఎట్టెట్టూ = ఎట్టూ+ఎట్టూ; 12. చిట్ట = వింత; 13. కూళ - నెమ్మి - పిట్ట = క్రూరమైన నెమలి; 14. అవ్యాజ - తేజస్(:) + విరాజమానము = నిజమైన తేజస్సుతోఁ బ్రకాశించునది; 15. జాలపాద + ఉత్తమము = హంసలలో శ్రేష్ఠమయినది; 16. అరి = కప్పము; 17. సింగము (వి) = సింహము (ప్ర.); 18. ప్లవంగము = కోఁతి.

చేయవలయుం గాఁబోలు! చిత్రవర్ణుఁ డలవి[1] యెఱుఁగలేక, చుట్టుకొన్న యజ్ఞానతిమిరంబున[2], నశక్యవిధానంబునకుఁ బాటుపడుచున్నవాఁడు. తొల్లి వాంఁడ్రను వీంఁడ్రను గొందఱ జయించితినని తలక్రొవ్వి, యిక్కడ నక్కొలందినె పోవునని తలంచెంగాని, హిరణ్యగర్భుని ప్రతాపాగ్నికిఁ[3] దనప్రాణములు వెచ్చపెట్టక బ్రతికి పోలేమి యింతయుఁ జింతింపఁడయ్యె." అని, యనివార్య క్రోధభీషణుం[4] డయి పలుకుచున్న తేనివంకఁ జూడఁజాలక, భయార్తమూర్తులై[5] సభాసదులెల్లఁ బరస్పర ముఖావలోకనంబులు సేయుచుండ, నా మరాళనేత[6] యనుభావంబున కనురూపముగా రిత్త[7]కోపంబు తెచ్చుకొని, దండ[8] నుండు బలిభుజుండు[9] కోపంబు రూపంబు దాలిచినపోలిక లేచి, యా చిలుకకై వెలలుచు[10], సవినయముగా దొరకిట్లనియె. "కాలపాశబద్ధుండై, యీ పాలసుం[11] డోలగంబున[12] దేవరం దన్నును విచారింపక, మందెమేలం[13] బున నోరికి వచ్చినట్లెల్లఁ గర్ణకఠోరంబుగఁ బ్రేలుచున్నవాఁడు. ఎంతగుండెగలవాఁడు గాకున్న, నిట్లు మొఱకడమ్ములు[14] పచరింప[15]నోపునే? వీనిం దూతయని దయఁ జూడఁ గూడదు. ఈ యధముం డత్యంతంబు వధార్హుండు. ఏను దేవరసేవకుండ నుండ, నేలినవారికి శ్రమమేల? మాఱు పలుకకుఁడు; నేఁ గడఁగి యీ చెడుగు[16] నిప్పుడ కడముట్టించెద; మదీయవిజ్ఞాపనము వృథాకరింపక, ముదల[17] యీవలయును." అనుచుం గదలి, ఫలాశనము[18] కడ నిగుడుచు, నెడసొచ్చి

---

1. అలవి = శక్తి; 2. అజ్ఞాన - తిమిరము = అజ్ఞానమనెడి చీఁకటి; 3. ప్రతాప + అగ్ని = ప్రతాపమనెడి అగ్ని; 4. అనివార్య - క్రోధ - భీషణుఁడు = నివారింపరాని కోపముచే భయంకరుఁడు; 5. భయ - ఆర్త-మూర్తులు = భయముచే దీనమైన ఆకారములు గల వారు; 6. మరాళ - నేత = హంసనాయకుఁడు; 7. రిత్త = వ్యర్థమైన; 8. దండ = సమీపము; 9. బలిభుజుఁడు = కాకి; 10. వెలలు = వెడలు; 11. పాలసుఁడు = మూర్ఖుఁడు; 12. ఓలగము = సభ; 13. మందెమేలము = చనవు; 14. మొఱకడములు = దౌష్ట్యములు; 15. పచరించు = ప్రకటించు; 16. చెడుగు = దుష్టుఁడు; 17. ముదల = ఆజ్ఞ; 18. ఫలాశనము = ఫలములు ఆహారముగాఁ గలది - చిలుక.

యచ్చక్రవాకవల్లభుం డిట్లనియె. "నిలునిలుము; సాహసోద్యోగంబు వలదు; ధర్మంబుఁ బదటఁ[1] గలపకుము. దూతప్రాణంబుల కలుగుట పాడిగాదు. పాడి విడిచిన పుడమియొడయనికడ నొడమె[2] వెడలునని, నెఱినెఱి నెఱిఁగిన[3] గఱువ[4]వలన విందుము.

త్రికరణశుద్ధిగా[5] భూతజాతంబుల[6] యెడ నెగ్గు దలంపమి శీలంబు నాఁబడు; సమస్తంబునకు శీలంబు మూలంబు. శీలంబువలన ధర్మంబు నెగడును; ధర్మంబువలన సత్యంబు గలుగును; సత్యంబువలన వృత్తంబు[7] చొప్పడును[8]; వృత్తంబువలన బలం బొలయును; బలంబువలన సిరి యొదవును; దానివలన సర్వకార్యసిద్ధులును సంఘటిల్లును. ఆవు నావునుం గ్రుమ్ములాడి, నడిమి లేఁబెయ్య[9] కాళ్ళు విఱిచినట్టు, రాజును రాజునుం బోట్లాడి దూత కెగ్గుసేయ డగ్గఱు[10]దురే? ఏతఱి నేతరి[11]కి సర్వానర్థంబులును సిద్ధంబు లగును. దూత యెప్పుడు నవధ్యుండు. అతండు తన యవధ్యభావంబుఁ[12] దలంచి, పలుకవలసినట్లెల్ల వాయోడక[13] పలుకుంగాని యెన్నఁడైన మోమోడి స్వాపకర్షం[14]బును బరోత్కర్షం[15]బును బ్రకటింపంజూచునె? ఈతని మాటలు తప్పుగాఁ బట్టఁబోకు. దూతపలుకుల కలుకఁ బూనుటకంటె ననివేకము లేదు, కోపము మూర్ఖులకు ముక్కునవె యుండు; క్రోధి[16], కార్యాకార్యజ్ఞతఁ గోలుపోయి, యవధ్యులనైన వధియించును; తుద కాత్మఘాతము[17]కైన

1. పదటన్ = బూడిదయందు - 'పదడు' సప్తమ్యేకవచనము; 2. ఒడమె = ఒడమి = ధనము; 3. నెఱి నెఱి నెఱిఁగిన = బాగుగాఁ దెలిసిన; 4. గఱువ = పెద్ద; 5. త్రికరణ - శుద్ధి = త్రికరణములచే (మనస్సు, వాక్కు, కర్మము) శుద్ధమగుట; 6. భూత - జాతము = ప్రాణి సమూహము; 7. వృత్తము = నడవడి; 8. చొప్పడు = ఒప్పు; 9. లేఁబెయ్య = లేఁత + పెయ్య; 10. డగ్గఱు = సమీపించు; 11. ఏతరి = దుర్నయపరుఁడు; 12. అవధ్య భావము = వధింపఁబడమి; 13. వాయోడక = మాటపిఱికి గాక; 14. స్వాపకర్షము = స్వ + అపకర్షము = తన తక్కువతనము; 15. పర + ఉత్కర్షము = ఇతరుల గొప్పతనము; 16. క్రోధి = క్రోధము గలవాఁడు; 17. ఆత్మఘాతము = ఆత్మహత్య.

శంకింపఁడు. కోపము పాపముల కెల్లను మూలము. కావున, క్షమాజలములం[1] జేసి మతిమంతుఁడు క్రోధానలము[2] నార్పవలయునని, సూక్ష్మదృక్కులైన మహాత్ములు పలుకుదురు. క్షమయే సర్వకార్యములకు సమృద్ధికారణము. కోపము కొనియాడుట లగ్గు[3] గాదు. క్రూరకర్మము యోధధర్మం బగునే?" అని మందలించి, నీలవర్ణునిఁ గొంత ప్రశాంతస్వాంతుం జేసి, సంరంభం బుడిపిన నుదీర్ణతరనిశ్వాసుండై[4], యాతండు కుంభనిక్షిప్తభుజంగంబు[5] భంగి రొఁజుచు, నిలువంబడి యుండె. అంతఁ దద్వచనామృతాస్వాదనం[6]బునం దేఱి, ప్రశమితక్రోధుండ[7]యి యున్నరాజునకు మంత్రి యిట్లనియె. "దేవా! తడవయ్యె. ఈ శుకోత్తముండు ప్రత్యుత్తరము వార్చియున్న[8]వాడు. ఇంక నిలువఁగూడదు. మీ మనోనిశ్చయము చందం బానతిచ్చి, వెచ్చెరఁ బుచ్చవలయు." అనినఁ గలహంసావతంసుండు శుకంబువంక మరలి యిట్లనియె. "ఓరీ! యరుణముఖా! వినుము వాక్యం బస్మదీయం[9]బు. నీవేగి నీ రాజును బొడగన్నతోడనె, నోరోడక సభామండపమున నందఱు విన నా పలుకులుగా నిట్లనుము. 'నీవు రాజ్యమదంబు ముదిరి మా దేశం బొక్కట నాపోశనము గొన[10]ఁదలఁపు గొన్నవాఁడవు. హిరణ్యగర్భుని ముక్కున నూర్పు[11] గలుగ, నీ నేల నేలఁగలుగుట నీకకా దల్ల నొసటఁగన్ను[12]న్నవాని కైన మెయిమెయిం గలుగ నేరదు. నీవు నా బలశౌర్యములకు మాఱొడ్డుట, ఖద్యోతంబు[13] ఖద్యోతమండల ప్రభాపటలం[14]బుఁ గడవఁగడఁగుట. ఒక్క

---

1. క్షమా - జలములు = క్షమయనెడు జలములు; 2. క్రోధ + అనలము = క్రోధమనెడి అగ్ని; 3. లగ్గు = మేలు; 4. ఉదీర్ణతరనిశ్వాసుఁడు = అధికమైన నిట్టూర్పు గలవాఁడు; 5. కుంభ - నిక్షిప్త - భుజంగము = కుండయందుంపఁబడిన పాము; 6. తద్వచనామృతాస్వాదనము = అతని మాట యనెడు అమృతముయొక్క ఆస్వాదనము; 7. ప్రశమిత క్రోధుఁడు = శాంతించిన కోపము గలవాఁడు; 8. వార్చియుండు = వేచియుండు; 9. అస్మదీయము = మాది; 10. ఆపోశనము + కొను = త్రాగు; 11. ఊర్పు = ఊపిరి; 12. నొసటఁగన్ను + ఉన్నవాఁడు = ఈశ్వరుఁడు; 13. ఖద్యోతము = మిడుఁగుఱు; 14. ఖద్యోత - మండల - ప్రభా - పటలము = సూర్య బింబము యొక్క కాంతి సమూహము.

చిత్రపర్ణుండె కాఁడు, కోటిచిత్రపర్ణు లొక్కట నెత్తివచ్చినను, సంవర్తమార్తాండ మండలము మెండు[1]న విపక్షదురధి క్షేపం[2] బయిన ప్రతాపంబున వెలుంగు హిరణ్యగర్భుని రణాంగణంబునఁ దేఱిచూడ శక్యంబు గాదు. నీవు నిక్కంపుఁబౌరుషశాలివేని, యాలంబు[3]చేసి మానేల నొడిచికొను[4]టయే మగతనం[5]బు. అప్పుడుగా నీ మగంటిమి మెచ్చుకొందుము! ఎందును నినుబోఁటి శూరమాను[6]లమాటలె కోటలు దాఁటుంగాని, కాలు గడపదాఁటదు. పనికిరాని యీ బేరజపుంబీరంబులు[7] గట్టిపెట్టి, పోటుబంటవై[8] పోరితం[9]బునకు డాయు[10]ము. మృత్యువుం గృతకృత్యుఁ జేసెద. లేదా నీ పడుచుమాట[11] లవలఁబెట్టి, జితోస్మి[12] యనుము. అనిన న్విడిచెద." అని తెగనాడి, యివి యన్నియు మీ యేలికపాల నళుకు[13] మాని వాక్రువ్వవలయుంజుమీ." అని మఱిమఱి చెప్పి, "మీరాజు నాజి[14]కిం గొని రమ్ము, పొమ్ము." అని పసదనం[15] బొసఁగి, స్వాదు[16]ఫలదానంబున సంతృప్తుఁ జేసి, వీడుకోలిచ్చిన, నచ్చిలుకయు రాజున కున్ముఖం[17]బయి, "మీకడ నేమియుఁ దప్పనాడనుగదా? నా వాక్యంబులం గల వచస్స్ఖాలిత్యంబు[18] లెల్ల మఱవవలయు; నా వల్లఁ జాల శ్రమం బయ్యెను. పోయివచ్చెద; నాతోడ నింకేమేనియుఁ జెప్పవలయునది గలదే?" అని సవినయంబుగా వీడ్కొని, పనివినియెను.

---

1. సంవర్త - మార్తాండ - మండలము = ప్రళయసమయ సూర్యబింబము. మెండు = ఆధిక్యము; 2. విపక్షదురధిక్షేపము = శత్రువులను దిరస్కరించునది; 3. ఆలము = యుద్ధము; 4. ఒడిచికొను = లాగికొను; 5. మగతనము = శౌర్యము = మగంటిమి; 6. శూరమానుఁడు = శూరుఁడు గాకున్నను శూరుఁడనని యెంచువాఁడు; 7. బేరజపుంబీరములు = కుత్సితములయిన పరాక్రమములు; 8. పోటుబంటు = గొప్ప శూరుఁడు; 9. పోరితము = యుద్ధము; 10. డాయు = సమీపించు; 11. పడుచుమాటలు = యౌవనపు మాటలు; 12. జితోస్మి = జితః + అస్మి = జయింపఁబడినవాఁడనగుచున్నాను; 13. అళుకు = భయము; 14. ఆజి = యుద్ధము; 15. పసదనము = కానుక; 16. స్వాదు = రుచిగల; 17. ఉన్ముఖము = ఎదురయినదయి; 18. వచస్ + స్ఖాలిత్యము = మాట జాఱుపాటు.

అ ట్లాశీరంబు బయలుదేఱి, కతిపయ ప్రయాణంబున నిజదేశంబుఁ జేరి, దుర్గమార్గపరిశ్రాంతి కొంతశాంతించిన వెనుకఁ గొలువుకూటంబునకుం బోయి, పేరోలగం బున్నమయూర్దరాజుం గాంచి, ప్రణామంబు గావించుడు, నాతండు కరుణాతరంగితంబు లగునపాంగబు[1] లరుణముఖునిపయిం బ్రొలయించుచు[2] సాదరంబుగా నిట్లనియె. ఓ యరుణముఖా! కర్పూర ద్వీపమునకుం బోయి యొకయొచ్చెంబుఁ[3] బొరయక మరలి సేమంబున వచ్చితివా? నీ వచ్చుటనే కదలనికంబం[4]బవైతి వది యేమొకో యని, మనమ్ము తామరపాకునీరుక్రియఁ దల్లడిల్ల ననిశంబు నీమార్గమె చూచుచు, నిమిషం బొక్క కల్పంబు[5]గా దినములు పుచ్చుచున్నారము. మా చేసిన భాగ్యంబు కతంబున, నేఁడు తిన్నఁగా నిన్నుఁ జూడఁగాంచి మా కన్నులు చల్లనయినవి. అచ్చటి వార్తావిశేషంబు లేవియుఁ గడమవడకుండఁ[6] దెలుపుము" అనిన శుకం బిట్లనియె. "నాఁడు స్వామియానతి మౌళిఁ[7] దాలిచి, హిరణ్యగర్భుపాలి కేగి, మాట లాడి, యాతఁ డనుప నిప్పుడ వచ్చితి. ఆ దీవిమానోజ్ఞకం[8] బేమని విన్నవింతును? ఎక్కడఁ జూచిన నప్సర స్సమన్వితంబును[9] నయి, సుమనోవిరాజితంబును[10]నయిమాఱట స్వర్గంబు[11]నాఁ జూడ్కికి వేడ్కఁగొలుపు చున్నది. హిరణ్యగర్భుండును నాత్మరక్షయం దప్రమాదుండయి, యభి యాతుల[12] వేయికన్నులం జూచుచుండును. ఆ లంకం[13] గల విహంగంబు లెల్ల, ననూనం[14]బగు నభిజనాభిమానంబు[15] గలవయి, తమరాజు నవ్యాజాను రాగమునం గొలుచుచుండును. అస్మదాదు లా యొప్పులో శతాంశంబు[16]ను జెప్ప, శక్తులుగారు. నేర్చినవఱకుం జెప్పెదునన్నను, అందులకుం బెక్కు

1. అపాంగము = క్రీఁగంటి చూపు; 2. పొలయించు = ప్రవర్తింపఁ జేయు; 3. ఒచ్చెము = ఆపద; 4. కదలని - కంబము = స్థిరమైన స్తంభము; 5. కల్పము = బ్రహ్మదినము; 6. కడమ + వడకుండన్ = నిశ్శేషముగా; 7. మౌళి = శిరస్సు; 8. మానోజ్ఞకము = అందము; 9. అప్సరస్ + సమన్వితము = అచ్చరలతోఁ గూడినది; 10. సుమనస్(:) + విరాజితము = దేవతలచేఁ బ్రకాశించునది; 11. మాఱటస్వర్గము = అపర స్వర్గము; 12. అభియాతి = శత్రువు; 13. లంక = ద్వీపము; 14. అనూనము = తక్కువకాని; 15. అభిజన + అభిమానము = స్వదేశానురాగము; 16. శతాంశము = నూఱవవంతు.

దినంబులు పట్టును. ఆ కథ దవ్వుల నుండనిండు. నే నేగినప్పుడు, హిరణ్యగర్భుండు లోపలికొలువులో నిజామాత్యద్వితీయుండై[1] మంతనం[2] బుండి యుంటంజేసి, మదాగమనాభిధానంబులు[3] విజ్ఞాపనంబు సేయుండని దౌవారికుల[4] నెందఱ నెన్నివిధంబుల నర్థించిన, 'మంచిది చెప్పెద ముండు' మనుచుంటయెకాని, యెవ్వరుం గాలుకదల్పఁజాలినవారు గారు. తరువాతఁ గొంతసేపున కొకరెండు విడుతలు[5] కొందఱు లోనికిం బోయివచ్చి, 'యిపుడు సమయంబు గాదు. కొంచెము తాళు'[6] మనుచుం జాగు చేసిచేసి, యం దొక్కరుండు లోపలినుండి వచ్చి, 'యేలిక సెలవైనది ర'మ్మని నన్నుఁ బిలుచు కొనిపోయెను. అయ్యవసరంబున నయ్యేకిమీఁడు *సంతత సేవాసమా యాతశకుంతజాతంబులు[7] వరవుడంబు[8] లంగీకరించుచు, నాంతరంగికుల మనవికిఁ జెవి యొగ్గుచునుండి, యాలో నన్నుఁ జూచి, సముచితాసనంబునఁ గూరుచుండ నియమించి యాగమనకారణం బడిగెను." అని, తాఁ గొలువు సొచ్చు టాదిగా హిరణ్యగర్భుం డాడ నియోగించిన మాటలు తుదిగా నడచిన సర్వవృత్తాంతంబును నానుపూర్వంబుగా[9] విన్నవించి మఱియు నిట్లనియె. "అతండు న న్నిచ్చటికంపుచో, న న్నలవోకగాఁ జూచుచు, నవసానంబున 'నీ రాజు నాజికిఁ గొనిరమ్ము పొ' మ్మని వేగిరించె. అతఁ డరాతుల[10] కసాధ్యుండు; అనుపోష్యులుగు[11] భటులును యుద్ధశౌండులు[12]. అయినను మనకొదవ[13] లన్నియుఁ దీర్చి గెలు పొసంగ, మన మేఘవర్ణుండు గలఁడు. అవసరోచితంబు లగువర్తనంబుల జేనిమనసున కెక్కఁ బ్రవర్తించుచుఁ, బ్రసాదంబునకుఁ

1. నిజ+అమాత్య - ద్వితీయుఁడు = తనమంత్రి రెండవవాఁడుగాఁ గలవాఁడు - మంత్రితోఁ గూడినవాఁడు; 2. మంతనము = ఆలోచన, ఏకాంతము; 3. మదాగమనాభిధానములు = నా రాకయు, పేరును; 4. దౌవారికులు = ద్వారపాలకులు; 5. విడుత = తడవ; 6. తాళు = ఆఁగు; 7.* సంతత = ఎడతెగని, సేవా = సేవకొఱకు, సమాయాత = వచ్చిన, శకుంత = పక్షులయొక్క, జాతము = సమూహము; 8. వరవుడము = దాస్యము; 9. అనుపూర్వము = క్రమము; 10. అరాతి = శత్రువు; 11. అనుపోష్యులు = పోషింపఁదగినవారు; 12. యుద్ధశౌండులు = యుద్ధమునందు నేర్పరులు; 13. కొదవ = లోటు.

బాత్రభూతుండై, యాతం డచ్చట నీలవర్ణాహ్వాయంబున[1] రాజునకు విస్రంభభాజనంబై[2] యున్నవాఁడు. వెఱవనేల? భారంబు దైవంబుమీఁదఁ బెట్టి, 'ధర్మో జయతి' యని యుద్ధంబున కుద్యోగింపుఁడు." అనినఁ, గొలువు కలయం గనుంగొని, చిత్రవర్ణుం డిట్లనియె. "వింటిరే చెవులార మీ రెల్లరు హిరణ్యగర్భుని గరువపుంబలుకుల[3] చందంబు? తా నఁట! జితోస్మియనిన, నన్ను విడుచువాఁడఁట. ఈ వాక్యం బొక్కటియె నా హృదయంబునకు శల్యభూతంబై[4] నొవ్వ[5] దనికించు[6]చున్నది. ఏనాఁడైన * మదకుంభికుంభవిదళన పటిష్ఠనిష్ఠురనఖముఖం బగు[7] కేసరి ఘాసంబు[8] గ్రాసంబు సేయఁ[9] బాలు పడునె? చిత్రవర్ణుం డొరున కొక్కనికి, నీపుణ్యమని దోసిలి యొగ్గి మనుట కలనైనం గలుగనేర్చునే? ఇత్తటి సమరంబు[10]కంటె నుత్తమకృత్యంబు నామది కొక్కటి చూపట్టదు. పరరాజ్యజిగీషుత్వంబు[11] కన్నను, న న్నాతం డాడిన తులువమాటలు కలనికి[12] మిక్కిలి త్వరపెట్టుచున్నవి. నా పేరు విన్నఁ, బాఱుపామైనం గదల వెఱచు. అట్టి నన్నా తెలిపిట్టల మన్నీఁ[13] డారివేరం[14]బున వీరిని వారినిం బోలె వెఱపింపఁజొచ్చె. ఆహా! అంత్యకాలం బాసన్నం బయి, దుష్ప్రలాపంబులు సేయుచున్నవాఁడు! ఎవ్వఁడు వైరంబు తుదముట్ట సాధింపఁజాలఁడో వాని జన్మంబు నిరర్థకంబు. పౌరుషశాలికిఁ దనంతవాఁడు పగవాఁడుండినఁ, బగ తెగునంతవఱకుం గంటికి నిద్దుర రాదు; నోరిఁ కోరెం

---

1. అహ్వాయము = పేరు; 2. విస్రంభ - భాజనము = నమ్మఁదగినది; 3. గరువపుఁ బలుకులు = గరువము + పలుకులు; 4. శల్యభూతము = బాణమైనది; 5. నొవ్వ = నొప్పి; 6. తనికించు = కలిగించు; 7.* మద = మదముతోడి, కుంభి = ఏనుఁగు యొక్క, కుంభ = కుంభస్థలముయొక్క, విదళన = ఖండనమందు, పటిష్ఠ = మిక్కిలి పటువైనది; నిష్ఠుర = కఠినమైనది, అగు, నఖ = గోరులయొక్క, ముఖంబు = కొనలు గలది; 8. కేసరి = సింహము - కేసరములు గలది (వ్యు.), ఘాసము = గడ్డి; 9. గ్రాసము + చేయు = తిను; 10. సమరము = యుద్ధము; 11. పర - రాజ్య - జిగీషుత్వంబు = ఇతరుల రాజ్యమును జయింపఁగోరిక; 12. కలనికిన్ = యుద్ధమునకు; 13. తెలిపిట్టల మన్నీఁడు = హంసరాజు; 14. ఆరివేరము = కలహము.

బింపుగాదు; ఇతరసౌఖ్యంబులు మనసునం జొరమి[1] వేఱ చెప్పనేల? కావున, మనమిప్పుడ జైత్రయాత్ర వెడలి, పగవాని నిర్జించుట[2] కర్జంబు[3]. మీవంటి సహాయసంపన్నత్వము గలుగ, నా కొక్క హిరణ్యగర్భుం డెంతవాఁడు? ముల్లోకంబులు నొక్కట నెత్తివచ్చినను సరకుగొనను. అతం డిటనుండి తలముతప్పిన[4] గర్వమున మనల మాటలం గెలుచుచున్నవాఁడు. మన మా యధముని ప్రధనంబున[5] నిధనంబు[6] నొందించి, నో రడంతము. సరివాఁ డొకఁడు కొలువులో ములుకుల[7]వంటి తులువమాటలు పెక్కులు ప్రేలెనన విని ప్రతికృతిఁ[8] గావింపక యీలువు[9]గలవాని కెటులు తాళ మనసు వచ్చు? మన మొకవేళ దయఁదలఁచిఁ యోరిచి యూరకుందుము పో, లోకులు మనలఁ జాలనివా రనరే? లోకాపవాదముపడ శక్యమగునె? ఆహవంబు[10] శుభావహంబు[11] గాదనియు జయాపజయంబులు దైవాధీనంబు లనియుఁ దలంచితిరేని, వినుండు. ఈ దేహంబులు బుద్బుదప్రతిమంబులు[12]; మృత్యుకృత్య మిదమిత్థ[13] మని నిశ్చయింపరాదు? పుట్టినవాఁ డవశ్యము గిట్టవలయును? సదనమునఁ[14] గదలని గదము[15]లంబడి యొడలు[16] విడువక, పగతుండు[17] వెగడుపడు[18]నట్టి దిట్టతనంబు వాటించి, యాలంబునం గూళు మేలు *పురాతనజననకృతసుకృతపరిపాకమునం గాని[19] చేకూర నేరదు. బహూక్తు[20] లేల? కలనం బొలియఁగనుట[21] స్వర్గమార్గంబుఁ గనుట.

1. చొరమి = ప్రవేశింపకుండుట; 2. నిర్జించుట = జయించుట; 3. కర్జము (వి.) = కార్యము (ప్ర.); 4. తలము తప్పిన = అతిశయించిన; 5. ప్రధనము = యుద్ధము; 6. నిధనము = యుద్ధము; 7. ములుకులు = బాణములు, ములికి - (ఏక వ.); 8. ప్రతికృతి = మాఱుచేఁత; 9. ఈలువు = మానము; 10. ఆహవము = యుద్ధము; 11. శుభావహము = మేలు గలిగించునది; 12. బుద్బుద - ప్రతిమంబులు = నీటిబుడగలతో సమానములు; 13. ఇద మిత్థమ్ = ఇది యిట్లు; 14. సదనము = ఇల్లు; 15. గదము = రోగము; 16. ఒడలు = శరీరము; 17. పగతుఁడు = శత్రువు; 18. వెగడుపడు = తల్లడపడు; 19.* పురాతన = పూర్వపు, జనన = పుట్టువులందు, కృత = చేయఁబడిన, సుకృత = పుణ్యముయొక్క, పరిపాకము = పంట; 20. బహూక్తులు = బహు + ఉక్తులు = పెక్కు మాటలు; 21 పొలియఁగనుట = [illegible] గలుగుట.

ప్రసంగవశంబున నింతయుఁ బలుకవలసివచ్చెంగాని, వివేకధనుల[1] రగుమీకు ధర్మంబు లుపదేశించుపాటివాఁడంగాను, తద్దయుం[2] బ్రొద్దువోయెడు: జాగేల? మీమీ సైన్యంబుల నాయితంబుచేసికొని రండు; పొండు; అని[3] చేసి, మన మా దాయ[4] సిరి[5] హరింతము విత్తములు[6] పురుషారంభాయత్తములు[7]." అన, మంత్రి దూరదర్శి యిట్లనియె. "దేవా! యింటగెలిచి మఱి రచ్చ గెలువ వలయును. మనలోని మాట విచారింతము. ఇప్పుడు మన యరుణముఖుండు చెప్పిన వాక్యముల చొప్పు పరికింప, సంగ్రామం[8] బుత్తమకర్మంబుగా నా బుద్ధికిం దోఁపదు. మిత్రామాత్యసుహృద్వర్గంబులు దృఢభక్తియుక్తులయి యుండి, విపక్షుని[9] కడ వారు విపరీతులై యుండిరేని, భండనం[10] బప్పుడు కర్తవ్యంబు. మఱియు విగ్రహంబు[11]నకు ధరణియు[12] హిరణ్యంబును[13] నను రెండును ముఖ్యఫలంబులు. అవి తద్దయు నిశ్చితంబులైన పిదపఁగదా, కదనంబునకుఁ[14] గడంగవలయును? అంతియకాక, వడివడిం దొడర[15] ననన్య సామాన్యపరాక్రమమాన్యుండైన[16] హిరణ్యగర్భుఁ డంత యశ్రమసాధ్యుండె?

మనతలఁచున ట్లాతఁ డలంతులఁ బోవు[17]వాఁడు గాఁడు. అతఁడు పెద్దయుఁ బ్రజారంజకుండై యున్నవాఁడు. సేవకులును గేవల వీరవ్రతశౌండులు[18]. వైరిబలంబు విచారింపక, మూఢుండు సాహసంబునకుం జొచ్చి, హరి[19]బారిం బడు హరిణంబు[20] కరణి మరణంబు నొందును. కావున నీ సాహసిక్యంబు[21] మానవలయు" అన, మంత్రిమాట చెవిఁ దూఱక, యలుక

---

1. వివేకధనులు = వివేకమనెడి ధనము గలవారు; 2. తద్దయున్ = మిక్కిలి; 3. అని = యుద్ధము; 4. దాయ = శత్రువు; 5. సిరి (వి) = శ్రీ (ప్ర); 6. విత్తము = ధనము; 7. పురుష + ఆరంభ + ఆయత్తము = పౌరుషమున కధీనము; 8. సంగ్రామము = యుద్ధము; 9. విపక్షుఁడు = శత్రువు; 10. భండనము = యుద్ధము; 11. విగ్రహము = యుద్ధము; 12. ధరణి = భూమి; 13. హిరణ్యము = బంగారము; 14. కదనము = యుద్ధము; 15. తొడరు = ఎదుర్చు; 16. అనన్య - సామాన్య - పరాక్రమ - మాన్యుఁడు = ఇతరులకు సాధారణముగాని పరాక్రమముచేత - మన్నింపఁదగినవాఁడు; 17. అలంతులఁబోవు = తేలికగాఁ బోవు; 18. వీరవ్రతశౌండులు = వీరుల వ్రతమునందు మత్తిల్లినవారు; 19. హరి = సింహము; 20. హరిణము = లేడి; 21. సాహసిక్యము = సాహసము.

వాడమి యొడయం డిట్లనియె. "నీ వాక్యంబులు చూడఁ జిత్రాతిచిత్రంబులుగా నున్నవి. నీవు కేవల వయోవృద్ధుఁడవు[1]. తల తెల్లనైనంతనె[2] యెఱుక[3] కలుగు నెట్లు? ముదుసళులు దమ కనుకూలంబుగాఁ జదువుకొనుటఁ దక్క, వేఱొక్కటిఁ గానరు. జ్ఞానవృద్ధుల బుద్ధులు గదా సభ్యుల కెక్కును? నే నెట్లును బరరాజ్యాక్రమణంబునకుం గృతనిశ్చయుండనై యున్నవాఁడ. ఇఁక మదీయోత్సాహభంగంబుగా మాకడ నీ నేర్చిన వెల్లను వల్లింపకుము. ఓపితివేని, విజయానురూపంబు[4] లగుసల్లాపంబులు[5] కలుపుము. అట్లు సలిపినను, నీవు మాకు మహోపకారంబు చేసినవాఁడ వగుదువు." అనుచు నెఱఁకు[6]దూఱఁ బలికిన, విషణ్ణుం[7] డయ్యుఁ బ్రసన్నుం[8]డుంబోలె, దుర్వారం[9] బగు పరిభవ వికారం[10] బేమియు వెలిఁ దోఁపకుండ నవ్వుమునుంగు వెట్టి, మానసంబున లేనియుత్సాహంబు తెచ్చుకొని, దాక్షాయ్యనాయకుం[11] డిట్లనియె, "మాకెల్లరకు దేవర మూలకంద మగుటంజేసి, దేవర మేలు గోరి యింతవట్టును నిష్కపటముగా వచియించితిని. చెవికిఁ జేఁదుగా నున్నను, స్వామిహితం బెదఁ గోరుభృత్యుండు తనకుఁ దోఁచినహితము నిశ్శంకముగ వాక్రువ్వవలయును. అట్లుగాక, కొందఱు యథాజాతులు[12] స్వామిచిత్తము నొప్పింప నేలయని, యెఱిఁగినదానినైన నడఁచిపుచ్చి, మనసుకక్కుఱితి విచ్చకముగాఁ బెదవులు గదలుప కూరకుందురు. అట్టివారు తప్పక స్వామిద్రోహులై, యిహపరలోకదూరు లగుదురు. సర్వధర్మజ్ఞులు, దేవర యెఱుఁగరా నీతినిర్ణీతుల[13] తెఱంగు? మే మెల్లరము స్వామితోడి సుఖ దుఃఖముల కియ్యకొని[14], యనన్యశరణ్యులమై[15] స్వామియాజ్ఞ యందున్న వారము.

---

1. వయోవృద్ధుఁడు = వయస్సుచేతవృద్ధుఁడు; 2. తలతెల్లనగు = వృద్ధుఁడగు; 3. ఎఱుక = జ్ఞానము; 4. విజయ + అనురూపములు = గెలుపునకుఁదగినవి; 5. సల్లాపము = మాట; 6. నెఱఁకు = మర్మము, నెఱను (రూపాం.); 7. విషణ్ణుఁడు = విషాదము నొందినవాఁడు; 8. ప్రపన్నుఁడు = భక్తుఁడు; 9. దుర్వారము = వారింప శక్యముగానిది; 10. పరిభవ వికారము = అవమానమువలని మార్పు; 11. దాక్షాయ్య - నాయకుఁడు = గ్రద్ద తేఁడు; 12. యథాజాతులు = మూర్ఖులు; 13. నిర్ణీతి = అవినీతి: 14. ఇయ్యకొని = సమ్మతించి; 15. అనన్య శరణ్యులు = ఇంకొకరు శరణు పొందఁదగినవారు లేనివారు.

దేవరనియోగంబన్న[1], మా కలంఘ్యంబు[2]. సత్యసంకల్పులు, దేవర కెన్నండును నొక్క కొఱంత రాదు. స్వామియానతింజేసి, చమూసమూహంబు[3] లాహవదోహలంబు[4] లయి యేతెంచి యున్నవి. దండయాత్ర కిది మంచి సమయము. శత్రువు ముక్కడి[5]యని ప్రయత్న మల్పము చేయరాదు. చిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోడనె కొట్టవలయును. కాఁబట్టి సర్వసైన్యసమేతముగా నడచి, యాకస్మికముగఁ బోయి, యేమఱించి[6] పయింబడితిమేనిఁ, బగఱ[7]బలంబుల నేలఁ గలుపుట మనకుఁ గరము సుకరం బగును. కాలయాపనము చేసిన, వా రందఱుం గూడుకొని, నెయ్యుర[8] తోడుపాటుఁగూడఁ బడయుదురు. అప్పుడు వారి దోరించుట కరంబు దుష్కరంబగును. కావున, వేవేగ నమిత్రసంత్రాసమును[9] మిత్రసముల్లాస మునుగా[10] దండు వెడలుదము. కార్యము తఱిదప్పక చేయుట లగ్గు. 'ఆలస్యా దమృతం విష' మ్మని[11] కదా, యుష్మాదృశు లైన[12] పెద్దలు పలుకుదురు." అనుడుఁ బ్రెగ్గడ[13] మాటల కలరి[14], దడముల[15] నడపింప మొనగాండ్రకు నాజ్ఞయిడి, నెమ్మిసామి[16] సేనాసమేతముగా దాడివెడలి, నిత్యప్రయాణముల మలయంబుం జేరి, యాచేరువ బాళెంబు దిగి[17] యుండె.

పదపడి హిరణ్యగర్భుండు కొలువున్నయెడ, మున్ను చిత్రవర్ణు పాలి కేగినదీర్ఘముఖుండు చనుదెంచి, పథశ్రమమున[18] దూఁగాడుచు నిలువంబడి,

---

1. నియోగము = ఆజ్ఞ; 2. అలంఘ్యము = దాఁటరానిది; 3. చమూ - సమూహములు = సేనా సమూహములు; 4. ఆహవ - దోహలము = యుద్ధమునం దుత్సాహము గలది; 5. ముక్కడి = అల్పము; 6. ఏమఱించి = అకస్మాత్తుగా; 7. పగఱు = శత్రువులు; 8. నెయ్యురు = మిత్రులు, నెయ్యుఁడు (ఏక వ.); 9. అమిత్ర - సంత్రాసము = శత్రు భయంకరము; 10. మిత్రసముల్లాసము = మిత్రుల విశ్వాసము; 11. ఆలస్యాత్ + అమృతం - విషమ్ = ఆలస్యమువలన అమృతము విషమగును; 12. యుష్మాదృశులు = మీవంటి వారు; 13. ప్రెగ్గడ = మంత్రి; 14. అలరి = సంతోషించి; 15. దడము = సేన; 16. నెమ్మిసామి = నెమలిఱేఁడు; 17. పాళెముదిగు = విడియు; 18. పథశ్రమము = మార్గాయాసము.

జోహారు[1] వొనరించి, తేనియనుమతిని దాపునకుఁ జని, వక్తవ్యాంశము[2] విన్నవింప సంకోచించి, నలువంకలుఁ బాఱఁజూచుచుఁ, దలంపెఱింగి యచ్చట మేఘవర్ణాదు లవలికిం జనిన, తేనియాననమ్మునెనె చూపు నిలిపి, మఱికొంతచెంత జరిగి మెల్లన నిట్లనియె. "ఓ పక్షికులసార్వభౌమా! చిత్రవర్ణుని సభం బుట్టిన విశేషములు విన్నవించెద; పరాకులేక యాకర్ణింపుఁడు. కడ కక్కడ నీయెడకు దాడివెడలుట నిశ్చయింపఁబడి, చిత్రవర్ణుండు సముజ్జ్వలనైజ తేజమున మలయధరాధరోపత్యక[3] న్మొనల[4]తోడ వీడు విడిసియున్నవాఁడు. ప్రతిక్షణమును దుర్గం బేమఱకుండునది. మఱియు నొక్క యాశ్చర్యం బవధరింపుఁడు. మున్నా రాజుచేతఁ బ్రత్యాఖ్యాతం[5] బైన యొక కపోతము[6] తోడఁ జెలికారంబు వాటించి, రాజమంత్రతంత్రము సమస్తము నాకళించి[7] నాఁడను. చెప్పిన నమ్మెదరో నమ్మరో కాని, మనవీట నెవ్వఁడో చిత్రవర్ణప్రేషిత[8] గూఢపురుషుం డొక్కొరువుం[9] డున్నవాఁడని విన్నవాఁడను. ఇప్పలుకు చెప్పునంతలో నప్పారావతంబు[10] కార్యాంతరవ్యాసంగమున[11] నొండెడ కేగుటం బట్టి, దిఙ్మాత్రంబెకాని[12] సవిస్తరముగా నాతఁ డెవఁడో యెట్టివాఁడో యడిగి తెలిసికొనంజాలనైతి. అతనితోడి ప్రసంగానుప్రసంగముల వే ఱొకప్పుడు మఱియొక రహస్యంబును నెఱిఁగినవాఁడను. తదీయమంత్రి, రాజు తనమంత్రంబు దెస ననాదరంబు సేయుటంజేసి, యుపేక్షాపరుండయి, యున్నవాఁడట! ఇదియు మన ఫలావాప్తికిఁ గొంత యనుకూలంబుగాఁ దోఁచు చున్నది. నా వాక్యములయం దేది యయిన, దేవరకార్యంబునకుం బ్రయోజనకారి యగునేని, గైకొనునది. మొన్నరాత్రి చిత్రవర్ణుని పరిచరులు కొందఱు చీఁకటిచాటున నన్నుఁ దారసించి[13], పూర్వపరిచయంబున, నా

---

1. జోహారువు = నమస్కారము; 2. వక్తవ్య + అంశము = చెప్పఁదగిన విషయము; 3. మలయ - ధరాధర + ఉపత్యక = మలయపర్వతప్రాంతభూమి; 4. మొన = సేన; 5. ప్రత్యాఖ్యాతము = నిరాకరింపఁబడినది; 6. కపోతము = పావురము; 7. ఆకళించు = తెలిసికొను; 8. ప్రేషిత = పంపఁబడిన; 9. ఒక్కొరువుండు = ఒకఁడు; 10. పారావతము = పావురము; 11. కార్యాంతరవ్యాసంగము = మఱియొక పనియందు మిక్కిలి ఆసక్తి; 12. దిఙ్మాత్రము = కొంచెము; 13. తారసించి = సమీపించి.

పలుకుబడియు మొగముచాయయుఁ దలంచి, యీతం డల్లనాఁటి దీర్ఘ ముఖుం డౌను నాఁటను సంశయంబుతోఁ గొంతవడి పొట్టుపొరలయి[1], గుజలు గుజలువోయి[2] డాయఁ జూచిన, నే నా కీ లెఱింగి[3], తడసినఁ గార్యపాకంబు తప్పునని యెంచి, యచటఁ గాలునిలువక మేను నిడువెంద్రుకపెట్ట[4] లేచి యది యే మని యడుగు కలవరంబుతో నేమియులే దిప్పుడ మరలి వచ్చెద నని పులిమిపుచ్చి[5], తక్కినవారిం గనుమూసి, యిచ్చటి కొక్క యంజను జనుదెంచితి, మన ధవళాంగుఁ డచ్చటనే యున్నవాఁడు" అని తా విన్నదియుఁ గన్నదియు సపాకల్యముగా వినిపించి యూరకున్న, క్షణమాత్ర నిమీలిత నేత్రుండై[6] కొంత చింతించి, కుశాగ్రబుద్ధి[7] గావున నహిత[8] కృతద్రోహం బూహించి, మంత్రి రాజున కిట్లనియె. "ఆలించితిరా? మన దీర్ఘముఖుని వచనంబుల నెవ్వఁడో నెమ్మితేని దూతవేషధారి యొక్కరుం డిందున్నవాఁడని, చూచాయగా నెఱుకపడుచున్నది. ఒక విధంబున నా గూఢపురుషం డీ నీలవర్ణుండె యైనం గావచ్చును. అకారపూజ్యుం[9] డగు నీ పలుగాకి కాకి నీకడ నునిచికొనుట యనుచితంబు, వీనిని నిపుణంబుగాఁ బరికించి వేగ వెలార్పవలయు[10]. ఈతని రాకకు మూలము చాలఁ గలిగియుండును. అది యంతయు మీకడ నాకు వాకొననేల? తుదమాట చెప్పెద వినుండు. ఈతని మనమిప్పు డొప్పరికించిన[11], నుపేక్షితం బయిన యామయంబు[12] పగిదిఁ బ్రాణంబుపయి వచ్చును. వేఱొక విచారంబుమాని, నామాట చెవిఁ దూర్పుఁడు. పరులఁ జెఱుప వేఁడి, యరులు[13] పలుపోకలం బోవుదురు : వా రాత్మైక కార్యాయత్తులు; మాయాశీలురు. వారిమాటల కెల్లఁ జోటిచ్చినఁ, జేటు

---

1. పొట్టు పొరలయి = పీడితమయి; 2. గుజలు గుజలు వోయి = త్రొక్కిడిపడి; 3. కీలు = మర్మము; 4. నిడువెంద్రుక పెట్టన్ = గగుర్పొడువ; 5. పులిమిపుచ్చు = విషయమును దేలికగాఁ బోనిచ్చు; 6. నిమీలితనేత్రుఁడు = మూయఁబడిన కన్నులు గలవాఁడు; 7. కుశాగ్రబుద్ధి = దర్భమొనవలె నిశితమైన బుద్ధిగలవాఁడు; 8. అహితుఁడు = శత్రువు; 9. అకార - పూజ్యుఁడు = ఆకారముచేతఁ బూజింపఁదగిన వాఁడు; 10. వెలార్ప వలయున్ = బయటికిఁ బంపవలయును; 11. ఒప్పరికించు = ఉపేక్షించు; 12. ఆమయము = వ్యాధి; 13. అరులు = శత్రువులు.

వాటిల్లు: ఈ తండు వట్టి కలపనగంప[1]. ఈతనిమాట లేమియు నిజను సేయకుఁడు. నిక్కముగా నీతండు సింహళద్వీపమునుండి వచ్చినవాఁడు గాఁడు. చి చ్చొడిఁ గట్టుకొన్నట్టు[2] లీతని నొద్దఁ బెట్టుకొననేల? స్వకార్యార్థము శాత్రవుం డెంతయు నిచ్చకం[3] బచ్చుపడ[4] ముచ్చట లాడి, మచ్చిక చేసికొని, నచ్చికపుట్టించి, కడకుం బ్రతారించి[5] దోరించును[6]. అట్టివాని పొత్తున కిచ్చగించుట, దండధరుపొత్తు[7] చిత్తంబునం గోరుట. అట్టిఁడు[8], గోముఖ వ్యాఘ్రంబు[9] లాగున, సమక్షవ్యవహారంబుల సాధువర్తనుండుంబోలెఁ జూపట్టును. అజ్ఞనుసఖ్యము ముఖ్యముగా సజ్జనుం డుజ్జగింప[10]ంజను. కానినాఁడు చిరంజీవి యను కాకమ్మును నమ్మి నిహతమ్ము[11] లైన ఘూకమ్ము[12]లట్ల, కడలేనిహానిఁ జెందును. దేవర కా కథ వివరించెద నవధరింపుఁడు."

### కాకిని నమ్మి చచ్చిన గుడ్లగూబ కథ

పుండరీకగండకవేదండాది[13] నిఖిలమృగకులశరణ్యం బగు దండకారణ్యంబున, బహుళఫలదళవిలసితం[14] బగు వటవిటపి[15] యొక్కటి గలదు. అయ్యది పరిసరతరునికరంబులతోడి పెచ్చుపెరిఁగిన మచ్చ రంబున[16] మిన్నుముట్టఁ బన్నిదంబు సఱచి, యోడిన తోడిమ్రాఁకుల[17] నాలోకించి కిలకిల నగుపగిదిని శాఖ లాకసంబొరయఁ, బలుదెఱంగుల పులుంగుల[18] కలకలంబులు సెలంగ, గరం బభిరామం బయి[19] యుండు.

---

1. కలపనగంప = కలహశీలుఁడు; 2. చిచ్చు + ఒడిన్ + కట్టుకొన్న + అట్లు = నిప్పును ఒడియందుఁ గట్టుకొన్న విధమున; 3. ఇచ్చకము = ప్రియవచనము; 4. అచ్చుపడు = ఏర్పడు; 5. ప్రతారించు = వంచించు; 6. దోరించు = చంపు; 7. దండధరు - పొత్తు = యముని సాంగత్యము - మరణము; 8. అట్టిఁడు = అట్టివాఁడు; 9. గోముఖ వ్యాఘ్రము = గోవు ముఖముగల పులి; 10. ఉజ్జగించు = విడుచు; 11. నిహతము = చంపఁబడినది; 12. ఘూకము = గ్రుడ్లగూబ; 13. పుండరీకము = పులి, గండకము = ఖడ్గమృగము, వేదండము = ఏనుఁగు; 14. బహుళ - ఫల - దళ - విలసితము = పెక్కు పండ్లచే, ఆకులచేఁ, బ్రకాశించునది; 15. వట - విటపి = మఱ్ఱిచెట్టు; 16. మచ్చరము (వి) = మాత్సర్యము (ప్ర.); 17. మ్రాఁకులు (బహువ.) మ్రాను (ఏక వ.) = చెట్టు; 18. పులుఁగు = పక్షి; 19. అభిరామము = సుందరము.

ఆభూజరాజంబున[1], లోకభీకరంబు లగుకాకిమూఁక లనేకంబులు దన్నుఁ గొలువ, సత్త్వనిర్జితసుపర్ణుం[2] డగు మేఘవర్ణాభిధానుండు బలిభుగ్వల్లభుండు[3] కాఁపురం బుండును. వాయసావాసం బగు వటకుటంబు[4]నకుఁ గొంతచెంత, నులూక మందిరం[5] బగు సుందరవసుంధరాధరకందరంబు[6] దనరును. ఆ గహ్వరంబున[7], దుర్దమరిపుమర్దనుండగు[8] నుపమర్దనుండను నులూక లోకాధ్యక్షుం డొక్కరుండు, తన కొలంపుఁబులుంగుమొత్తంబులు[9] పెక్కులు దన్ను సేవింప, నివసించియుండును. ఆ పతంగపుంగవుం[10] డొక్క నాఁటి నిశీథంబున[11] నమాత్యాదులతోడ మంతనంబు సలిపి, యప్పుడ సేనాని రప్పించి, యుత్సాహపోషణంబు లగు భాషణంబుల వీరావేశ మెసకొల్పి[12], మొన లేర్పఱించి, యనేకంబు లగునసీకంబులతో[13] ఘూకఘూంకృతులు పొదలఁ గదలి విరోధులు కాకులు వసియించు మఱ్ఱిచెట్టుఁ జట్టుముట్టి, నిద్రాముద్రితనేత్రంబులై గాత్రంబులు[14] మఱచి కూరికియున్న[15] వాయసంబులఁ గాంచి, సంతసించి, మించిన కోపాతిరేకంబున ఘూకంబుల డీకొల్పుడు, నవియు శాఖోపశాఖల వెదకి, శాతముఖంబు[16] లగునఖంబుల నడఁచియు మహోగ్రంబు లగు చండతుండాగ్రంబులఁ[17] బొడిచియు నచంచలంబు లగుగరుదంచలంబులఁ[18] జఱచియుఁ గొన్నింటి ఱెక్కలు

1. భూజ-రాజము = వృక్ష శ్రేష్ఠము; 2. సత్త్వ - నిర్జిత - సుపర్ణుఁడు = బలముచే జయింపఁబడిన గరుత్మంతుఁడు కలవాఁడు; 3. బలిభుక్ + వల్లభుఁడు = కాకుల ఱేఁడు; 4. కుటము = చెట్టు; 5. ఉలూక - మందిరము = గ్రుడ్లగూబ యిల్లు; 6. సుందర - వసుంధరా ధర - కందరము = అందమైన పర్వత గుహ; 7. గహ్వరము = గుహ, 8. దుర్దమ - రిపు - మర్దనుఁడు = అణఁపరాని శత్రువులను జంపువాఁడు; 9. కొలంపుఁబులుంగు - మొత్తములు = జాతి పక్షుల సమూహములు, (కొలము + పులుంగు = కొలంపుఁబులుంగు). కొలము (వి) = కులము (ప్ర.); 10. పతంగ - పుంగవుఁడు = పక్షిశ్రేష్ఠుఁడు; 11. నిశీథము = రాత్రి; 12. ఎసకొల్పి = అతిశయింపఁజేసి; 13. అనీకము = సేన; 14. గాత్రము = శరీరము; 15. కూరికియున్న = నిద్రించియున్న; 16. శాత - ముఖము = వాఁడి మొనలుగలది; 17. చండ - తుండ + అగ్రము = తీక్ష్ణమైన ముక్కు కొన 18. గరుత్ + అంచలము = ఱెక్కల అంచు.

మొక్కవఱిచి[1], కొన్నింటిఁ బ్రక్కలు వ్రక్కలించి[2], కొన్నిటి ముక్కులు చెక్కలు వాపి[3] వివిధంబు లగువధంబులఁ ద్రుటికాలంబులోన, ననేకకాకలోకంబును యమలోకంబున కనిచిన[4], సమావృతాంతరిక్షం[5] బగు నా వటవృక్షంబు విగతధ్వాంక్షంబగుట[6] వీక్షించి, కృతార్థీకృతలోచనుండై[7], యుపమర్దనుండు సంతోషపులకాంకురాలంకృతసర్వావయవంబులతో[8], *నిజపరిజనకోలాహల నినదబధిరీభూతరోదోంతరాళంబుగాఁ[9] గ్రమ్మరి, పింగళేక్షణంబుల[10] మెఱుంగులు తుఱంగలింప[11] నిజనివాసంబునకుం జనియె. అంతఁ బ్రభాతం బగుడు, రేయి వాయసారాతుల[12] రాయిడిం[13] బడక యొక్కెడ నొడ లోముకొనిన[14] మేఘవర్ణుండు లేచివచ్చి రాత్రి కులాయాంతరనిద్రాణకరట కులంబునకు[15] సంభవించిన యకాలప్రళయంబు చూచి, గుండెలు పగిలి కొంతవడి చింతాసాగరంబున[16] మ్మనింగియుండి, కొంత నివ్వెఱ[17] తొఱఁగి[18], లోకాంతరగతు[19] లయిన తనతనయులం బేరుపేరువరుసలం దలంచి

---

1. మొక్కవఱిచి = కుంటుపడఁజేసి; 2. వ్రక్కలించి = బ్రద్దలు చేసి; 3. చెక్కలు + వాపి = చీలికలు చేసి; 4. యమలోకంబున కనుచు = చంపు; 5. సమావృత + అంతరిక్షము = బాగుగా ఆవరింపఁబడిన ఆకాశముగలది; 6. విగత - ధ్వాంక్షము = పోయిన చీఁకటి గలది; 7. కృతార్థీకృతలోచనుఁడు = ధన్యములుగాఁ జేయఁబడిన కన్నులు గలవాఁడు; 8. సంతోష - పులక + అంకుర + అలంకృత - సర్వ + అవయవములు = సంతోషము వలని గగుర్పాటుమొలకలచే నలంకరింపఁబడిన ఎల్ల అవయవములు; 9.* నిజ=తమ, పరిజన = చుట్టునున్నవారియొక్క, కోలాహల = కలకలముయొక్క, నినద = ధ్వనిచేత, బధిరీభూత = చెవుడుగలదైన, రోదస్ + అంతరాళము = భూమ్యాకాశముల నడిమి ప్రదేశము గలది; 10. పింగళ + ఈక్షణంబులన్ = గోరోజనమువంటి వర్ణముగల చూపులందు; 11. తుఱంగలింపన్ = ప్రకాశింపఁగా; 12. వాయస + అరాతులు = కాకుల శత్రువులు - గుడ్లగూబలు; 13. రాయిడి = ఉపద్రవము; 14. ఓముకొనిన = రక్షించుకొన్న; 15. కులాయ + అంతర - నిద్రాణ - కరట - కులము = గూండ్లలోపల నిద్రించు కాకుల సమూహము; 16. చింతా - సాగరము = దుఃఖ సముద్రము; 17. నివ్వెఱ (నిండు + వెఱ) = మిక్కిలి భయము; 18. తొఱంగి = విడిచి; 19. లోక + అంతర - గతులు = మఱియొక లోకమును బొందినవారు - చచ్చినవారు.

నిట్టూర్పు నిగిడించుచుఁ, గడువుశోకమున దలంబగు[1] కొందలంబునం[2] గుందు[3]చుండ రాతిరి గూబలపాలుగాక చిక్కిన ప్రెగ్గడ లొక్కచక్కిం[4] గూడుకొని, తమ మందభాగ్యత్వంబులకుం దూర వగచుచు, రాజునుం బ్రాణంబులు తప్పించుకొంట విని యాతనిసరస కరుదెంచి, దీనంబు లగునాననంబులతోడ నడుగులంద్రెళ్ళి, కంటికి నేలకు నేకధారగా రోదనంబు సేయుచు నిట్లనిరి. "దేవా! తెల్లవాఱి మరల నేలినవారి చరణంబు లీ తీరున సందర్శింపంబడసికదా, మా యందఱ నయనంబులు భాగ్యంబులు చేసె. మా ప్రాక్తన[5] పుణ్యంబు ఫలించె; నేఁడుగా దైవము గలుగుట పరి జనంబులు వేవురు గలిగియు, రాజు లేనిరాష్ట్రంబగు కతంబునఁ[6] జుక్కలు పెక్కుండియుఁ దేజంబుం గాంచని సోమవిహీనయామిని[7] కైవడిఁ, దమోవృతం[8] బయి కన్పట్టును. ప్రధానులు లేని యధినాథుండును, బ్రాణంబులఁ బాసిన బొందిచందంబునఁ, గాంతి దఱిగియుండును. దైవవశంబున స్వామియు నేమును నీ రే యొక బన్నమునకు[9] లోనుగాక, సప్రాణులమై మగుడఁ బుడమిపై నడుగిడఁ గలిగితిమి. పగవారిం గూడి దైవంబును మనకుఁ గీడుఁ దలంచె. ఇది యవశ్యంభావి[10] యైనయర్థం బెట్లు తప్పింపనగును? నిష్కారణముగా నీయట్టిసధర్మునకుఁ జేసిన యపకారం బా క్రూరకర్ములకుఁ దోడనే చూపకపోదు. ఇప్పుడు మన ప్రాణములు దక్కిన వంతియ చాలును. ఇఁకఁ బగ నెన్నఁటికైన, మెల్లఁగా సాధింపవచ్చును. కాలంబు మన కీవేళ మేలు కాకున్నయది. కాలము మీఱి నడవ నెవరితరమగును? ఆయుఃప్రమాణము నిండి, మనవారు పేరుగలవారు పెక్కం డ్రిట్లనామధేయంబులగు దివాంధంబులచే[11] నిద్రావశాత్ములై మానప్రాణంబులు గోలుపోయిరి. దైవవైపరీత్యం బయినప్పుడు వగవఁ బనిలేదు. మే మప్పుడ యలసి క న్నొకింత

1. తలము = అధికము; 2. కొందలము = దుఃఖము; 3. కుందు = దుఃఖము; 4. చక్కి = చోటు; 5. ప్రాక్తన = పూర్వ; 6. కతము = కారణము; 7. సోమ - విహీన - యామిని = చంద్రుఁడు లేని రాత్రి; 8. తమస్ (ః) + వృతము = చీఁకటిచే నావరింపఁబడినది; 9. బన్నము = కష్టము; 10. అవశ్యంభావి = తప్పక జరుగఁబోవునది; 11. దివాంధము = గుడ్లగూబ - పగలు గ్రుడ్డియైనది.

మూసితిమి. అంతలో నాకస్మికముగ గణనాతీతము లగుపగఱబారు[1] లరుదెంచి, కనుమూయుఁగా వీరి గొంతుకలు కోసిపోయెను. మేమే మేలుకనియున్న, నొక్కఁడు మీబంట్ల నిట్లువఱిచి నామ మడఁగ కుండెనె? ఇప్పు డేమో మా దురదృష్టంబునఁ బరాభవంబు నొందితిమికాని, దేవర కటాక్షలవంబు గలుగ, ము న్నెన్నఁడు ని ట్లయినవారము గాము. దేవరయంతవానికిం బరాభవము సంభవించెను. ఇది మాచేసికొన్న భాగ్యము గాఁబోలు! పగతురు[2] మనల మిగిలి నొగిలించుట[3] కంతరంగంబున నెగు[4] లొందకుము. 'అత్యుచ్ఛ్రయః పతనహేతు'[5] వని యార్యులు వచియింతురు గావునఁ, బెరిఁగెడివాఁడే విఱిగెడివాఁడు. నేఁడు శత్రునిరాసంబున ధన్యోస్మి' యనుకొని విఱ్ఱవీఁగుదాయ[6] చేసేమి మూఁడనున్నాఁడో, యే[7] రెఱుఁగుదురు? సతతముఁ గంటికి ఱెప్పవలెఁగాచుచుఁ బ్రోచుచుండ దేవర బుద్ధి విని, స్వామియే కనువెలుఁగుగా వెంటఁ జరియించు తలంపున, మే మందఱము మీ కడకుం జనుదెంచినారము. నీయట్టి ఘనుని[8] కరుణారస వృష్టి[9] కలిగినంగదా, మా హృదయతాపము చల్లారును. ఇన్ని నాళ్ళును నంద తొనొనస బ్రదికి, తుదకుఁ బౌరుషము చెడినప్పుడు శరీరధారణార్థం బొక్కనీచవృత్తికి లోనయి, రోఁత[10]ల కాలయము కానేల? ఈఁతకు మిక్కిలి లోఁతు లేదు. కాన సాహసించి యసహాయశూరులమై, జనులు మనమీఁదఁ జాలమివెట్టఁ జోటు లేకుండ, నాయురవసానపర్యంతమును[11] బోరి, యధ్రువంబులగు[12] దేహంబులచే ధ్రువం బగుకీర్తి నార్జింతము. మన కాలము మంచి దయినప్పుడు విగిడి మగుడ నా చెడుగులఁ గడముట్టింతము. విమతుండు[13] బలవంతుండు

1. పగఱ - బారులు = శత్రువుల వరుసలు; 2. పగతురు = శత్రువులు - పగతుఁడు (ఏక వ.); 3. నొగిలించుట = బాధించుట; 4. నెగులు = దుఃఖము; 5. అత్యుచ్ఛ్రయః పతనహేతుః = అతి + ఉచ్ఛ్రయః - పతనహేతుః = మిక్కిలి యెత్తు పడుటకుఁ గారణము పెరుఁగుట విఱుగుట కొఱకు అనుట; 6. దాయ = శత్రువు; 7. ఏరు = ఎవరు; 8. ఘనుఁడు = గొప్పవాఁడు, మేఘుఁడు; 9. కరుణారసవృష్టి = దయారసమనెడి వర్షము; 10. రోఁతలు = తిట్లు; 11. ఆయుః + అవసాన - పర్యంతము = ఆయువు ముగియుదాఁక; 12. అధ్రువము = అశాశ్వతము; 13. విమతుఁడు = శత్రువు.

గావున-నింతే మనభాగ్య మనుకొని, యాతని నాశ్రయించి బ్రదుకుదము. ఇప్పటికి విప్రకృష్ట[1]దేశం బరిగి, యం దణఁగియుండి, వదంపడి పోలినట్లు చూచుకొందము. ప్రత్యర్థుల[2] కసాధ్యం బగుదుర్గంబు నాశ్రయింతము. బల్లిదు నొక్కనిఁ జేరి, వైరి నిరాసం బనాయాసముగఁ గావింతము." అని తమకుఁ దోఁచిన ట్లనేకు లనేకవాక్యములు పలుకుచుండ, వారి కలకలంబులు వారించి, చిరంజీవి యనుమంత్రి యిట్లనియె. "దేవా! దేవరయమాత్యు లెల్లఁ బెల్లు సమర్థులు; ఒక రొకర తమ ధీబలమున[3] లోకములెల్ల నఱచేతిలోనికిం దేఁజాలినవారు; నీతిశాస్త్రమున వారిని మీఱినవా రేరును లేరు. ఇంక స్వామి సామర్థ్యాతిశయంబో సమక్షంబున[4] వాక్రువ్వవలసినది కాదు. సంతాపంబు పేరిమిని[5], మనసునకు సమాధానంబు లేక యితరవ్యాపారముల నెఱుంగకుంట నిప్పుడేమోకాని, యించుకంత మది కుదురఁబెట్టి యాలోచించిన, దేవరకుం దోఁపని కార్యాంశంబులు లేవు. ఎట్టిబుద్ధిశాలులును దేవరలో సహస్రాంశంబును[6] బోలఁజాలుదురె? ఇది మా కెల్లరకు ననుభవగోచరంబు. అది యట్లుండె, స్వామి నన్నును నొక మానిసిఁగా నెంచి మిగుల మన్నింత్రుగాన, మిన్నకుండఁబట్టక[7] చిత్తచాపల్యంబున నాకుఁ దోఁచినయర్థంబు నేనును విన్నవింపఁ గడఁగెదను. భవదీయమతి నతి విశదంబుగా నొనరించి యాలింపుము. దురంబున నురగారి[8] నయిన నుఱని[9] శూరవారంబు[10]నెల్లఁ జంపుకొని, కోఁఱలు వెతికినభుజంగంబు[11]లభంగి భంగపడి యున్నవారము. ఇత్తఱి మన పెత్తువ[12] యుంటంజేసి, యహితుం[13] బొడిచి[14] యొడువఁ గడిమి[15] చాలదు. సమయ మొడఁగూడుదాఁక లాఁతి[16]మీఁదఁ గన్నిడి

---

1. విప్రకృష్ట = దూర; 2. ప్రత్యర్థి = శత్రువు; 3. ధీబలము = బుద్ధిబలము; 4. సమక్షము = ఎదురు; 5. పేరిమి = అతిశయము; 6. సహస్రాంశము = వేయవవంతు; 7. మిన్నకుండఁ బట్టక = ఊరకుండలేక; 8. ఉరగ + అరి = పాముల శత్రువు - గరుడుఁడు; 9. ఉఱని = లక్ష్యపెట్టని; 10. శూర - వారము = శూరుల సమూహము; 11. భుజంగము = పాము; 12. ఎత్తువడు = చెడు; 13. అహితుఁడు = శత్రువు; 14. ఒడుచు = ఓడించు; 15. కడిమి = పరాక్రమము; 16. లాఁతి = శత్రువు.

విశ్రుంచలముగ నుండి. తతిచేచి, బకము[1] ప్రేలిక నరి[2] నొక్కట గ్రుక్కఁ గొందము. నా బుద్ధి కిప్పటికి సమాశ్రయం బొక్కటియే యుత్తమకార్యముగాఁ గనుపట్టుచున్నది.

పగవాఁడు మిగులం బొగరు గవిసియున్నవాఁడు కాన దీనదశనొంది డిందుపడియున్న మన కాతని పొందెట్లు సంఘటిల్లు నని చింతిలవలదు. తావక[3]జ్ఞాబలముననుు, వీరికెల్ల నా దెసం గల యనుకంప[4] పెంపుననుు, దైవానుకూల్యము గూడ గోరంత కలిగెనే నెంతదుష్కర కార్యము నైన వ్రేల్మిడి[5] సఫలంబు గావించుకొనివచ్చెద. నన్నుఁ బనిగొనుండు. ఓపితిరేని, మీరెల్ల నా కొక్క సాయము చేయుఁడు. ఈ క్షణంబ మీ రందఱు నెందయినఁ జని, యల్ల నల్లం[6] గొనివచ్చి, నా మేను రక్తసిక్తంబు గావించి, తడయక ఋశ్య శృంగంబునకు వెడలి, యచ్చోట నప్రమత్తులరయి యుండుఁడు. తక్కిన కార్యభారం బంతయు నాపయిం బెట్టి, మీరు నిర్విచారంబుగ సుఖియింపుఁడు. ఎల్ల విధంబుల శుభం బాపాదించెద." అని మృదుమధుర భాషణంబుల స్వాభిలాషంబు తెలంగెలింగించిన, మొగంబులం దెలి వొంది, వాయసంబు లప్పుడ కడలకు వెడలి, సందుల గొందుల నెమకి[7], మూషికప్రముఖక్షుద్ర జంతుసంతానముల[8] దారుణత్రోటీ[9] విదారణముల[10] మారణము[11] గావించి, వలయునంత క్రొత్తనెత్తురు కొంచువచ్చి, యచ్చిరంజీవి శరీరంబునం బూసి, 'నీవు సిద్ధసంకల్పుండవు. నీ కసాధ్యం బెందును లేదు పో' మ్మని సాగనంపి, యాచోటు వాసి చనియె. అంత నా చిరంజీవియు 'డాఁగఁబోయినఁ దలారి[12]యిల్లగు నాకో' యని ప్రాణంబులు పిడికిటం బట్టుకొని, మెల్లఁగా నడచి ప్రొద్దుగ్రుంకునంతకు దివాభీతంబు లుండుకొండగుహఁ జేరి, వైరికి

---

1. బకము = కొంగ; 2. అరి = శత్రువు; 3. తావక = మీ యొక్క; 4. అనుకంప = దయ; 5. వ్రేల్మిడి = చిటిక; 6. నల్ల = రక్తము; 7. నెమకి = వెదకి; 8. మూషిక - ప్రముఖ - క్షుద్ర - జంతు - సంతానము = ఎలుకలు మొదలైన అల్పజంతువుల సమూహము; 9. త్రోటీ = (పక్షి) ముక్కు; 10. విదారణము = చీల్చుట; 11. మారణము = చంపుట; 12. తలారి = తలవరి = రక్షక భటుఁడు.

వినంబడున ఱ్ఱీరెలుంగు[1] గద్గదికం[2] దగుల, గుహాముఖంబునఁ గూసె. ఆ కూఁత చెవి సోఁకుడు నదిరిపడి, కోటఁ డొక్క[3]ఁ డాచక్కికిం బఱతెంచి. కాకిం బట్టి కొనిపోయి, యువమర్దనుముందఱఁ బెట్టిన, నాతండును విస్మయవికచవిలోచనంబులఁ జూచుచు 'నీ వెవ్వనివాఁడ వేల యిట్లయితి' వని యడిగినఁ జిరంజీవియు దైన్యం బాననంబున నటించుచు మాయ యచ్చుపడ, డగ్గుత్తికవెట్టి యిట్లనియె. "చెప్ప నోరాడ దేమని చెప్పుదు నా వార్త? నేను మేఘవర్ణుని ప్రధానమంత్రిని; చిరంజీవి యనువాఁడను. నేఁటి వేఁబోక[4], మేఘవర్ణుండు నిజప్రధానులం బిలిచి కార్యాలోచనం బడిగిన, నే నాతనిదుర్నయం బెఱింగియుఁ దోఁచిన హితంబు చెప్పి చూతముగాక యని, యిట్లంటిని. "ఉపమర్దనుండు లావు గలవాఁడు గావున భక్త్యేకసాధ్యుండు[5]; అతని పాదంబులు వట్టి మనుట లగ్గు. నీవు రాజ ననుదురభిమానంబు మాని, యవశ్యంబుగఁ దద్దర్శనంబు చేసి, నా మాట విని యక్కరుణాకరు శరణంబు సొరుము." అనునప్పు డేమిసెప్ప. నా పలుకు లాపాలసుని[6] కోపానలంబున[7] కాజ్యధారాప్రవాహోపమంబు[8] లైన, భగ్గున మండిపడి, యక్షివిక్షేపంబున[9] ననాదరంబు సూపుచు, మంత్రుల నాలోకించి 'వీఁడు విపక్షపక్షపాతియై యొడ లెఱుంగక యున్మత్తప్రలాపంబులు సేయుచున్నవాఁడు; దయఁ జూడక వీనిం బొదివి[10] వధియింపుఁడు.' అనిన, వారును గుక్కలట్ల నాపయిం గవిసి, ముక్కులంబొడిచి, కాళ్ళంగ్రుమ్మి, నెత్తురులం దొప్పఁదోఁగి సొమ్మవోయి[11] యున్న నన్ను మృతుఁగా వగచి, దిగవిడిచి తమయిచ్చం బోయిరి. పుడమిపై నిట్టిరాజోత్తము లుండఁబట్టియే కదా, 'రాజ్యాన్తే నరకం ధ్రువ'[12] మనుపండితోక్తి యెల్లెడలను బెల్లుగ విలసిల్లెడును. నేనును గొండొకవడికిం దెలిసి,

1. ఱ్ఱీరెలుంగు = హీనస్వరము; 2. గద్గదిక = డగ్గుత్తిక; 3. కోటఁడు = గుడ్లగూబ; 4. వేఁబోక = వేకువ; 5. భక్తి + ఏక - సాధ్యుడు = భక్తిచేతనే సాధింపఁదగినవాఁడు; 6. పాలసుఁడు = మూర్ఖుఁడు; 7. కోపానలము = కోపమనెడి అగ్ని; 8. ఆజ్య - ధారా ఉపమానము = నేతిధార ఉపమగాఁ గలది; 9. అక్షి - విక్షేపము = కంటి కదలిక; 10. పొదివి = ఆక్రమించి; 11. సొమ్మ + పోయి = మూర్ఛఁజెంది; 12. రాజ్య + అన్తే - నరకం - ధ్రువమ్ = రాజ్యావసానమున నరకము నిశ్చయము.

నలువలంకులుఁ[1] గలయ నాలోకించి యెందు నెవ్వరిం బొడగానక, చెదరినమది తుదకుం బదిలించుకొని, విసృష్టస్వజనబంధుజనుండ[2] నగుటంజేసి, యీ యవస్థ సర్వంబును దేవరకుం గానిపించి మఱి ప్రాణంబులు విడుతు ననుతలంపు నొడమ, గళద్రక్తసిక్తాంగంబు[3]లతో నిట్లరుగుదెంచితిని. ఇంక నాకు దేవరయే యేడుగడ[4]. శ్రద్ధానునకు[5] విద్యాదానంబును, క్షుధార్తున[6] కన్నదానంబును, వ్యాధిమథితున[7] కౌషధదానంబును, భీతున[8] కభయ దానంబును, దానంబుల నుత్తమదానంబు లని యార్యులందురు. రాజుల కార్తరక్షణమందును బోలుధర్మంబు నొండు లేవు 'దుర్బలస్య బలం రాజా'[9] యన వినవే! దేహ మాకల్పము[10] స్థిరము గాదు : అట్టి యస్థిరం బగుకాయంబు[11] కొఱకుఁ, * బరకృతావమాననిపీడ్యమానమానసుండనై[12] యౌదాసీన్యం[13]బుజ్జగించి[14], యెట్లు సరివారిలో మరలఁ దలయెత్తుకొని మెలంగ నేర్తును? ఎవరిని రక్షింపఁగోరి నే నీబ్రతుకు బ్రతుక వాంఛింతును! నేను సర్వసంగవిముక్తుండ[15] నయి యున్నవాఁడను. స్వమాత్రపోషకుండ నగు నా కిఁక నీమేనితోడిపొత్తు వలదు. ఇంతవఱకును మేఘవర్ణుని కొఱగామి[16] స్వామికి నివేదింపఁ బ్రాణంబులు పట్టికొని యున్నవాఁడను. నాకుం బాటిల్లిన[17] యీదురవస్థ యంతయు దేవర కెఱిఁగింపఁ గలుగుటంబట్టి, చరితార్థుండ[18]

---

1. నలువలంకులు = నాలుగు దిక్కులు, వలంకులు (బహువ.) వలను. వలఁకు, (ఏకవ.); 2. విసృష్ట - స్వ - జన - బంధు - జనుఁడు = విడువఁబడిన తనవారు, చుట్టములు గలవాఁడు; 3. గళత్ + రక్త - సిక్త + అంగము = కాఱుచున్న నెత్తుటిచేఁ దడిసిన అవయవము; 4. ఏడుగడ = దిక్కు; 5. శ్రద్ధానుఁడు = శ్రద్ధగలవాఁడు; 6. క్షుధా + ఆర్తుఁడు = ఆఁకటిచేఁ బీడితుఁడు; 7. వ్యాధిమథితుఁడు = రోగముచేఁ బీడితుఁడు; 8. భీతుఁడు = భయపడినవాఁడు; 9. దుర్బలస్య బలం రాజా = బలహీనునకు బలము రాజు; 10. ఆకల్పము = ప్రళయమువఱకు, 11. కాయము = శరీరము; 12. పర - కృత + అవమాన - నిపీడ్యమాన - మానసుఁడు = శత్రువుచేఁ జేయఁబడిన పరాభవముచే బాధింపఁ బడుచున్న మనస్సు గలవాఁడు; 13. ఔదాసీన్యము=ఉదాసీనత - ఉపేక్షాభావము; 14. ఉజ్జగించి=విడిచి; 15. సర్వ-సంగ-విముక్తుఁడు=ఎల్ల సంబంధములచే విడువఁబడినవాఁడు; 16.కొఱగామి=తప్పు; 17.పాటిల్లు=కలుగు; 18. చరితార్థుఁడు=కృతార్థుఁడు

నైతిని. ఇఁక నెట్లయినం గడుమేల. నే నీయెడఁ బ్రాణమాత్రావశిష్టుండనై, పగ - నీఁగు[1] శక్తి లేక, కాలంబున కెదురుచూచుచు, జీవచ్ఛవంబనయి[2] యున్న వాఁడను. ఆ పాపకర్ము లప్పుడు నా ప్రాణంబులు గొనక కొంత కొఱంత వెట్టి పోయిరి. మీరైనఁ దక్కినకొఱంతఁ దీర్చి, పుణ్యంబు గట్టుకొండు - సుకృతి[3] నయ్యెదను. తొల్లి నేనెప్పుడును భవత్సందర్శనంబు చేయవలయు ననియే కోరుచుందును. ఎంత పొరలినను, దైవానుకూల్యంబు లేని కార్యంబులు సిద్ధింబొందవుగదా? నేఁటి కది యీ నెపంబున నైన సిద్ధించినది, మహాభాగ్యవంతులకుఁ గొందఱకుఁ గాక, మీయట్టివారిసేవ యందఱకుం దొరఁకొనునె?[4] మఱియు నే ననవతరము దేవరచరిత్రమే యాతని యోలగంబున వేనోళ్ళ సంస్తవ[5] మొనరించుచుందును. అందుల కాతండు కటకటంపడి[6] మిమ్ముఁ గడవనాడు[7] చుండును. ఆ కథలు త్రవ్విన కొలఁదిని, బెక్కు లూరుచుండును. పోయినవి పోనిండు. నే నాతనికి నేఁటిదనుకం జేసినమేలంతయు నొక్కపూఁటలో వఱదఁ గలసిపోయెను. అందు దేవరకుం గోటితమాంశంబైన నాచరించిన, నింతకు నా మనోరథంబు నిండదే? అని కర్ణకలాపంబు[8]లుఁగా గరటం బాడు దయనీయాలాపంబుల మెత్తనైన రాజచిత్తంబు నారసి, మంత్రు లిట్లనిరి 'స్వామీ! యేమో పలుకుచున్నామని యనాదరంబు సేయుక, మా మనవి చేకొనుఁడు. ముందఱఁ గీడెంచి మేలెంచవలెను. వైరంబు లామరణాంతంబులు[9] గానిఁ, యింతట నంతటం దెగునవి కావు. ఈతనిచరితంబు ప్రత్యక్షపరిచితతో బయినది ప్రాపడి[10] పోయెనె? రాజు తనవంకవారినే నమ్మి నమ్మక యుండవలెను. లాఁతివానిఁ జెప్ప నేల? ఈతండు తృణచ్ఛన్నకూపంబు[11] వంటివాఁడు; వీనిని విశ్వసింపఁ

1. ఈఁగు = తీర్చు; 2. జీవచ్ఛవము - జీవత్ + శవము = బ్రదుకుచున్న శవము; 3. సుకృతి = సుకృతము గలవాఁడు - పుణ్యాత్ముఁడు; 4. దొరఁకొను = లభించు; 5. సంస్తవము = స్తుతి; 6. కటకటంపడు = బాధపడు; 7. కడవనాడు = తిరస్కరించు; 8. కర్ణ - కలాపము = చెవి యాభరణము; 9. ఆమరణాంతములు = మరణమువఱకు నుండునవి; 10. ప్రాపడు = ప్రాఁతపడు; 11. తృణ + ఛన్న - కూపము = గడ్డిచేఁ గప్పఁబడిన నూయి, - పైకి మంచివాఁడుగాఁ గనఁబడుచు లోన దుష్టుఁడయి యుండుట.

గూడదు. మనము మతిఁదప్పి నిశ్వసించితిమేని, వీనిం జేర్చినఫలం బవసానంబున నంశఫలంబు[1] రీతి సమూలవినాశంబు సేయక మానదు. సందియము లేదు; వీఁడు మనలం జెఱుపవేఁడి, వైరులకుఁ దాపికాఁడయి[2] వచ్చి యెందులేనిపలుపోకలమాయలు పచరించుచున్నవాఁడు. వీని న్మనకడ మనుచుకొనుట, దూదిం జిచ్చు[3] దాఁచినయట్లయ్యెడు. కొండంత దూదికిం గొండంత నిప్పేల? మనల నేలపాలు సేయ వీఁడొక్కఁడ చాలును. విపక్షుండు క్షుద్రుం డయ్యును గాలక్రమంబునం బెరిఁగి, వృక్షమూలమునందలి నామలూరువు[4] వృక్షంబుంబోలెఁ, జెఱుప సమర్థుం డగును." అని మంత్రు లెంద ఱెత్తెఱంగున నాతనిపొత్తు హత్తించుకొనుట విపత్తునకే మూలం బని యొత్తిచెప్పినను, వానిం దన చిత్తంబున హత్తింపక, విధి మూఁడి, యుపమర్దనుండు తనపట్టిన చలంబు విడువక, శరణాగతపరిత్రాణంబున[5] కెనయు[6]నుత్కృష్టధర్మంబు లే దుడుగుం డని వారల వారించి, యా బలిభుజ రక్షణకరణంబునం గృతనిశ్చయుం డయి, వారల కిట్లనియె, "జాతిమాత్రంబు చేతనె యీతని లాఁతిఁగాఁ దలంపవలదు. ఈతండు సాధుజనాగ్ర గణ్యుఁడు; కలనైనం బరుల కాపదఁ దలఁచువాఁడుగాఁడు; సత్యంబుకానివాక్యం బీతని రసన[7] తుదకు రాదు; జగంబున నీతనికి సమానుండు మానధనుండు లేఁడు. ఈతని వాక్యంబులే యీతనిగుణమ్ముల నెఱింగించుచున్నవి. మన పుణ్యపరిపాకంబున నీ చిరంజీవితోడి పరమసౌహార్ద[8]లాభంబు దొరకినది. మన కీతండు కడు విశ్వసనీయుండు; ఇందు నందు ననక మనమందిరంబున నెందైన నడ్డంకిలేక తిరుగఁదగినవాఁడు. నేఁడుమొదలు పూర్వవైరంబు విచారింపక, మీ రెల్లరు నీతని నతిమాత్రగౌరవంబునం జూచుచుండునది." అని యానతిచ్చి తన కభయప్రదానం బొసంగి ప్రశంసించుచున్న రాజున కభిముఖుం డయి, భయభక్తులు మెఱయఁ జిరంజీవి యిట్లనియె "సాధు!

---

1. వంశ - ఫలము = వెదురుపండు; 2. తాపికాఁడు = సంధానము చేయువాఁడు; 3. చిచ్చు (వి) = నిప్పు - శుచి (ప్ర.); 4. నామలూరువు = పుట్ట; 5. పరిత్రాణము = రక్షణము; 6. ఎనయు = సాటియగు; 7. రసన = నాలుక; 8. సౌహార్ద = స్నేహ.

సాధు! పరదోషకథావిముఖుల రగుదేవర గుణంబులు గొనియాడ నే నెంతవాఁడ? భవత్సందర్శనమాత్రంబున, మామకవిలోచనంబులు[1] భాగ్యం బులు వహించె; భవదీయవచనామృతాస్వాదనంబున[2], శ్రుతిద్వయంబును[3] దృప్తి వహించినది. స్వామి సందర్శనంబు దొరఁకొననివాని జన్మమేల? సర్వజగ జ్జయిత్రులరు[4] మిత్రులగుటంబట్టి, నాజన్మంబు కృతార్థత్వంబు నొందె. మీకారుణ్యంబు గలిగినం, దృణమయిన మేరు[5] వగును. పగవారినైన నొచ్చిననోరం బలుకనొల్లవు. అది దేవర బోఁటి గుణగ్రహణైకపారీణు లగుధరాభారధౌరేయులకుఁ[6] గొందఱకుం జెల్లెఁగాక యందఱకుం జెల్లునె? స్వామివంటి దయాళురు కొందఱు గలుగంఁబట్టి కదా, యీ స్థిర[7] తిరంబై[8] నెగడుచున్నది. అక్కడక్కడ రాజ్యపరిపాలనంబు సేయువారు లెక్కకుఁ బెక్కురు గలరు; దేవరం జూచి, మఱి వారిం దలపెట్ట సిగ్గు వొడముచున్నది. మత్స్వరూపస్వభావంబులు దెలియక, వీరందఱు నాపై నింద గడించెదరు. హితాహితనిర్ణయంబు సేయ మహాప్రబద్ధులకుఁ గాక, సామాన్యముగ నందఱకుం బయిపయి నున్నదియే! నావల్ల కల్ల[10] గోరంత కలిగెనే, నిప్పుడ కా దెప్పుడయిన నేలిక చిత్తంబునకు వచ్చినట్లు చేయవచ్చును. నిఖిలహేయ భాజనంబయి[11] క్షణభంగురం[12] బయిన యీ కాయంబుఁ గల్పస్థాయిఁ[13]గా నమ్మి, యెట్టి కష్టాత్ముండయిన విశ్వాసఘాతుకత్వంబున కొడిగట్టుకొనునే? దైవంబు దయమాలి నలువురిలో నన్నిట్లు తలవంచుకొనం జేసెఁగావున, నీరీతి నిన్నికఱకుమాటలకు వీను లొప్పగింపవలసివచ్చెను. ఆబాల్యము[14] నేఁ గాంచిన

---

1. మామక విలోచనములు = నా కన్నులు; 2. భవదీయ - వచన + అమృత + ఆస్వాదనము = మీ వాక్కనెడు అమృతము యొక్క(ను) రుచిచూచుట; 3. శ్రుతిద్వయము = చెవుల జంట; 4. సర్వ - జగత్ + జైత్రులు = ఎల్ల జగములను జయించువారు; 5. మేరువు = బంగరుకొండ; 6. ధరా - భార - ధౌరేయుఁడు = భూమి బరువును వహించువాఁడు; 7. స్థిర = భూమి; 8. తిరము = స్థిరము; 9. గడించు = కల్పించు; 10. కల్ల = అసత్యము; 11. నిఖిల - హేయ - భాజనమ్ము = ఎల్ల నైచ్యములకుఁ బాత్రమైనది; 12. క్షణ - భంగురము = క్షణకాలములో నశించునది; 13. కల్పస్థాయి = కల్పము - ప్రళయము వఱకునుండునది; 14. ఆబాలఁము = చినుతనమునుండి.

గౌరవంబంతయు, నిప్పుడు స్వప్నలబ్ధపదార్థంబు[1] చందం బయ్యె. న న్నెవ్వ రెట్లనుకొన్నను, దేవర యాజ్ఞ కడుగుదాఁట నోడుదుఁగాన నేలికపాలఁ దలఁదాఁచుకొని యిచ్చట భవద్గర్భవాసగుప్తిం[2] దినములు పుచ్చెదను." అని యిచ్చకంబు లాడుచు, నిమిషంబును తేని నెడఁబాయక, యాతని చూపు లేచాయ నిగుడునో యని నిర్నిమేషంబుగ[3] సమ్ముఖమ్మునం గొలిచి యుండుచు, దినదినంబును వింతవింతగా నవసరోచితంబు లగువినోదంబులఁ బ్రమోదంబు రెట్టించి యంతకంతకు మొదలింటికంటె శతగుణంబుగా[4] రిత్తయుపచారంబుల నుపమర్దను మనమున కెక్కు నడవడిం బ్రవర్తించుచుఁ, గరమ్ము నమ్మకము పుట్టించి, యెల్లెడల నడ్డు లేక క్రుమ్మరుచుఁ, జిరపరిచయంబునఁ జిరంజీవి తత్త్రద్రహస్యవర్తనమ్ములును దుర్గబలాబలమ్ములును నిమ్ముగా[5] నెఱింగి, తఱి యారసి యొక్కనాఁటి పగటిపూఁట బహుస్వనమ్ము[6] లాదమఱచి సుఖసుప్తంబు లయి యుండ గుహ వాకిలి వెడలి వచ్చి, యచ్చేరువ మొదవుపదుపులు[7] గల తావుల కరిగి, యెరువు కొంత చరణంబుల నిఱికియుఁ గొంత ముక్కునం గఱచికొనియుఁ గొనివచ్చి, గుహాముఖంబునం దాపి, రెండవకంటివాఁ డెఱుఁగకుండ మేఘవర్ణు పాలికిం బోయి నమస్కరించి యిట్లనియె. "దేవా! మనము సేయునధ్యవసాయం[8] బంతయు నేఁడు ఫలితంబునకు వచ్చినది. అంతకంతకుం బెరుఁగు దేవర మన్నన ఋణంబు నేఁటికిం దీర్పఁ గంటిని. స్వామి మనోరథపూరణం బాపాదింపఁ బడసి, నా యొడలెత్తిన ఫలంబుఁ గాంచఁ గలిగితిని. మీరందఱు నేకనిశ్చయు లయి, నాకుఁ జేదోడై నడవవలయును. నే నా యుపమర్దనుని చెలిమి కలిగించుటకై పడరానిపా ట్లెల్లంబడితి. కట్టా! దాయలపంచం బడి యేఁ బడినయిడుమ లిన్నియన్నియని యెన్నఁదీఱునె? ఉపమర్దనుండు తన పాపంబు పండి, సులభంబుగ నావలం దగులువడి, నా కన్నపానాదు లిడి

1. స్వప్న - లబ్ధ - పదార్థము = కలలోఁ బొందఁబడిన వస్తువు; 2. భవత్ + గర్భ - వాస - గుప్తి = నీ కడుపులో నుండుటవలన రక్షణము; 3. నిర్నిమేషము = ఱెప్పపాటు లేనిది; 4. శత గుణము = నూఱు రెట్లు; 5. ఇమ్ముగన్ = బాగుగా; 6. బహుస్వనము = గుడ్లగూబ; 7. మొదవు - పదుపులు = ఆల గుంపులు; 8. అధ్యవసాయము = పూనిక.

పరామర్శింపఁ దనవారి నియమించె. వారెల్లఁ దొలుత నాపాడ కనఁబడినపు డెల్ల నన్ను గుటుకుమనకుండ మ్రింగవలయునని యుండిరి. అప్పుడు వారి పెట్టువోఁతలకు లోఁబడి, వా రింద మని[1] యిచ్చినదే భుజించుచు, నోరు కట్టుకొని శరీరశోషణం[2]బునకయిన నోర్చి, యసంభవం బయిననాఁడు జలప్రాశనంబె[3] చేయుచు రాజుతోడనైనఁ జెప్పక కాలంబు ప్రతీక్షించుచుండి, కడకు వారి యనుగ్రహంబునకు సహితము పాత్రుఁడ నయితిని. ఎందును గార్యంబు సఫలమయిన, నే పూర్వప్రయాసంబును నేల గణనకు వచ్చు? కాలు[4]చేతి త్రొక్కులంబడి, యిపు డుపమర్దనుండు రాజ్యానుసంధానం బేమఱి, నాతోడిదలోకం బని యున్నవాఁడు. నాపొందు వలదని, యమాత్యు లెందఱో నోరఁ గాయ లిడక బోధించిరి. వారి హితవచనంబు లన్నియు, రోగికిఁ బథ్యాహారంబు లట్ల, యాతనికి రుచింప వయ్యెను. వేయేల? కడమాట నుడివెద; వినుండు, వారి సంతోషకాలము నేఁడు ముగిసివచ్చినది. ఇపుడు మీతోడ నూరక మాటలాడుచుం గూరుచుండుటకు నాకు లేశమును నవకాశము లేదు. వారినందఱఁ గనుఁబ్రామి[5] నే నిటు చనుదెంచితి. నూతినీళ్లు వెల్లువవోవు. తక్కిన నా యక్కడిగాథ లన్నియు సవిస్తరముగా ముందు విన్నవించెద. ప్రస్తుతకరణీయంబు వినుండి. గుహలోపల నులూకంబు లీ లోకంబు మఱచి, నిద్రావివశంబులై యుండ నాకుం గనుమొగుడ[6]క లేచి వచ్చి, యచ్చుట్టుపట్టుల నుండుతొఱ్ఱుపట్టు[7]ల కేగి పసుల వెంటఁ బట్టుకొని వచ్చి, గవివాతం[8] బెట్టి మిమ్ముం బిలుచుకొనిపో వచ్చితిని. అం దగ్నిరగిల్చి కాల్చి, నిద్దుర వోవు కౌశికంబులఁ[9] బెద్దనిద్దురపుచ్చ[10]వలయు, ఇప్పుడ మనవా రందఱుం గదలి, రవులుకొఱకచ్చులు[11] చంచువులం[12] గఱచికొని,

1. ఇందము = ఇదిగో; 2. శోషణము = ఎండుట; 3. జల-ప్రాశనము = జలాహారము; 4. కాలు = యముని; 5. కనుఁబ్రామి = కన్నుగప్పి - మోసగించి; 6. మొగుడు = ముడుచు, 7. తొఱ్ఱుపట్టు = ఆవులుండుచోటు; 8. గవి - వాతన్ = గుహాముఖమున; 9. కౌశికము = గుడ్లగూబ; 10. పెద్ద నిద్దురపుచ్చు = చంపు; 11. రవులు-కొఱకచ్చు = మండుకొఱవి; 12. చంచువు = ముక్కు.

నాపెఱుంద[1] నరుదేరవలయు." అని కఱపి, తా నొక్క మం
ముక్కునం జిక్కఁబట్టి, పురోయాయి[3] యయి త్రోవవెట్టినఁ, శ
నట్టులాతని వెంట మింట ననుగమించె. అంత నా శకుంత
లనంతాధరంబుం[4] దఱిసి, దరివాతం[5] దార్చినయెరువునకుం గొఱవ్రి
దరికొల్పి యెఱకల[6] విసరుడు, నర్చిష్మంతుండు[7] కరటవిసర
పవమానజాజ్వల్యమానకీలాజాలంబుల[8] నాభీలంబుగఁ[9] గవియించి, ధూ
స్తోమంబు[10] లెసకొల్ప గుహయెల్లఁ దామయై పేర్చినయర్చు[11]ల వేఁడి కోఁడి
లేచి పేచకంబులు[12] నిదురమంపున[13] నఱచుచు వెఱచఱచి[14] పఱచి, యెట్లును
గుహవెడలు వెరవు దొరకక, రాజుకడం జేరి, ప్రభు వని చూడక యిట్లనియె
'దేవా! వైరి యగు నీ చిరంజీవిం జేరఁదీయవలదు; కీడుమూఁడు' నని మే
మెల్లఁ బలుదెఱంగులఁ జెవి నిల్లుకట్టుకొని పోరిన మా మాటలు పాటిగాఁ
గొనక, పెడచెవులంబెట్టి, నీమదిఁ బట్టుకొన్న యున్మాదంబు మానవైతివి
అనన్యాధిష్ఠితం[15] బగు సదనున నిష్కంటకముగా[16] నుండి, యనపహార్యం[17]
బగు నైశ్వర్యంబుఁ గుడుననేరక, నిర్హేతుకముగఁ గూలఁ దన్నుకొంటివి.
మఱియుఁ గానకకన్నసంతానంబును, నెందునుం బడయరాని బంధుజనం
బును, బ్రాణసమానంబగు మిత్రవర్గంబును, నూరక మ్రింగుకొంటివి
మాపలుకు వినక, విరోధికిఁ దా విచ్చినఫలము చేసేఁత నను భూతం బయె
ఇప్పు డయిన, నహంకారపంక[18] మింకెఁగా?" అని యుపమర్దనుందూఱుచ

---

1. పెఱుఁద = వెనుక; 2. మండు - కాష్ఠము = రవులు కొఱకచ్చు; 3. పురోయాయి - పురః + యాయి = ముందు నడచువాఁడు; 4. అనంతాధరము = కొండ; 5. దరి - వాతన్ = గుహా ముఖమునందు; 6. ఎఱక = తెక్క; 7. అర్చిష్మంతుఁడు = అగ్ని; 8. కరట - విసర - పక్ష - పవమాన - జాజ్వల్యమాన - కీలజాలము = కాకుల మూఁకయొక్క తెక్కల గాలిచేమండుచున్న జ్వాలల సమూహము; 9. ఆభీలము = భయంకరము; 10. ధూమ - స్తోమము = పొగల గుంపు; 11. అర్చి = జ్వాల; 12. పేచకము = గుడ్లగూబ; 13. మంపు = మత్తు; 14. వెఱచఱచి = భయపడి; 15. అనన్యాధిష్ఠితము = ఇతరులచే నధిష్ఠింపఁబడనిది; 16. నిష్కంటకము = శత్రురహితము; 17. అనపహార్యము = అపహరింపరానిది; 18. అహంకార - పంకము = గర్వమనెడి బురద.

మూలమూలలు దూఱుచు, మంట లోఁడ ళ్ళంటినఁ గమరి, ఘర్గరికంబు[1] లెల్ల నిలువున విగతాసువు లయి[2], కాళ్ళు కుప్పవడ నేలఁగూలి, వేఁడివేలుపుచే[3] భక్షింపఁబడియె. ఇ ట్లహితులెల్ల నిహతు లయి, నిమేష[4]మాత్రంబున గుహయంతయు నేనుఁగు తిన్న వెలఁగపంటివలె[5] నైన నలరి, హృదయంబుల ముదంబు[6] వదనంబుల[7] వెల్లివిరియఁ, గరటంబులెల్లఁ గూడఁబడి, చిరజీవిని జుట్టుకొని యిట్లనియె. "ఓయీ! చిరంజీవీ! నీవు కలుగఁ బట్టికదా, యిబ్బారిం గడవఁగాంచితిమి. అక్కడనుండి నీవు క్రమ్మఱ వచ్చి మాకంటఁ బడుపర్యంతము, మమ్ము మే మెఱుంగము. మా యందఱి ప్రాణంబులును నీవ; నీవులే కిక్కడ మా కొక్క నిమిషమయిన వేగునె? నీ మేధా విశేషంబునంగదా, నిశాదర్శి[8] యొక్కఁడయినఁ గడమపడకుండఁ[9] గడతేఱె[10]. ఇపుడు మా మనంబులం గలనెగు[11] లాఱె. అనన్యాదృశ సుకృతంబున[12] మాకు నీ వంటి చెలిమికాఁడు దొరకె. ఇఁక మాకేమి తక్కువ?' అని శ్రవణా నందంబుగాఁ జిరంజీవిం బ్రస్తుతించి, యాతనిచేఁ బ్రతినందింపఁబడి, కొంతసేపు వాయసంబు లెల్ల సల్లాపసౌఖ్య మనుభవించు చుండె. అనంతరము వాయసేంద్రుఁడును బరమానందభరితుఁడయి వైరినీ డెల్లఁ జూఱాడి, కాక కాకారవ ముఖరిత హరిదంతరంబుగా[13] నిజ నివాసంబు నకుం జని, సుఖంబుండె.

కాఁబట్టి గిట్టనివాని నొద్దఁ బెట్టుకొంట బెట్టిదంపుంజెట్టఁ[14] బుట్టించును. దేవర యేకన్నులం జూచెదరోకాని, నా కీ కాకమ్మును నమ్మట సర్వవిధమ్ముల

---

1. ఘర్ఘరికము = గుడ్లగూబ; 2. విగత + అసువులు = పోయిన ప్రాణములు గలవి; 3. వేఁడివేలుపు = అగ్ని; 4. నిమేషము = ఱెప్పపాటు; 5. ఏనుఁగుతిన్న వెలగపండు = ఆకస్మికముగా నదృశ్యమగునది; 6. ముదము = సంతోషము; 7. వదనము = ముఖము; 8. నిశాదర్శి = గుడ్లగూబ; 9. కడమ + పడకుండ = మిగులకుండ; 10. కడతేఱు = చచ్చు; 11. నెగులు = దుఃఖము; 12. అనన్యాదృశ సుకృతము = సాటిలేని పుణ్యము; 13. కాక - కాకారవ - ముఖరిత - హరిత్ + అంతరంబుగాన్ = కాకులయొక్క 'కాకా' యను ధ్వనిచేత మ్రోఁగునదిగాఁ జేయఁబడిన దిక్కుల మధ్యభాగము గలుగునట్లు; 14. బెట్టిదంపుంజెట్ట = బెట్టిదము + చెట్ట = మిక్కిలి ఆపద.

ననర్థదాయకమ్మగాఁ గన్పట్టుచున్నది. దేవర యీతని తేనెమాటలకు మోసపోయి, యీతని తోడ్పాటున కుప్పిళ్ళూరుచున్నట్టు తోఁచుచున్నది. సత్య మారయ, నితఁడు చక్కెరపూఁత పూసిన విషముగాని వేఱుగాదు; శీతల ప్రవాహంబు కూలసాలనిర్మూలనానుకూలంబగుట[1] దేవరచిత్తంబున భావింపవలయును. ఏ విధమునఁ జూచిన, నీ నీలవర్ణుండు గర్హణీయుండ[2] యగుంగాని సంభావనీయుఁడుగాఁ[3] గానిపింపఁడు. ఈయన సేయు సాయంబు పేరు దైవం బెఱుంగు; అపాయంబు సేయకున్నం జాలును. విన నేర్పితి రేని, నాకుఁ దోఁచినహితంబొక్కటి చెప్పెదఁ జిత్తంబునం జేర్పుఁడు. ఆవల వినినీ వినకపోనీ హితంబుగోరి యాఁడుమాట కీశ్వరుం డయిన మెచ్చుఁగదా? క్రూరకర్మం బనిచూడక వీని నీయెడ మట్టుపెట్టుఁడు[4]. వీఁడు తెగిన మన మనఃపీడయంతయుం దెగును. అని పలుకుమంత్రి మాటలకుఁ జిఱునవ్వు నవ్వి రా జిట్లనియె "నీ వాడినదంతయు సత్యము. అయినను గ్రొత్తగా వచ్చినంతమాత్రముననె విశ్వాసపాత్రంబు గాఁడని నిశ్చయించుట తగదు.

ఈతఁ డింతవఱకును మనకుఁ గించిద్ద్రోహంబైనఁ[5] జేయఁడు. ఒక్కని గుణంబు లిట్టివని గుణవ్యవహారంబుల నెఱుంగవలయుంగాని, జాతి మాత్రంబుననె నిర్ణయింపరాదు. ఒకానొకవేళ నాగంతుకులును[6] హితు లగుదురు; సన్నిహితులే యహితు లగుదురు. శరీరజం[7] బగురుజ[8] యహిత మగుటయుఁ గాటఁ[9] గలిగిన యౌషధంబు హితమగుటయుఁ బాటింపవలదే? కొందఱు తొలుత హితులయట్లు కనఁబడి, కడపట నహితు లగుదురు. మఱికొందఱు మొదల నహితుల మాడ్కిం జూపట్టియుఁ, గార్యావసరంబుల హితు లగుదురు. ఈతండు మనకొక్కకీడు రోయువాఁడుగా నా బుద్ధికిం

1. కూల - సాల - నిర్మూలన + అనుకూలము = గట్టునందలి చెట్లను నిర్మూలించుటకు అనుకూలము; 2. గర్హణీయుఁడు = నిందింపఁదగినవాఁడు; 3. సంభావనీయుఁడు = ఆదరింపఁదగినవాఁడు; 4. మట్టుపెట్టు = చంపు; 5. కించిత్ + ద్రోహము = ఇంచుక ద్రోహము; 6. ఆగంతుకులు = వచ్చినవారు; 7. శరీరజంబు = శరీరమునఁ బుట్టునది; 8. రుజ = రోగము; 9. కాటన్ = కాటియందు.

బొడకట్టఁడు. మన కపకారంబె తలంచినవాఁడేని, నాఁ డట్లు కొలువులోఁ జిలుకం బిలుకుమార్పఁ[1] దలఁపడునెట్లు? మనదెసం గల వాత్సల్యంబె కారణంబుగా మన కుపకారంబు చూపవచ్చినవాఁడుగాని, వేఱొక్క పాపం బెఱిఁగినవాఁడు గాఁడు, పరమధార్మికుఁడు; సత్యసంధుఁడు. పరీక్షా పూర్వకంబుగాఁ గొన్నాళ్ళీతని మనకడ నునిచికొని, యీలోపల నెద్దియైన నీతనియెడ నీయెన్నిన యవగుణం బించుక గాననైన, నేమి చేసినను లోకంబు మెచ్చుంగాని, వేగిరపడి ధర్మంబు కట్టిపెట్టి యకారణంబుగ నితని నొకకీడునకు లోఁబఱిచితిమేని, లోకులు మనల సీ యనరె? మఱియు మనకుఁ బ్రత్యక్ష విపక్షమువాఁ డని కదా, యీ పక్షిని నమ్మఁగూడ దనుట. కార్యార్థియగువాఁ డొక్కొకతఱి శాత్రవునైనం గలపికొని మెలంగవలయును. ఆవల లావరి[2]యగుదాయ మనమీఁద దాడి వెడలి యున్నవాఁడు. మన మిప్పు డీతనిం బోనాడునవసరంబు గాదు. మన ప్రయోజనంబు తీఱుదనుక మన మీతని నేస్తంబున[3] కొడంబడవలయును. విమతులకు హితులైనవారిం గని మతిమంతుండు వికసన్ముఖుండై[4], పల్కు నవనీతకోమలంబును[5] హృదయం బాయసనిష్ఠురంబును[6] నై, మాట లాడవలయును. 'చెలిమిమైఁ[7] జేఁదు మేపింపవచ్చుం గాని, బలిమిమెయిం బాలు ద్రావింపరాదు.' అను లోకోక్తి వినలేదా? విపక్షునియెడఁ గార్యంబుపొంటె[8] మిత్రభావంబు నెఱపియు, మనమ్మన నమ్మక, యప్రమత్తుం డయి యుంట బుద్ధిమంతుల లక్షణం బని మేధావులయి వినికి[9] గలవారు చెప్పుదురు. మన కెలసంబు[10] తీఱు నందాఁక నీ నీలవర్ణుని విశ్వసించినట్లు నటించి, లోన నమ్మక యుందము. కంటకంబునఁ[11] గంటకోన్మూలనంబు[12] చేసి యా ముంటెఁ గూడఁ

---

1. పిలుకుమార్పు = చంపు; 2. లావరి = బలవంతుఁడు; 3. నేస్తము = స్నేహము; 4. వికసత్ + ముఖుఁడు = వికసించుచున్న ముఖము గలవాఁడు; 5. నవనీత - కోమలము = వెన్నవలె మృదువైనది; 6. ఆయస - నిష్ఠురము = ఇనుమువలెఁ గఠినమైనది; 7. చెలిమిమైన్ = చెలిమితో; 8. కార్యంబు పొంటెను = పనికొఱకు; 9. వినికి = తెలివి; 10. కెలసము = పని; 11. కంటకము = ముల్లు; 12. కంటక + ఉన్మూలనము = ముల్లు పెఱుకుట.

బరిహరించులాగున, నీతనిప్రాపున నా విరోధిని మర్దించి మన కార్యంబు గడపికొని పిమ్మట నీతని విడనాడుదము. పూర్వ మొకమూషికంబు తన కర్జంబుకొఱకుఁ గేవలము విపక్షపక్షమువానితోడ మార్జాల[1]నాథునితోడఁ జెలిమి కలిగించుకొని, కార్యాంతంబున విసర్జించెను. నీ కా కథ వినిపించెద, వినుము.

## మూషిక మార్జాలముల కథ

పంచవటంబు ప్రాంతంబున నొక్క మఱ్ఱివృక్షము తొఱ్ఱలో రోమశుం డనుబిడాలము[2] వాసముచేయుచుండును. ఆ చెట్టుక్రిందలాఁగ[3] లోఁగిలిగాఁ[4] జేసికొని, పలితుం డను నెలుకొక్కఁడు వసించుచుండును. ఒక్కనాఁటి రాతిరి కిరాతుం డొక్కఁ డక్కడ కరుదెంచి, యా చెట్టుచుట్టు నురులొడ్డి పోయెను. ఆ యొద్దు టెఱుంగమింబట్టి, వేగుజామునఁ గనుచీఁకటి యుండ, మార్జాలం బాహారంబునకుఁ జనఁబోయి యా యురిం దగులుకొనియె. అదికాంచి సంతోషించి, మూషికంబు తొడుసు[5] వాసెఁ గదా యని నిర్ధరంబుగఁ[6] గలుఁగు[7] వెడలివచ్చి, యచ్చేరువం జెఱలాడు[8]చుండఁ, జంద్రకుం డనుకౌశికం[9] బొక్కటి యా చక్కటి[10] కేతెంచి నిలిచెను. దానిపొడ[11] వవలోకించి, కాళ్ళు గుదివడ, నొడలు వడవడవడంక, నుల్లంబు జల్లనఁ, బుల్లవడి[12] యొల్లంబోయి[13], యల్లనఁ గొంతవడికిం దెలివి తెచ్చుకొని, బిలేశయంబు[14] తనలోఁ దా నిట్లనియె. 'హా! ఏమి సేయుదును? ఈ దేహ మిన్నినాళ్ళును బెంచి, కడ కీ క్రించు[15] గూబపాట్టఁ బెట్టవలసివచ్చెను! దైవమా! నీ కంటికిం బేలగింజయుఁ బెద్ద దయ్యెనె? ప్రాణంబులు గొనందలంచి, నాపాలివిధి న న్నిటకుం దెచ్చెఁగాఁబోలు! తప్పింప నెవ్వనికి శక్యమగును? అడవిలోపల ఫలమూలమాత్రంబున దేహయాత్ర నడపుచు, నొరులకెన్నఁడు సెరగు[16] తలఁచి యెఱుఁగనినాకును,

---

1. మార్జాలము = పిల్లి; 2. బిడాలము = పిల్లి; 3. లాఁగ = బొఱియ; 4. లోఁగిలి = ఇల్లు; 5. తొడుసు = సంబంధము; 6. నిర్ధరము = నిర్భయము; 7. కలుఁగు = కన్నము; 8. చెఱలాడు = తిరుగు; 9. కౌశికము = గుడ్లగూబ; 10. చక్కటి = ప్రదేశము; 11. పొడవు = రూపు; 12. పుల్లవడు = స్తంభించు; 13. ఒల్లఁబోవు = మూర్ఛిల్లు; 14. బిలేశయము = ఎలుక; 15. క్రించు = అల్పము; 16. సెరగు = కీడు.

ముదిసిముప్పుకాలంబున నపాత్రపుఁజావు[1] చావ విధి లిఖియించెనే! ఆ మాలదైవము చేఁతలకు మేర గలదే? నిమిషంబు క్రింద నీ పిల్లిపీడ నేఁటితో విఱుగడయౌఁగదా యని, హాయిగా నుండఁ జింతింప, నింతలో నా కీయకాలమృత్యు వెక్కడనుండి యాసన్నమాయెను? దీని కేమి సేయుదు. ఎందుఁజొత్తు?' అని విలపించి, గుండియ లవిసి బెండువడి[2], మగుడ ధైర్యం బవలంబించి, యిట్లు చింతించెను. 'బుద్ధిమంతుఁ డగువాఁ డప్పు డుప్పతిల్లిన[3] ముప్పు తప్పించుకొనఁదగిన వెర వరయవలయుంగాని, యధీరత్వంబున నోరు దెఱచి యుప్పరంబు[4] విలోకించుచుఁ గలఁత నొందరాదు. ఇప్పుడు నా కీ మార్జాలనాయకుం డొక్కఁడే యాశ్రయణీయుండయి కనుపట్టుచున్నవాఁడు. ఏదో యొక మాయోపాయంబు పన్ని, యీతనియనుగ్రహంబునకుఁ బాత్రుండ నయ్యెద.' అని కొంతసే పూరకుండి, యించుకకార్యం బూహించి, నఖరాయుధంబున[5] కభిముఖంబయి నడచుచు మూషకం బిట్లనియె. ఓ బిడాలకులోత్తమా! నీ కిదె నమస్కారము. తడవులనుండి[6] మనమిద్దఱము నీవృక్షము నాశ్రయించి యేకోదరులవలె[7] నున్నవారము. అట్టిమనలో మనకు భేదభావంబు వహించియుండుట కార్యంబు గాదు. నాకు నీవుగాని, నీకు నేనుగాని, యేనాఁడును నొక యపకారంబుఁ దలంచి యెఱుఁగము. నీకు నాకు నితరేతరద్వేషహేతువు[8] వే ఁదేదియును లేదు. మనము కలకాలము బ్రతుకఁబోము. ఉన్నట్లుండ నెప్పుడో కాలుఁడు నోర వ్రేసికొని పోవును. ఈయున్న రెన్నాళ్ళ[9]యిన, మన మన్యోన్యమిత్రభావంబునం బొదలుచు, నొకరి కార్యంబుల కొక రవుట యుచితంబు. నీ వీ యురిం దగులుకోలు నాలోచన గోచరం బయినంతనుండియు, సహవాసదోషంబేమి చెప్పుదును? నిప్పులం బొరలించినట్లు నా యుల్లం బెరియుచున్నది. ఇచ్చకంబు గాదు. ఈ మనశ్శుద్ధి

---

1. అపాత్రపుఁ జావు = అపాత్రము + చావు; 2. బెండువడు = బలహీనమగు; 3. ఉప్పతిల్లు = పుట్టు; 4. ఉప్పరము = ఆకాశము; 5. నఖరాయుధము = పిల్లి; 6. తడవుల నుండి = చిరకాలము నుండి; 7. ఏకోదరులు = సోదరులు; 8. ఇతరేతర ద్వేష హేతువు =పరస్పర ద్వేషమునకుఁ గారణము; 9. రెన్నాళ్లు=రెండు+నాళ్లు.

యాశ్వరుం డెఱుఁగును. వేయేల? ని న్నీ మృత్యుపాశంబువలనం దలఁగు[1] వఱకును, నా హృదయంబు కుదుటఁబడియుండదు. అయినను, బుణ్యమునకుఁ బోవఁ బాప మెదురయ్యె' నన్నట్టు, నీ బ్రతుకునకై కడంగ నా బ్రతుకున కెక్కడ మోస మొదవునో యని, నా యుల్లం బొకపట్టునఁ దెగువకుం జొరఁబాఱఁ జాలకున్నయది. అది యట్లుండ, నదిగో నాక పాపిష్ఠఘూకము నన్ను వాత[2] వ్రేసికొన నుంకించి[3], నట్టాడుచు[4] మ్రోలఁ[5] గొండవలె నిన్నుఁ బొడగాంచి, కదియ శంకించి, శిరఃకంపంబు చేసి, చిత్తం బురియాడ[6] వెచ్చనూర్పు[7] చున్నది. నీకారుణ్యంబు గలిగిన, నా యాపద నిస్తరించి[8] నీ కీవిపత్పయోధి[9] కవధిఁ జూపుదును. ఎరవుగాఁ జూడక, నన్ను స్వానిఁగా మన్నింపుము." అనుడు, నుల్లంబునఁ బెల్లు సంతసిల్లి, హస్తాచ్ఛాదిత శ్రోత్రుండయి[10] పృషదంశకోత్తముం[11] డిట్లనియె. హా! కారుణికోత్తమా! నీ బ్రతుకునకు మోస మొదవునం చెంత మాటాడితివి! ఊరక యుపకారంబు సేయవచ్చిన నీవంటి నోరుమాలిన జంతువుం బొట్టకై పొలియించి[12], నే నేమి కట్టుకొందును? దేనికి వెఱవకున్నను, బాపంబునకైన వెఱవ వలదె? నేనిప్పుడు వైరాశ్రయతాదశను మ్రగ్గి, కాటికిఁ గాళ్ళు సాఁచుకొని యున్నాఁడను.

ఇట్టిచో నెట్టికట్టిఁడి[13] యైన, ధర్మేతరుండయి[14] నీతిబాహ్యం[15] బైన కార్యంబున కొడఁబడునె? ఒరు లేయవి యొనరించినఁ దనమనమున కప్రియమగునో, యాయవి తానొరులకుఁ జేయకునికియే సర్వశాస్త్రసారంబైన పరమధర్మము. నేనును బాల్యము నుండియు నినుబోఁటి యెఱుకగలవారి

---

1. తలఁగు = తొలఁగించు; 2. వాతన్ = నోర; 3. ఉంకించు = పూను; 4. నట్టాడు = తిరుగు; 5. మ్రోలన్ = ఎదుట; 6. ఉరియాడు = చలించు; 7. వెచ్చనూర్పు = వేఁడిగా నిట్టూర్పు; 8. నిస్తరించి = దాఁటించి; 9. విపత్పయోధి = ఆపద యనుసముద్రము; 10. హస్త + ఆచ్ఛాదిత - శ్రోత్రుఁడు = చేతులతో మూయఁబడిన చెవులు గలవాఁడు; 11. పృషదంశకము = పిల్లి; 12. పొలియించి = చంపి; 13. కట్టిఁడి = కఠినుఁడు; 14. ధర్మేతరుఁడు = అధర్మపరుఁడు; 15. నీతిబాహ్యము = నీతికి వెలియైనది.

శిక్షలనె పెరిఁగినవాఁడనుగాని, తెలుకువ[1] మాలిన[2] నడవడిం బ్రవర్తించినవాఁడఁ గాను. మిత్రుఁడా! నీ యాలోకంబున[3] నా తమోనిచయంబులు[4] పటాపంచ లయ్యెను. నే నెప్పుడు నీ పొందున కే మున్నును గ్రుక్కిళ్లు మ్రింగుచుందును. నేఁటికది యీనిమిత్తంబున సిద్ధించినది. నీ చెలిమి యబ్బిన ధన్యుండు సర్వజనమూర్ధన్యుండు[5] గాఁడె? భవత్సందర్శనంబున వేవు[6] రాప్తులువచ్చి మ్రోల నిలిచినట్లున్నది. లోకంబున మంచివారికి సజ్జనదర్శనంబునకంటెఁ బరమలాభంబు గలదె? నీ పరోపకారచింతకు నా స్వాంతం[7] బెంతయు సంతసించె. ఎవఁడు చేసిన ధర్మంబు వానిఁ గాచును. కావున, మతిమంతులు కాలుచెయ్యాడుతఱినే ధర్మంబునందు బుద్ధి నిలుపవలయును. ఆవల జవసత్త్వంబు[8] లుడిగి, యస్థిచర్మావయవంబులతో[9] ముదిమి[10] గదిరి యున్నప్పు డేమిసేయుటకును బురుషుండు సమర్థుండు గాఁడు. అంతియకాక యాయువును వాయుచలితదీపకళికయుంబోలె[11] క్షణభంగురంబై యుండును. అది విచారించి, ధర్మకార్యం బెల్లి[12] చేయవలయునది నేఁడును, మాపు[13] చేయవలయునది ఱేపును[14]. జేయుచుండవలయును. 'ధర్మస్య త్వరితా గతి[15] యను పురాణవచనమును బాటింపవలదే? దుఃఖసముద్రంబున[16] మునుంగఁ బాఱి, నిరాధారంబుగ నున్న నాకు నీవొక తెప్పగాఁ దారసించితివి. ఆహా! ఏమి నా భాగ్యము! ఆధఁబోవుతీర్థమెదు రయ్యెను! నేను నీతోడు వేఁడికొన వేగిరపడుచుండ, నింతలో నయాచితంబుగ నీవే నన్నుఁ దరింపఁ దలంపుఁ గొంటివి. నీవంటి పుణ్యకర్ముండు లోకంబున నొండొక్కరుండు గలఁడె?

---

1. తెలుఁకువ = వివేకము; 2, మాలిన = లేని; 3. ఆలోకము = చూపు; 4. తమస్ (:) + నిచయములు = అజ్ఞాన సమూహములు; 5. సర్వ - జన - మూర్ధన్యుఁడు = ఎల్ల జనులకు శిరోధార్యుఁడు; 6. వేవురు = వేయి మంది; 7. స్వాంతము = మనస్సు; 8. జవసత్త్వంబులు = వేగమును, బలమును; 9. అస్థి - చర్మ + అవశేష + అవయవములు = ఎమ్ములు, తోలు మిగులుగాఁ గల అవయవములు; 10. ముదిమి = ముసలితనము; 11. వాయు - చలిత - దీపకళిక = గాలిచేఁ గదల్పఁబడిన దీపపు మొగ్గ; 12. ఎల్లి = ఱేపు; 13. మాపు = రాత్రి; 14. ఱేపు = ఉదయము; 15. ధర్మస్య - త్వరితా - గతిః = ధర్మమునకు శీఘ్రగమనము; 16. దుఃఖ సముద్రము = దుఃఖ మనెడి సముద్రము.

నీ కీ ఘూకమాత్రంబున కీలాగున భయపడ నేల? నా ప్రాణము రక్షించితే[1] జాలును. భవదిష్టం బే నవశ్యంబుగఁ గావించెద. గుండెబెదరు దీఱి నాసరస కరుదెమ్ము. నా ప్రాపు గలిగి యుండ, ని న్నీ నీచ పేచకంబు చెనకి[2] మయిమయిం[3]బోవ నోవునె? నీకొక్కయాపద రాకుండ నా ప్రాణ మడ్డము వైచెద: చెచ్చెర వచ్చి, యీయుచ్చు వ్రచ్చు[4]పనిఁ బూనుము. అనిన, నా యుందురువు[5] డెందంబున నానందించి. వల్లెయని, మెల్లన నా చీలి[6] సమీపంబునకుం జనియె. అదిచూచి, మనసు నిరాశ చేసికొని, యులూకంబు తనవచ్చినత్రోవఁ బట్టి తిరిగిచూడక మరలఁ దన యిరవున కరిగెను. అంత బోయయు జాగిలమ్ములు పెక్కులు ప్రక్కలం బలసి చనుదేర, జముదూత[7]వలె నేతెంచుచుండెను. మార్జాలం బా యెలుకును దూరమునుండి కాంచి, గుండియ రాయి వడి, యంగ మాకంపింప, నెలుక కిట్లనియె. "చెలికాఁడా! మనము మాటల సందడిని మఱచి యేమఱి యుంటిమి. చూడు మదిగో - నాపథంబున[8] వ్యాధుండు[9] దండహస్తుండై[10] రెండవదండధరునోజం[11] జనుదెంచుచున్నవాఁడు. ఆ క్రూరకర్ముండు నాకంటఁ బడ్డప్పటినుండియు, నా ప్రాణంబులు నావేన లేవు; చిత్తంబు స్వాయత్తంబు[12] గాక తత్తరించుచున్నది. ఇంక నా బ్రదుకెల్లను నీచేతిలోనిదయి యున్నయది. పుట్టి బుద్ధియెఱుఁగుట మొదలెన్నఁడును మున్నిట్టి కష్టములకు లోనైనవాఁడఁ గాను. కాల విలంబనాసహిష్ణుత్వంబున[13] జలదరించుచున్న నన్ను భయవిహ్వాలు[14]

1. రక్షించితేన్ = దక్షించితిని + ఏన్ = రక్షించితివేని; 2. చెనకి = తాఁకి; 3. మయి మయిన్ = సుఖముగా; 4. వ్రచ్చు = ముక్కలు చేయు; 5. ఉందురువు = ఎలుక, ఉందురము (రూపాం.); 6. చీలి = పిల్లి; 7. జము - దూత = యముని దూత; 8. పథము = మార్గము; 9. వ్యాధుఁడు = బోయ; 10. దండహస్తుండు = కఱ్ఱ చేతఁయందు గలవాఁడు; 11. దండధరు + ఓజన్ = యముని విధమున; 12. స్వాయత్తము = స్వ + ఆయత్తము = తన అధీనము; 13. కాల - విలంబన + అసహిష్ణుత్వము = సమయము యొక్క ఆలస్యమును సహింపరామి; 14. భయ - విహ్వాలుఁడు = భయముచే నవయవముల స్వాధీనత తప్పినవాఁడు.

నా నృశంసు[1] బారిం బడకుండ వేగ విడుగర[2] సేయుము.' అనిన, మూషకంబును నరిచేరులు[3] కొఱుకుట నటించుచు, 'నోడకోడకు[4] మిదె విడిపించెద' నని లుబ్ధకుండు[5] సమాసన్నుండగు సంతకుంగడపి, వాఁడును గడునికటం[6] బగుడు, వడివడిం ద్రాడుతెగఁ గొఱికి, యొక్క పరుగునంబోయి, తన బొరియం జొరఁబాఱె. లబ్ధమనోరథం బగునోతువు[7] ముంగలఁ జెంచుం[8] గాంచి, దరమర్దితం[9] బగు హృదయంబున, నా క్షణంబ వృక్షసమారోహణం బాచరించె. శిథిలప్రయత్నుండయి నిషాదుండు[10], విషాదనంబున నరి పారిపోవుటకు నాసికాశిఖాగ్రంబునఁ[11] గరతర్జని[12] మోపి యబ్బుర పడుచుఁ[13] దనయిచ్చం జనియె. అంత నా వృషదంశకంబు మ్రాను దిగివచ్చి, యెలుకం జేరుకొని యిట్లనియె. మిత్రుఁడా! పరోపకారకారణంబున, న న్ని ట్లన్నిటం జాలియున్న సంగడికానిం[14] బడసియు, సౌహార్దసౌఖ్యం బనుభవింప నొల్లక, యేల బేలతనంబున ఫలవిముఖుండ[15] వయ్యెదవు? ఇంకొక తడవ నీవచోమృతంబు నా చెవులకుం జవి చూపుము. నేఁడు మొదలుగా నాసిరి యనుభవింప నీవును భాజనంబ వైతివి. నీవు వెలిగా నొక మంచిపదార్థంబు గుడువ నామన సొగ్గకున్నయది. నా కెల్ల చుట్టంబులును బక్కంబులును నీవ. నా యిల్లు నీ యిల్లుగా భావించుకొని, నేఁడును ఱేపును నీ వవశ్యము మధ్యాహ్నంబున నన్న పానాదిపూజనంబులు గయికొని, నా భవనమ్ము పావనమ్ము చేయునది. ఇదిగో మదీయంబు లగు నర్థంబును జీవితంబును భవదధీనంబులు. ఇంక నన్ను నీవానిఁగా నెంచుకొనుము. ప్రాణరక్షణం బొనరించి మించిన మహోపకారిం బ్రియపూర్వకంబగు గాఢాలింగనంబున నయిన గారవింపక, కృతజ్ఞతాలేశం

---

1. నృశంసుఁడు = క్రూరుఁడు; 2. విడుగర = విడుదల; 3. చేరులు = త్రాళ్ళు; 4. ఓడకుము = భయపడకుము; 5. లుబ్ధకుఁడు = బోయ; 6. నికటము = సమీపము; 7 ఓతువు = పిల్లి; 8. చెంచు = కిరాతుఁడు; 9. దర - మర్దితము = భయపీడితము; 10 నిషాదుఁడు = కిరాతుఁడు; 11. నాసికా - శిఖా + అగ్రము = ముక్కు పై భాగపు కొన; 12. కరతర్జని = చూపుడు వ్రేలు; 13. అబ్బురపడు = అబ్బురము + పడు; 14. సంగడికాఁడు = మిత్రుఁడు; 15. ఫల - విముఖుఁడు = ఫలమునకుఁ బెడతల పెట్టినవాఁడు.

పెట్టికట్టఁడి నయిన మది కుదిరియుండ నిచ్చునే! ఇప్పుడు నీ గాఢపరిష్వంగసౌఖ్యం[1] బొసంగక వేఱుసేయుట, నెయ్యునిదెస కూర్మి కఱ[2]పియుటగాని యొండుగాదు; వేవేగ వివరంబు[3] వెడలివచ్చి, న న్నక్కు[4]నం దియించి మన్నింపుము." అనిన బిలంబులోనుండి మూషికం బిట్లనియె. "ఎక్కప్పుడు ప్రయోజనం బపేక్షించి విపక్షునితోడి సఖిత్వం బంగీకరించియు, బుద్ధిమంతుఁ డేమఱియుండఁడు. ఇప్పుడు నీవొనరించు తఱితీపున[5]కుం జిక్కి, సొక్కి, యుండుట నాకు బ్రతుకు తెరువు గాదు. నీ వింతదనుకం బాశంబునఁ జిక్కికొని మిక్కిలిబడలి పేరాఁకలి గొనియున్నవాఁడవు; ఉదరంబు వ్నంటుకొని యున్నది; కన్నులు గుంటలు పడ్డవి; నీ కిప్పుడు చలిది వలసి నెయ్యంబు[6] కరంబు నెఱపుచున్నాఁడవు నీ మాయమాటలకు లోఁబడి, ప్రాణంబులు గోలుపోదునే; నీ నెయ్యంబునకును నీకును వేయి నమస్కృతులు. ఇక నీ విక్కడ మఱేమియుఁ జదివి చంపక, యీ వట్టిభ్రమలు మాని నీదారిం బయెత్తక పొమ్ము. ఇంతకుముంద యాలుబ్ధకుపాశంబువలన వెలువడియు, మరల నింతలో నీ దురాశాపాశంబులఁ[7] గట్టువడఁ గోరెదేల?" అని తెగనాడి, పొఁగు వదలక యెలుక సుఖంబుండె. అంత నామాటల మనసు విఱిగి, పిల్లియు హస్తగతంబగు ధనంబు నోనాడుకొన్న కరణి సంతాపించుచుఁ జనియె.

"కాఁబట్టి శత్రువుతోడఁ గూడి మనవలసిన యవసరంబు నుండును. ప్రా డేమఱియుంటమాత్రము కానిపని. ఈ ప్రయోజనంబునకు మఱేమియు విచారింపఁ బనిలేదు ఇఁక నీవు మాఱాడకు, మీతరి చేరిక కీకొమ్ము[8]" అని, మంత్రియుం గల శంకలన్నిటికిం బరిహారంబులు సెప్పి మఱియు నిట్లనియె. విరోధి[9] వరూధిని[10]తోడఁ గూడి, మలయపర్వతమ్ము నెత్తమ్ము[11]న విడిసియున్నవాఁడు. ఇట్టియెడ మనలో మనము త్రొక్కులాడుట పగతుని

1. గాఢ - పరిష్వంగ - సౌఖ్యము = బిగి కౌఁగిలి సుఖము; 2. అఱ = కొఱఁత; 3. వివరము = బొఱియ; 4. అక్కు = ఱొమ్ము; 5. తఱితీపు = ఇచ్చకము; 6. నెయ్యము = స్నేహము; 7. దురాశాపాశము = దుష్టమైన ఆశయను త్రాడు; 8. ఈకొమ్ము = స్వీకరింపుము; 9. విరోధి = శత్రువు; 10. వరూధిని = సైన్యము; 11. నెత్తము = శిరము.

కార్యసిద్ధికి నుపకారంబు. కావున నీ చెనఁటివివాదంబు మాని, కార్యైకతత్పరుండ వయి, ముందుగాఁ బ్రస్తుత కరణీయంబు[1] విచారింపుము.'' అనినఁ బక్ష్మాంచలంబులు[2] వాల్చి తనలోఁ దా నింతసేపు చింతించి, రాజునకు మంత్రి యిట్లనియె.

"చిత్రవర్ణునిచేతఁ బ్రత్యాఖ్యాతుం[3] డయి, యాతని మంత్రి యుపేక్షాపరుండయి యున్నవాఁ డని వినియున్నాము గదా! ఇది యొక్కటియె మనకార్యసిద్ధి కత్యంతప్రయోజనకారి. అంతియుకాక, పరవశుండును, బ్రమాదియు, యోధావమంతయుఁ[4] బగతురకు సుఖభేద్యు లగుదురు. ఈ చెప్పిన లక్షణంబు లన్నియు నిప్పుడు చిత్రవర్ణునియందుఁ గన్పట్టుచున్నవి. అతని వాహినీనాథులును[5] మార్గాయాసపరవశులై, ప్రమాదు[6] లయి యుందురు. దీర్ఘవర్త్మపరిశ్రాంతంబును[7] క్షుత్పిపాసార్దితంబును[8] నయి, సైన్యంబు దైన్యంబు గదిరి యుండును. ఆ బర్హిప్రకాండుం[9] డింతవఱకు నస్మద్దుర్గావరోధంబు గావింపం బ్రమత్తుండయి, తన్నుఁదా నెఱుఁగకున్న వాఁడు. కావున, నభియాతులఁ[10] బరాభూతులఁ జేయ నిది మంచి సమయంబు. నద్య ద్రివనమార్గంబు[11] లవరోధించి[12], విరోధివరూధిని వధియింప మన సారసాదుల వేగ నియమింపవలయు. మాకు బుద్ధియేమి?'' అనిన, నమ్మా టలకుం బ్రముదితాంతరంగుం డయి[13], కార్యత్వరా సముత్సాహదోహలిత హృదయంబున[14] రా జిట్లనియె. "మనవా రిత్తఱి వైరిం దారసించి బీరంబులు

---

1. కరణీయము = కార్యము; 2. పక్ష్మ + అంచలములు = ఱెప్పల అంచులు; 3. ప్రత్యాఖ్యాతుఁడు = తిరస్కృతుఁడు; 4. యోధావమంత = యోధులనవమానించువాఁడు; 5. వాహినీ - నాథులు = సేనాపతులు; 6. ప్రమాదులు = పరాకు చెందినవారు; 7. దీర్ఘ - వర్త్మ - పరిశ్రాంతము = చిరమార్గముచే బడలినది; 8. క్షుత్పిపాసార్దితము = ఆఁకలిదప్పులచేఁ బీడితము; 9. బర్హి - ప్రకాండుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 10. అభియాతి = శత్రువు; 11. నద్యద్రివనమార్గములు = నదీ + అద్రి - వన - మార్గములు; 12. అవరోధించి = అడ్డుపెట్టి; 13. ప్రముదిత + అంతరంగుఁడు = మిక్కిలి సంతోషించిన మనస్సు గలవాఁడు; 14. కార్య - త్వరా - సముత్సాహ - దోహలిత - హృదయము = పనితొందర వలని గొప్ప యుత్సాహముచే నుత్సహించిన హృదయము.

తోరంబులుగాఁ[1] బోరిన వచ్చు నా గౌరవముగాని యందులకుంగాని యీ యాకారగౌరవంబు గౌరవముగాదు. దురంబున నరవాయి[2]గొనక, మీరందఱుఁ బ్రాణాత్యయపర్యంతంబుఁ[3] బోరునది. కాలవిలంబనంబు సేయక యందఱిమన సాక్షులై నడువుండు," అని ఆ మాట లాడుటయె తడవుగా, సేనాపతియు మహోత్సాహంబునఁ బృతనాపుంజంబులతోడ[4] నడచి, కడునడచినబడలిక నొడళ్ళు తూఁగాడఁ[5] బోఁడిమి[6] చెడియున్న పరబలంబుల పయి నేమఱుపాటునం బడి, వేఁడిమిచూపి, పక్షహన[7] నంబులఁ దూలించి, శాతనఖచంచుపాతనంబుల[8] నొంచి[9], పాలికలన[10] నెత్తురు మడుఁగులు గట్టించి, పలువుంఱ్ఱ రూపుమాపినఁ జిత్రవర్ణుండు విపక్షపక్షపక్షిపక్షనఖ తుండాఘాతమ్ముల[11] నేలం గూలి కీ లెడపిన జంత్రపుబొమ్మలుం బోలెఁ గాలుకాలం బెనఁచికొని చాఁపకట్టువడి[12] యున్న నిజసైనిక నికరంబుల[13] విలోకించి, నిర్విణ్ణుండయి[14], బహిర్లిఖితచిత్రాకారంబు పగిదిం గొంతవడి చేష్టలు దక్కియుండి, మగుడ నెట్టకేలకుఁ బరిజనప్రయత్నంబునఁ దెలిసి, దారుణరణకరణస్మరణంబు[15] చిత్తంబు నుత్తలపెట్ట[16], దూరదర్శిం గాంచి, సవిషాదంబుగా నిట్లనియె. "ఇప్పగిది నొప్పనివారి[17] వలన మన దళంబునకు

---

1. తోరము = అధికము; 2. అరవాయి = జంకు; 3. ప్రాణ + అత్యయ - పర్యంతము = ప్రాణ నాశనము వఱకు; 4. పృతనా - పుంజము = సేనా సమూహము; 5. తూఁగాడు = చలించు; 6. పోఁడిమి = అందము; 7. పక్షహననము = ఱెక్కలను గొట్టుట; 8. శాత - నఖ - చంచు - పాతనము = వాఁడియైన గోర్ల, ముక్కుల ప్రయోగములు; 9. నొంచు = బాధించు; 10. పాలికలను = యుద్ధరంగము; 11. విపక్ష - పక్ష - పక్షి - పక్ష - నఖ - తుండ + ఆఘాతములు = శత్రుపక్షము నందలి పక్షుల ఱెక్కల, గోర్ల ముక్కుల దెబ్బలు; 12. చాఁపకట్టుపడి = చాఁపచుఱచినట్లు పడి; 13. నికరము = సమూహము; 14. నిర్విణ్ణుఁడు = నిర్వేదము (దుఃఖము) నొందినవాఁడు; 15. దారుణ - రణ - కరణ - స్మరణము = భయంకర యుద్ధము చేఁతయొక్క స్మృతి, 16. ఉత్తల పెట్టు (ఉత్తలము + పెట్టు) బాధించు; 17. ఒప్పనివాఁడు = శత్రువు.

దెప్పరంపుముప్పు[1] వాటిల్లుచుండఁ, గానివాని యొప్పున[2] నొప్పరికించి[3] చూచుచుండుట నీయట్టిదిట్ట కుచితంబే? నీయుపేక్షానిర్ఘాతంబె[4] వీరిపరిక్షయంబునకు హేతుభూతం బయినది. మనసైన మన సైనిక నికాయంబులోఁ[5] గాయంబు[6] గాయంబు గానివాఁడు మందునకైనఁ గానరాఁ డయ్యెడును. మా యదృష్ట మిట్లుండ, ని న్నిట్టట్టనుట నేరము. అయినను, మనమొన కొకచెట్ట పుట్టిన నిందుఁ బ్రసిద్ధులరు మీరకావున నది మీతలనె నిలుచుంగాని, మీరప్పుడు తప్పించుకొందమన్నఁ బోవునది కాదు. కృతమతి[7] వగు నీ మంత్రము పెడచెవులం బెట్టి, వాక్పారుష్యంబు చూపిన నాపాపఫలము తోడనె కట్టికుడిపినది. భవదంతఃకరణంబునం గరుణఁ జొనిపి, యింతదనుక నానోర వెడలిన ప్రల్లదంబు[8] లెల్ల మఱచి నన్నుఁ జల్లనిచూపునం జూడుము. లేదా, యీదండు[9]లం దోడుకొని వింజపుఁగొండకు[10] మార్గంబువెట్టుము. నాగతి దైవంబెట్టు కావింపఁ దలఁచె నట్లయ్యెడు - నామే నున్నది, ఈ వింధ్యాటవి యున్నది. అంతేకాని, రాజనని యీబలంబులు వొలియఁజూచి సహింపఁజాల. అకారణంబ దివి[11] తూఁటుపడి సందడించునలబలం బిప్పు డలబలంబు[12] లేక, స ద్ద[13]డఁగియున్నది; నా యూరంతబలఁగంబును నల్పావశిష్టం[14] బయి, కాడుపడియున్నది. వీరింగూడ, నట్లు చూచిచూచి వైరులవాతఁ ద్రోఁచుదును? ఇదె పుణ్యమును బాపమును నీపయిం బెట్టితిని. ఇఁక, నేరిచినను నేరకున్నను గూఱిచికొని రావలయును. న న్నీ యపారవిపత్పారావారంబున[15] ముంచినం దరిఁ[16]జేర్చిన నీదె భారము." అని న్యాయనిష్ఠురంబు లాడి, కరుణ పుట్టునట్లు

---

1. దెప్పరంపు ముప్పు = దెప్పరము + ముప్పు = అధికమైన ఆపద; 2. కానివాని యొప్పున = శత్రువు విధమున; 3. ఒప్పరికించు = ఉపేక్షించు; 4. ఉపేక్షా - నిర్ఘాతము = ఉపేక్షయనెడి పిడుగు; 5. నికాయము = సమూహము; 6. కాయము = శరీరము; 7. కృతమతి = తెలివిగలవాఁడు; 8. ప్రల్లదము = పరుష వాక్కు; 9. దండు = సేన; 10. వింజపుఁగొండ = వింజము + కొండ = వింధ్య పర్వతము; 11. దివి = ఆకాశము; 12. అలబలము = సందడి; 13. సద్దు (వి) - శబ్దము (ప్ర.); 14. అల్పావశిష్టము = కొలఁది మాత్రమే మిగిలినది; 15. అపార - విపద్ + పారావారము = పారములేని (పెద్ద) ఆపదయను సముద్రము; 16. దరి = ఒడ్డు.

మడిసి[1]నదదండంబుల[2] దడని తడవి కురరివలె విలపించిన, మనము కరఁగి దూరదర్శియుఁ దొంటికోపం బెల్ల దిగఁద్రావి, ప్రసన్నముఖుం డయి రాజున కిట్లనియె. "దేవా! దేవర యవార్యశౌర్యవిజృంభణంబున దుర్గం బాక్రమించి, లబ్ధవిజయులమై సమస్తవస్తువులం జూఱగొని, యచిరకాలంబునకు భవదుక్త ప్రకారంబుగా వింధ్యాటవికే చనుదము. సుఖదుఃఖంబు లెంతవారికి ననుభావ్యంబులు కావే! ప్రాగ్జన్మకృతకర్మాధీనంబు[3] లైన వీని నెవరు పొందకుండఁ గలరు! ఆయువుమూఁడి యాచన్నవారికై శోకంబు మాని, కార్యపరుండవు గమ్ము. ఈ హతశేషపరిమితబలంబులతోడ నపరిమిత వృతనావృతుం డగు సహితు నెట్టు నిహతుం గావింపఁ దలకూడు[4] నని చింతిలవలవదు. లోకంబున నుపాయశాలికి, లోఁకువగానియర్థంబు లేదు. దేవర నిజముగాఁ దలఁచినఁ గలన నీయలఁతి[5]మూఁకల గెలువ నెంత సేపు పట్టును? నాసామర్థ్యంబు నేఁ జెప్పవచ్చిన, హాస్యాస్పదంబు చూపట్టును. మఱియు న్నాత్మప్రశంస యనర్థ్వంబు : నన్ను నే నెన్ననేల? నా బారిం బడ్డవారు ముందఱ నాచే నెంద ఱె ట్లయ్యెదరో, నీవ యెఱింగెదవు. తక్కిన నీలెంకల[6] బలశౌర్యంబులును దలంప లోకసామాన్యములు గావు. ఏనుంగుంబోలె నీబలము నీవెఱుంగవు. నీ వించుక యులిగిచూచిన, నీముందఱ హంసలుగింసలు[7] నిలువఁ గలవె? మన మందఱముం గూడి తెరువు[8] లరికట్టి, యెట్టివారికిఁ జొరవ యీక, లోనివారిం గడుపుచిచ్చున లోపలన దరికొను[9]నట్లు సేయవలయు. మనవారిం దొలుత దుర్గద్వారం బవరోధింప విధింపుము. దీర్ఘసూత్రత[10] విజసిద్ధికి హేతువుగా వివేకిలోకంబుచే గణియింపఁబడు.

---

1. మడియు = చచ్చు; 2. దడము = దళము = సేన; 3. ప్రాగ్జన్మకృత కర్మాధీనము = పూర్వపుఁ బుట్టువులోఁ జేయఁబడిన కర్మముల వశము; 4. తలకూడు = సంభవించు; 5. అలఁతి = అల్ప; 6. లెంక = బంటు; 7. హంసలు గింసలు = హంసలు + హంసలు - నిందార్థమున ఆమ్రేడితము తొలి యక్షరమునకు 'గి' ఆదేశము; 8. తెరువు = దారి; 9. దరికొను = మండు; 10. దీర్ఘసూత్రత = చిరక్రియత్వము, ఆలస్యముగాఁ బనిచేయువాఁడు.

అయ్యదియు నియ్యెడ సిద్ధం బగ్యెను. ఇంక గార్యసిద్ధికిఁ సందియంబెయ్యది? సముత్సాహంబు వాటించి, దళవాయిని[1] రణవిహరణక్రీడకుం దీవరింపుము[2]. జయశ్రీ[3] వరింపుము." అని యాతని యనుభావంబునకుఁ బ్రోద్బలంబుగాఁ బలికిన, తేఁడును నంతరంగంబునం బొంగి నింగిముట్టె[4].

అంతట మున్ను పంపఁబడిన రెండవ ప్రణిధి ధవళాంగుండు రయంబునం బఱతెంచి, హిరణ్యగర్భుం గానిపించుకొని, నమస్కరించి యిట్లనియె. "స్వామీ! యవధారు[5]. ఆ పాఁపమేఁపరిదొర[6] యెఱకల[7] మెఱుంగులు తుఱంగలిగొనం దను చేరువతో నీచేరువం[8] జనుదెంచుచున్న వాఁడు. భగ్నమనోరథుండయి యాతండు తన మంత్రికడకుం బోయి వేలాగుల[9] బతిమాలి యతిప్రయత్నంబున నాతనిం బ్రసన్నుం గావించుకొని, తనమంత్రోపష్టంభంబున విజృంభించి, యాతనివచనంబులె మహావ లంబంబుగా[10] నస్మద్దుర్గావరోధంబు[11] సేయ నిశ్చయించె. ఇఁక నవశ్యాను ష్ఠేయం[12] బైన కృత్యంబుపయిం దలఁపు నిలుపుము." అనవుడుఁ, జక్రాంగపుంగవుండు[13] రథాంగంబు[14] మొగంబుఁ జూచి, "సర్వజ్ఞా! మీఁదఁ జేయవలయుపని యేమి? చెప్పుము." అనిన నా జక్కవలమేలుబంతి[15] యిట్లనియె.

"మనవీరుల సారాసారంబులు[16] విమర్శించి, తత్తదర్హ సంభావ నంబుల గారవింపవలయు, దానంజేసి, యుత్సాహసాహసంబు లినుమడించి[17] ప్రాణములైన డాఁపక పోరుదురు. దానముకంటెను సన్మానంబె

---

1. దళవాయి = సేనాధిపతి; 2. తీవరించు = తొందరపెట్టు; 3. జయశ్రీ = గెలుపనెడు లక్ష్మి; 4. నింగిముట్టు = ఆనందముతో ఆకాశమును దాఁకు; 5. అవధారు = చిత్తగింపుఁడు; 6. పాఁపమేఁపరిదొర = నెమలిఱేఁడు; 7. ఎఱక = ఱెక్క; 8. చేరువ = సమూహము, సమీపము (నానా.); 9. వేలాగులు = వేయివిధములు; 10. మహావలంబము = పెద్ద ఊఁత; 11. అవరోధము = అడ్డు; 12. అవశ్యానుష్ఠేయము = తప్పక చేయఁదగినది; 13. చక్రాంగ - పుంగవుఁడు = అంచఱేఁడు; 14. రథాంగము = చక్రవాకము; 15. జక్కవల మేలుబంతి = చక్రవాక శ్రేష్ఠుఁడు; 16. సారాసారములు = బలాబలములు; 17. ఇనుమడించు = రెట్టింపగు

వేయిమడుంగు[1] లెక్కుఁడు; సన్మానంబె సర్వార్థసాధకము.

దక్షులగు భృత్యుల యథార్థ సంభావనములం దనుప[2]మికంటె రాజులకొప్పమి[3] వేఱులేదు. కాఁబట్టి నా పలుకు లసడ్డ[4]చేయక, యాదరింప వలయును.'' అనిన, హిరణ్యగర్భుండును మనమునఁ గడునలరి నిజసైనిక నికరముల రావించి, బహూకరించి, యుత్సాహం బెక్కించి, దురమునకుం బురికొల్పె. అంత దూరదృశ్యమానవైరివాహినీసందోహముం గాంచి, మించిపోయినట్లు పఱతెంచి, నీలవర్ణుండు రాజునకు నమస్కరించి, యిట్లనియె. 'దేవా! సేవకునిఁ గృపాకింకరం[5] బగు కటాక్షాంకురంబున వీక్షించి, యీచిన్నవిన్నపం బవధరింపవలయు. నామాట యసదు[6]గాఁ జూడవలదు. అల్లదె ప్రత్యర్థి యుద్ధార్థియై దుర్గద్వారమువలనికిం డాయుచున్నవాఁడు. అతండు మనదుర్గనిర్గమమార్గం[7] బవరోధించెనేని, మనమెల్లఁ గాళ్ళు తెగినపగిది విందుండి పేరులేక మ్రందం[8]వలసి వచ్చును. పనుపవచ్చును రాదనుశంక మాని, నన్ను నీయిచ్చవచ్చినపనికిం బుచ్చుము. స్వామియాదేశం బయ్యెనేనిఁ, బోరికిం దారసించిన యీ శారికావారమ్ములను[9] గీరమ్ములను నే నొకచీరికిం గొనను.[10] ఇవి గరువమున నాడు కండకావరపుమాట లని తలంపకుము. నేఁ బ్రధనము[11] నకుం జొచ్చినఁ, జచ్చియు విచ్చియు నరాతు[12] లెట్లు యథాయథ[13] లయ్యెదరో కనుంగొనుము. స్వామి నాకింతవట్టు మన్నన యీవలయు, దేవర ఋణంబెల్ల వడ్డితోడఁగూడ నేఁడ యీ మ్రుక్కడులచేఁ గ్రక్కించి, స్వామి ఋణమువలన విముక్తుండ నయ్యెద. అంగీకార సూచకముగా నొకమాఱు భ్రూవల్లరి[14] నించుక యల్లార్పుము[15]'. అనిన, మొగంబున నవ్వుగానినవ్వు నవ్వి, కోకలోకాధ్యక్షుండు[16]

---

1. మడుఁగు = రెట్టు; 2. తనుపు = తృప్తిపఱచు; 3. ఒప్పమి = ఆపద; 4. అసడ్డ (వి.) = అశ్రద్ధ (ప్ర.); 5. కృపాకింకరము = దయకు వశమైనది; 6. అసదు = తక్కువ; 7. దుర్గ - నిర్గమ - మార్గము = దుర్గమునుండి వెలికివచ్చు దారి; 8. మ్రందు = చచ్చు; 9. శారికా - వారము = గోరువంకల సమూహము; 10. చీరికిఁగొను = లక్ష్యపెట్టు; 11. ప్రధనము = యుద్ధము; 12. అరాతి = శత్రువు; 13. యథాయథలు = చెల్లాచెదరు; 14. భ్రూవల్లరి = బొమతీవ; 15. అల్లార్చు = ఆడించు; 16. కోక - లోక + అధ్యక్షుఁడు = చక్రవాక సమూహమునకు రాజు.

రూక్షేక్షణంబుల[1] నధిక్షేపించుచుఁ, గాకి కిట్లనియె. 'ఔ నౌను; నీవన్నిటికిం జాలుదువు. ఆయాస ముడిగి, యింతటితో మిన్నకుండుము. కృత్యాకృత్య పరిజ్ఞానంబు లేక, యూరక త్రుళ్ళుటయేకాని, బుద్ధియావంతయు నెఱుంగవు. నీ వెప్పుడుం బోరు పోరనియే పలువరించుచుందువు. నేఁటి కది తలకూడినది. నీవే నిష్కారణముగా నీవైరంబుఁ బెనిచితివి. దీన మాకందఱకుంగూడఁ బ్రళయంబు సంభవించుంగాని, నీ యొక్కనితోడం బోవదు. అయోధ[2] లగు మానుసు[3] లిండ్లకడ నెన్నియైన బీరంబులు నఱకుదురుగాని, మారుతుండు దారసంబై యీరసంబునం[4] బోరునప్పుడు వారి నక్కిళ్ళువడును[5]. నా హిత వచనంబు లవజ్ఞతగా[6] నెక్కించుకోక, నీ పోకడమాలినతనంబుఁ[7] గట్టిపెట్టి, సాధుసమ్మతుండవగుము." అని, రాజువంక మరలి "స్వామీ! యీ రజ్జులాని[8] వృథాజల్పంబులు[9] నిక్కంబులుగా వగచి, మానప్రాణంబులఁ గోలుపోవుట మేలుగాదు. వీఁడు గడుఁ గ్రొవ్వి, నోరికివచ్చినట్లెల్ల వెడయఱపు లఱచు చున్నవాఁడు గాని, లేశంబును గార్యంబుఁ గానఁడు. కర మారసిచూడ, వీఁడు మిత్రవ్యపదేశంబునం[10] బరఁగు శత్రుండు. నీకుఁ గల వివేక మంతయు నిపు డేయూరికిఁ బోయె? మాయికుల కెందును మాయపుభంగులే మందు గాని, ఋజుమార్గంబులు కొఱగావు. నీ వార్యవృత్తంబునకుం జొచ్చి, యీతని శుష్కోపచారంబులు కడుపుతీపులుగా నభివర్ణించెదవు. ఈ దురాత్ముని దౌర్మంత్ర్యంబు[11] చెవినిడఁగూడ దను తలం పించుకయు నీ బుద్ధికిం బుట్టదయ్యెను. మనయోధలు[12] దుర్గంబు నిర్గమింతురేని, దుర్గాశ్రయణం బెల్ల నిష్ప్రయోజనంబై చెల్లును. అందులకై మనపడ్డ ప్రయాసపాటును నిష్ఫలం

---

1. రూక్ష + ఈక్షణము = కఱకైన చూపు; 2. అయోధ = యోధుఁడు గానివాఁడు; 3. మానుసులు = మనుష్యులు; 4. ఈరసము (వి.) = ఈర్ష్య (ప్ర.) = కోపము; 5. నక్కిళ్ళు పడు = ప్రక్క పండ్లకీళ్ళు పడిపోవు; 6. అవజ్ఞత = తెలివిలేమి; 7. పోకడ మాలిన తనము = దుర్మార్గత; 8. రజ్జులాఁడు = వ్యర్థభాషణుఁడు; 9. వృథా + జల్పము = వ్యర్థపు భాషణము; 10. మిత్ర - వ్యపదేశము = స్నేహితుని నెపము; 11. దౌర్మంత్ర్యము = దురాలోచన; 12. యోధ - యోధుఁడు (రూపాం.).

బగును. నీళ్ళలోనుండి యేనుంగుఁ బీనుంగు గావింపంజాలు నక్రంబు[1] బయటి భషకమ్న[2] బుచే భంగపడుట స్థానభ్రంశదౌర్బల్యంబునంగాదే?[3] దుర్గంబు వెలువడునేనిం జివ్వలో[4] మనగువ్వలు గవ్వకుం గొఱగావు:[5] అనుకూలశత్రుం డగు నీలవర్ణుని చెడుఁగఱపులు[6] నీవీనుల కమృతకల్పంబులయి, మతికి హితంబులుగాఁ దోఁచుచున్నవి. మన వారికిం గాలంబు చేరు వాటం గాఁబోలు, నీయెద కీ బూటకపు మాటలు వాటంబులుగా[7] నాటుకొనియెడిని" అని మఱియు నేమో యనఁబోవు మంత్రిమాటల కడ్డంబు వచ్చి, హిరణ్యగర్భుండు తన నమ్మకపుటురిం[8] దగులుట భావించి, వర్ధిష్యమాణరోషుం[9] డయి కరటేంద్రుం డిట్లనియె. "ఓ మహారాజా! నా మాటలు బోటుసేయక, దేవర దివ్యచిత్తంబున నవధరింపవలయు. ఈ సర్వజ్ఞుండు మేఁకవన్నెపులి. మన కవమానంబు వాటిల్లినను, దనప్రాణముల దాఁచికొనవేఁడి, యిప్పు డిన్నిపోకలం బోవుచున్నవాఁడు. ఈతఁడు మనకడ, నుత్సంగంబున[10] నాశీవిషం[11] బున్నట్టున్నవాఁడు. స్వకార్యైకధురంధరు[12] లగు నేతాదృశ[13] మిత్రుల దూరంబున విసర్జించుట[14] కర్జంబు. ఈతండు పోరికి రాకుండుటయె యుఱవు[15]. ఈతం డొక్కఁడు లేకున్నను, మన కొక్కకొఱఁత రాఁబోదు. సన్నెకలు దాఁచినంతనె పెండ్లి చిక్కునా[16]? దేవరముందఱఁ బంతంబులు పలుకరాదు గాని, యెవ్వరు నేల? నీకుం గెలుపొసంగ నే నొక్కరుండఁ జాలుదును. నా యుత్కర్షంబు చూడఁజాలక, మీఁదుమిక్కిలి నాపై నొక్క యోపమి[17] నారోపించి దూఱనాడు[18]చున్నవాఁడు. ఓహో వీనుల కెంత రోఁత

---

1. నక్రము = మొసలి; 2. భషకము = కుక్క; 3. స్థాన - భ్రంశ - దౌర్బల్యము = చోటినుండి జాఱుట వలని బలహీనత; 4. చివ్వ = కలహము; 5. గవ్వకుంగొఱగావు = గవ్వ విలువ కూడఁ జేయవు; 6. చెడుఁగఱపులు = దుర్బోధలు; 7. వాటము = చక్కన; 8. నమ్మకపుటురి = నమ్మకము + ఉరి = నమ్మకమనెడి ఉరి, 9. వర్ధిష్యమాణరోషుఁడు = వృద్ధిపొందుచున్న కోపము గలవాఁడు; 10. ఉత్సంగము = ఒడి; 11. ఆశీవిషము = పాము; 12. స్వ - కార్య + ఏక - ధురంధరులు = తమపనిని మాత్రమే వహించువారు; 13. ఏతాదృశ = ఇటువంటి, 14. విసర్జించు = విడుచు; 15. ఉఱవు = మంచిది; 16. చిక్కునా = ఆఁగునా; 17. ఓపమి = చాలమి; 18. దూఱనాడు = నిందించు.

వినవలసివచ్చెను! నిక్కంబు విచారింప, నివి యన్నియు న న్నాప్తుఁ డని మన్నించు దేవర నంట[1] గాక, న న్ననుటయె? ఈతని బోఁటిబంట్ల కెట్లయిన నగుంగాని, శరీరంబునఁ బిఱికికండ లేనిబిరుదుమగలకుఁ బ్రాణంబు మానంబుకంటెను బెద్ద కాదు; మానమే ప్రాణాధికంబు. కావున, లోకమున మానధనులు మానహీనమయిన బ్రదుకు నొల్లరు. ప్రాణంబులనైన విడువనోపుదుంగాని, మానంబు వీటఁబుచ్చి[2] లోకంబున భీరు[3] వను సడి[4] వడంజాలను. కుండ మూయ మూఁకుడు గలదుగాని, యెందును నోరుమూయ మూఁకుడు లేదు. తఱివచ్చినప్పుడు ప్రాణంబులు దాఁచుకొని, యాబ్రహ్మకల్పాంతంబు నీఘనునే మననిమ్ము." అని, మఱియు ననాదర సూచకం బగు చిఱునవ్వుతోడ "అహహా! యీతని మాటలు మెచ్చవచ్చును. మన గువ్వలఁట! దుర్గంబు వెలువడిన, గవ్వకుం గొఱగావఁట! ఇట్లు చెప్పెడువారు చెప్పిననుఁ జెవియొడ్డి వినువా రయిన నవ్వకపోరు. అప్పు డట్లనంతము లగు పగఱబలంబుల బలిమిమెయిం దొడరి, నేలఁగలిపిన మనబలుసేన లిప్పటి పలపలని మూఁకల[5] కోపవంటకంటెఁ బరిహాసాస్పదం బగునర్థంబు లేదు. పనికిమాలిన యీ శంకలఁ జాలించి, సేనలతోడ వెడలి, ఈవఱకే యఱ[6] చచ్చి యున్నయాకొంచెపు మూఁకలం బొదివి, సదమదంబు[7] సేయుము. నీవు నిమిత్తమాత్రుండవు; అంతియ కాని, దైవోపహతం బయి యీ పరి[8] రూపఱియే[9] యున్నది." అని మఱియుఁ బెక్కులు శూరాలాపంబులు పలికి, యీ మరాళరాజునకు మత్సరం బెక్కించెను. ఇట్లు నీలవర్ణునితోడ విధి[10]యును దన్నుఁ బ్రేరేఁప, "ఇది నీళ్ళలోని ముల్లు[11]; ఇది యదియని కార్యనిశ్చయంబు సేయరాదు." అని యొక్కింతసేపు త్రొక్కటపడు చుండియు, నీలవర్ణుని మాటకు మాఱాడలేక, యీ కలహంసవతంసుం డూరకుండెను. అంత నీలవర్ణుండును నెట్టకేల కొడయని యర్థాంగీకారంబె

1. అంట = అనుట; 2. వీటఁబుచ్చు = విడుచు; 3. భీరువు = పిఱికివాఁడు; 4. సడి = నింద; 5. పలపలని మూఁకలు = పలుచని సేనలు; 6. అఱ = సగము; 7. సదమదము + చేయు = నలఁగునట్లు చేయు; 8. పరి = సేన; 9. రూపఱు (రూపు+అఱు) = నశించు; 10. విధి = దైవము; 11. నీళ్ళలోని ముల్లు = యథార్థస్వరూపము తెలియనిది.

వడసి, దడంబులఁ దోడుకొని, దుర్గంబు వెడలి యరిగి, పరబలంబులం దలపడియె.

అందుల కచ్చటివా రందఱు గుంపులుగూడి, రహస్యముగఁ దమలో గుజగుజలు వోవుచుండ, మంత్రి సేనానితోడ నిట్లనియె. "నీలవర్ణునితోడి నేస్తంబు[1] మానించుటకై, నేఁ బొరలంగలయంతయుఁ బొరలితి. ఇఁకఁ బతితో నతివివాదంబు కూడదు; 'అతి సర్వత్ర గర్హిత'[2] మ్మని పెద్దలు చెప్పుదురు.

ఎంత చెప్పినఁ దనమార్గంబు మానక, మన ఱేఁడు తాను బట్టిన పిట్టకు నాలుగు కాళ్ళే యనుచున్నవాఁడు. మన కాడిక[3] రాకుండఁ, జేఁతకయినంత వఱకు మనము నిలిపి చూచితిమి. మీఁద నీశ్వరసంఘటనం బెటులుండె నటుల కాకమానదు. మనకుఁ గాలంబును గర్మంబును బ్రతికూలంబు లయియుండ, నాతనికి మంచి బుద్ధి యెట్టుపుట్టును? మనరాజునకుఁ గ్రొత్తవారే పెద్ద యిష్టులు; మనమే లాఁతివారము." అనుచుండి, యనతిదూరవర్తి[4] యగుచక్రాంగచక్రవర్తిం గాంచి, యొండొరుల నవలోక సంజ్ఞల[5] వారించుకొనుచు, రణసంభ్రమంబునం బరిభ్రమించు చుండిరి. అంత మరాళకులాధ్యక్షుండు, * నిజవలక్షవక్షవిక్షేవణజాతవాతవేగ సముద్ధూతపాంసుజాతంబు[6] భూనభోంతరాళంబుం[7] దిరోహించి[8] యంతరిక్షం బలక్షితంబుగాఁ జేయ దురాగ్రహగ్రహావేశంబున నొడ లెఱుంగక, సమగ్రసన్నాహంబున, నుత్సాహం బెసంగఁ జనుదెంచి, యింగలమ్ము[9] లొలుకునపాంగమ్ముల[10] వైరివీరుల నీక్షించుచు, మొన వెనుకం బొలిచి నిలిచె. అప్పుడు హిరణ్యగర్భవాహినీసందోహంబు లన్యోన్యాహ్వానవాదంబులును

1. నేస్తము = స్నేహము; 2. అతి - సర్వత్ర - గర్హితమ్ = మితిమీఱుట ఎల్లెడల నిందితము; 3. ఆడిక = నింద; 4. అనతిదూరవర్తి = అతి దూరమునలేని; 5. అవలోక - సంజ్ఞ = చూపు సన్న; 6. * నిజ - వలక్ష - పక్ష - విక్షేపణ - జాత - వాత - వేగ - సముద్ధూత - పాంసు - జాతంబు = తమవైన తెల్లని ఱెక్కల కదలికచేఁ బుట్టిన గాలియొక్క వడిచే వెగురఁగొట్టఁబడిన దుమ్ము సమూహము; 7. భూనభోంతరాళము = భూమ్యాకాశముల నడిమి ప్రదేశము; 8. తిరోహించి = కప్పి; 9. ఇంగలము = అగ్ని; 10. అపాంగము = క్రేఁగన్ను.

సింహనాదంబులును రోదసీకుహరంబులు[1] నిండ వైరివీరులం దలపడి, హోరాహోరిం బోరిన, సంగ్రామమం బుద్దామంబుగాఁ[2] జెల్లె. అందు దీర్ఘముఖాదులు తొంటిపగకై ప్రాణంబులకుఁ దెగించి, రోషావేశవివశు లయి రిపుసేనఁ బాయవడం జొచ్చి, దారుణంబు లగుత్రోటీవిదారణంబులను, నత్యంతకఠినపాతంబు లగుచరణనఖాఘాతంబులను, నభియాతుల[3] నొప్పించి, యద్భుతరసావహంబుగా మహాహవం[4] బొనరించినఁ గించి దవశిష్టంబుగా నరాతిచమూసమూహంబు[5] నష్టంబునొందె. అప్పు డప్పతంగ[6] కులదారుణమరణంబుఁ (దానును బతంగుండె[7] కానఁ) జూడ నోపక యాచోటు వాసి చనియెనో యనఁ బ్రభాకరుండు ప్రభ యెడలి పడమటి కడలి[8]కడకు నడచి, మఱుంగుపడియె. ఆ మునిమాపున[9] నిరువాఁగుల పడవాళ్లును[10] నాఁటికి బవరంబు[11] చాలించి, తమతమ బలంబులం దివిచి కొని[12] వీళ్ళు[13] సేరిరి.

అ ట్లరిగి, యా రాత్రి సుఖనిద్ర చేసి, మఱునాఁడు రేపకడ[14] నుభయ వాహినీపతులును నహర్ముఖోచితకృత్యంబులు[15] నిర్వర్తించిన పిమ్మటఁ దమ తమ బలంబులఁ గలని కాయితంబు చేసి, పురికొల్పిన, నవి యనల్ప క్రోధంబున నభ్యర్ణపూర్ణ చంద్రోదయఘూర్ణమానార్ణవంబుల[16]భంగిఁ బొంగి, యొండొంటిం దలకడచితాఁకి, ఘోరంబుగాఁ బోరుచుండె. ఆ భీమసంగ్రామంబునఁ బ్రొద్దు

1. రోదసీ - కుహరము = భూమ్యాకాశముల నడిమిదేశమనెడి గుహ; 2. ఉద్దామము = తీవ్రము; 3. అభియాతి = శత్రువు; 4. మహాహవము = గొప్ప యుద్ధము; 5. అరాతి - చమూ - సమూహము = శత్రు సేనా సమూహము; 6. పతంగము = పక్షి; 7. పతంగుఁడు = సూర్యుడు; 8. కడలి = సముద్రము; 9. మునిమాపు = సాయంసంధ్య; 10. ఇరువాఁగుల - పడవాళ్ళు = రెండు పక్షముల సేనాపతులు; 11. బవరము = యుద్ధము; 12. తివిచికొను = తీసికొను; 13. వీళ్ళు = సేన విడియుచోట్లు; 14. రేపకడన్ = ప్రొద్దున; 15. అహర్ముఖోచితకృత్యములు = ఉదయకాలమునఁ దగిన పనులు, - కాలకృత్యములు; 16. అభ్యర్ణ - పూర్ణ - చంద్ర + ఉదయ - ఘూర్ణమాన + అర్ణవము = దాపుననున్న నిండుచంద్రుని ఉదయముచేఁ దిరుగుడుపడుచున్న సముద్రము.

పొడవకమున్ను వచ్చియున్న మేఘవర్ణుండు, * హిరణ్యగర్భరాజ్యగర్వాంధకార వినాశసూచకోల్కానా[1] నొక్కజ్వలత్కాష్ఠంబు[2] ముక్కునం గఱచికొని కపటపలాయనంబు నటించుచుఁ, దనవారు వేవురు[3] వెంటనంటిరా దుర్గం బనర్గళో[4]రయంబునం[5] జొచ్చి, చిచ్చింటింటం దరికొల్పి, చట్టుపల[6] విసరుడుం బ్రజ్వలితశిఖుం[7] డగుసమీరణసఖుండు[8], కరాళజ్వాలికాజాలంబుల[9] దశదిశలం బఱపి, దుర్గంబెల్ల నాక్రమించిన, బహువిహంగంబులు విహాయసంబున[10] కెగసి, పక్షంబులు కమలిన[11] సుడిపడుచు ముడింగిపడి, హుతాశనున[12] కశనంబు[13] లయ్యె. కల్పాంతకల్పం[14] బగుననల[15] విహారంబునకుఁ దలంకి[16], హతశేషములయిన పక్షు లంతరిక్షంబున కెగయ గమకింపఁ, బోనీక కాకులెల్లం బొదివి త్రోటీఘాతమ్ములఁ[17] జరణ ప్రహరణమ్ములఁ[18] తద్విహంగఝాటమ్ముల[19] నిరాఘాటమ్ము[20] గఁ గెడపి[21], పుడమికిం బలిచేసి 'దుర్గంబు వట్టువడెఁబట్టువడె'నని యార్చిపేర్చిన కోలాహలము రోదోంతరాళము నిండిన, బెండువడి విమతకృతం[22] బగుపావకోపప్లవంబునకు[23] వగచి; లోని నగౌకములు[24] కాందిశీకము[25] లయి,

---

1. హిరణ్యగర్భ - రాజ్య - గర్వ + అంధకార - వినాశ - సూచక + ఉల్క-నాన్ = హిరణ్యగర్భునిరాజ్యముయొక్క గర్వమనెడి చీఁకటియొక్క నాశనమును సూచించు మంటలేని కట్టెనిప్పు అనఁగా - ఉల్కాపాత మరిష్టసూచకము; 2. జ్వలత్ + కాష్ఠము = మండుచున్న కట్టె; 3. వేవురు = వేయిమంది; 4. అనర్గళ = అడ్డులేని; 5. రయము = వేగము; 6. చట్టుప = ఱెక్క; 7. ప్రజ్వలితశిఖుఁడు = మండింపఁబడెడి జ్వాలలు గలవాఁడు; 8. సమీరణ - సఖుండు = వాయు మిత్రుఁడు - అగ్ని; 9. కరాళ - జ్వాలికా - జాలము = భయంకరములైన జ్వాలల సమూహము; 10. విహాయసము = ఆకాశము; 11. కమలు = కాలు; 12. హుతాశనుఁడు = అగ్ని; 13. అశనము = ఆహారము; 14. కల్పాంతకల్పము = ప్రళయముతో నించుక తక్కువగా సమానము; 15. అనల = అగ్ని; 16. తలఁకు = చలించు; 17. త్రోటీ - ఘాతము = ముక్కు దెబ్బ; 18. చరణ - ప్రహరణములు = కాళ్ళ దెబ్బలు; 19. ఝాటము = సమూహము; 20. నిరాఘాటము = అడ్డులేకుండు; 21. కెడపు = చంపు; 22. విమతకృతము = శత్రువుచేఁ జేయఁబడినది; 23. పావక + ఉపప్లవము = అగ్ని ఉపద్రవము; 24. నగౌకము = (నగ+ఓకము) = కొండ స్థానముగాఁ గలది; 25. కాందిశీకము = వెఱపుచేఁ బాఱినది.

యాహవమున కోహటించి[1] పాఱి, కంఠగతజీవనము లగుచు జలంబులంబడి తమ ప్రాణముల దక్కించుకొనియె. తక్కిన కొన్ని స్వభావమునకు భయము తోడ్పడ గుండియలు జల్లుమని, కళ్ళువడి, యేగఁ గాళ్ళురాక, పగతుర చరణనఖాఘాతనిపాతితములై[2], ప్రవన్నిర్ఝురము[3] లగు గోత్రములుం[4] బోలె, నెత్తురు వఱదలు పాఱుగాత్రములు మెఱయ, నిశ్చేతనము లయ్యెను. అట్లు క్షణమాత్రమున దుర్గం బెల్ల మల్లె[5]పట్టిన పాలము చందం బగుటవిని, బయటివారును వెఱవేఁకిఁ[6]గొని, కాలుచేయాడక, పిడు గడిచిన వడువునఁ[7] గూలఁబడి బిమ్మిటి గొని[8]యుండ, నేమఱుపాటునం జుట్టుముట్టి, పరబలము లసంఖ్యములు[9] నిశితముఖము లగునఖములం గ్రుచ్చి, నిర్ఘాతపాతము లంబోని తుండాఘాతముల నొప్పించిన, నిలువున విగతాసువులై[10] రక్తసిక్తాం[11]గంబులతో రణాంగణం బలంకరించిరి. కొందఱు రణభీరువులు[12] రాజుం బగవారినడుమ దిగవిడిచి, నిలిచినచోట నిలువక, చూచినవంకం జూడక, కెళవుల[13] కుఱికి, యొకఁడు పోయిన త్రోవ నొకఁడు వోవక, చెట్టొకఁడుగా నొదిఁగిరి. మఱికొందఱు కాలుతక్కువవారు పాఱఁజాలక వెనుకఁజిక్కి, విరోధియోధచరణప్రహారమూర్ఛాపరవశులై, త్రోటీభేదనముల సంధులు ప్రిదుల[14] మురిసి[15] వ్రాలిరి.

ఇట్లు నిహన్యమానము[16] లగుసైన్యములు నిలువఁజాలక, దైన్యమునఁ జెల్లాచెదరై పఱచిన, నా యాపత్కాలమున రాజహంసము స్వభావమందగతి యగుట నబ్బారి గడవనేరక, సారసద్వితీయంబై[17] యుండి, పారలిపారలి

1. ఓహటించు = జంకు; 2. నిపాతితము = పడఁగొట్టఁబడినది; 3. ప్రవన్నిర్ఝురము ≠ ప్రవత్ + నిర్ఝురము = ప్రవహించుచున్న ఏఱు; 4. గోత్రము = కొండ; 5. మల్లె = పురుగు; 6. వెఱ - వేఁకి = భయమనెడి జ్వరము; 7. వడువు = విధము; 8. బిమ్మిటి + కొను = మనోవ్యథనొందు; 9. అసంఖ్యములు = లెక్కలేనివి; 10. విగత + అసువులు = పోయిన ప్రాణములు గలవి; 11. సిక్త = తడిసిన; 12. రణ - భీరువులు = యుద్ధమునఁ బిఱికివారు; 13. కెళవు = దూరము; 14. ప్రిదులు = సడలు; 15. మురియు = విఱుగు; 16. నిహన్యమానము = చంపఁబడుచున్నది; 17. సారస - ద్వితీయము = బెగ్గురుపక్షి రెండవదిగాఁ గలది, బెగ్గురుతోఁ గూడినది.

వచ్చు కన్నీటివఱదం దనధైర్యసేతువున[1] నుడువుచు[2], సేనానిదిక్కు మొగం బయి యిట్లనియె. 'వీరవరా! చూచితివిగదా, నా నిమిత్తమున మనవారల కెందఱ కిట్లు ప్రాణాంతకారియైన యాపద సంప్రాప్తమయ్యెనో? వా రందఱి విక్రమము లిఁక జనము లద్భుతములుగాఁ జెప్పుకొందురు. ఈ గడియకు నీవును నేనును నూపిరితో నున్నారము. ఉత్తరరక్షణమున నెట్లయ్యెదమో తెలియదు. నాకై యంతలేసివార లట్లు కాఁగా, నింక నీ పాడుశరీరమా నన్ను రక్షించునది? ఈ నీలవర్ణుని నమ్ముటఁగదా, కార్యమింత మోస మయ్యెను. ఆ మాయమాటలు చూచి, యీతఁడేమో విశ్వాసపాత్రుండని భ్రాంతిపడి, తప్పుచేసి యీగతిఁ దెచ్చుకొంటిని. కడ కీ దురాత్ముండు నమ్మించి భంగపఱిచెను. అప్పు డీతనిఁ జేరఁదీయవలదని మీ రెంద ఱెంద ఱెన్నెన్ని విధములనో నూఱిపోసితిరి. ఏమి కాలకర్మదోషమో యప్పు డా వచనము లేమియు నా చెవికిం జవి[3] గావయ్యెను. అప్పటి నా డెందంబు చందంబు తలంప, నిపుడు నాకే విస్మయ మగుచున్నది. విధి మూఁడినవానికి హితులవాక్యము లెట్లు రుచించును? మీరెల్లరు వలదువలదని వేవిధములఁ జెప్పినఁ జెవిని బెట్టక యా కట్టిఁడికాకిని గోరితెచ్చుకొన్న నా పాపఫలం బనుభవింపక తీఱునె? ఇంతకును దైవసంకల్పం బిట్లుండఁ, బౌరుషం బేమి సేయ నోపును? హా! దైవకృత మేమనవచ్చును! నాఁడట్లు వేవు రెప్పుడు నోలసి కొలువ వెలయునాకుఁ, బిలిచిన నోయనువాఁడును లేకుండఁ జేసె. వా రందఱు ముందుగాఁ ద్రోవ తీసిరి; క్షణ మెక్కువ తక్కువగా మనము నాదారినే వారిఁ జేర నున్నారము. మన సర్వజ్ఞుం డాడినమాట లన్నియు నేఁడు తథ్యంబు[4] లయినవి. అతండు తలంప నీలోకములోనివాఁడే? ఇఁక నాతని విషయమై యెట్టి పాపపుమాట చెవిని బడునో? నీవు నాకుఁ గూర్తువేని, యీలోనన చని యొక్క యుపకారము చేయుము. దైవోపహతుండ[5] నగునన్ను రక్షింపఁ బూనునీయెత్తికో[6] లెట్లును సఫలము గానేరదు. నేఁటితో నా యాస విడిచిపెట్టి, నా కడంక కడ్డకాల్వేయక, మదీప్సితంబుఁ[7] దుదముట్టించి, కృతకృత్యుండ

1. ధైర్యసేతువు = ధైర్యమనెడి వంతెన; 2. ఉడుపు = మాన్పు; 3. చవి = రుచి; 4. తథ్యము = నిజము; 5. దైవోపహతుఁడు = దైవముచేఁ గొట్టఁబడినవాఁడు; 6. ఎత్తికోలు = ప్రయత్నము; 7. మత్ + ఈప్సితము = నా కోరిక.

వగుము. నీవు వేగమ వీడు చొచ్చి, సర్వజ్ఞానుమతంబున మత్పుత్త్రుఁ జూడాకర్ణు విహంగరాజ్యంబున కభిషిక్తుం గావించి, యా శుభవార్త దెచ్చి నా చెవిని వేయుము.

అతఁడైనఁ బ్రాణములతోడ నుండి రెక్కొనెనా[1] మనయాపగ నెన్నఁటికైన నీఁగఁగలవాఁడు. దైవంబు మనలనిద్దఱఁ దిన్నఁగాఁ జూచినది, బునర్దర్శనం బయ్యెడును. లేదా, యింతే మనయదృష్టమనుకొని, యిదే కడసారి చూ పనుకొమ్ము; పొమ్ము'' అను ఱేనివచనములు కర్ణశూలాయమానంబులయి[2] హృదయంబుఁ గలంచినఁ, గొంతవడి దిగ్భ్రాంతి పడి, యతి ప్రయత్నంబునం దెలిసి, గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు, నెలుంగు గద్గదికం దగులువడ నిట్లనియె. "దేవా! యిట్టి దుస్సహవచనంబులు దేవరనోర వెడలఁదగవు. 'చూడాకర్ణుని విహగరాజ్యంబున కభిషిక్తుంజేయుమని యెంతమాటానతిచ్చితిరి! ఆచంద్రతారార్కంబుగ[3] నీ సర్వంసహాచక్రంబు[4] సర్వంబును దేవరవారే యేలవలెను. నేను సేనానినై యుండ, దేవర నెవ్వరైన, జుట్టనవ్రేలఁ జూపనోపుదురె? వేయేల? మదీయ మాంసాసృగ్విలిప్తమార్గంబునం[5] గాని, దాయ కేలినవారి డాయఁదలకూడదు. క్షమావంతుండును, దాతయు, గుణగ్రాహియు నగుదొర దొరకుట, మహాభాగ్యంబునంగాని గలుగదు. శుచియు, దక్షుండును, ననురక్తుండును నగుభృత్యుఁ డొదవుటయు దుర్లభంబె. అట్లు భాగ్యవశంబున లభ్యం బైన ప్రభురత్నంబు నెట్టి మందభాగ్యుం డైనఁ బెడవాయఁ[6] జూచునె? నాకు స్వామితోడిద లోకంబు; దేవరచరణంబు లెడవాసి క్షణంబును మననేర. ఎంతటివాఁడును మృత్యువుఁ గనుఁబ్రామలేఁడు. ఎన్నఁటికైన నీ దేహంబు నేలపాలు గావలసినదే. అస్థిరం బగుశరీరంబునకై సుస్థిరం బగుకీర్తిం గోలుపోనేల? భృత్యుఁడు స్వామికార్య హతప్రాణుఁ[7] డయ్యేనేని, బుణ్యలోకంబులు

1. రెక్కొను = వర్ధిల్లు; 2. కర్ణశూలాయమానము = చెవికి శూలమువలె నగుచున్నది; 3. ఆచంద్రతారార్కము = చంద్రుఁడు, నక్షత్రములు, సూర్యుఁడు ఉండువఱకు; 4. సర్వంసహా - చక్రము = భూవలయము; 5. మాంస + అసృజ్ + విలిప్తమార్గము = మాంసము చేత, రక్తముచేత పూయఁబడిన దారి; 6. పెడవాయు = విడుచు; 7. స్వామి - కార్య - హత - ప్రాణుఁడు = ప్రభుకార్యమునందుఁ బోయిన ప్రాణములు గలవాఁడు.

చూఱకొనునని యార్యు లందురు. ఎప్పుడైన విడువవలయునీశరీరంబు, నిప్పుడు విడుచుట యేమి భారము? స్వామ్యర్థపరిత్యక్తజీవుఁడనై[1] సుకృతి నగుదును. సంపదలు గజకర్ణాంతవిలోలంబులు;[2] తనువులో[3], శరన్మేఘ తటిత్తరళంబులు;[4] ఇఁకఁ దారుణ్య మందునూ[5], వారితరంగచంచలంబు;[6] నిన్న చూచినవాఁడు నేఁడు గానరాఁడు. ఉన్నను జన్నను[7], బేరుమాత్రము పోక నిలుచును. దేవరవారు సర్వధా[8] రక్షణీయులు, సప్తాంగములలోఁ[9] బ్రధానాంగము రాజు; ప్రకృతివర్గం బెంత బలవంతం బయ్యు, రాజవిహీనంబై[10] జీవింపనేరదు. ధన్వంతరి[11] వైద్యుఁడైన, నాయువు మూఁడినవాని నేమి సేయనోవును? అంభోజంబుంబోలె[12], నినుని[13] యభ్యుదయసంక్షయంబుల[14] లోకం బంతయు వికాససంకోచంబులం[15] బొరయుచుండును." అనునంతలోఁ జిత్రవర్ణుని సేనాపతి తామ్రచూడుఁడు తనపుంజుపౌఁజు[16]తో రాజహంసను హింసించు తలపునం దారసించె.

అప్పుడు కుక్కుటమరాళంబులకు[17] దారుణప్రవిదారణం[18] బొదవి, పదలు మదంబులం బొదివి పరస్పరజయకాంక్షలం బోరుచుఁ బిఱిందికిం జరగి మరల నరుదెంచి యెగిరి చరణంబుల నొండొరుల నదరంటం

---

1. స్వామి + అర్థ - పరిత్యక్త - జీవుఁడు = యజమానునికొఱకు విడువఁబడిన జీవము గలవాఁడు; 2. గజ - కర్ణ - అంత - విలోలము = ఏనుఁగు చెవుల తుదివలెఁ జంచలము; 3. తనువు = శరీరము; 4. శరద్ + మేఘ - తటిత్ = తరళము = శరత్కాలమునందలి మేఘమునందలి మెఱుపువలెఁ జంచలము; 5. తారుణ్యము = యౌవనము; 6. వారి - తరంగ - చంచలము = నీటి యలలవలెఁ గదలునవి, 7. చన్నను = చనినను = పోయినను; 8. సర్వధా = అన్ని విధముల; 9. సప్తాంగములు = ఏడంగములు - స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము; 10. రాజ విహీనము = రాజుచేత విహీనము; 11. ధన్వంతరి = దేవ వైద్యుఁడు; 12. అంభోజము = పద్మము; 13. ఇనుని = సూర్యుని, 14. అభ్యుదయ - సంక్షయములు = అభివృద్ధి నాశనములు; 15. వికాస - సంకోచములు = వికాసమును, సంకోచమును (ముడుచుకొనుట); 16. పౌఁజు = సేన; 17. కుక్కుట - మరాళములు = కోడియు, హంసయు; 18. దారుణ - ప్రవిదారణము = భయంకర యుద్ధము.

జఱచుచు, నఱచుచుం బఱితెంచి చంచువు చంచువునం బెనఁచి యితరేత రాకర్షణంబుల మించి మేనులు చించుచు, వాఁడిగో ళ్ళొడళ్ళుగాఁడఁ దాఁచుచు, నెత్తురులం జొత్తిల్లి[1], ఱెక్కలుగల మల[2]లమాడ్కి నింగి కెగసి పక్షంబులు ప్రక్షతంబులు[3] చేసిన బోరనం గాఱుధారాళరుధిరాసారపూరంబు[4] ధారాధరనిపతితపయోబిందుసందోహంబు[5] ననుకరింప, నొండొరువులకు[6] వట్రపడక[7] పెద్దతడవు పెనంగి, ధరణీతలంబునకు లంఘించి కొంతసే పీడంబోక[8] పోరాడి యంతకంతకుఁ బరిశ్రాంతసత్త్వుండగుచు వచ్చునంచలతేనిం గని సత్త్వాధికుం డగుకృకవాకువల్లభుండు[9] మేలు చేయియయి, మెఱుఁగు మెరసిన తెఱఁగున హిరణ్యగర్భుమీఁది కుటికి యెఱకల శిరమ్ము మోఁదిన, నమ్మోఁదుకంటెను ముంగలివారినగవు[10] శిఖి[11] వోలె మనం బెరియింప, సటాసముత్పాటనకుపితం[12] బగుకంఠీరవంబు[13] నేవునఁ గోపంబు ముప్పిరిగొనఁ దటి[14] వారిఁ గొందఱిం బొరిగొని[15], యంతలోఁ జరణాయుధంబు[16] క్రమ్మఱఁ దన్నిన మ్రొగ్గతిలి, దిగ్గన సంబళించుకొని[17] లేచి, భ్రుకుటీప్రకటీకృతరోషుండయి[18], కడంకలు సుడివడఁ గడిమిపెంపు వోనాడి, దండతాడితదర్వీకరంబునోజ[19] రోఁజుచు, శ్రమంబునం డీలుపడి[20] యుండ, వీక్షించి సారసాధ్యక్షుండు వీరవరుండు రోషాసూయావిల[21]

---

1. జొత్తిల్లు = ఎఱ్ఱిపాఱు; 2. మల = కొండ; 3. ప్రక్షతము = మిక్కిలి గాయపడినది; 4. రుధిర + ఆసార - పూరము = రక్తపుజడి ప్రవాహము; 5. ధారాధర - నిపతిత - పయస్ + బిందు - సందోహము = కొండనుండి పడిన నీటి బిందువుల సమూహము; 6. ఒండొరువులకున్ = ఒకరొకరికి; 7. వట్రపడక = లక్ష్యపెట్టక; 8. ఈడంబోవు = వెనుదీయు; 9. కృకవాకు - వల్లభుఁడు = కోళ్ళకు నాయకుఁడు; 10. ముంగలివారి నగవు = ముందున్నవారి నవ్వు; 11. శిఖి = అగ్ని; 12. సటా - సముత్పాటన - కుపితము = జూలును చీల్చుటచేఁ గోపించినది; 13. కంఠీరవము = సింహము; 14. తటి = సమీపము; 15. పొరిగొను = చంపు; 16. చరణాయుధము = కోడి; 17. సంబాళించుకొను = తెప్పిఱు; 18. భ్రుకుటీ - ప్రకటీకృత - రోషుఁడు = బొమముడిచేత వెల్లడిచేయఁబడిన కోపము గలవాఁడు; 19. దండ - తాఢిత - దర్వీకరంబు + ఓజ = కఱ్ఱచేఁ గొట్టఁబడిన పాము విధమున; 20. డీలుపడు = బలహీనమగు; 21. ఆవిల = కలఁగిన.

మానసుండై కడంగి, యదరు[1] లుమిసెడుచూడ్కు లాతనిపై నిగిడించుచుం గవిసి నిజఖరతరనఖరప్రహారంబులఁ జరణాయుధంబు నెట్టకేలకు ధరణి కెరఁజేసి[2], బాసటయై దారిచేసినఁ దెలిపిగాంచి యా యంచలరాయండు వెఱపెల్లునం[3] బ్రాణార్తుండయి పాఱి, నీరంబులం దూఱె. అట్లు తమ యుద్ధమం బెల్ల వీసరపోవుట[4]యుఁ, బృతనాపతి నిహతుం డగుటయు, నీక్షించి విపక్షిపక్షులెల్లఁ గోపాటోపంబునం జుట్టుముట్టిన, సరకుసేయక యా సార సతల్లజుండు సంవర్తవేళాప్రవర్తితదారుణసంహారవిహారుండగు[5] మాఱట సమవర్తి[6] యుంబలె నుదగ్రమహోగ్రహవ్యగ్రుండయి[7], యనేకశకుంతంబుల నంతకాంతికంబున[8] కనిచి, చూప అగ్గింపఁ[9] జిత్రవర్ణవాహిని నేటి కెదు రీఁదినట్లు వీరవిహారంబు సలిపి, విపక్షదుర్నిరీక్షుండయి[10], రణక్షోణియెల్ల[11] నిపతితవసామాంసభారంబు[12] లగు శోణితపూరంబులు[13] వఱపి, మఱియుఁ బిఱువోవక[14] జముఁ[15] డాడించు జంత్రపుబొమ్మలట్లు పయిపయిం గవియు పింగళి[16] బలంబులఁ బీనుంగుపెంటలు గావించి, మాఱులేక మలయుచుండ, హతశేషపక్షికులంబు వికలంబయి విఱిగి సురిఁగి[17] తనముఱుఁగుఁ జొచ్చుటయుఁ, గేకినాయకుం డెల్లెడలం బెల్లుగఁ ద్రెళ్ళి మృతంబులు[18]

---

1. అదరులు = మిడుఁగుఱులు; 2. ధరణికెరఁజేసి = భూమిపైఁ బడఁగొట్టి; 3. వెఱ - పెల్లు = భయాతిశయము; 4. వీసరపోవు = వ్యర్థమగు; 5. సంవర్త - వేళా - ప్రవర్తిత - దారుణ - సంహార - విహారుఁడు = ప్రళయసమయమునందు జరిగిన భయంకర సంహారమనెడి క్రీడగలవాఁడు; 6. మాఱట - సమవర్తి = అపర యముఁడు; 7. ఉదగ్ర మహా + ఆగ్రహ - వ్యగ్రుఁడు = భయంకరమైన గొప్ప కోపము నం దాసక్తి గలవాఁడు; 8. అంతక + అంతికము = యముని సమీపము; 9. అగ్గించు = పొగడు; 10. విపక్ష - దుర్నిరీక్షుఁడు = శత్రువులకుఁ జూడశక్యము గానివాఁడు; 11. రణక్షోణి = యుద్ధభూమి; 12. నిపతిత - వసా - మాంస - భారంబులు = పడిన క్రొవ్వు - మాంసము అనువాని బరువు గలవి; 13. శోణిత - పూరము = రక్తప్రవాహము; 14. పిఱువోవు = వెనుకకుఁ దిరుగు; 15. జముఁడు (వి) - యముఁడు (ప్ర.); 16. పింగళి = వెనుక; 17. సురుఁగు = పాఱు; 18. మృతములు = చచ్చినవి.

మృతకల్పంబులు[1] నై యున్న స్వకీయానీకినీజనంబులకు[2] విచారపడి, సేనలం బురికొల్పి యొక్క పెట్టఁ దానును నమాత్యుండును బెగ్గురుపయిం బడి బడలించినఁ[3], జేవదఱిఁగియుఁ బౌరుషంబు వాటించి, శాత్రవ సహస్రంబులం దునిమి, విగతసత్త్వుం డయి తూఁగాడుచు నరగన్ను వెట్టి, కొఱప్రాణంబులతో వీరవరుం డుండ, శిఖండిం[4]ద్రుండు పురివిచ్చి వచ్చి యాత్మపక్షత్రోటీ ప్రహరణమ్ముల మొత్తిన, వికృతంబుగా నొఱలుచు విగతజీవుండయి వీరశయనంబున శయనించె. అది చూచి చిత్రవర్ణుం డమందానందంబునం[5] బొదలి[6], సింహనాదంబు చేసె.

ఇట్లు చిత్రవర్ణుండు విజయోల్లాసభాసురుండయి, యరిదుర్గంబుఁ బ్రవేశించి, రాచనగరులెల్లఁ గొల్లగొని, యుల్లంబుల వెల్లివిరియు సంతసంబు మొగంబునం బ్రబ్బి[7] యుబ్బి, జయజయశబ్దంబులు భూనభోంతరంబు నిండ, నిజామాత్యభృత్యవర్గంబులం దోడుకొని, నిత్యప్రయాణంబుల నిజరాజధానిం జేరి, యత్యంతయత్నలబ్ధం బయిన విజయంబు సార్థకంబుగా నపార సంతోషంబున వసుంధరా[8]పాలనంబు సేయుచు సుఖముండె.

అని విష్ణుశర్మ విగ్రహము సమగ్రముగా ననుగ్రహించి, ప్రజాప్రళయ కారణంబగు రణంబునకుఁ గాలుద్రవ్వక, నొవ్వక[9], మీరును నేఱిమి[10] మీఱఁ బ్రజాపాలనంబు సలుపుం డనిన, రాజపుత్త్రు లింతంతనరాని సంతసంబునం బొదలి విష్ణుశర్మను బహుభంగులం గొనియాడిరి.

కందుకూరి వీరేశలింగ ప్రణీతంబయిన నీతిచంద్రిక యందు
విగ్రహము సంపూర్ణము.

---

1. మృతకల్పము = చచ్చినవానితో నించుకతక్కువగా సమానము; 2. స్వకీయ + అనీకినీ - జనము = తనదైన సేవలోని జనము; 3. బడలించు = అలయునట్లుచేయు; 4. శిఖండి = నెమలి; 5. అమంద + ఆనందము = తక్కువకాని యానందము; 6. పొదలు = ఒప్పు; 7. ప్రబ్బు = అతిశయించు; 8. వసుంధర = భూమి; 9. నొవ్వు = బాధపడు; 10. నేరిమి = నేర్పు.



# సంధి

## పీఠిక

### చిత్రపదము

శ్రీకరు నవ్యయు నాద్యున్
లోకచయావనశీలున్
శోకవిశోషణు నీశున్
బ్రాకట భక్తిని గొల్తున్ 1

శ్రీకరున్ = శుభములను జేయువాఁడును, అవ్యయున్ = నాశనములేనివాఁడును, ఆద్యున్ = మొదటివాఁడును, లోక - చయ + అవన - శీలున్ = లోకముల సమూహము యొక్క రక్షణము స్వభావముగాఁ గలవాఁడును, శోక - విశోషణున్ = దుఃఖమును బోఁగొట్టువాఁడును, అగు, ఈశున్ = ఈశ్వరుని, ప్రాకట - భక్తిన్ = ప్రసిద్ధమైన భక్తితో, కొల్తున్ = సేవించెదను.

### తేటగీతము

ఆంధ్రభాషను బద్యకావ్యములు పెక్కు
మున్ను లోకోపకారకంబుగ రచించి
నట్టి నన్నయాదుల నెదయందుఁ గొలిచి
వచనకావ్యంబులను వ్రాయువారిఁ దలఁతు. 2

ఆంధ్రభాషను = తెలుఁగుభాషలో, పద్యకావ్యములు, పెక్కు, మున్ను, లోక + ఉపకారకంబుగన్ = లోకములకు మేలు గలుగునట్లు, రచించిన + అట్టి, నన్నయ + ఆదులన్ = నన్నయ్య మున్నగువారిని, ఎద + అందున్ = హృదయమునందు, కొలిచి = సేవించి, వచన - కావ్యంబులను, వ్రాయువారిన్, తలఁతున్.

### ఉత్పలమాల

ఇంతకుమున్ను నేను రచియించిన విగ్రహతంత్ర మెల్లచో
వెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁబడ్డ దటంచుఁ బల్మఱున్

వింతగ నాకు లేఖలను బెక్కురు వ్రాయుచునుంటఁజేసి య
త్యంతము వ్రాసితిన్ సులభమౌగతి దీని సంధితంత్రమున్. 3

ఇంతకున్ + మున్ను = ఇదివఱకు, నేను, రచియించిన - విగ్రహతంత్రము, ఎల్లచోన్ = అన్నిచోట్లను, ఎంతయున్ = మిక్కిలి, కష్టశైలిన్ = క్లిష్టమైన శయ్యలో, రచియింపఁగఁ బడ్డది, అటంచున్, పల్మఱున్ = పెక్కుసార్లు, పెక్కురు = అనేకులు, నాకున్, వింతగన్ = ఆశ్చర్యముగా, లేఖలను, వ్రాయుచున్ + ఉంటన్ + చేసి = వ్రాయుచుండుటచేత, దీనిని - సంధి తంత్రమున్ = ఈ సంధియను తంత్రమును, అత్యంతమున్ = మిక్కిలి, సులభము + ఔ-గతిన్ = సులభరీతిలో, వ్రాసితిన్.

తాత్పర్యము : ఇంతకుముందు నేను రచించిన విగ్రహ మనుతంత్రము మిక్కిలి కష్టమైన శైలిలో నున్నదని పెక్కండ్రు నాకు వ్రాయుటచేత నే నీ సంధి యనుతంత్రమును మిక్కిలి సులభముగా రచించితిని.

### తేటగీతము

పలుమఱు హితోపదేశంబు భారతమును
బంచతంత్రంబుఁ బరికించి, వానిలోన
వలయుకథలను గొని దీని వ్రాసినాఁడఁ
గ్రొత్తగాఁ గొంత యందందుఁ గుదురుపఱిచి. 4

పలుమఱున్ = పెక్కుసారులు, హితోపదేశంబున్, భారతమును, పంచతంత్రంబున్, పరికించి = పరీక్షించి, వానిలోనన్, వలయు - కథలను + కొని, క్రొత్తగాన్, కొంత, అందున్ + అందున్ = అక్కడక్కడ, కుదురుపఱిచి = పొందుపఱిచి, దీనిన్ = ఈ సంధిని, వ్రాసినాఁడన్.

### చిత్రపదము

పెద్దల వేఁడెద దీనన్
దిద్దఁగ దోషము లున్నన్
విద్దియ చాలనినన్నున్
దద్దయుఁ గూర్మి క్షమింపన్. 5

దీనన్ = ఈ సంధితంత్రమునందు, దోషములు + ఉన్నన్ = తప్పులున్నచో, దిద్దఁగన్ = దిద్దుటకును, విద్దియ = విద్య, చాలని, నన్నున్, తద్దయున్ = మిక్కిలి, కూర్మిన్ = ప్రేమతో, క్షమింపన్ = క్షమించుటకును, పెద్దలన్, వేఁడెదన్.

# సంధి

తదనంతర మా నరవరకుమారు[1] లా ధరణీసురప్రవరున[2] కిట్లనిరి. "స్వామీ! మీ యనుగ్రహంబు కతంబున, విగ్రహమును సమగ్రముగా వాకర్ణించితిమి. దయచేసి యింక సంధిని సహితము ప్రసాదించి[3] మాకుం గర్ణరసాయనంబు[4] గావింపు(డు". అనవుడు నభ్యస్తసమస్తనీతిశాస్త్ర మర్మజ్ఞుండగు[5] విష్ణుశర్మం డిట్లని చెప్పందొడంగె :-

అమ్మాడ్కి[6] భీమసంగ్రామంబున[7] నిహతానేకసైనికలోకంబులగు[8] మయూర మానసౌకంబులకు[9] గృధ్ర[10]చక్రవాకంబులచే క్షణమాత్రంబున సంధి చేయఁబడియె. ఆ విధంబు వివరించెద వినుండు.

ఆ రీతిని దారుణం బగుప్రవిదారణంబున[11] వీరవారం బెల్ల మారణంబు[12] నొందినఁ జింతాక్రాంతస్వాంతుండై[13] వరటాకాంతుండు[14] మంత్రిం జూచి "సర్వజ్ఞా! ఎవఁడు మనదుర్గంబున న ట్లగ్గిపెట్టిన దుష్టాత్ముఁడు? పగఱచేఁ[15] బంపంబడి యెవ్వరయినఁ బ్రచ్ఛన్నవేషులయి[16] మనదుర్గంబు నివాసంబుగా నుండి మనల మోసపుచ్చి, చి చ్చంటించి పోరుగదా!" అనిన

---

1. నరవర కుమారులు = రాజపుత్త్రులు; 2. ధరణీసుర ప్రవరునకున్ = బ్రాహ్మణ శ్రేష్ఠునకు; 3. ప్రసాదించి = అనుగ్రహించి; 4. కర్ణ రసాయనంబు = చెవులకు విందు; 5. అభ్యస్త - సమస్త - నీతి - శాస్త్ర - మర్మజ్ఞుండు = నేర్వఁబడిన ఎల్ల నీతిశాస్త్రము లందలి రహస్యములు గలవాఁడు; 6. మాడ్కి = విధము - మాడికి (రూపాం.); 7. భీమ - సంగ్రామము = భయంకర యుద్ధము; 8. నిహత + అనేక - సైనిక లోకంబులు = చంపఁబడిన పెక్కు సైనికుల సమూహములు గలవి; 9. మయూర - మానసౌకములకున్ = నెమలికి, హంసకు; 10. గృధ్ర = గ్రద్ద; 11. ప్రవిదారణము = యుద్ధము; 12. మారణము = చంపుట; 13. చింతా - ఆక్రాంత - స్వాంతుఁడు = దుఃఖముచే నాక్రమింపఁబడిన మనస్సు గలవాఁడు; 14. వరటా - కాంతుఁడు = అంచతేఁడు; 15. పగఱు = శత్రువులు; 16. ప్రచ్ఛన - వేషులు = మాఱువేషములు గలవారు.

వినయావనతుం[1] డయి చక్రవాకప్రశస్తుం డిట్లనియె.

"దేవా! దేవరవారికి నిష్కారణబంధువై యుండు నీలవర్ణుం డిప్పు డే మొకో సపరివారంబుగాఁ గానరాకున్నాఁడు. నాకుం జూడ నిదియంతయు నా విశ్వాసఘాతుకుని[2] విచేష్టితమ[3] యని తోఁచుచున్నది. దేవర యమాయికత్వమే దేవర నింతకుం దెచ్చినది. పుట్టుపూర్వములను విచారింపక యవిశ్వసనీయులగు[4] నభినవాగతుల[5] యెడ హృదయంబు సదయంబు[6] గావించి నమ్మిన పాపఫల మనుభవింప నేఁడు కాలము వచ్చినది." అనిన రాజును క్షణమాత్రంబు స్వాంతంబునఁ జింతించి - "ఇది యంతయు మా దురదృష్టము. మా యదృష్ట మిట్లుండఁగా నెవరి ననవలసినపని యేమున్నది. ఈ విషయంబున దైవప్రాతికూల్య[7] మొక్కటియె కాని మంత్రుల దోషంబు లేశంబును లేదు. మనుష్యప్రయత్నముచేఁ గార్య మెంత చక్కఁగా సంఘటింపఁబడినను, దైవయోగముచేతం జెడిపోవును. నిటలలిఖితాక్షరంబులు[8] తుడిచి వేయ నెవ్వరిచే నగును." అని యూరకుండెను.

అపుడు సవినయంబుగా మంత్రి యిట్లనియె - "లోకములోఁ బండితులు కానివారు తమ కొక్కవిషమదశ[9] ప్రాప్తమయినప్పుడు, దైవమును గర్హింతురు[10]; కాని యాత్మకర్మదోషంబుల[11] నెఱుంగఁజాలరు. అపథ్యానురాగు[12] లగురోగుల లాగున నృపాలురును హితతంత్రు లగు మంత్రులమతి నతిక్రమించి యాత్మవంచకు[13] లయి యభినవప్రియులం[14] బురస్కరించుకొని

---

1. వినయ + అవనతుఁడు = అడఁకువచే వంగినవాఁడు; 2. విశ్వాస - ఘాతుకుఁడు = నమ్మికను దెబ్బతీయువాఁడు - కృతఘ్నుఁడు; 3. విచేష్టితము + అ = పనియే; 4. అవిశ్వసనీయులు = నమ్మఁదగనివారు; 5. అభినవ + ఆగతులు = క్రొత్తగా వచ్చినవారు; 6. సదయము = దయతోఁ గూడినది; 7. దైవ ప్రాతికూల్యము = దైవముయొక్క అననుకూలత; 8. నిటల - లిఖిత + అక్షరములు = నుదుట వ్రాయఁబడిన వ్రాఁతలు; 9. విషమ - దశ = కష్టస్థితి; 10. గర్హింతురు = నిందింతురు; 11. ఆత్మ - కర్మ - దోషములు = తమచేఁతల తప్పులు; 12. అపథ్యానురాగులు = అపథ్యమునందు అనురాగము గలవారు; 13. ఆత్మవంచకులు = తమ్ముఁదాము మోసగించుకొనువారు; 14. అభినవ - ప్రియులు = క్రొత్తమిత్రులు.

కార్యంబు ముగిసిన వెనుక గర్వము సర్వముం దూలి[1] యప్పు డదృష్టముం బేరుకొందురు. సుహృదులును[2] హితకాములును[3] నగు సచివుల[4] వాక్యంబు లాదరింపనివారు సహవాసి[5] హితోపదేశంబు వినక చెడిన దీర్ఘసూత్రుండను విసారంబు[6] తీరున వినాశంబు నొందుదురు. అక్కథ వక్కాణించెద నవధరింపుండు."

## మూఁడు చేపల కథ

ఒక్క యేటిమడువున దీర్ఘకాలమునుండి, దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడు, నని మత్స్యంబులు మూఁడు కూడి వసియించుచుండును. అట్లుండఁ గొండొకకాలంబునకు వేసవి సమీపించుడు, దీర్ఘదర్శి తక్కటిమీల[7] రెంటిని జేరఁజీరి[8] యిట్లనియె - మిత్రులారా! మీరునుం జూచుచున్నారు గదా! ఆ దినమున కా దినము వేసఁగి[9] మిగుల నాసన్న మగుచున్నది. ముందు నిక్కముగా నీళ్ళువురఁబాతెడితతిని మన కొండొకచోటికిం బోవ శక్యము కాదు. కాఁబట్టి యిప్పుడే యీ యేటం బడి వెడలి యగాధజలంబును[10] జలచర బహులంబును[11] నగు మఱియొక్క మడువుం జేరుదము. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె. భవిష్యదర్థంబునందుఁ[12] బ్రమాణముం గానము; కాఁబట్టియె బుద్ధిమంతు లగువా రెప్పటి కేది ప్రాప్తమగునో యప్పటికి దానికిం దగినట్లు కార్యము ననుష్ఠింపఁ[13] జూతురు; కాని ముందెప్పుడో యొప్పమి[14] రాఁబోవు నని యిప్పుడే చిత్తంబున రిత్త[15] విచారంబు పెట్టుకొని కుందరు[16].ఇట్లీ మడువు మహార్ణవంబు[17] వడువున[18] నుండఁగా నిప్పుడే యింతవంత[19] యేల? అంత

---

1. తూలు = చలించు; 2. సుహృదులు = మిత్రులు; 3. హితకాములు = మేలుగోరువారు; 4. సచివులు = మంత్రులు; 5. సహవాసి = కూడ నివసించువాఁడు - మిత్రుఁడు; 6. విసారము = చేఁప; 7. మీలన్ = చేఁపలను - మీను (ఏకవ.) మీలు - (బహువ.); 8. చేరన్ + చీరి = దగ్గఱకుఁ బిలిచి; 9. వేసఁగి = వేసవి (రూపాం.); 10. అగాధ - జలము = లోఁతైన నీరు గలది; 11. జలచర - బహుళము = జలచరములచే బహుళమయినది; 12. భవిష్యత్ + అర్థము = కాఁగల విషయము; 13. అనుష్ఠించు = చేయు; 14. ఒప్పమి = ఆపద; 15. రిత్త = వ్యర్థ; 16. కుందు = దుఃఖించు; 17. మహార్ణవము = మహాసముద్రము; 18. వడువు = విధము; 19. వంత = దుఃఖము.

పుట్టినప్పుడు పోలినతెఱంగు చూచుకొందము." అనిన దీర్ఘసూత్రుం డేమియు నాలోచన పాలువోవక యూరకుండె. అంతయు న్విచారించి దీర్ఘదర్శి యింక నిందు నిలుచుట కార్యంబు కాదని మున్ముందు మెలంకువపడి జలసమృద్ధం బగు మఱియొక్కమడువుం బ్రవేశించె. ఆ వెనుకం గొన్నాళ్ళు గడచిన నెండలు మెం డగుడుఁ బూఁటపూఁటకు జలంబు లింకఁజొచ్చిన, జాలరులు వచ్చి యూఁతలు, చిక్కములు, మీలపుట్టికలు మొదలగువానితోడ నీరంబులఁ[1] జొచ్చి, విషంబులం[2] గల ఝషంబుల[3] నెల్లఁ బట్టి త్రాళ్ళం గ్రుచ్చుచుండఁ బ్రాప్తకాలజ్ఞుఁ డొక్కవెర వూహించి యం దొక్కత్రాడు నోరం గఱచికొని గ్రుచ్చినట్టు లంటిపట్టుకొని గ్రుక్కుమిక్కనక యుండెను. అప్పుడు దీర్ఘసూత్రుం డబ్బారిం గడచు నుపాయంబుఁ గానక "యేమి చేయుదు నెందుఁ జొత్తు" నని తత్తఱించుచు నిందునందు మిట్టిమిట్టిపడుచు దుముకు లాడుచుండంజూచి యా కైవర్తు[4] లా వాలుగను[5] లగుడంబున[6] నడిచి మడియించిరి[7]. అంత నా ధీవరులు[8] మీలవేఁటఁ జాలించి వారిచరంబుల[9] యొడళ్ళ నంటినమంటిని గడుగ మీలగుదుల జలంబుల జాడించునప్పుడు మీనంబుల సందున నిరుదొడలం ద్రాడు గఱచి పట్టుకొని గిట్టినట్టుల[10] కదలమెదలకున్న ప్రాప్తకాలజ్ఞుఁడు మెల్లఁగా ద్రాడు విడిచి గంభీరవారిం[11] బ్రవేశించి ప్రాణత్రాణంబు[12] కావించుకొనియె. కాఁబట్టి మిత్రుల హితవచనంబులు విననివాఁడు దీర్ఘసూత్రుని విధంబున నంతంబుఁ జెందును. మఱియు దీన నిం కొక విశేషంబుకూడఁ గలదు. ముందుగా ననాగతము[13] లగు కార్యంబుల నూహించి మెలఁకువపడువాఁడు దీర్ఘదర్శి విధంబున నాపదం బొరయక[14] సుఖించును; అప్పటికిం దోఁచినట్టు వెరవు పరికించి ధైర్యముతోఁ

1. నీరము (ప్ర.) - నీరు (వి.); 2. విషము = నీరు, విషము, అమృతము (నానా.); 3. ఝషము = చేఁప; 4. కైవర్తులు = జాలరులు; 5. వాలుగ = చేఁప; 6. లగుడము = కఱ్ఱ; 7. మడియించు = మడియ (చావ)఻జేయు - చంపు; 8. ధీవరులు = జాలరులు; 9. వారిచరము = జలచరము; 10. గిట్టిన + అట్టులు = చచ్చిన విధమున; 11. గంభీర - వారి = లోఁతునీరు; 12. త్రాణము = రక్షణము; 13. అనాగతము = రానిది; 14. పొరయక = పొందక.

గార్యము నిర్వర్తింపఁజూచువాఁడు ప్రాప్తకాలజ్ఞుని తెఱంగునఁ బరమ సంశయాస్పదం బయిన బ్రదుకుం గాంచును; భవిష్యదర్థంబును గానక సమయోచితం బగునుపాయంబునుఁ దోఁచక యూరకుండువాఁడు దీర్ఘసూత్రునికైవడిఁ[1] దప్పక యప్పుడ ముప్పుఁ[2] జెందును.

అనునప్పు డొప్పనివారి[3]వీటం[4] బుట్టువింతల నారసి రాఁగ్రమ్మఱఁ బంపఁబడిన ధవళాంగుండు చనుదెంచి యంచలరాయనిం గాంచి నమస్కరించి యిట్లనియె. "స్వామీ! ప్రతిక్షణంబును దుర్గశోధనంబు కర్తవ్యంబని మున్నే విన్నవించుకొనియున్నాఁడనుగదా? దేవర నా వచనంబులయెడ ననాదరంబు చేసి యావనిం గావింపరైతిరి. అ ట్లేమఱియుండుటవలనిఫల మిప్పు డనుభూతం బయినది. గృధ్రానీతం[5] బయిన మేఘవర్ణుండనువాయసము చేతనే మనదుర్గదాహంబు[6] చేయఁబడినది. అతఁడే మీపాల నీలవర్ణుం డనుఁ జనవరియై[7] యుండినవాఁడు. ఆ ప్రకారము - అనునంతలో నాతనిమాట కడ్డము వచ్చి తలయూఁచి విశ్వసించి మరాళవల్లభుం డిట్లనియె. "ఔనౌను! ఉపకారంబువలనంగాని ప్రణయంబు[8] వలనంగాని కానివాని విశ్వసించినాతఁడు వృక్షాగ్రమున విద్రించువానివలెనే యధఃపతితుం[9] డగును. సందియము[10] లేదు. తదనంతరోదంతంబు[11] చెప్పుము." అనుడు బకం బిట్లనియె.

"ఆ ప్రకారము దుర్గదాహంబు చేసి డాయవచ్చిన మేఘవర్ణునిఁ జిత్రవర్ణుండు సగౌరవంబుగా బహూకరించి, ప్రసాదమేదురంబుగా[12] మంత్రివంకఁ జూచి యిట్లనియె. - "కృతకృత్యుఁ డయిన భృత్యునికృతం బూరక పోరాదు. ఆతండు మనోవాక్కుల సంతోషించు ప్రతిఫల మవశ్యము

---

1. కైవడి = విధము; 2. ముప్పు = ఆపద; 3. ఒప్పనివారు = శత్రువులు; 4. వీడు, దేశము, వీఁడు = ఇతఁడు; 5. గృధ్ర + ఆనీతము = గ్రద్దచేఁ దీసికొనిరాఁబడినది; 6. దాహము = దహనము; 7. చనవరి = చనవు + అరి = చనవు గలవాఁడు; 8. ప్రణయము = ప్రేమము; 9. అధః - పతితుఁడు = క్రిందఁబడినవాఁడు; 10. సందియము (వి.) - సందేహము (ప్ర.); 11. ఉదంతము = వృత్తాంతము; 12. ప్రసాద - మేదురము = అనుగ్రహముచేఁ జక్కనై నునుపైనది.

కలుగవలయును. కాఁబట్టి యీ మేఘవర్ణునినే యీ కర్పూరద్వీపరాజ్యంబున కభిషిక్తునిం జేయుదము" అని చెప్పునప్పుడు పోరిచొప్పు[1] తలఁపునం బాటి పరధ్యానముతో విచారించుచున్న రాజుంజూచి మంత్రి చక్రవాకంబు : "ప్రణిధియేమో ముఖ్యాంశంబు మనవి యొనరింపఁ బోవుచున్నాఁడు. దేవర పరాకు లేక ససాకల్యముగా నాకర్ణింపవలయును." అనుడు ఱేఁడు; "ధవళాంగా! మేము చిత్తగించుచునే యున్నారము. ఏదీ? తరువాతి వృత్తాంతమును వినిపింపుము." అనవుడుం బ్రణిధి యిట్లు విన్నవించుచున్నాఁడు.

అంత నా మాటలకుఁ బ్రధానమంత్రి యైన దూరదర్శి యిట్లనియె : "దేవా! ఇప్పు డేలినవారు సెల విచ్చిన దంత యుచితంబని నేఁ దలంపను. ఈతనికి మే లొనరింపఁ దలంపుఁ గొంటిరేని, ప్రసాదాంతరము[2] చేయుటయె యెంతయు నర్హకార్యము. చూడామణి[3] స్థానమునం బాదుకల[4] నిడఁగూడనట్లు, మహాత్ము లుండఁదగినపదంబునందు నీచుల నెప్పుడును నిలువరాదు. నీచస్థానయోగ్యునిం దెచ్చి యతిశయస్థానమునందు నిలిపినభూవిభుండు, కాల్భం దొడుగఁ దగిన పాదుకలం దల ధరియించిన వానివలెఁ బరిహాసపాత్రుఁ[5] డగును. లోకములో దేవర యెఱుఁగనిది మఱి యెవ్వ రెఱుఁగుదురు? పూజించినను నవమానించినను గూడ సహకారంబు చేయుచుండుట యల్పులకు నైజగుణము. శిరంబున ధరించినను గాలం ద్రొక్కినను భుజగంబు బడలువడం[6] గఱుచును గదా? నీచులు శ్లాఘ్య[7]పదంబుం బొందుదురేని నొకానొకప్పుడు మేలు చేసినవారికే ద్రోహంబు చేయఁ జింతింతురు. ము న్నొక కాలసర్పము వణిజునిచే[8] బ్రతికింపఁబడియు, నాతనికే యపకారంబు చేయఁ జూచెను. దేవర కా కథ వాక్రుచ్చెద నవధరింపుఁడు.

---

1. పోరి - చొప్పు = యుద్ధరీతి; 2. ప్రసాదాంతరము = మఱియొక అనుగ్రహము (ఉపకారము); 3. చూడామణి = తలమానికము; 4. పాదుక = చెప్పు; 5. పరిహాస పాత్రుఁడు = పరిహాసమునకుఁ దగినవాఁడు; 6. బడలుపడు = శ్రమపడు; 7. శ్లాఘ్య = పొగడఁదగిన; 8. వణిజుఁడు = వ్యాపారి.

## పాము - నక్క - వ్యాపారి

హిమవంతంబు ప్రాంతంబున నొక కాంతారంబునఁ[1] గాలితెరువున[2] నొక బేహారి[3] చనుచుండెను. ఆయెడ నాయడవియందు దావపావకుండు[4] గడు నడరి నలుగడలుఁ జుట్టి యొక్కపట్టున నొక్క పెట్టునఁ బెక్కుచెట్లం గాల్చుచుండెను. అట్లు వెంటనే మంటలు మింట[5] నంటఁగా నా నడుమ నొక్కకాలవ్యాళంబు[6] చిక్కుకొని యెక్కడకుం బోవఁ ద్రోవఁ గానక యా కానం[7] జనుచున్న వణిజునిం గని పేరెలుంగున[8] నిట్లనియె. "ఓ యార్తజనశరణ్యా![9] ఈ యరణ్యంబు నలుదెసలు గ్రమ్మి ముమ్మరమ్ముగఁ[10] జుట్టుకొన్న యీ యెరగలిం[11]బడి ప్రాణంబులు గోలుపోవలసివచ్చెఁగా యని రక్షణోపాయంబు తోఁపక దైవంబుం బ్రార్థించుచుండఁగా నాపాలిటిదైవంబు చందంబున సమయమున సన్నిహితుండయినాఁడవు. శరణాగతభరణం[12] బున శిబిచక్రవర్తిని[13] దలఁపింపం దగు నీయంతటిలోకోత్తరుని శర ణొందితిని. ఇఁక నాకేమి కొదవ[14]; జాగుసేయక వేగ వచ్చి ప్రాణదానంబు చేసి పుణ్యమునం బొమ్ము. నే విన్నవింపఁగల దంతయు విన్నవించితిని. పిమ్మటఁ దమచిత్తము నా భాగ్యము. అని మఱియు దీనాతిదీనంబు లగువచనంబులఁ బ్రార్థింప,

---

1. కాంతారము = అడవి; 2. కాలితెరువు = కాలిబాట; 3. బేహారి = వ్యాపారి; 4. దావ - పావకుఁడు = అడవినిప్పు; 5. మింటన్ = ఆకాశమునందు; 6. కాల - వ్యాళము = కాలసర్పము; 7. కాన (వి) - కాననము (ప్ర.) = అడవి; 8. పేరెలుఁగు - పేరు + ఎలుఁగు = పెద్ద కంఠస్వరము; 9. ఆర్త - జన - శరణ్యా = పీడితులైన జనులకు శరణు పొందఁదగినవాఁడా; 10. ముమ్మరమ్ముగన్ = అధికముగా; 11. ఎరగలి = అడవినిప్పు; 12. శరణ + ఆగత - భరణము = శరణు కొఱకు వచ్చినవాని పోషణము; 13. శిబి = ఒక చక్రవర్తి, అతఁడు మహాదాత. అతని దానగుణమును బరీక్షింప నింద్రుఁడు పావురము, అగ్ని డేగయునైరి. డేగ పావురమును దఱుముకొనిరాఁగా, నది శిబిని శరణు చొచ్చెను. శిబి దాని కభయమిచ్చి, డేగకు దానియెత్తు మాంసమును దన మేనినుండి యిచ్చుట కంగీకరించెను. ఎంత మాంసమును గోసినను దానియెత్తు తూఁగకపోవుటచేఁ దుదకుఁ దానే దాని కాహారముగా సంసిద్ధుఁ డయ్యెను. అగ్ని, ఇంద్రుఁడు వాని మహాదాతృత్వమునకు సంతోషించి ప్రశంసించిరి; 14. కొదవ = లోపము.

నాతఁడు దుష్ట జంతువు వ్రంత[1]సహితము చూడఁజాలక యగణ్యా కారుణ్యంబున[2] డాయఁబోయి లోపల మిలమిల మెదలుచు నరణ్యారోదనంబు[3] చేయుచున్న జిహ్మగముం[4] గనుఁగొని, తన చేతికఱ్ఱకొనకుం బెనుద్రాటితో నొకసంచిని వ్రేలం గట్టి, యా కఱ్ఱమొదలు చేతఁ బట్టుకొని యుపాయముగా సంచిని బొదలో జాఱవిడిచెను. తోడనే యాపన్నం[5] బగు నా పన్నగంబు[6] సంచిలోఁ దూఱి చుట్టచుట్టుకొని యుండెను. అంత నా పణ్యాజీవుండు[7] మెల్లఁగా సంచిని బయటఁ దీసి యాశీవిషము[8] నొకచోట విడిచిపెట్టెను. మ్రొక్కఁ బోయిన గుడి విఱిగి మీఁదఁబడినట్టు తోడనే యా త్రాచు బుసకొట్టుచు లేచి, మనుష్యులు పాములం గంటఁబడినతోడనే చంపుచుందురు. కాఁబట్టి యట్టి మా కులంబున కెల్లను మృత్యుప్రాయులైన వారిని దొరకినపుడు దోరింపక[9] విడువరాదని పలుకుచు, నాలుక లార్చు[10]చుం గవిసి యాతనిపైఁ బడి కఱవఁ బోయెను. అందుల కాతం డడలు[11] గడలుకొని[12] వడఁకుచుఁ బరిసరధరాధరదరీ ద్వారంబులు[13] మాఱుమ్రోయ నఱచుచు సంచి నొక మూలం బాఱవైచి దర్వీకరము[14] వెనుకనుఁ దాను ముందునుం గాఁ బఱవఁ జొచ్చెను. ఆ చేరువ పొదలో నిదురించుచున్న గోమాయు[15] వా యలుకుడు[16] విని యులికిపడి లేచి వచ్చి, ఫణికిని[17] వణిక్ఛిరోమణికిని[18] నడుమ నిలిచి యిట్లనియె. "ఓ యురగరాజమా![19] ఏల యూరక రోఁజుచు నీ పాఱుఁబోతు[20] వెంటంబడి పరుగెత్తుచున్నాఁడవు? ఇంచుక నీవు నిలిచి నీవార్త నాతోడఁ

---

1. వ్రంత = దుఃఖము; 2. అగణ్య - కారుణ్యము = లెక్కపెట్టరాని దయ; 3. అరణ్య - రోదనము = అడవి యేడ్పు; 4. జిహ్మగము = పాము; 5. ఆపన్నము = ఆపద నొందినది; 6. పన్నగము = పాము; 7. పణ్యాజీవుఁడు = వ్యాపారి; 8. ఆశీవిషము = పాము; 9. దోరింపక = చంపక; 10. ఆర్చు = ఆడించు; 11. అడలు = భయము; 12. కడలుకొను = అతిశయించు; 13. పరిసర - ధరాధర - దరీ - ద్వారములు = చుట్టుపట్లనున్న కొండల గుహల ద్వారములు; 14. దర్వీకరము = పాము; 15. గోమాయువు = నక్క; 16. అలుకుడు = ధ్వని; 17. ఫణి = పాము; 18. వణిక్ + శిరోమణి = వ్యాపారి శ్రేష్ఠుఁడు; 19. ఉరగము = పాము; 20. పాఱుఁబోతు = పరువెత్తువాఁడు.

జెప్పుము. నా చేత నగు సాహాయ్యం బున్నం జేసెదను." అనినం గృష్ణాహి[1] తన యావద్వృత్తాంతంబును బూసగ్రుచ్చినరీతిని వినిపించెను. అది విని యక్కజం పడిన[2] ట్లభినయించుచు నక్క యిట్లనియె : "ఓ మిత్రమా! ఇప్పుడు నీవు చెప్పిన చరిత్రము విస్రంభపాత్రముగా[3] నేఁ జింతింపను. ఈ సంచి యెక్కడ? నీ దేహ మెక్కడ? దీనిలో నీవు దూఱుట యెక్కడ? నీవు చూడఁబోయిన బెద్దబారెఁ[4] డున్నావు ; సంచియో పట్టుమన్న జేనెఁడు[5] లేదు. నీ విందు మరలఁ జొచ్చి చూపువఱకును నీమాట సత్యమని విశ్వసింపఁజాలను.' అనుడు నా నాగుఁబా మప్పుడ సంచిం బ్రవేశించి, తొల్లింటియట్టుల చుట్టఁ జుట్టుకొని లోపల నిమిడి యుండెను. వెంటనే యా సృగాలము[6], మోమున వైవర్ణ్యంబు[7] మిగులఁ బెదవులు తడుపుచు నిలుచున్న యా వణిజానకుం జేసైఁగ[8] చేసి యా సంచిమూతిని గట్టిగా దారముతో బిగింపు మని చెప్పెను. అతఁ డా ప్రకారము చేసి, తన చేతిబడియతో సంచిమీఁద నాలుగు మోఁదులు మోఁది దందశూకమును[9] స్వర్గలోకమునకుం బుచ్చి, జంబుకంబుం[10] గొనియాడి తనదారిఁ బోయెను.

కాఁబట్టి క్షుద్రులు[11] తమ కుపకారంబు చూపినవారికే యపకారంబుఁ దలంతురు. అంతియ గాక, మ్రుక్కడు[12]లయెడం జేసిన యుపకారంబును నిసుకయందు రచించిన ముద్రయుంబోలెఁ జాలకాలంబు నిలువదు. మార్జాలంబును[13] ధర్మకర్తఁగా భావించి సేవింపఁబోయిన శశకపింజలములకుం బోలెఁ దమ కెప్పుడు కీడు మూఁడునో యని యెంచి, ప్రజలును నల్పునిం గొలిచియుండ నొడఁబడరు. మీ కాకథ వాక్రుచ్చెద నాలింపుఁడు.

---

1. కృష్ణ + అహి = నల్లత్రాఁచు; 2. అక్కజంపడు - ఆక్కజము + పడు + పడు = ఆశ్చర్యపడు; 3. విస్రంభపాత్రము = నమ్మఁదగినది; 4. బార + ఎఁడు = బారెఁడు; 5. జేన + ఎఁడు = జేనెఁడు; 6. సృగాలము = నక్క; 7. వైవర్ణ్యము = పాలిపోవుట; 8. చేసైఁగ = చేతిసన్న; 9. దంతశూకము = పాము; 10. జంబుకము = నక్క; 11. క్షుద్రులు = నీచులు; 12. మ్రుక్కడి = అల్పుఁడు; 13. మార్జాలము = పిల్లి.

## శశకపింజములు - పిల్లి

వింధ్యాటవిలో నొకవృక్షకోటరంబునఁ[1] జిరకాలమునుండి కపింజలం బను పక్షియొకటి కాఁపురంబుండును. ఒకనాఁటి సూర్యాస్తమయ సమయంబున మొయిలు మొత్తమ్ములు[2] వియత్తల[3] మెల్లఁ గాఁబుక్రమ్ముకొని కడవలం గ్రుమ్మరించిన ట్లొక జడివాన కురిసెను. ఆ వర్షంబునం దడిసి తడసి[4] యా పులుంగు[5] వేళకుఁ దొట్టుఁ జేరలేకపోయెను. అప్పుడు దీర్ఘకర్ణం బనుశశం[6] బొక్కండు భృశంబును[7] వానను నాని యా శకుంతం[8] బుండుతరుకోటరంబు చేరి, నెమ్మదిగా నందు సుఖనిద్ర చేయుచుండెను. ఇంతలోఁ గపింజలము తన నివాసస్థలి న్వెదకుకొనుచుఁ జిమ్మచీఁకటిలో[9] వచ్చి లోన నిదురించు కుందేటిం గని యదలించి కోపంబు గదుర నిట్లనియె.

ఓరీ! శశాధమా! నే నింటలేనియెడ వచ్చి నీవు కావరంబున నా గృహం బాక్రమించుకొని నిశ్శంకముగా శయనించుచున్నాఁడవు. ఇఁకనైన నాలస్యంబు చేయక నాయిల్లు నాకు విడిచి యవలికి లేచి పో. చూడు పోకుంటివా, నీ ప్రాణములు నీవి కావు" అనిన గరువంబున[10] శశం బిట్లనియె. "చాలుఁ జాలు. నీ బెదరింపుమాట లింతటితోఁ గట్టిపెట్టుము. దీర్ఘకర్ణుని ముందఱనా బీరంబులు పలుక వచ్చితివి? * వాపీకూపంబులును, దటాకంబులును, దరువివరంబులును[11] నెవ్వరు ముందుగా నాక్రమించుకొందురో నాఁటికి వారివి గాని యెల్లకాలముఁ బ్రత్యేకముగా నొకరిసొత్తులు గావు. మాటాడక పో పో. పో నొల్ల వే నెయ్యెడకైనం దగవునకు రా పోదము" అనిన "వ్యవహారమునకు ర మ్మన్నచో రాననవచ్చునా? ఈ రాత్రి వుచ్చి వేగినం[12] బోదము. అందాఁక

---

1. వృక్ష - కోటరము = చెట్టుతొఱ్ఱ; 2. మొయిలు - మొత్తములు = మేఘముల గుంపులు; 3. వియత్ + తలము = ఆకాశప్రదేశము; 4. తడయు = ఆలస్యము చేయు; 5. పులుఁగు = పక్షి; 6. శశము = కుందేలు; 7. భృశము = మిక్కిలి; 8. శకుంతము = పక్షి; 9. చిమ్మచీఁకటి - చీఁకటి + చీఁకటి - అందదుకులలోనిది; 10. గరువము (వి.) - గర్వము (ప్ర.); 11.* వాపి = దిగుడుబావి, కూపము = నూయి, తటాకము = చెఱువు, తరు - వివరము = చెట్టుతొఱ్ఱ; 12. వేగు = తెల్లవాఱు.

గొంచె మోపిక పెట్టుము." అని యా కొదవ[1]రాత్రి నెట్లో వేగించి[2] తూరుపు తెల్లవాఱుడు శశంబును లేపి, దానితోఁ దగవునకుఁ బోదము నడువు మని నాలుగడుగులువెట్టి, యాపిట్ట మనవివాదంబుఁ దీర్పఁగలవాఁ డెవ్వఁ డనిన దీర్ఘకర్ణుం డిట్లనియె. "నర్మదానదీతీరంబున దధికర్ణుం డనుమార్జాలవల్లభుం డొకండు గలఁడు. అతఁడు బహుకాలవృద్ధుఁడు; బహువ్యవహారదర్శి; శాంతమూర్తి; సధర్ముఁడు. అతండే మనచిక్కు వదలింపఁ దగినవాఁడు." అనినఁ గాఁబోలు నని యొడఁబడి యా కపింజలము కుందేటితోడఁ గూడఁ గాల్దెరువునం జనిచని మట్టమధ్యాహ్నమున నా జీర్ణోతు వుం[3]డుతావుం జేరెను. ఆహా! కాలంబు చేరువయినఁ దల లుత్తరించుకొనిపోవుచోటికే పాదంబు లెంతదూర మయిన, శరీరధారుల నీడ్చుకొని పోవును గదా; అ ట్లా శశకపింజలములు గమ్యస్థానంబుఁ జేరి, పురోభాగమున[4] వృద్ధమార్జాలునిం గాంచి, కపటధార్మికుఁడును గేవలజఠరపూరకుండును[5] నని యెఱుంగక యిట్లనియెను. "ఓ మార్జాలనాయకా! మాలో మాకు స్థలవివాదం బొక్కటిపుట్టి దానిని ధర్మస్వరూపులరగుస్వామి సమ్ముఖమ్మునం దీర్చుకోవలెనని బహుదూరమునుండి యాసపడి వచ్చినవారము. మమ్ముఁ దడవు కూర్చుండఁ బెట్టక నిష్పక్షపాతముగా వేగిరము మా వ్యవహారంబు తీర్చి మమ్ము మా నెలవు[6]లకుం బంపివేయుము." అనిన మా ముదుసలిపిల్లి యిట్లనియె. 'అయ్యలారా! మీరేమో దూరమునుండి చెప్పుచున్నారు. జరాభరంబునకుఁ[7] జాంద్రాయణాదివ్రతంబులు[8] తోడుపడఁ గృశించి యింద్రియపటుత్వము తగ్గియున్నవాఁడఁ గాన నా శ్రవణంబులు[9] దూరమునుండి మీ వాక్యంబులఁ దిన్నఁగా గ్రహింపనేరకున్నవి, మీ రిరువురుం జెఱియొక చెవిచెంతం జేరి

1. కొదవ = కొఱఁత; 2. వేగించు = జాగరము చేయు; 3. జీర్ణోతువు - జీర్ణ + ఓతువు = ముసలిపిల్లి - ఇందు వృద్ధి రావలసియుండఁగా గుణము వచ్చినది; 4. పురస్ (ః) + భాగము = ఎదుటి ప్రదేశము; 5. కేవల - జఠర పూరకుఁడు = పొట్టనింపుకొనువాఁడు మాత్రమే; 6. నెలవు = చోటు; 7. జరా - భరము = ముసలితనము నాధిక్యము; 8. చాంద్రాయణ వ్రతము = చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి ఆహారమును దీసికొను వ్రతము; 9. శ్రవణము = చెవి.

మీమీవివాదాంశంబులఁ దేటపడ నుచ్చైస్స్వనంబునం[1] దెలుపునది. మా కనుష్ఠానసమయంబు సమీపించుచున్నది; మాధ్యాహ్నికంబు[2] లొనరించి ధానధర్మములు చేసికోవలెను. అయినను దగవు తీర్పఁగలవా రెందఱెందఱో యుండ మీరు వారి నేరింగాదని, నే నేమో నిష్పక్షపాతముగాఁ దీర్పువాఁడ నని విని కడుదవ్వులనుండి వచ్చియున్నవారు. అట్టి మి మ్మూరక పంపుట మము బోఁటి తపస్వులకు ధర్మంబుగాదు. ఈ లోకములోనే యెల్లకాలము నుట్టికట్టుకొని యూఁగులాడఁబోము. కాలధర్మము[3] నొందినప్పుడు ధర్మ మొక్కటి దక్క నీ లోకములోని వేవియుఁ గూడ రావు. కాఁబట్టి యట్టి ధర్మమును మాత్రము వేయి యాపదలు వచ్చినను జెడనాడుకోక కాపాడు కొనుచు రావలెను. ఇది యెంతయు సత్యము. సత్య మెప్పుడును దప్పరాదు. సత్యమే సర్వశుభములకు మూలము. సత్యమునకుఁదోడు భూతదయయు నుండవలెను. భూతదయయే సమస్త ధర్మములకు నలంకారము. తన దేహమున నొక్కకంటకము[4] సోఁకినంతనె యెంత నొప్పి కలుగునో యెల్ల దేహధారుల[5] శరీరవేదనయు నట్టిదే కదా యని యెఱింగి తత్త్వజ్ఞు లెప్పుడును హింసకుం గడుదవ్వుగఁ జరియించుచుందురు. క్రూరకర్ము లీయర్థం బెఱుంగక దయయు ధర్మంబును విడిచి దేహయాత్రామాత్రమునకై పరోపతాపంబు[6] చేయఁ బాలుపడుదురు. "స్వాశ్రితావనసమో న హి ధర్మ"[7] యని వేదములు ఘోషించును గదా? కాఁబట్టి యాశ్రితరక్షణమునకు సమానమయిన ధర్మము మఱి యొకటి లేదు. విషాభం[8]బగు లోభంబును మొట్టమొదట[9] మొదలంట నున్మూలింప[10]వలయును. ఎంత సంపాదించినను బ్రాణావసానసమయంబున

---

1. ఉచ్చైః + స్వరము = పెద్ద ఎలుఁగు; 2. మాధ్యాహ్నికము = మధ్యాహ్నవేళఁజేయు విధి; 3. కాలధర్మము నొందు = మరణించు; 4. కంటకము = ముల్లు; 5. దేహధారి = మనుష్యుఁడు; 6. పర + ఉపతాపము = ఇతరులకు బాధ; 7. స్వాశ్రితావన సమో నహిధర్మః = స్వ + ఆశ్రిత + అవన - సమః - ధర్మఃనహి = తమ్మాశ్రయించుకొన్న వారి రక్షణముతో సమానమైన ధర్మము లేదు గదా; 8. విష + ఆభము = విషముతో సమానము; 9. మొట్టమొదలు - మొదలు + మొదలు - ఇది కడాదులలోనిది; 10. ఉన్మూలించు = పెకలించు.

లోకములోని దేదైనఁ దలఁ గట్టుకొని పోదుమే? ఓ దురాశా! పాపభూయిష్ఠం[1] బయిన యీ కలికాలంబున నీ వెందఱ వశవర్తులం గావించుకొని యెందఱచే నెన్ని దుష్కార్యములఁ జేయించుచున్నావు? ఓహో! నీ పేరు తలంపునఁ బాఱినంతనె నా గుండెలు పగులుచున్నవి! అని యవ్వగ్గఁబిల్లి[2] చల్లని మాటలతో నల్లన ధర్మోపన్యాసంబులు సేయుచుండ నా శశకపింజలములు విశ్వాసముతో బిడాలమును డాయం బోయి రెండును రెండుచెవులలోను దనతన వ్యవహారమ్మును జెప్పుకొనుచుండఁ, బిట్టతగవు పిల్లి తీర్చినన్నట్లా జరఠమార్జాలంబు[3] కాళ్ళతో నా రెంటిని జిక్కంబట్టి యొక్కట మెడలు కొఱికి చిత్రవధం బొనరించెను. ప్రాణప్రయాణవేళ[4] నృకపింజలములు : "అయ్యో! ఒక్కరాత్రి కెవ్వరు పరున్న నేమియని యూరకుండక లేనిపోని వివాదంబు పెట్టుకొని తగవునకుం బోవుద మనుదుర్బుద్ధి యొకటి పుట్ట సుఖముగా బ్రదుకలేక వేకువజామునఁ బడిపోయినట్టు లేచి యింతదూరము పరుగెత్తుకొనివచ్చి, యీ ఖలుని నాశ్రయించి వీని మిథ్యావాదములు[5] విని వృథా భ్రమపడి దుర్మరణంబుఁ దెచ్చుకొంటిమి. పోరు నష్టి[6] పొందు లాభము వన్న లోకోక్తి యెన్నఁడైన వ్యర్థమగునా? వినాశకాలము సమీపించినప్పు డెవ్వరియాలోచనలు నేల పనికివచ్చును? తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును. 'లలాటలేఖా న పునః ప్రయాతి'[7] యన వినమే?" అని చింతించుచుఁ బ్రాణములు విడిచెను. మార్జాలమును యథేష్టంబుగ[8] రెండుమూఁడుదినము లాహారంబు వెదకుకోనక్కఱలేక వానిని భక్షించు చుండెను.

అప్పుడు చిత్రవర్ణుండు దూరదర్శిం జూచి, "మంత్రివర్యా! నీవు చెప్పినట్ల మేఘవర్ణుని కుపకారాంతరమునే[9] చేయుదము. కాని మున్ముందు

1. పాప - భూయిష్ఠము = పాపముతో నిండినది; 2. వగ్గఁబిల్లి = ముసలిపిల్లి; 3. జరఠ మార్జాలము = ముసలిపిల్లి; 4. ప్రాణ - ప్రయాణ - వేళ = ప్రాణము పోవునప్పుడు; 5. మిథ్యావాదములు = అసత్యవాదములు; 6. నష్టి = నష్టము; 7. లలాట - లేఖా - న - పునః - ప్రయాతి = నుదుటి వ్రాఁత తిరిగి పోదు; 8. యథేష్టము = ఇష్టము ననుసరించి అవ్యయీభావ సమాసము; 9. ఉపకారాంతరము = మఱియొక ఉపకారము.

చేయవలసిన పని నొక దానిం జెప్పెదను వినుము. మనచే నశ్రమంబున[1] జయింపఁబడిన కర్పూరద్వీపమునకు సురల నీ మేఘవర్ణునినే పంపుదము. ఈతండు చని యారాజ్యమునం గల యుత్తమపదార్థముల నెల్ల నిరాయాసంబున[2] నిచ్చటికిం గొనిరాఁగలఁడు. అప్పు డా తెచ్చినవానిలోఁ గొన్ని యపూర్వవస్తువుల మనయాప్తులకుం బుత్తము[3] : కొన్ని మేలి వస్తువులు ప్రకృతివర్గంబున కొసఁగుదము; మిగిలినవానిని యథేచ్ఛముగా[4] మన మనుభవింపఁగలము. ఆపయిని నిష్కంటకముగా[5] మనమే యెల్లకాలము జలనంబు లేకుండ నా దీవి దొరతనంబు జెల్లింపఁగలము. అను రాజువచనంబులు విని నవ్వి దూరదర్శి వినయవిధేయత్వంబులు కాన్పింప మెల్లఁగా నిట్లనియె. "దేవా! అనాగత[6] కార్యంబులం దలఁచి సంతోషింపరాదని నయవిదులు[7] పలుకుదురు. మనోరథరాజ్యపాలనంబున నానందించువాఁడు కడపటఁ బేలపిండికుండం బగులఁగొట్టుకొన్న మేదినీదివిజునివలెనే[8] విషాదంబు నొందును. ఆ కథ వినిపించెదను వినుండి.

## దేవశర్మ యను బ్రాహ్మణుని కథ

అయోధ్యానగరంబున దేవశర్మ యను బ్రాహ్మణుఁడొకఁడు గలఁడు. ఆ మహీసురుఁడు[9] మహావిషు[10]వత్సంక్రాంతినాఁడు మఱియొక విప్రునియింట శ్రాద్ధమునందు నిమంత్రితుఁడై[11], యొక సక్తుపూర్ణశరావమును దానముగాఁ బరిగ్రహించెను. అందున కాతండు డెందంబున[12] నమందానందము[13] నొంది, యా సక్తుఘటముఁ[14] గొని యిరవున[15] కరుదెంచుచుఁ గడుపార శ్రాద్ధ

---

1. అశ్రమము = శ్రమము లేకుండ; 2. నిరాయాసము = ఆయాసము లేకుండ; 3. పుత్తము = పంపుదము; 4. యథేచ్ఛము = ఇచ్ఛననుసరించి; 5. నిష్కంటకము = శత్రువులు లేకుండ; 6. అనాగత = రాని; 7. నయ - విదులు = నీతి తెలిసినవారు; 8. మేదినీ - దివిజుఁడు = భూసురుఁడు - బ్రాహ్మణుఁడు; 9. మహీ - సురుఁడు - బ్రాహ్మణుఁడు; 10. విషువత్ = రేయి పగలు సమమైన కాలము; 11. నిమంత్రితుఁడు = శ్రాద్ధభోజనాదులందు నియమింపఁబడినవాఁడు; 12. డెందము = హృదయము; 13. అమంద + ఆనందము = తక్కువకాని ఆనందము; 14. సక్తుఘటము = పేలపిండి కుండ; 15. ఇరవు = ఇల్లు.

భోజనంబు చేసియుంటఁజేసి నడవఁజాలక యాయాసపడుచు[1] బొజ్జ నిమురుకొనుచు మెల్లన మార్గంబున నొకకుంభకారుని[2] గృహంబు చేరి యరుఁగుమీఁద దొంతరలుగా నిడిన కడవలకడఁ దననీరుకావిదోవతింబఱచి, తలకుఁ జుట్టినయంగవస్త్రము తీసి చుట్టకుదురుగాఁజేసి దానిపయిని సక్తుభాండంబు నిడి, సక్తురక్షణార్థంబు దక్షిణహస్తంబున దండంబు నొకదానిని ధరించి, యెడమచేయి తలగడగా నిడుకొని యా పంచెమీఁద శయనించి, కన్ను లరమోడ్చి మితిమీఱిన కోరికలు కోరుచు నిట్లు చింతించెను. "ఈ సక్తువును మంచివెల వచ్చినప్పుడమ్మి యొక పాఁడిమేఁకను గొనియెదను. అది యేఁటేఁట రెండేసి పిల్లలఁ బెట్టుచుండును. అవియు వానికిఁ బుట్టినవియు సంవత్సరక్రమమునఁ బెరిఁగి కొన్ని హాయనములలో[3] బహుసహస్రము[4] లగును. అప్పుడు వాని నన్నిటిని విక్రయించి నూఱు పాఁడిమొదవులం[5] గొందును. ఆ ధేనుశతమును[6] గతిపయాబ్దము[7] లలోఁ బెక్కుదూడల నీనును. అవి యన్నియుఁ గాలక్రమమున మందలు మందలుగా వర్ధిల్లి దొడ్లు నిండిపోవును. ఆవల వానిలోఁ గొన్నిటితో విరివిగా వ్యవసాయము సాగించి, పొలములలోఁ బండిన పంటలలోఁ గొంత విక్రయించి లక్షల సంఖ్యల ధనము నార్జించెదను; మఱికొన్ని కోడెలనమ్మి సొమ్ము కూడఁబెట్టెదను. ఆ విత్తము[8]తో నత్తఱి నేను గోటీశ్వరుఁడ నగుదును. ఆ పిమ్మట మాయింట నేమూలఁ జూచినను రొక్కము[9] వెక్కసముగా[10] మూలుగుచుండుట నెఱిఁగి యెల్లవారును నాకు 'మేము కన్య నిచ్చెదము మేము కన్యనిచ్చెద' మని యింటిచుట్టును తిరిగి పోవుచుందురు. అందులోఁగల గుణరూపసమన్విత[11] యగు నొక్కతన్విం[12]( బెండ్లియాడెదను. ఆ లలన[13]వలన నాకు మారునిం[14] బోలు కుమారుం డొకఁడు

1. ఆయాసపడు - ఆయాసము + పడు; 2. కుంభకారుఁడు = కుమ్మరి; 3. హాయనము = సంవత్సరము; 4. బహుసహస్రములు = పెక్కు వేలు; 5. మొదవు = ఆవు; 6. ధేనుశతము = నూఱావులు; 7. కతిపయ + అబ్దములు = కొన్ని యేండ్లు; 8. విత్తము = ధనము; 9. రొక్కము = డబ్బు; 10. వెక్కసము = అధికము; 11. సమన్విత = కూడుకొన్నది; 12. తన్వి = స్త్రీ; 13. లలన = స్త్రీ; 14. మారుఁడు = మన్మథుఁడు.

కలుగును. వానికి మా సోమశర్మపేరే తప్పక పెట్టెదను. గృహకృత్య నిర్వహణాయత్తచిత్తంబున[1] నా సుంగరి నందను[2] నెత్తుకోక నా ముందఱ విడిచిపోవఁ గోపంబు పట్టలేక వెనుకపాటునఁ బోయి యా మగువ నీ లగుడంబున[3] నే నాలుగడపు లడఁచెదను." అను సమయమునఁ గొంచెము నిద్రవచ్చి ఱెప్పలు వాల్చి నిజముగా భార్యవచ్చి మ్రోలనిలుచున్నట్టు కలవరించి, యాగ్రహంబునఁ దనకుడిచేత నున్న దండముతో నా పిండికుండను భిన్న భిన్నములుగాఁ గొట్టెను. కఱ్ఱ విసరునప్పు డాదెబ్బలలోఁ గొన్ని యాచేరువ నున్న భాండపంక్తులకుం[4] దగిలి కొన్ని కుండలు పగిలిపోయెను. ఆ చప్పుడు విని యదరిపడి లోపలినుండి కుమ్మరివాఁడు పరుగెత్తుకొని వచ్చి యా వెడఁగుబాపనయ్యకు[5] నాలుగుబహుమానంబు[6] లర్పించి, వడివడి నా పుడమివేల్పును[7] జావడి వెడలనడఁచెను. కాఁబట్టి యెందును రాఁబోవు కార్యంబులం దడవికొని, సంతోషించువాఁడు మున్నున్నదానిం గూడఁ జెడఁగొట్టుకొనుటయే కాక, సరివారిలో దూఱు[8]వడయును.

అప్పుడు మయూరసార్వభౌముండు మంత్రిం జూచి యిట్లనియె; "దూరదర్శీ! నీ వీవఱకును వచియించిన దంతయు నాదరణీయం బయి యున్నది. నీమాట చొప్పున మేఘవర్ణుని రాజ్యంబునకుఁ బట్టంబు కట్టఁగూడమికి మేమును నొప్పుకొన్నారము. ఇఁకఁ గర్పూరద్వీప పరిపాల నంబునకు మనవారిలో నేరి నియోగింపవలెనో వ్రాక్రువ్వుము." అనిన మందహాసంబు గావించి, సగౌరవముగా దూరదర్శి యిట్లనియె.

"దేవా! మన మిప్పు డాహిరణ్యగర్భునిఁ బరాజయంబు నొందింపఁ గలుగుట మాయోపాయముచేతఁ గాని, నిక్కంపుఁబౌరుషంబుచేతం[9] గాదు.

---

1. గృహ -కృత్య - నిర్వహణ + ఆయత్త - చిత్తము = ఇంటిపనులను జేయుట కధీనమైన మనస్సు; 2. నందనుఁడు = కొడుకు; 3. లగుడము = కఱ్ఱ; 4. భాండపంక్తులు = కుండల వరుసలు; 5. వెడఁగు బాపనయ్య = వెఱ్ఱి బ్రాహ్మణుఁడు 6. బహుమానము = బహూకృతి - ఇక్కడ దెబ్బలు; 7. పుడమివేల్పు = భూసురుఁడు - బ్రాహ్మణుఁడు; 8. దూఱు = నింద; 9. నిక్కంపుఁబౌరుషము = నిక్కము + పౌరుషము - పుంప్వాదేశ ద్రుతకార్యములు.

అతఁడు మహాసత్త్వసంపన్నుండు; ప్రజారంజకుండు; అసమానమాన మహితుండు[1]. కావున నీ యవమానంబున కోర్చి యాతం డూరకుండువాఁడు కాఁడు. ఉన్నట్టుండి యెప్పుడో యేమఱుపాటున మనపయిం బడి పగఁదీర్చుకొన సమయంబుకొఱకుఁ బ్రతీక్షించుచుండును. అతనిమంత్రియు నన్యసామాన్యశేముషీమంతుండు[2]; సర్వంకషప్రజ్ఞగలవాఁడు[3]; సౌజన్య ధన్యుఁడు[4]; ప్రతాపదీపితుఁడు[5]; కాలచోదితుండయి[6] వెనుక తేఁ డాతని మంత్రంబుదెన ననాదరంబు సేయుటంజేసి యీ మేఘవర్ణున కందుఁ జేరంగలిగెను గాని, హిరణ్యగర్భుం డప్పుడాతని మంత్రంబునే నమ్మికొని ప్రవర్తించెనేని యింతకుముందు మన మెక్కడ నుండవలసినవారమో దేవరయే యూహింపఁదగియుండును. వెనుక నొకసారి నమ్మి భంగపడి[7] యున్నవాఁ డవుటఁజేసి తొంటియ ట్లేమఱియుండక యిఁక జాగరూకతతో మంత్రి వాక్యములనే వేదవాక్యములనుగా మన్నించుఁ గాన, ముందు మనయాట లేమియు నాతనికడ సాగవు. ఇంతియకాక రాఁబోవునది వర్షాకాలము. జలపక్షులగుటంజేసి యాతని సైనికనికాయంబుల[8] కది యాలంబున[9] కనుకూలకాలంబై చూపట్టును. స్థలపక్షులగు మన పక్షమువారికో వర్షాకాలదినంబులు దుర్దినంబు[10] లె యయి కానఁబడును. కాఁబట్టి హిరణ్య గర్భునితోడ సంధి గావించుకొని యాతని రాజ్యం బాతని కొసంగుట సముచితకార్యము. హిరణ్యగర్భుని సంగరంబున[11] జయించితి మన్న ప్రతిష్ఠ యీ వఱకే వచ్చి యున్నది. దానంజేసి యిఁక దేవరకీర్తి లోకంబున శాశ్వతంబుగ

---

1. అసమాన - మాన - మహితుఁడు = సాటిలేని చిదౌన్నత్యముచే గొప్పవాఁడు; 2. అనన్య - సామాన్య శేముషీమంతుఁడు = ఇతరులకు సాధారణము కాని బుద్ధికలవాఁడు; 3. సర్వంకషప్రజ్ఞ = అన్నిటి నొరయు తెలివి - సంపూర్ణమైన తెలివి; 4. సౌజన్యధన్యుఁడు = మంచితనముచే ధన్యుఁడు; 5. ప్రతాప - దీపితుఁడు = ప్రతాపముచేఁ బ్రకాశించువాఁడు; 6. కాల - చోదితుఁడు = కాలునిచే (యమునిచే) ప్రేరేపింపఁబడినవాఁడు; 7. భంగపడు భంగము + పడు = అవమానపడు; 8. నికాయము = సమూహము; 9. ఆలము = యుద్ధము; 10. దుర్దినము = చెడు దినము - సూర్యదర్శనముగాని దినము; 11. సంగరము యుద్ధము.

నెలకొనఁగలదు. అంతకన్న మనకుఁ గావలసిన దేమి? హిరణ్యగర్భుండు దేశకాలానుకూలంబు తెలిం గెఱింగి మరల సంగరంబునకు రాక తక్కఁడు. పరమర్మభేదనోపాయధౌరేయుం[1] డగుసర్వజ్ఞుని బుద్ధిసంపదకుఁ దోడు సహాయ సంపదంగూడఁ బడసి దడ్డంబులతోడ దాడివెడలి మనలం దొడరు మరాళ రాజున కాజి[2] యిచ్చి నొచ్చి యోడి, దిగ్దేశముల వ్యాపించిన యశస్సును[3] గోలుపోక నిలుపుకొనుట యుక్తము; నేఁజెప్పవలసినది చెప్పితిని. ఇంక దేవర యిష్టము." అనినఁ బకపక నవ్వి బలదర్పంబున నాతని మాటలు పాటింపక శిఖండీంద్రుం[4] డిట్లనియె.

నీవేవెూ లోకములో లేని యూహలనెల్ల నల్లి నేర్పువెూయి న్నిరాధారముగ నాకాశహర్మ్యమునుఁ[5] నిర్మింపఁజూచుచున్నాఁడవు, కాని యది యుక్తిమారుతంబు[6] తాఁకునకుం గదలక నిలువనేరదు. సంగ్రామంబున సర్వంబును బోఁగొట్టుకొని ప్రాణమాత్రావశిష్టుండై యోడి పాఱినహిరణ్యగర్భుం డెక్కడ? సంగ్రామవిజయగర్వోన్నతి న్మాఱు లేక మలయుచున్న[7] చిత్రవర్ణుని నాతండు భండనంబునం[8]దాఁకి మానప్రాణంబులు గోలుపోక నిలిచి గెలుచు టెక్కడ? ఈమాట లెవ్వరయిన విన్న నవ్వుదురు. బాహుబలంబున నార్జించుకొన్న నేల నాఁచికోలేక[9] నిష్కారణముగాఁ జేవిడుచుట వీరధర్మంబు గాదు. రణవిజితుం డగుహిరణ్యగర్భుం డిప్పుడు నాచేతిలోనివాఁడ. అతని నాతనిరాజ్యంబును నా యిచ్చవచ్చినట్లు చేయఁగలవాఁడను. నీ విఁక వేయి చెప్పినను రాజ్యంబు విడువఁ గలవాఁడను గాను. ఇంక నీ విషయమున నీవు నాతోడ నేమియుఁ జెప్ప వలదు." అని, వీరగర్వంబునఁ గొలువు విడిచి లోపలి మందిరంబునకుం జనియెను. అంత మంత్రి మొదలగువారును దమతమ నెలవులకు నరిగిరి.

---

1. పర మర్మ - భేదన + ఉపాయ - ధౌరేయుఁడు = శత్రువుల రహస్యముల భేదించుటకై ఉపాయమును వహించువాఁడు; 2. ఆజి = యుద్ధము; 3. యశస్సు = కీర్తి; 4. శిఖండి + ఇంద్రుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు; 5. ఆకాశ - హర్మ్యము = ఆకాశమునందు మేడ; 6. యుక్తి - మారుతము = ఉపాయమనెడి గాలి; 7. మలయు = తిరుగు; 8. భండనము = యుద్ధము; 9. ఆఁచికొను = అపహరించుకొను.

నేనును దేవరకు వార్తావిశేషంబులు విన్నవింపఁ గ్రన్ననఁ[1] జను దెంచితిని. అని ధవళాంగుండు సర్వంబును నివేదింప, రాజానుమతంబున సర్వజ్ఞుఁ డాతని కిట్లనియె "ధవళాంగా! నీవు మార్గాయాసంబునఁ గడు బడలి యున్నవాఁడవు. ఇప్పుడు గృహంబునకుం బోయి యలసట వాపికొని, పిమ్మట నెమ్మదిగా మఱియొకసారి దొరవారిని సందర్శించుకొమ్ము. నీకు మేము మిక్కిలి శ్రమమిచ్చినారము. నీ స్వామిభక్తికిని గార్యనిర్వాహకత్వంబునకును స్వామియు నేమును స్వాంతంబున నెంతయు సంతసించినారము. నీ వింకఁ బోయి రమ్ము." అని వీడుకోలిచ్చిన, నా బకంబును మనంబునఁ గరంబు నయంబును భయంబును గదుర ఱేనికిని మంత్రికిని మ్రొక్కి తనయిక్క[2]కుం జనియెను.

ధవళాంగుండు నిజమందిరంబున కరిగిన యనంతరంబున హిరణ్యగర్భుండు మంత్రితోడ నేకతముండి, కార్యాలోచనం బడిగినఁ బ్రెగ్గడ యిట్లనియె. మన మీవఱకే బవరంబున నోటువడి వాసి[3] చెడియున్నవార మగుటంజేసి, యిప్పు డావిరోధివరూధినీజాలంబు[4] నెక్కటిం[5] దాఁకి వీఁక[6] చెడక నిలువఁజాలము. బలశాలి యగువిరోధిని సాధింపఁ దలంపు గొన్నవాఁ డంతకంటె బలవంతునితోడఁ జెలికారంబు[7] వాటించి యా మేటిమగనిం దనవైరిమీఁదికిం బ్రేరేఁపవలయునని నీతివిద్యావిదులు పలుకుదురు. గంధగజం[8] బుబ్బలిలోఁ[9] దగులుకొన్నప్పుడు గంధగజంబే లేవనెత్తవలెను గాని యాపని యొక్క మ్రుక్కడిమృగంబుచేతఁ గానేరదు. సింహళద్వీపాధినాథుం డగుమహాబలాభిధాన[10] సారసకులపవిత్రుండు మనకుం బరమమిత్రుండు గలండు. అతనిపాలి కిప్పుడ దూతను బంపి, జంబూద్వీపంబుపయి దండు వెడలి మనకుఁ దోడు సూప వేఁడుకొన వలయును. ఇప్పటి కిదియ నాకుం జూడ నవశ్యకర్తవ్యంబుగ్గాఁ దోఁచుచున్నది.' అనిన ఱేఁడునుఁ గడు నలరి

1. క్రన్ననన్ = శీఘ్రముగా; 2. ఇక్క = స్థానము, ఇల్లు; 3. వాసి = ప్రసిద్ధి; 4. విరోధి - వరూధినీ - జాలము = శత్రుసేనల సమూహము; 5. ఎక్కటి = ఒంటరి; 6. వీఁక = పరాక్రమము; 7. చెలికారము = చెలిమి; 8. గంధ - గజము = మదించిన ఏనుఁగు; 9. ఉబ్బలి = బురద; 10. అభిధానము = పేరు.

మంత్రిం గొనియాడి, తదుక్తప్రకారంబున వేగంబ సుగుప్తంబుగా[1] నొకలేక లిఖియించి, పదిలంబుగా ముద్రవైచి, విచిత్రుండను బకంబును రహస్యంబుగఁ బిలిపించి, యాలేఖ నతనిచేత నిచ్చి సింహళ ద్వీపంబునకుం బుచ్చెను.

అంత నచ్చటఁ జిత్రవర్ణుండు మఱియొకనాఁడు నిండుకొలువుండి నానావిషయంబులు ముచ్చటించుచుఁ, బ్రసంగవశంబునఁ గర్పూరద్వీపము మాట వచ్చి మేఘవర్ణునితో నిట్లనియె. "ఓయీ మేఘవర్ణా! నీవు బహు వారములు[2] కర్పూరద్వీపమునుండి వచ్చితివి గదా? హిరణ్యగర్భుఁ డెట్టిగుణములు గలవాఁడో యాతని మంత్రి చరిత్ర మెట్టిదో నీవు చక్కఁగా గ్రహించియుందువు. కాఁబట్టి వాని నెల్ల మాకడ వివరింపుమా చూతము." అనినఁ గాకం బిట్లనియె : "హిరణ్యగర్భమహారాజు మహాశయుఁడు; సత్యసంధుఁడు; జాగరూకుఁడు. మంత్రి సర్వజ్ఞుండును సర్వవిధంబుల సమర్థుఁడు; ప్రెగ్గడతనంబున[3] నాతనితోడ నీడగు ప్రయోజకుని నొండొక్కనిం గానము." అనినఁ జిత్రవర్ణుండు తల యూఁచి మందహాసపూర్వకంబుగా నిట్లనియె. "అంతటి మహాశయుం డగుటచేతనా హిరణ్యగర్భుండు నీచేత నంత సులభముగా వంచితుఁ డయ్యెను? ఏ దేదీ? ఇఁకఁ గొంత చెపుమా?" అనిన వాయసముఖ్యుం డిట్లనియె. "విశ్వాసముకతంబున నేమఱియున్నవానిని వంచించుట యొక ఘనకార్యము కాదు. నమ్మకముచేతఁ దొడమీఁదఁ దల నిడుకొని సుఖముగా నిదురించుచున్నవానిని గొంతుకోయుట యొక పౌరుషమగునా? నల్లనివెల్ల నీళ్లును దెల్లని వెల్లం బాలును ననుకొను నమాయికులు తమవలెనే లోకములో నెల్లవారును సత్యవాదులును సన్మార్గవర్తులును నిష్కపటులును ననుకొందురు. లోపల నుండు మాయలును మర్మములును నెఱుంగ రాకుండ నేరుపుమెయి[4] దుర్జనులు చెప్పు తేనె మాటలకు మోసపోయి ప్రథమమున వారివలం దగులుకొందురు. ఒకటి

1. సుగుప్తము = మిక్కిలి రహస్యము; 2. బహు - వారములు = పెక్కుమాఱులు; 3. ప్రెగ్గడతనము = మంత్రిత్వము; 4. నేరుపుమెయిన్ = నేరుపుతో;

రెండుమాఱు లనుభవమయినమీఁదటఁ దరువాతి విషయములలో మిక్కిలి జాగ్రత్త గలిగియుందురు. ఎవ్వరైనఁ గ్రొత్తగా వచ్చినవానిగుణంబు లిట్టి వాని మాటలనుబట్టి నిశ్చయించుకోవలెను గాని మనసులో నే మున్నదో లోఁ జొచ్చి చూడలేరు గద? పూర్వ మొక యుర్వీసురుఁడు[1] కొందఱు ధూర్తు చేత మోసపుచ్చఁబడ లేదా? దేవర కా కథ వినిపించెదను వినుండు.

### బ్రాహ్మణుఁడు - దొంగలు

బ్రాహ్మణుఁడు పరమచ్ఛాందసుఁ[3] డొకఁడు తన యధ్వరార్థంబు[4] నల్ల మేఁక నొకదానిం గొని మెడకుఁ బగ్గ మగ్గలముగా[5] మించువేడుకతోడ నింటి కీడ్చుకొని పోవుచుండెను. త్రోవలో నొక చెఱువుగట్టుమీఁదఁ గూర్చుండి చూచి దుర్నయంబునఁ గొందఱు దుర్మార్గు లా యజంబును[6] గాఁజేయవలెనని తలంచి తమలోఁ దా మిట్లు చింతించిరి. ఈ ధరామరుం[7] డదె బలిసిన మేఁకపోతుం గొనిపోవుచున్న వాఁడు. ఒక్కనిష్కమిచ్చి[8] కొంద మన్నను మన కిట్టి క్రొవ్వినది సాధారణముగా దొరకదు. ఈ వైదికశిఖామణి[9] నేలాగునవైన వంచించి యా ఛాగంబు[10] నిప్పు డపహరించితిమేని వారముదినములవఱకుఁ బుష్కలముగా మన మనన్యాపేక్షం[11] బుగ మాంసభక్షణంబు సేయవచ్చును. అనునెడ నొకధూర్తుఁడు నడుమ నడ్డము వచ్చి యిట్లనియె. "ఈ బ్రాహ్మణుఁడు పిశాచమువలెఁ బట్టుకొని యేమఱక యా మేఁకం గొంతున కురిపోసి ధరాపరాగంబు[12] రేఁగ లాగుకొని పోవుచుండఁ, బట్టపగలు[13] నట్టనడువీధిలో మన మెట్లు దీని నెత్తుకొనిపోయి ప్రజలకన్నులు గప్పఁగలము? రాజభటులును భయంకరులయి యమకింకరులవలె దండహస్తులై యూర నెల్లెడఁ దిరుగులాడుచున్నారు. మనల నొకవేళ దొంగలమని పట్టుకొనిపోయి,

1. ఉర్వీసురుఁడు = బ్రాహ్మణుఁడు; 2. ధూర్తుఁడు = వంచకుఁడు; 3. పరమచ్ఛాందసుఁడు = పరమ + ఛాందసుఁడు; 4. అధ్వర + అర్థము = యజ్ఞముకొఱకు; 5. అగ్గలము = అధికము; 6. అజము = మేఁక; 7. ధరా + అమరుఁడు = బ్రాహ్మణుఁడు; 8. నిష్కము = మాడ; 9. శిఖామణి = తలమానికము, శ్రేష్ఠతా వాచకము; 10. ఛాగము = మేఁక; 11 అనన్యాపేక్షము = ఇంకొకదానిమీఁదఁ గోరికలేకుండ; 12. ధరా - పరాగము = నేలయందలి ధూళి; 13. పట్టపగలు = పగలు + పగలు - ఇది కడాదులలోనిది.

చండశాసనుం డగురాజు నెదురం బెట్టినఁ గ్రూరశిక్షలకుం గుఱి కావలసి వచ్చును. దైవ మిచ్చిన మాత్రము సుఖముగఁ గుడిచి కూర్చుండలేక తల ద్రొవ్వి యకార్యకరణంబునకుఁ జొచ్చితిమేని, మన కందఱకు నేకకాలంబునఁ గాలంబు చేరు వగును. ఈ వ్యర్థప్రయత్నముచే మన కవమానం బగుట దక్క నభిమతకార్యసిద్ధి యొదవ నేరదు. నాబుద్ధి విని యింక నీ ప్రయత్నంబు మానుఁడు". అనినం బకపక నవ్వి బాల్యమునుండియు మోసవుఁబనుల నాఱితేఱిన యొక వృద్ధవంచకుం డిట్లనియె - నీకు లోకానుభవంబు చాలమింజేసి బేలతనంబున బాలవాక్యంబులు పలుకుచున్నాఁడవు. నిజముగా నావంటి ప్రౌఢుఁడు దలఁచుకొన్న నీయల్పకార్యంబు సాధించుట యెంతపని? ఫాలాక్షునైనను మోసపుచ్చి యభిమతంబు తుదముట్టించును. చూడు మే నిదె నీవు చూచుచుండ నా శక్తిచేత నీ మేఁకపోతును గుక్కను జేసి తీసికొని వచ్చి మీకందఱకుఁ గాంక్షలుదీఱ దీని మాంసమున విందుచేసి మీచేత నిప్పుడె మెప్పించుకొందును. తొల్లింటికాలంబున నొక మర్కటంబు మకరంబును మోసపుచ్చికాదే తన ప్రాణంబులఁ గాపాడుకొనెను. మీ కక్కథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

## కోఁతి - మొసలి

పశ్చిమసముద్రతీరంబున నుండునడవియందు బలవర్ధనుఁ డను ప్లవంగపుంగవుం డొకండు వసియించుచుండును. అతండు వార్ధక్యంబున హీనసత్త్వుం డగుట చూచి జ్ఞాతులు సర్వముం దోఁచుకొని యాతని నిల్లు వెడలనడంచిరి. బలవర్ధనుండును నడవులపాలయి పోయిపోయి, తపతీ నదంబు తీరంబున ఫలభరితంబై యున్న యొక్క మేడిచెట్టు నాశ్రయించి, తత్ఫలాహారంబున శరీరధారణంబు గావించుకొనుచుండెను.

ఇట్లు ఫలమాత్రమునఁ బ్రాణభరణముఁ జేసికొనుచు నా యుదుంబర వృక్షము [1] మీఁదఁ జిరకాలము నిర్విచారముగా నుండి, యొక్కనాఁడు పండ్లం దినుచుండ వలకేలం[2] బట్టుకొన్నపండు ప్రమాదవశంబునంజాఱి నీరంబులం

---

1. ఉదుంబర-వృక్షము=మేడిచెట్టు, 2. వల-కేలన్ = కుడిచేతను.

బడ బుడబుడశబ్దం బొక్కటి పుట్టెను. వానరమున[1] కా నినదము[2] శ్రవణానందముగా నున్నఁ దన మర్కటచేష్టలు[3] బయల్పడ బలవర్ధనుం డవారిగ[4] వారి[5]లోపల ఫలములఁ బడవేయఁ జొచ్చెను. దైవవశంబున నావేళనె ఛాయ[6]కయి వచ్చి చెట్టుక్రింద నీడం బండుకొనియున్న క్రకచం బను మకరం[7] బొకపండు కొని చప్పరించి జిహ్వ కింపుగా భక్షించి రుచి మరఁగి మఱియు నోరూర వానరము రాల్చుఫలముల నెల్ల మెల్లమెల్లఁగా నాలుక త్రుప్పుడుల్ల[8] నారగింపసాగెను. ఇట్లు ఫలాపేక్షంజేసి యామొసలి ముసలికోఁతితో మైత్రి చేసికొని, యిల్లును వాకిలియు మఱచి యాలుబిడ్డలం దలపెట్టక నెలలకొలంది నచ్చుటనే కాలక్షేపము చేయుచుండెను. అంత గృహంబున నాతనిగృహిణి దుస్సహం బగు పతివిరహంబునకుం[9] దాళఁ జాలక పెనిమిటిం దలఁచుకొని యహోరాత్రములు[10] నేత్రముల నీరు సంతత ధారగాఁ గాఱ నేడ్చుచు, కొక్కదూతిం బిలిచి ప్రాణనాయకుని విలంబనకారణం[11] బారసి యాతని సుఖవార్తను జెవుల వేసి మేనం బ్రాణంబుల నిలుపు మని బహువిధంబులఁ బ్రార్థించెను. ఆ దూతికయు నతిరయంబునం గదలి వెదకుచు వచ్చి యా ...డిచెట్టునీడను గోఁతితోడఁగూడ నుండి వేడుకమాట లాడుచున్న క్రకచునింజూచి పోయి దీనాననంబుతో నామాసిని యడుగులఁ బడి, 'మగువా! మగఁ డొకకోఁతిముగుదం[12] దగులుకొని మగుడ నెలవునకు రాఁజాలకున్నాఁ' ని, యున్నవి కొన్నియు లేనివి కొన్నియుఁ గల్పించి గ్రుడ్ల నీరు గ్రుక్కు ...నుచు వినిపించెను. పతి యొండొకసతిం దవిలియున్నాఁ డన్న పలుకులు ములుకులవలెఁ జెవిని బడిన మాత్రమున నుల్లము జల్లన నొల్లఁబోయి[13] ...ల్లనఁ దెలివొంది యామొసలిచెలువ[14] చెలువుని[15] నడతం దడవి మన

---

...వానరము = కోఁతి; 2. నినదము = ధ్వని; 3. మర్కట - చేష్టలు = కోఁతి పనులు; 4. ...వారిగన్ = అడ్డులేకుండ; 5. వారి = నీరు; 6. ఛాయ = నీడ; 7. మకరము = మొసలి; ...డుల్లన్ = పోవునట్లు; 9. పతి - విరహము = పతితోడి విరహము; 10. అహస్ (:) + ...త్రి = అహోరాత్రములు = పగలును, రేయియు; 11. విలంబన కారణము = ఆలస్య ...తువు; 12. ముగుద (వి) - ముగ్ధ (ప్ర.) = స్త్రీ; 13. ఒల్లఁబోవు = మూర్ఛిల్లు; 14. ...లువ = స్త్రీ; 15. చెలువుఁడు = భర్త.

మెరియు[1]. వెచ్చ నూర్చుచుండెను. ఇచటఁ గ్రకచుండును. దూతిక యేతెంచి దవ్వుల నృగిడిపోవుట దూరమునుండి పొడగని గుండెలు తటతటం గొట్టుకొన, అది సదనంబునకుం[2] జని తనమీఁదఁ గామినితో[3] నేమి నేరములు చెప్పునో యని యచట నిమిషమయినఁ గాలు నిలువక, వడివడి స్సంగతికాని[4] వీడుకొని, యింటి కేగునప్పుడు శూన్యహస్తములతోఁ బోఁగూడదని చేడి యకు[5] సూడిదగా[6] నిడఁ గొన్ని మధురతరపరిపక్వ[7]ఫలంబులం గొని హుటాహుటిఁ[8] జనియె. ఈలో నా మకరాంగన[9] తన చెలులవలనం బతిరాక మున్మ్ముంద యెఱిఁగి, చెలికత్తెయలు సూరెలం[10] జేరి విలపించుచుండ, మూసిన కన్నులు తెఱవక పడియుండి మూలుగుచుండెను. క్రకచుండును దార[11] దారసించి[12] కాంచి హృదయంబు పగిలి నోరు గద్గదికం దగులువడ బడఁతిఁ బిలిచి యలబ్ధప్రతివచనుండయి[13], తత్తరంబున నిదియేమని చెలికత్తియల నడిగిన నత్తరుణు లిట్లనిరి. "నీవు వెనుక మఱచి, పోయినపోకగాఁ బోయి యింటి యొద్దఁ బెండ్ల మేమయినను సరేయనుకొని నెలదినములనుండి బొత్తిగా నిల్లు త్రొక్కి చూడకుంటివి. నీ వరిగిన మఱుసటి దినము మొదలుకొని నీ భార్యకుఁ దీఱనివ్యాధి పట్టుకొని దినదినక్రమమున రోగము ప్రబలి నేఁటి యుదయము నుండి మాటపడి పోయినది. తెవ్వులు కనఁబడినది మొదలుకొని రాత్రియనక పగలనక తిరిగి, కన్నకన్నవారి కాళ్లెల్లం బట్టుకొని సామ్మునకు[14] వెనుక ముందులు చూడక మేము మా చేత నయినపని లోకములో లేనిసిద్ధౌషధముల[15] నెల్ల నొకటి కాదని యొకటిఁ బోయించితిమి. ఆఁడువార మింతకంటె నేమిచేయఁగలము? వేసిన మందులెల్ల నేమూలఁ బడుచున్నవో కాని లేశ మయినను గుణ మగపడలేదు. మందులు పోసిపోసి విసిగి వైద్యులు కడచికిత్స

---

1. ఎరియు = మందు; 2. సదనము = ఇల్లు; 3. కామిని = స్త్రీ - భార్య; 4. సంగతికాఁడు = స్నేహితుఁడు; 5. చేడియ = స్త్రీ - భార్య - చేడె (రూపాం.); 6. సూడిద = కానుక; 7. పరిపక్వ = బాగుగాఁ బండిన; 8. హుటాహుటిన్ = శీఘ్రముగా; 9. మకరాంగన = ఆఁడు మొసలి; 10. సూరె = ప్రక్క; 11. దార = భార్య; 12. తారసించు = సమీపించు 13. అలబ్ధప్రతివచనుఁడు = పొందఁబడని మాఱుమాట గలవాఁడు; 14. సొమ్ము (వి) · స్వము (ప్ర.); 15. సిద్ధౌషధము = సిద్ధ + ఔషధము - వృద్ధి సంధి.

యొకటి చెప్పిరి. కోఁతిగుండెకాయ నేయత్నముచేతనైన సంపాదించి దానిం బాలతో నాలుగుదినములు సాయంసమయమున సేవించుచు వచ్చిన రోగము నిశ్శేష మయి యీ ముదిత[1] బ్రతుకఁగలదనియు, లేకున్న జీవితాశ వదలు కోవలసినదనియుఁ దెలియఁ జెప్పిరి. చెడఁగాఁ జెడఁగాఁ గాఁపురములు గావు. మీము చెప్పవలసినది చెప్పితిమి. ఇంక నేపాట్లుపడి వానరహృదయము తెచ్చి కార్యం బ్రతికించుకొనెదవో మీఁద నీయిష్టము." అనినం గొంతతడవు నిశ్చేష్టితుఁ డయి వితాకు[2] గదిరి[3] యుండి, యేమియుం బాలుపోక యాకసము వంకఁ దిలకించి పరిపరివిధంబులఁ జింతించి తల పంకించి, యెట్లును బోక తీఱదని నిశ్చయించి, వారికడ నోరు మెదల్పలేక కదలి చనుచు మార్గంబున నిట్లుచింతించెను. ఇంట భార్య చూడఁబోయిన వచ్చెడు ప్రాణముతోను బోయెడు ప్రాణముతోను నున్నది. వైద్యులో యసాధ్య మయిన యౌషధము జెప్పిరి. సాధ్యమయ్యెఁబో నెయ్యునిం[4] బొలియించునంతటిపని పుట్టును. బలవర్ధనుండుదక్క నాకు మఱియొక్కకోఁతి యెక్కడఁ జిక్కును? వానర హృదయ మెత్తెఱంగునఁ దెత్తును? లేక యీయవస్థలో నున్న సన్నుతాంగి[5] నెట్లు మందు వేయక బలవంతముగాఁ జంపుకో నేర్తును? భార్య నిమిత్తము మిత్రద్రోహము చేయుట తగ వగునా?[6] కాదని యొప్పరికించిన నిష్కారణముగాఁ బండువంటి కాఁపురము కూలిపోవుచున్నది. మిత్రవధంబు దురితంబులలో నెల్ల దురితంబు;[7] జాయ[8] తన కాయంబులో[9] నర్ధం[10] బగుటంజేసి యాలిం[11] గోలుపోవుట యాత్మవధంబుకంటెను బాతకంబు.[12] లోకములోఁ దన్ను మాలినధర్మము లేదు గదా? సూక్ష్మదృష్టి న్విచారింప మిత్రునిప్రాణంబులు గొనియైనఁ బ్రాణేశ్వరీప్రాణత్రాణంబు[13] గావించి యిల్లు

---

1. ముదిత = స్త్రీ; 2. వితాకు = నిశ్చేష్టత; 3. కదురు = కలుగు - అతిశయించు; 4. నెయ్యుఁడు = స్నేహితుఁడు; 5. సన్నుతాంగి = మిక్కిలి పొగడఁబడిన అంగములు గలది - స్త్రీ; 6. తగవు = న్యాయము; 7. దురితము = పాపము; 8. జాయ = భార్య; 9. కాయము = శరీరము; 10. అర్ధము = సగము; 11. ఆలు = భార్య; 12. పాతకము = పాపము; 13. త్రాణము = రక్షణము.

నిలువంబెట్టుకొనుటయే యుచితము." అని కృతనిశ్చయుం డయి పదియడుగులు నడచి యంతటి పాపంబున కొడిగట్ట నొకపట్టున మన సొప్పక డోలాందోళనంబు[1] వొందఁ గ్రమ్మఱఁ గొంతవడి విచారించుచు నిలువంబడి, కడకుఁ బాపనిశ్చయుండై[2], బలవర్ధనవధోద్యోగంబున[3] నేగుదెంచిన చెలికానిం గని యా వనచరవల్లభుం[4] డిట్లనియె. "మిత్రమా! చిత్ర మయ్యెడును. కళత్రముం[5] జూడ వేడుకపడి గడియ క్రిందటనె చని యింతలోనే యేల తిరిగి వచ్చినాఁడవు? నీ రాకకుం గల కారణము తెలుపుము." అనిన నా నక్రంబు[6] వక్రంబుగా[7] నవ్వి యిట్లనియె. "నీచేత ననుజ్ఞాతుండ[8] నయి మందిరంబునకుంజని నా సుందరిం గని యమందానందంబున నీవిచ్చిన స్వాదు[9] ఫలంబుల నొసంగిన నంతరంగంబునఁ బొంగి యా యంగన కొన్ని మెసంగి[10], వానిరుచి కచ్చెరువడి "యీ పండ్లెక్కడివి? వీని నీకిచ్చిన పుణ్యాత్ముఁ డెవ్వఁడు? నీవిన్నాళ్ళదాఁక నెక్కడ మసలితివి? చెప్పు" మనిన, నేనిట్లు చెప్పితిని: 'తపతీనది యొడ్డున నుండు మేడిచెట్టుమీఁద బలవర్ధనుం డను తరుచరసత్తముం[11] డొకఁడు కలఁడు. ఆతఁ డనింద్యచరితుండు[12]; స్నేహ పాత్రుఁడు; నాకుం బరమమిత్రుఁడు. ఆ దయాళుని యాదరణంబున సమస్తము మఱచి యాతనికడ నపూర్వసుఖం బనుభవించుచు నిందాఁక వదలి రాలేకుంటిని. ఆ మహామహుండు నన్ను సాంత్వనవచనంబుల[13] వీడుకొలిపి యమృతోపమానంబు[14] లగు నీఫలంబుల నిచ్చి నీ యొద్దకుం బుచ్చెను." అని నీ యుపకారకృత్యంబులు స్తుతిపాఠకుగతిం బొగడి నీ సుగుణ సంపదను

---

1. డోలా + ఆందోళనము = ఊయల ఊఁపు; 2. పాపనిశ్చయుఁడు = పాపమునందు నిశ్చయము గలవాఁడు; 3. వధ + ఉద్యోగము = చంపు ప్రయత్నము; 4. వనచర - వల్లభుఁడు = కోఁతిఱేఁడు; 5. కళత్రము = భార్య; 6. నక్రము = మొసలి; 7. వక్రము = వంకఱ; 8. అనుజ్ఞాతుఁడు = అనుమతింపఁ బడినవాఁడు; 9. స్వాదు = రుచిగల; 10. మెసఁగు = తిను; 11.తరుచర - సత్తముఁడు = కోఁతులలో శ్రేష్ఠుఁడు; 12. అనింద్య - చరితుఁడు = నింద్యముగాని చరితము గలవాఁడు; 13. సాంత్వన - వచనములు = అనునయవాక్యములు; 14. అమృత + ఉపమానము = అమృతము ఉపమగాఁ గలది - అమృతముతో సాటి యైనది.

సహస్రముఖంబులం గొనియాడితిని. నీచెలియ[1] లాసలుకులు విని నన్నుఁ గనిసి[2] 'ఓయి! కృతఘ్నుఁడా![3] సుహృత్తముఁడైన యా వనచరోత్తముని నీతోడఁ గూడ మన భవనమునకుం గొని వచ్చి మనపాలిటి వేలుపుం[4] బోలెఁ బూజించి జన్మసాఫల్యంబు గాంచక యాచెట్టుమీఁద నొంటిం దిగవిడిచి వచ్చితివే? ఇప్పుడు పోయి యా కపికులగ్రామణికి[5] నా మ్రొక్కని మ్రొక్కి యిక్కడకుం గొడితెచ్చి మఱి నాతోడ మాటాడుము." అని పదరి[6] న న్నిచటికిఁ బంపిన న్ను వెంటఁ బెట్టుకొనిపోవచ్చితిని.

నా ప్రార్థనం బంగీకరించి వేగమ మదీయాగారంబునకు[7] చ్చేయుమా. పోదము!" అని యా కపటాత్ముండు మిథ్యావినయంబునఁ[8] లికిన నా వానరవరుండు నెయ్యునిమాట కడ్డ మాడలేక యియ్యకొని ట్లనియె: "క్రకచా! నాకు నీ యిల్లు లాఁతియిల్లు కాదు; నీ యగారంబున రుదెంచి నీవలని సత్కారంబులం బడయుటకు నాకేమియు నడ్డంకి లేదు. ని, యొుక్క ప్రతిబంధము మాత్రము కనఁబడుచున్నది. నేను నచరుండనయ్యును నీవనంబులనె చరియింపఁగలను గాని మీ రుండు నంబులఁ[9] జరింపఁజాలను. మీ గృహంబున కెట్లు రాఁ గలుగుదునో ప్పుము." అనిన మకరంబు కరంబును మింటివంకఁ జూచి యాలోచించి ట్లనియె. "నే నంత విచారింపక నిన్నుఁ బిలుచుకొని పోఁదలచినాఁడను ను. నా యిల్లు నీకు రారానిచోటు గాదు. మేముండినది యీ యేటిలంకలోని కసుందరమందిరము. దాని చుట్టుపట్టుల ఫలవృక్షము లనేకంబులు గలవు. దీవి మానోజ్ఞకం[10] బేమని చెప్పుదును? అది భూతలస్వర్గంబు నాఁ జూడ్కికి గొలుపుచుండును. ఱేపును మాపును మా మందిరంబున సపర్య[11] గొనుచు వచ్చినప్పుడెల్ల నందు విహారంబు సలుపుచుండ వచ్చును. మార్గంబున

చెలియలు = చెల్లెలు; 2. కినియు = కోపించు; 3. కృతఘ్నుఁడు = చేసిన మేలు చినవాఁడు; 4. వేలుపు = దేవత; 5. కపి - కుల - గ్రామణి = క్రోఁతుల సమూహము దు శ్రేష్ఠుఁడు; 6. పదరు = కోపించు; 7. మదీయ - అగారము = నాదైన యిల్లు; 8. థ్యావినయము = అసత్యపు అడఁకువ; 9. వనము = నీరు, అడవి (నానా.), దీవి (వి.) పము (ప్ర.); 10. మానోజ్ఞకము = అందము; 11.సపర్య = సేవ.

నీకొక్క యుపాయంబు గలుగకుండ నిన్ను నావీఁపు మీఁద నెక్కించుకొని యుపాయముగాఁ గొనిపోయి మా యావాసంబున[1]ఁ జేర్చి నీచెలియ లత్యంతతాత్పర్యంబున[2] నా వహించిన[3] శాకపాకంబులతోడి భక్ష్యంబుల నుపాయనంబు[4] చేసెద. నీసోదరి మనరాక కెదురు చూచుచుండును. రమ్మా పోయివత్తము." అనిన మాఱుమాటాడక యా కీశలోకేశుండు[5] వృక్షావతీర్ణుండయి[6] క్రకచునివీఁపునం దూఁకెను. దూఁకుటయె తడవుగా మకరంబు సుకరంబుగా వానరంబును వెన్నున నిడుకొని చనుచుఁ దెన్ను[7]నఁ దనలోఁ దానిట్లు పలుకఁజొచ్చెను. "అయ్యయో! ఎంత దారుణకర్మంబు గావింపఁ జూచు చున్నాఁడను! ఒక్క యాఁడుదాని నిమిత్తము మిత్రముం దోరించి ఘోరపాతకంబు కట్టుకోవలసి వచ్చెఁగా! ఇఁక నేనేదుర్గతికిఁ బోదునో యెఱుంగను. ననువంటిదుష్టాత్ము లెందైన నుందురే? దైవమా! నే నేమి నిందలపాలు గావలయునో" అని యీ రెలుంగున[8] ననుకొనుచు ఖిన్న హృదయుండై[9] చనుచుండఁ గపివరుం డించుక గ్రహించి, "మిత్రుఁడా! ఇప్పుడు నీ మోముజాడఁ జూడ నొండొకవిధంబుగాఁ దోఁచుచున్నది. నీ యందు మున్దున్న యుత్సాహంబు గానరాదు. చిత్తంబు విచారాయత్తం బయి తత్తఱించుచున్నట్టు కనుపట్టు చున్నది. దేహము లాధివ్యాధిజరాన్వితములు;[10] గృహమున నాసహోదరి సేమమున నున్నది కదా?" యనెను. క్రకచుండు పలుకులఁ దడఁబాటుపడుచు 'నీ చెల్లెలు కొంచెము వ్యాధిబాధిత యయి యున్న' దనెను. 'అంతటి యల్పరోగమునకా నీ మొగ మింత చిన్నపోయినది? చీటికిమాటికిఁ దాలిమి[11] దిగనాడుట మగపాడి[12] గాదు గదా' యని బలవర్ధనుండు పలికెను. 'ప్రబలవ్యాధిపీడిత యయియే యున్న' దని

---

1. ఆవాసము = ఇల్లు; 2. తాత్పర్యము = ఆసక్తి; 3. ఆవహించు = కలిగించు; 4. ఉపాయనము = కానుక; 5. కీశ - లోక + ఈశుఁడు = కోఁతుల సమూహమునకుఁ బ్రభువు; 6. వృక్షావతీర్ణుఁడు = వృక్షమునుండి దిగినవాఁడు; 7. తెన్ను = దారి; 8. ఈరెలుఁగు = హీనస్వరము; 9. ఖిన్న హృదయుఁడు = ఖేదము నొందిన హృదయము గలవాఁడు; 10. ఆధి - వ్యాధి - జరా + అన్వితములు = మనోవ్యాధి, రోగము, ముసలితనము అనువానితోఁ గూడినవి; 11. తాలిమి = ఓర్పు; 12. మగపాడి = శౌర్యము.

క్రకచుండు సందేహించుచుఁ బలికెను. అంత నశ్రుమిశ్రితాక్షుండయి[1] వానరాధ్యక్షుండు; వైద్యులం బిలిపించి వేగిరము దివ్యౌషధప్రయోగము చేయించినావు కావా?' యని యడిగెను. 'ఏమి మాయయో యెఱుఁగను; వైద్యు లెంతమంది యెన్నిమందులను వేసినను గుణ మియ్య లేదు - నిన్నట్లు విడ్చోని పోయి చూచునప్పటికి నీచెలియలు యమయాతన పడుచున్నది; నాకుం జూడ నీ రోగము కుదిరి జీవించుటయె కష్టముగాఁ దోఁచుచున్నది' అని క్రకచుఁడు బదులుచెప్పెను. విని వనచరుఁడు 'ఇది యేమి? మిత్రుఁడా! ఇంత వెఱ్ఱిపని చేసితివి! ఇంట భార్య యిట్టియవస్థయం దుండఁగా మందును మాఁకును విచారింపక యింటి న్విడిచి మిత్రుని యొద్దకు రాఁ జిత్త మెట్లొప్పెను? విందునకుం బిలువ నో రెట్లాడెను?' అని మందలించెను. మనవైద్యులు కొందఱు కోఁతిగుండెకాయతో మం దీయవలెనని చెప్పు చున్నారు. అందు నిమిత్తమయి వచ్చితి'నని యా క్రకచుండు శోకవ్యాకులిత హృదయుం డగుకతంబున మతి పోయి తనగుట్టు బయలంబెట్టెను. ఆమాట విన్నతోడనె ప్రాణములు గలఁగఁబాఱి మేను చెమర్పఁ గొంతవడి యా మర్కటంబు దిగ్భ్రాంతినొంది యుండి యింతలో డెందంబు కుందు డిందువఱిచికొని[2] "అయ్యో! ఖర్వాటుఁడు[3] సూర్యాతపమునకు[4] సహింపలేక తాళవృక్షచ్ఛాయకుం బోవఁ దాఁటిపండు పడి తల పగిలినట్టు దైవోపహతుం డగువాఁ డెందుఁ బోయినను నాపదలు వెంట వచ్చును గదా! అడవిని విడిచి మృగసంచారము సహితము లేని సముద్రతీరముం జేరియు మృత్యుముఖ ప్రవిష్టుండ నైతిఁ గదా' యని వగచుచుఁ దెచ్చికోలుధీరంబున నిట్లనియె: "క్రకచా! యెంతపిచ్చిపని చేసితివి! వానరహృదయంబుకొఱకు వచ్చినవాఁడ వామాట ముందుగ మిత్రునిచెవిని వేయవలదా? ముందె చెప్పిన ముదిమి గదిరియుంట యలేక మేడిచెట్టునం దవిలించి యుంచిన నా గుండెకాయ నప్పుడ కూడం దెచ్చి వత్తును గదా? నీ మనోగతంబు[5] నెయ్యునికడ న్మఱుఁగుపఱిచి[6] పని

1. అశ్రు-మిశ్రిత+అక్షుఁడు=కన్నీటితోఁ గూడిన కన్నులు గలవాఁడు; 2. డిందువఱుచుకొను = తగ్గించుకొను; 3. ఖర్వాటుఁడు = బట్టతలవాఁడు; 4. సూర్య + ఆతపము = సూర్యుని ఎండ; 5. మనస్ (ః) + గతము = మనసున నున్నది; 6. మఱుఁగుపఱుచు = దాఁచు.

చెఱిచితివి. ఇట్టి నీవు నీకళత్రమునకు శత్రుఁడవుగాక మిత్రుఁడవే? మన కింతవఱకు నడిచినదంతయు వృథా త్రిప్పట యయ్యెను. అయిన నేమి? శీఘ్రంబ మరలి మేడిపొంత కరుదెమ్ము. గుండెకాయం గొనివత్తము." అను మాయమాటలు నమ్మి మకర, మా వానరమ్మును గ్రమ్మఱ మేడికడకుం గొని తెచ్చి విడిచెను. ఇఁకఁ బ్రాణములు దక్కిన వని యామర్కట మొక్కవడి భూరుహంబు[1] నెక్కి వెక్కిరించుచు, హృదయమును లేదు గిదయమును లేదు[2] పో పొ'మ్మని క్రకచుని గద్దించెను, అది చూచి మొసలి మోసముం దెలిసికొని 'యేవలనను మోసమెట్టిదో యెఱుఁగని నన్నును నీముసలికోఁతి యిట్టె మోసపుచ్చెఁగా' యని వగచుచుండఁ బ్లవంగ[3] మిట్లనియె. "నీవు ప్రసాదపురస్సరముగా[4] నెన్నెన్నియో యుపచారవాక్యంబులు పలికి నిటలతట ఘటితాంజలివై[5] నీయింటికి రమ్మని దేవురించుటంజేసి, పాపపు మోమోటమి నోరునొక్క రాననలేక మోసపోయితిని గాక నన్నుఁ బ్రతారింప[6] నీతర మగునే? ఓరీ మూఢాత్మా? మాటదాఁటక వచ్చి చేపడినవాఁడే తప్పించుకొని పోయెనుగదా యని సంతాపఢుునొందక ఈపాటి నీదారిం బొ్పమ్మ. ఒక కూర్మముచేత[7] నక్కయంతటిది మోసపోయినది. ఇఁక నీవనఁగా నెంతవాఁడవు? వినవలతువే నాకథఁ జెప్పెద వినుము."

### తాఁబేలు - నక్క

కర్ణాటకదేశమునందుఁ గావేరియను నదియొక్కటి ప్రవహించు చుండును. సాగరసంగమునకు[8] సమీపంబునఁ దత్తీరంబున నొక్క వటమహీరుహము[9] గలదు. ఒకనాఁటి మధ్యాహ్నసమయంబున నొక కమఠంబు[10] జలంబులు వెడలి వచ్చి యుచ్చెట్టునీడను సుఖముగా

---

1. భూరుహము = చెట్టు; 2. హృదయము గిదయము = హృదయము + హృదయము - నిందయం దామ్రేడితము మొదటి యక్షరమునకు 'గి' వర్ణాదేశము; 3. ప్లవంగము = క్రోఁతి; 4. ప్రసాద - పురస్సరము = బహుమానము ముందుండునట్లు; 5. నిటల - తట 6 ఘటిత + అంజలి = నుదుటి ప్రదేశమున నుంపఁబడిన దోయిలి గలవాఁడు; 6. ప్రతారించు = వంచించు; 7. కూర్మము = తాఁబేలు; 8. సాగర-సంగము = సముద్రమున నది కలియుచోటు; 9. వట - మహీరుహము = మఱ్ఱిచెట్టు; 10. కమఠము = తాఁబేలు

నిద్రించుచుండెను. అప్పుడు తత్ప్రాంతకాంతారంబున నుండు ఫేరవం[1] బొక్కటి యాయేట నీరువట్టు[2] మాన్పుకొనం జనుదెంచి తీయనిపానీయంబు లాప్యాయనంబుగఁ[3] బానంబుచేసి యాసమీపపాదపచ్ఛాయం[4]బవళించి యున్న తాఁబేలుం గాంచి పరమసంతోషంబున మెల్లమెల్లఁగాఁ దారుచుం బఱతెంచి యేమఱుపాటున దాని వీఁపుమీఁదఁ దనపాదంబు నూఁది త్రొక్కెను. అంత నాతాఁబేలు మేలుకని కీ లెఱింగి కాలునుం గేలునుం దటాలున ముడుచుకొని తల పొట్టలో నిముడుచుకొని కదలకుండెను. క్షుధార్తం[5] బగుమృగధూర్తంబును[6] బదంబున దాని నదిమిపట్టి యిట్టట్టు పొరలించుచుఁ గోఱలు మొఱకలువాఱఁ గొఱుకుచుఁ గూర్మంబు మర్మంబులు భేదింపఁజాలక చాలసేపు విడిచిపోవను మనసు రాక క్రిందనుమీఁదనుం బడుచుండెను. అక్కరణి నది మిక్కిలి చిక్కులు పడుచుండ నక్కూర్మం బెక్కరణి నైన నీమ్రుక్కడినక్కను డక్కువెట్టి[7] ప్రాణంబులు దక్కించుకొనెదఁ గాకని తలఁచి యించుక యాలోచించి మాయ యచ్చువడ[8] నిట్లనియె. "ఓ జంబుకోత్తమా! తత్త్వం బెఱుంగంజాలక యేల యీలాగున వృథాప్రయాసంబు పడియెదవు? నీ వీ కైవడి వేయేఁడులు కొఱికినను నా యొడలు నీకుఁ గొఱుకుడుపడఁగలదే? నీ వే విధంబునను నను వధించి యాపోవ నామాంసంబు మెసవక యవలఁబోవని తలపోసి యీ మనుగడ[9] పయి నాసను[10] గోసి యనాయాసమరణంబు[11] నొంద నిశ్చయించుకొన్నాఁడను. విషములో[12]నిఁబ్రదుకు; మా కెప్పుడును మృత్యువు శిరసుపై నాడుచుండును. కాఁబట్టి యాఁకొన్న మహానుభావునకు నీ కొక్క చక్కని యుపాయం బుపదేశించెదను. వినుము: నన్నుఁ గ్రన్ననం గొనిపోయి నీరంబులం జేరిచి కొంతతడ వందు నాననిచ్చిన, నా మేను వెన్నవలె మెత్తనయి నిమిషములో నీచిత్తమువచ్చినట్లగును. అప్పుడు కడుపార నామాంసంబుతో

---

1. ఫేరవము = నక్క; 2. నీరువట్టు = దప్పి; 3. అప్యాయనము = సంతోషము; 4. పాదప + ఛాయ = పాదపచ్ఛాయ = చెట్టునీడ; 5. క్షుధా + ఆర్తము = ఆఁకటిచేఁ బీడింపఁబడునది; 6. మృగధూర్తము = నక్క; 7. టక్కు + పెట్టి = మోసగించి; 8. అచ్చుపడు = ఏర్పడు; 9. మనుగడ = జీవితము; 10. ఆస (వి.) = ఆశ (ప్ర.); 11. అనాయాస మరణము = అశ్రమమైన చావు; 12. విషము = నీరు - విసము (నానా.).

సుఖపారణ[1] చేసి నీవలసినచోటికిఁ బోవచ్చును. అట్టు చేయుము." అనిన గోమాయువును[2] మాయావాగురం[3] జిక్కుకొని యక్కపటవచనంబులు వేదవచనంబులని నమ్మి యదియ కార్యమ్మనుకొని తాఁబేటిని బేలుపోయి[4] జలంబులం బడవైచియుఁ, గొంత మెలఁకువ గలిగి పట్టువిడువక గట్టిగాఁ దనముంగాళ్ల దాని వీఁపున న్మోపి పండ్లయూటలు ద్రావుచు వానిమీఁదనె కన్నిడి ముహూర్తమాత్రంబు నిలిచి మరలఁ గొఱికి చూచి దానిబొరుసు పండ్లకు సాధ్యముగాకున్నఁ గమఠంబున కిట్లనియె : "తడ వాయెను; నిన్ను జలంబుల నిడి యొడలు మెత్తపడినఁ గడువడిం గుడిచి నడవవలెనని కాచుకొని యున్నాఁడను. ఏ వేళకును నీ మేను నానుజాడ గానరాకున్నది. ఏమి చెప్పెదవు?' అనినఁ గచ్ఛపం బిట్లనియె: "మిత్రుఁడా! నీవు నావచనంబులయందు గుఱి యుంచక వెన్నుమీఁద రెండుపాదములును దిట్టముగాఁ బెట్టియున్నవాఁడవు. నీరంట వలనుపడకుండ వెన్నునకెల్ల సరిపోవ దారుణముగాఁ జరణంబుల[5] నిలిపియుండ, నా మే నెట్లు నానఁ గలదు? నీ కోరిక యె ట్లీడేఱఁగలదు? ఇందు నా దోసంబు వీసంబును లేదు. నోటిశనిచేత నీవే యింత తడవు నపనమ్మికపడి చెడితివి అయిన నిప్పు డేమాయెను?, ఇం నైన నామాట నమ్మి వెన్నుమీఁది పాదంబు లెత్తి క్షణమాత్రము చేరువం గూరుచుండి చూచుచుండుము. ఇప్పుడ పులకండంబులఁ[6] బోలు నా పలఖండంబులతో[7] విం దారగించి యనాయాసంబుగాఁ బోవచ్చును." అనిన నా సృగాలంబు[8] కూర్మంబు వాఙ్నిచయంబులు[9] నిశ్చయంబులుగా వగచి తదీయోపదిష్ట ప్రకారంబున[10] వెన్ను పయి నిడియున్న యడుగుదోయిని[11] మెల్లఁగాఁదీసెను.

---

1. సుఖ - పారణ = సుఖ భోజనము; 2. గోమాయువు = నక్క; 3. మాయా - వాగుర = వంచన యనెడి వల; 4. బేలుపోవు = మోసపోవు; 5. చరణము = పాదము; 6. పులకండము = పంచదార; 7. పల - ఖండము = మాంసపు ముక్క; 8. సృగాలము = నక్క; 9. వాఙ్నిచయము = వాక్+నిచయము = మాటల సమూహము - అనునాసికసంధి; 10. తదీయ + ఉపదిష్ట + ప్రకారము = వానిచే నుపదేశింపఁబడిన విధము; 11. అడుగుదోయి = పాదద్వయము.

త్రీసినతోడనే ప్రాణంబుల దక్కించుకొని యక్కమఠంబు శరవేగమునం[1] బఱచి లోతునీళ్ళం బడియెను.

అని చెప్పి యామర్కటము మఱియు నిట్లనియె. "ఓరీ! మకరాధమా! మోసముల కెల్ల నిధి యగువంచకమే[2] యిటు వంచింపఁబడఁగా, నీవంటి పుట్టు గ్రుడ్డు మోసపోవుట యొక యక్కజమా?[3] చాలుఁ జాలు, నీతోడ మైత్రి చేసినందునకు ఫలము తోడనే కలిగినది. ఇంక నీమైత్రిని నీయొద్దనె యుంచుకొమ్ము. లోకవిఖ్యాతసత్త్వుండనయ్యు[4] దైవవంచనచేత రాజ్యంబు గోలుపోయి త్రాణ చెడి రిపులతోఁ బడలేక కళత్రప్రముఖజన్య సుఖవిముఖుం డనై[5] లేచివచ్చి నిలువ నీడయుఁ ద్రాగ నీరును గానక యేకాకినై యడవులు పట్టి తిరిగి తిరిగి కడ కీవృక్షంబుఁ జేరి స్వచ్ఛందాహారంబున[6] నుదరపూరణంబు[7] గావించుకొనుచుఁ గులగోత్రనామంబులు దాఁచుకొని మొన్నటిదాఁక కాలము గడపుచుండి, నీ పెద్దతనంబు చూచి బుద్ధి భ్రమసి మిత్రవంచకుఁడవని తెలియంజాలక నీతోడి సఖిత్వం[8] బంగీకరించితిని. నీవును బాపాత్మురాలైన నీ భార్య దుర్బోధచేతఁ జెడుబుద్ధి పుట్టి, కుటిలోపాయంబున[9] నన్ను మట్టువెట్టఁ[10] దలఁచి, మాయింట విం దారగింతువు గాని రమ్మని నచ్చిక బుచ్చికలాడిన నే నా మర్మ మెఱుంగక నీ మందిరమ్మునఁ దిరమ్ముగాఁ[11] గలదాఁచుకొన నిశ్చాయకుఁడ[12] నయి నితాంత[13] సంతోషంబున బయలుదేఱి మధ్యేమార్గంబున[14] నాకారవికారాదులచే భవదీయం బగుమనోవ్యవసాయం బూహించి పూర్వపుణ్యావశంబున నీయుపాయంబు తోఁచఁబట్టి బ్రతికి, పులి

1. శరవేగము = బాణము వేగమువంటి వేగము; 2. వంచకము = నక్క; 3. అక్కజము = ఆశ్చర్యము; 4. లోక - విఖ్యాత - సత్త్వుఁడు = లోకమునఁ బ్రసిద్ధి నొందిన బలము గలవాఁడు; 5. కళత్ర - ప్రముఖ - జన్య - సుఖ - విముఖుఁడు = భార్య మున్నగువాని వలనఁ బుట్టు సుఖములకుఁ బెడమొగము గలవాఁడు; 6. స్వచ్ఛంద + ఆహారము = తనంతఁదాను లభించు నాహారము; 7. ఉదర - పూరణము = పొట్ట నింపుకొనుట; 8. సఖిత్వము = చెలిమి; 9. కుటిల + ఉపాయము = మాయోపాయము; 10. మట్టు + పెట్టు = చంపు; 11. తిరము = స్థిరము; 12. నిశ్చాయకుఁడు = నిశ్చయించుకొన్నవాఁడు; 13. నితాంత = అధిక; 14. మధ్యేమార్గము = దారినడుమ - అలుకసమాసము.

నాకి విడిచినవానిఁగా భావించుకొనుచున్నాఁడను. ఆఁడువారు మంచి యెఱుఁగరు; చెడ్డ యెఱుఁగరు; వట్టికుత్సితములు పన్ని తమపట్టినపట్టు సాధించుకొనఁ జూతురు. నీవు నాతోడి చెలిమింజేసి యిల్లు పట్టుకున్న న న్నేలాగుననైనఁ జంపింపఁ దలఁచి యిది యంతయు నీభార్య పన్నిన పన్నుగడ యయి యుండును. దేహములు బుద్బుదప్రతిమంబులు;[1] పరువము[2] ఫేనసదృశంబు;[3] సంపదలు తటిచ్చంచలంబులు:[4] అలంకారంబులు భిత్తిచిత్రంబులు;[5] దారపుత్రాదు లాశ్మశానగమనులు[6]గాని యా పయిని వచ్చువారు కారు; ధర్మ మొక్కటియే తోడ వచ్చి తన్నుఁ గాచునది, అట్లయ్యును నీవు తగవును ధర్మంబును దలపోయక సద్యఃపాతి[7] యగు తనువును[8] నమ్మికొని కీర్తిశరీరము[9] న్విడిచి నిత్యంబగు నపఖ్యాతి[10] గడియించుకొంటివి. ప్రాణాధికుఁ[11] డయిన మిత్రునినే యిట్లు చేసిన పరమసాహసికునకు నీకు నితరులు తృణకణంబులు[12]. మీఁద నీ వేమిగతిం బోవువాఁడవో! నీ యట్టిమిత్రద్రోహిం జూచుచున్న నఘం[13] బొదవును. ఇఁక నీవు నా ముందఱ నిలిచి నన్నుఁ గనలింపక,[14] వేవేగ నీయింటిత్రోవఁ బట్టి పొమ్ము" అని ముక్కును మొగమును జూడక దూరనాడి[15], నిరుత్తరుంజేసి[16] యా మొసలిఁదేని నక్కడనుండి సాగనంపెను. క్రకచుండును నిస్స్పృహుండై[17] దిక్కులు చూచుచు దోయిడిచేతుల[18] న్మగిడి నిజనివాసంబునకుం జనియెను.

కాఁబట్టి మోసముచే నెట్టిపనినైన సాధింపవచ్చును. నాయం

---

1. బుద్బుదప్రతిమము = బుడగతో సమానము; 2. పరువము = యౌవనము; 3. ఫేన - సదృశము = నురుఁగుతో సమానము; 4. తటిత్ + చంచలము = మెఱుపువలెఁ జంచలమైనది; 5. భిత్తి - చిత్రము = గోడబొమ్మ; 6. ఆశ్మశానగమనులు = కాటివఱకే వచ్చువారు; 7. సద్యఃపాతి = అప్పుడే పడునది; 8. తనువు = శరీరము; 9. కీర్తి - శరీరము = కీర్తియను శరీరము; 10. అపఖ్యాతి = దుష్కీర్తి; 11. ప్రాణాధికుఁడు = ప్రాణముకంటె నధికుఁడు; 12. తృణకణము = గడ్డి ముక్క; 13. అఘము = పాపము; 14. కనలించు = కోపింపఁజేయు; 15. దూరనాడు = నిందించు; 16. నిరుత్తరుఁడు = సమాధానము లేనివాఁడు; 17. నిస్స్పృహుఁడు = కోరిక లేనివాఁడు; 18. దోయిడి చేతులు = వట్టి చేతులు.

దనుగ్రహించి మీరందఱు నాకొక్క సాహాయ్యమును మాత్రము చేయుఁడు. మీరందఱును ముందుగాఁబోయి బ్రాహ్మణుడు చను మార్గమునందు దూరదూరముల నిలిచి, అతఁడు మీ సమీపముననుండి పోవునప్పుడు 'విప్రోత్తమా! కఱికుక్క[1] నేల కొనిపోవుచున్నా' వని ప్రశ్న చేయుఁడు. ఇంతమాత్రము మీరు తోడుపడితిరా, మిగిలిన కార్యమును నేను జక్కఁ బెట్టెదను'. అని యావృద్ధవంచకుఁడు పలికెను. మంచిదని యాపనికి నొప్పుకొని, తక్కినవా రందఱును బ్రాహ్మణున కగపడకుండఁ జని యాతఁడు వచ్చుదారిలో నందందుఁ గూరుచుండి, యాతనిరాకం బ్రతీక్షించుచుండిరి. ఇంతలో బ్రాహ్మణుఁడును మేఁకపోతు నీడ్చుకొని, మొదటి వంచకుఁ డున్న తావునుండి పోవుచుండెను. అప్పుడు వాఁడు "అయ్యో! మీరు చూడఁబోయిన బ్రాహ్మణోత్తములుగా నున్నారు. ఈ కఱికుక్క నేల ముట్టుకొని తీసికొని పోవుచున్నారు?" అని యడిగెను. అందున కా బ్రాహ్మణుండు నేత్రాంతంబులఁ[2] గెంపు[3] గదుర, "ఛీ ఛీ! త్రాగుఁబోతా! దురాగతభాషలు[4] ప్రేలకుము.

"నే నధ్వరార్థము[5] కొనిపోవుచున్న యీ పవిత్రమయిన ఛాగము[6] నపవిత్రమయిన శునకమునుగాఁ[7] బలుక నీకు నోరెట్లు వచ్చినది? పో పో" మ్మని, యా మాటలను లక్ష్యముచేయక తన త్రోవం బోవుచుండెను. మఱి నాలుగడుగులు సాగిన తరువాత రెండవ ధూర్తుఁ డెదురు వచ్చి మస్తకన్యస్తహస్తుఁ డయి[8] నమస్కరించి, బ్రాహ్మణునివంకఁ జూచి, "స్వామీ! మీరు సర్వముం దెలిసినవారు గదా? ఈ నల్లకుక్క నెగ్గులేక[9] ముట్టుకొనుచున్నా రే' మని పలికి పోయెను. అందున కా విప్రుండు డెందములో నించుక సందేహించి వానిమాటలకు మాఱుచెప్పక మేఁకం గొనిపోవుచుండెను. ఇంతలో మూఁడవవాఁ డెదురుపడి, "ఇది యేమి బాపఁడా![10] ఇంత యక్ర మమునకు

---

1. కఱికుక్క = నల్లని కుక్క; 2. నేత్ర + అంతము = కడగన్ను; 3. కెంపు = ఎఱుపు; 4. దురాగత భాషలు = కూడని మాటలు; 5. అధ్వర + అర్థము = యజ్ఞము నిమిత్తము; 6. ఛాగము = మేఁక; 7. శునకము = కుక్క; 8. మస్తక-న్యస్త-హస్తుఁడు=తలపై నుంపఁ బడిన చేతులుగలవాఁడు; 9. ఎగ్గు=దోషము; 10. బాపఁడు(వి) = బ్రాహ్మణుఁడు (ప్ర.).

లోఁబడినావు. నీవెత్తినది బ్రాహ్మణజన్మము గదా! అట్లయ్యునుం గుణ శీలముల నేటఁ గలిపి లోకులెల్ల నవ్వఁ బట్టపగలు రాజవీథిం బడి యీయపవిత్రమయిన వేఁపి[1] నెచటి కీడ్చుకొని పోయెదవు? ఈ రాజ్యమేమి పాపము చేసెనో కాని కులాచారధర్మములు నిర్మూలము లయిపోవుచున్నవి?' అని పదరెను. అంత నాయనంతాసురుండు[2] మతి[3] వికలత్వంబు[4] నొంద శంకామగ్నుండయి[5], "ఒకరు కా రిద్దరు గారు; కన్న వారెల్లరు దీనిని వేఁపి యనుచున్నారు. నాకొకవేళ మతిభ్రమ జనియింపఁ బోలు" నని చింతించుచు, ఉల్ల ముయ్యేల లాగున నూఁగ నిటునటుఁ జనఁ దోఁచక యనుమానించుచు నిలుచుండెను. మొదటినుండియు బ్రాహ్మణుని నెడఁబాయక వెంబడించి వచ్చుచున్న యాపృద్ధవంచకుఁడు, తన ప్రయత్నము ఫలోన్ముఖమునకు[6] వచ్చుఁగదా యని సంతోషించి, బ్రాహ్మణునకు వినఁబడునట్లుగాఁ జేరువ నున్న తోడుదొంగతో నిట్లనియె. "పాప మీముగ్ధ[7] బ్రాహ్మణుని వెఱ్ఱివానిం జేసి యెవ్వరో యట్లు కుక్క నొకదానిం గట్టిపెట్టిరి. చూచితివా యీతని దురవస్థ?" అని, విప్రుని యకార్యకరణమునకు వ్యసనపడునట్లు[8] పలికి పకపక నవ్వెను. బ్రాహ్మణుఁ డామాటలు విని, యంద ఱేకవాక్యముగాఁ జెప్పిన దబద్ధము కానేరదని నిశ్చయించి, తన ప్రమాదమునకు లోపల నొచ్చుకొనుచు యజనచ్ఛాగము[9] నచటనే విడిచి పెట్టి, మరల వెనుకకుం బోయి ధూర్తులందఱుఁ గొలంకు[10] కెలంకునఁ[11] జేరి నవ్వఁ దటాకములో స్నానము చేసి శుచియై తడిబట్టలతో నింటికిఁ బోయి పాపపరిహారార్థము గాయత్రి జపించుకొను చుండెను. ధూర్తు లామేఁకపోతుఁగొని పోయి, చంపుకొని తినిరి.

---

1. వేఁపి = కుక్క; 2. అనంతా + సురుఁడు = భూసురుఁడు - బ్రాహ్మణుఁడు; 3. మతి = మనస్సు; 4. వికలత్వము = కలఁత; 5. శంకా - మగ్నుఁడు = సందేహమునందు మునిఁగినవాఁడు; 6. ఫల + ఉన్ముఖము = పండనున్నది; 7. ముగ్ధ = అమాయకుఁడైన; 8. వ్యసనపడు = వ్యసనము + పడు = బాధపడు; 9. యజనచ్ఛాగము = యజన + ఛాగము = జన్నపు మేఁక, యజనముకొఱకు ఛాగము - చతుర్థీ తత్పురుషము; 10. కొలంకు - కొలను (రూపాం.) ఏక.వ. కొలంకులు (బహువ.); 11. కెలను, కెలఁకు, కెలంకు - (ఏకవ) - కెలఁకులు, కెలంకులు - (బహు.వ.).

అని మేఘవర్ణుండు చెప్పిన విని, చిత్రవర్ణుండు మఱియు నిట్లనియె. "నిమిషకాలము శత్రువుతోఁ గలసియుండుట యెంతో ప్రాణాంతముగ నుండును. అట్టి స్థితిలో, నీ వంతకాలము హిరణ్యగర్భుని వీట నిర్భయముగా నుండఁగలుగుట చూడ నత్యద్భుతముగా[1] నున్నది. శత్రుమధ్యమునఁ జిరకాలము నీ వెట్లు గుండె గుదిరి యున్నవాఁడవో తెలుపుము." అనిన, మేఘవర్ణుండు సవినయంబుగా నిట్లనియె. "స్వామీ! కార్యార్థి యయి యున్నవాఁడు స్వప్రయోజనమును ముఖ్యముగాఁ జూచుకోక యెవ్వరెన్ని బాధలు పెట్టిన నోర్చుకొని శత్రువును స్కంధమున[2] వహించి మోచియైన స్వకార్యము నుద్ధరించుకొనును. పూర్వమొక వృద్ధసర్పము[3] తనకార్యము నిమిత్తము కప్పలను మూఁపుపయిం బెట్టుకొని మోసి, కడపటఁ దనమనో రథ మీడేర్చుకొనలేదా? దేవర కాకథఁ జెప్పెదను జిత్తగింపుఁడు.

**పాము - కప్పలు**

కాంచీపుర సమీపంబున నుండు జీర్ణోద్యానంబునఁ[4] దడవులనుండి మందవిషుఁడను విషధరవల్లభుం[5] డొకఁడు వాసము చేయుచుండును. అతఁ డొక్క నాఁ డహర్ముఖంబున[6] నాహారాన్వేషణార్థంబు సంచారంబు వెడలి యొక్కచోట భేక[7] కలకలంబులు మిన్నుముట్ట గంభీరజలంబుల నలరారు సరోవరంబు పొడగాంచి యందుఁ బ్రవేశించి యా మండూకంబుల[8] నెల్ల భక్షించు మార్గము దొరకక, కొండొకవడి చింతించి యొక్క యుపాయం బూహించి తత్తీరంబున నేలపై ఫణంబు[9] వాల్చి వ్యాధిగ్రస్తునివిధంబున[10] మూల్గుచుఁ బడియుండెను. అది చూచి జలపాదుం డనుమండుకస్వామి[11] చేర వచ్చి యిట్లనియె; "ఓ నాగకులావతంసమా![12] నీవు తలఁచుకొన్న

1. అత్యద్భుతము - అతి + అద్భుతము - యణాదేశ సంధి; 2. స్కంధము = మూఁపు; 3. వృద్ధ - సర్పము = ముసలిపాము; 4. జీర్ణ + ఉద్యానము - గుణసంధి; 5. విషధర - వల్లభుఁడు = పాములఱేఁడు; 6. అహర్ముఖము - అహస్ + ముఖము = ఉదయము; 7. భేకము = కప్ప; 8. మండూకము = కప్ప; 9. ఫణము = పడగ; 10. వ్యాధిగ్రస్తుఁడు - వ్యాధిచే గ్రస్తుఁడు - తృతీయా తత్పురుషము; 11. మండుకము - మండూకము (రూపాం.); 12. నాగ - కుల - అవతంసము = సర్పముల సమూహములలో శ్రేష్ఠము.

మహాబలు[1]నంతవాని నయిన నొక్కగ్రుక్కను వాత[2] వ్రేసికోఁగలవు. అట్టినీ విత్తఱిఁ గప్పలు కుప్పతిప్పలుగా మ్రోల దుముకు లాడుచున్నను భక్షింప నొల్లక, ప్రాణములు కంటికొలుకులలోఁ బెట్టుకొని పస్తుపడియుండుట యెంతయు వింతగా నున్నది. ఇందులకుఁ గతం బెఱిఁగింపు" మనినఁ గాలాహి[3] యిట్లనియె: "నాకుఁ బ్రాప్తించిన[4] దుర్దశ మీతోడ నేమని చెప్పుకొందును? నేనీవఱ కెన్నఁడును బొట్టకొఱకుఁ బరులను దేహి[5]యని యాచించినవాఁడను గాను. నేఁటికాలమునకు నాకు మీవంటివారి ననుసరించి పొట్టపోసికోవలసిన దినములు వచ్చినవి. వే యేల? ఇఁక ముందు మీ రనుగ్రహించి భోజన మిడిన భుజింపవలసినవాఁడను, లేకున్నఁ బస్తుండవలసినవాఁడనయినాఁడను, నిన్నటిదిన మర్ధరాత్రంబున నే నాహారేచ్ఛం[6] ద్రిమ్మరుచుండ, నొకభూసుర కుమారుఁ డాత్రోవను జనుచు దురదృష్టవశమున నా తలమీఁద నడుగు వైచెను. ఆ యవమానమును సహింపలేక నేనును బుస్సుమని విషాగ్ను[7] లుమియుచుఁ దత్క్షణంబ యా విప్రనందనుని కాలొడిసి కఱచితిని. ఆ కాటు తిని విప్రార్భకుఁడు[8] భయాతిరేకంబున గృహంబులోనికిం బాఱి తండ్రి కంతయుం దెలిపి పులుకుపులుకున[9] నేడ్చుచు విష మెక్కి మూర్ఛిల్లి నోర నురుఁగులు గ్రక్కుచు నేలఁ బడి ఱెప్పలు దేలవైచెను. బ్రాహ్మణుఁడును గొడుకుం దొడలమీఁదనిడుకొని యస్తోకశోకమగ్నుఁడయి[10] పరిపరివిధముల విలపింపఁ జొచ్చెను. అప్పు డాతని బాంధవులు పలుదెఱంగుల దుఃఖ శోషణంబులగు[11] భాషణంబుల నాతనికి ధైర్యము చెప్పి మరలింప, ఆయర్ధరాత్రపువేళఁ

---

1. మహాబలుఁడు = మిక్కిలి బలము గలవాఁడు, వాయువు; 2. వాతన్ = నోరను; 3. కాల + అహి = కాలసర్పము, నల్లత్రాఁచు; 4. ప్రాపించిన = కలిగిన; 5. దేహి = ఇమ్ము; 6. ఆహారేచ్ఛ - ఆహార + ఇచ్ఛ = గుణసంధి, ఆహారమునందలి ఇచ్ఛ - సప్తమీ తత్పురుషము; 7. విషాగ్నులు = విషమనెడి అగ్నులు - రూపకము; 8. విప్రార్భకుఁడు - విప్ర + అర్భకుఁడు = బ్రాహ్మణ బాలుఁడు; 9. పులుకు పులుకున = ఱెప్పలు మూయుచుఁ దెఱచుచుఁ జూచుట; 10. అస్తోక - శోక - మగ్నుడు = అధికమైన దుఃఖమునందు మునిఁగినవాఁడు; 11. దుఃఖ శోషణము = దుఃఖమును నశింపఁ జేయునది.

జిమ్మచీఁకటిలో నురి మీఁద వెన్కకు నీడ్చు పాదములతోఁ బోయి విషవైద్యునిఁ బిలుచుకొని వచ్చి యా చిన్నవానిని వీఁడు, మీవాఁడు గాని మావాఁడు కాఁడని వారి పాదముల మీఁదఁ బడ వైచి తదనుగ్రహంబున విషముక్తుఁడయి[1] లేచి కూర్చున్న కొడుకును జూచి యంతరంగంబు హర్షోత్తరంగంబయి[2] 'వీఁడు పేరు పెట్టిన చెట్టని జీవనము[3] లిచ్చిన యా ఘనుని[4] వేనోళ్ళఁబొగడి వీడుకొలిపి, నామీఁదియాగ్రహం బుడుగక యా బ్రాహ్మణుఁడు న న్నుద్దేశించి యిట్లనియె: 'ఓ పన్నగమా![5] పున్నమచందమామను బోలు నీ యర్భకుని మోము చూచి, దయ పుట్టక నిర్హేతుకముగాఁ[6] గాటు వేయ నీకు నో రెట్లాడెను? సదా రంధ్రాన్వేషణమే[7] పనిగాఁ గుటిలగతి[8]న్వర్తించు పాపజాతికి[9] నీకెట్లు దయపుట్టును? నిష్కారణముగా విప్రబాలకుం గఱచిన యీ దురితంబు నీ కహ మెల్లం జుట్టుకొని, నీ యహంకారపంక[10] మింకున ట్లింతవఱకును నీ కాహారముగా నున్న భేకముల నీతలను మోపించి దయామతి నవి యొసఁగిన యాహారము నే నీచేతం గుడిపించుఁ గావుత' మని[11] రోషావేశంబున ఘోరశాపంబిచ్చెను. పాములబాముల[12] నే మందును? ఆ శాపాక్షరంబు లశనిపాతంబు[13] వోలె నాకర్ణంబులఁ జూఁడి[14] హృదయభేదనంబు గావింప, నాఁ యొడలు నావశము గాక కాళ్ళులేనివానివలెఁ గదలలేక మెల్లమెల్లఁగాఁ బ్రాఁకుచు మీ కృప నాశ్రయింప వచ్చితిని.

---

1. విషముక్తుఁడు = విషముచేత ముక్తుఁడు - తృతీయా తత్పురుషము; 2. హర్షోత్తరంగము = హర్ష + ఉత్తరంగము = సంతోషముచేఁ బొంగినది; 3. జీవనము = బ్రదుకు, నీరు; 4. ఘనుఁడు = గొప్పవాఁడు, మేఘుఁడు - (నానా.); 5. పన్నగము = పాము - పాదములతోఁ బోవనిది; (వ్యు.); 6. నిర్హేతుకముగా = కారణము లేకుండ; 7. రంధ్ర + అన్వేషణము = రంధ్రయలు వెదకుట, లోపములను వెదకుట; 8. కుటిల - గతి = వంకరనడక, కపటపునడక; 9. పాపజాతి = పాపులజాతి, పాములజాతి. పాములజాతియను నర్థమున పాము + జాతి - పాఁపజాతియని యుండును; 10. అహంకారపంకము = గర్వమనెడి బురద; 11. కావుతమని - కావుతన్ + అని; 12. బాము = కష్టము; 13. అశనిపాతము = పిడుగు పాటు; 14. చూఁడు = కాల్చు.

దైవోపహతుండ నయి మీపాలఁబడిననన్నుఁ జేయి విడువక, మీవాహనముఁగాఁ జేకొని యాహారదానంబు చేయుచు రక్షించుచుండిన, నెప్పుడును మీ పాదములకొలువు సేయుచుందును." అనుడు జలపాదుం డుప్పొంగి యారోహణకౌతూహలంబు[1] త న్నవివేకిం జేయ దుష్టోరగంబు[2] మాయావాగురం[3] దగులుకొని దానియునుకువ[4] కీకొనియెను[5]. అంత నమ్మందవిషుండును జలపాదుని నిజభోగమున[6] న్వహించి, కొండొకవడి చిత్ర ప్రచారంబున నిందు నందుం ద్రిప్పి లేనిబడలిక తెచ్చుకొని రోఁజుచుఁ దల వ్రేల వైచి యూరకుండెను. జలపాదుం డంతయుఁ జూచి, 'నీవేల యిట్లు నడవఁజాలకున్నా' వని యడిగెను. మందవిషుండు: "స్వామీ! నిన్నటి నుండి కబళమాత్రం[7] బయిన నాహారంబు లభింపమింజేసి, శుష్కోపవాసంబున[8] న్మాఁడుచు జవసత్త్వంబు[9] లుడిగి జీవచ్ఛవంబనై[10] యున్నవాఁడను. కటికి యాఁకట నకనకంబడునా కిప్పు డాహారంబు దయచేసినంగాక, వాహనకృత్యం బెట్లు నిర్వహింపఁగలుగుదును? కడుపు నిండినమీఁదట మఱి నాచిత్రపద క్రమంబు దేవర చిత్తగింపవలయు." అనిన, నా వాక్యంబులు నిజమ్మని నమ్మి, యంతరంగంబు గరఁగినవాఁడయి జలపాదుం డిట్లనియె: "ఓ భుజంగపుంగవా! నే నొక్క మాట చెప్పెదను వినుము. మధ్యమధ్య నీవు నన్నడుగవలసిన పనిలేదు. కడుపుఁజిచ్చు[11] దరికొను[12]నప్పుడెల్ల వలసినన్ని మండూకంబుల భక్షింప నొక్కసారిగా నీకిదె యాజ్ఞయొసఁగినాఁడను. ప్రతిదినంబును నీ యిచ్చవచ్చినన్నిటిఁ గొనవచ్చును. ఇప్పుడు పోయి

---

1. ఆరోహణ కౌతూహలము = ఎక్కుటయందు వేడుక; 2. దుష్టోరగము - దుష్ట + ఉరగము = పాడుపాము; 3. మాయావాగుర - మాయయనెడి వాగుర (వల) - రూపకము; 4. ఉనుకున = ఉనికి; 5. ఈకొను = అంగీకరించు; 6. నిజ - భోగము = తన దైన పడగ; 7. కబళము = ముద్ద; 8. శుష్కోపవాసము - శుష్క + ఉపవాసము, గుణ సంధి; 9. జవసత్త్వములు - జవమును (వేగము) సత్త్వమును (బలము) - ద్వంద్వము; 10. జీవచ్ఛవము = జీవత్ + శవము = జీవించుచున్న శవము; 11. కడుపుఁజిచ్చు = జఠరాగ్ని; 12. దరికొను = మండు.

యథేప్సితంబుగ[1] నాహారంబు గైకొనివచ్చి, మరల వాహనకార్యంబునం బ్రవర్తిల్లుము." అనిన మహాప్రసాదం బని జలమధ్యంబునం బ్రవేశించి, కఱవు దీఱఁ జిఱుకప్పలఁ గొన్నిటిఁ గిచుకురన మ్రింగి జఠరానలం[2] బార్చుకొని[3] మండూకరాజు నెదుర నిలిచెను. ఈ ప్రకారము యథేచ్ఛను బ్రతిదినమును వలసినన్నిటిని దిగమ్రింగుచుఁ, దొలుత సన్నగాండ్రను బిదప బలవంతులను దదనంతరము మంత్రులనుగా దినక్రమమున జలపాదావశేషంబుగా[4] హ్రదంబు[5] నిర్మండూకంబు[6] గావించి, కట్టకడపట[7] నాకప్పతేనిని సహితము కూయిడం బట్టుకొని మేనిమాంసం బాప్యాయనంబుగ మెక్కి, యిప్పటికి నా వ్రతసమాప్తి యయ్యెఁగాయని సంతోషించుచు, ఆ కొలను వెడలి యొండొక చోటికిం జనియెను.

నేనును మందవిషుని చందంబుననే యవమానంబున కోర్చుకొని, ప్రతిపక్షకార్యవిఘాతం[8] బొనరించి స్వకార్య ముద్ధరించితిని. బగ్గన మండుదవానలంబు[9] వృక్షాగ్రంబులం గాల్చి విడుచుం గాని, వానిని నిర్మూలము గావింపఁజాలదు; శైత్యశీల[10] మయ్యును నదీ జలంబు తటస్థితవసుమతీజంబుల[11] మూలంబులతోడఁ బెల్లగించును. కాఁబట్టి మంచిమాటలతో సాధింపవచ్చుపనిని బరాక్రమశతంబుచేనైన సాధింపరాదు. అయినను హిరణ్యగర్భుఁడు సంధికిం దగినవాఁడనియె నా మతము." అని చెప్పి మేఘవర్ణుండు మిన్నకుండెను.

అంత మంత్రి దూరదర్శి చిత్రవర్ణునివంకఁ దిరిగి యిట్లనియె. "దేవా! సర్వవిధంబుల నిప్పుడు హిరణ్యగర్భునితో సంధి చేసికొని యాతని రాజ్యంబున

---

1. యథేప్సితము - యథా + ఈప్సితము = కోరిక ననుసరించి - అవ్యయీభావము; 2. జఠర + అనలము = కడుపుఁజిచ్చు; 3. ఆర్చుకొని = ఆఱునట్లు చేసికొని; 4. జలపాదావశేషముగా = జలపాదుఁడు మిగులునట్లు; 5. హ్రదము = సరస్సు; 6. నిర్మండూకము = మండూకములు లేనిది; 7. కట్టకడపట - కడపట + కడపట = ఇది కడాదులలోనిది; 8. ప్రతిపక్ష కార్య విఘాతము = శత్రుకార్య వినాశనము; 9. దవ + అనలము = అడవి నిప్పు; 10. శైత్యశీలము = చల్లఁదనము స్వభావముగాఁ గలది; 11. తట - స్థిత - వసుమతీజము = ఒడ్డుననున్న చెట్టు.

నాతనినె యథాపూర్వముగా[1] నిలుపుట శ్రేయస్కరము. మొన్న నీనడుమఁ గర్పూరద్వీపమున నుండి యొకబకంబు సింహళద్వీపాధినాథుం డగు మహాబలుని కడకుం బంపఁబడియె నని చారులవలన నేఁటి యుదయముననె విన్నాఁడను. విచారించి చూడ హిరణ్యగర్భుం డప్పటికి దూత నంపుట, మనతో యుద్ధము చేయ సారసరాజును సహాయంబు వేఁడుటకై యుండును. మన యూహయె నిజమయ్యె నేని, మహాబలుండును బూర్వ మొకసారి మనచే నవమానితుం డయి యున్నవాఁడె కావున మహాసంతోషముతో హిరణ్యగర్భునకుఁ దోడుపడు ననుటకు సందియము[2] లేదు. వా రిరువురుం గలిసికొని మనమీఁద దండువెడలుట పొసంగునేని, ప్రస్తుతస్థితిని బట్టి విచారింప మనము వారిని గెలువఁగలుగుట దుర్ఘటము. కాఁబట్టి హిరణ్యగర్భునితో సంధి చేసికొనుటయె యుత్తమపక్ష మని నాకుఁ దోఁచుచున్నది."

అనిన మందహాససుందరాననుం[3] డయి చిత్రవర్ణుం డిట్లనియె. "హిరణ్యగర్భుఁ డెప్పు డాల[4] మిచ్చి మనచేఁ బరాజితుఁ[5] డయ్యెనో యప్పుడె రాజ్యాధికారపూజ్యతం గోలుపోయి మనకు సేవకప్రాయుఁడయ్యెను. అట్టివానిం బూజించి తెచ్చి మరల రాజ్యపీఠంబునం బ్రతిష్ఠింపవలసినంత యక్కఱ మన కిప్పు డేమి కలిగినది? అంత కలిగినప్పుడు పోలినట్లు చూచుకొందము. 'ఈనఁ గాచి, పాలమును నక్కలకుఁ బెట్టినట్లు' బాహుబలాధిక్యంబు పేరిమిని గష్టపడి రణంబునం గెలుచుకొన్న రాజ్యంబును ఫలకాలంబున నొరునిపాలు సేయ నేల? ఈ విషయమున నక్రమముగాఁ బూనుకొని మహాబలుండు మనమీఁద ధ్వజమెత్తినను నెత్తనిమ్ము. నా ప్రతాపానలంబు[6] వేఁడిమి నాతఁ డింకొకసారి బాగుగఁ జవిచూచెడుంగాక!" అనుచుండ నొకశుకంబు రోఁజుచుఁ గొలువుఁ గూటంబుదిక్కునకుం బఱతెంచుచు దూరమున నుండి "దేవా! సింహళద్వీపరా

1. యథాపూర్వము = పూర్వమెట్లోయట్లు - అవ్యయీభావము; 2. సందియము (వి.) సందేహము (ప్ర.); 3. మందహాస - సుందర + ఆననుఁడు = చిఱునవ్వుచే నందమయిన ముఖము గలవాఁడు; 4. ఆలము = యుద్ధము; 5. పరాజితుఁడు = ఓడింపఁబడిన వాఁడు; 6. ప్రతాపానలము = ప్రతాపమనెడి అనలము - రూపకము.

జనేకానీకంబులతోడ[1] న్వెడలి వచ్చి మన పట్టణ మాక్రమింప నూరిబయల న్విడియుచున్నాఁడు." అని కేకవేసెను. రా జా వాక్యము విని యులికిపడి 'యేమి యేమి' యని యాత్రముతో నడిగెను. కొలువువారును ససంభ్రములైరి.[2] అంతఁ జిలుకయు సమీపమునకు వచ్చి రాజుదిక్కు మొగము చేసి నమస్కరించి "దేవా! సింహళద్వీపరాజగు మహాబలుఁ డాకస్మికముగాఁ గోపకారణమేమియు లేకయె మనమీఁద దండువెడలివచ్చి, తన సేనల న్నగరంబుపఱగడ[3] న్విడియించుచున్నాఁడు. అతండు మన రాజధాని న్సమీపించువఱకును, మనవారి కెవ్వరికి నాతని రాక తెలియదయ్యెను. వారిం జూచి యిప్పు డూరికావలివారలు రణసంభ్రమంబునం బరిభ్రమించుచున్నవారు. నేను ఫలంబులు తేర వనంబునకుం జని ఫలంబులు కోయుచుఁ దొలుదొలుత నొక్కవృక్షాగ్రమునుండి దూరమున మిన్నును[4] మన్నును[5] నేకము సేయుచు లేచిన ధూళిం బొడగాంచితిని; డోలాందోళితమాన సుండనయి[6] దాని కారణంబుయోచించుచుండ నింతలో గూఁత వేటుదూరమ్మున సైన్యకలకలంబు విననయ్యె; పదంపడి బారులుతీరి మనప్రోలి[7] దెసం జనుదెంచు పక్షివారంబుల[8] నాలోకించితిని; తదనంతరము పురోయాయి[9] యయి వచ్చిన యొక బకంబు వలన నది మనవీ డాక్రమింప వచ్చిన సారసాధ్యక్షుని సైన్యమగుటం దెలిసికొని, దేవర కా సమాచారమును నివేదింప వాయువేగమునం బఱతెంచితిని.' అని మరలఁ జెప్పెను.

అప్పు డమ్మయూరరాజు రౌద్రరసమూర్తియై లేచి, కొలువు కలయం జూచి యిట్లనియె - "దూరదర్శీ! నిన్ననో మొన్ననో కదా మహాబలుండు మనమీఁద దాడి వెడలివచ్చు బవరంబునం బరాభవంబు నొంది సేవల నేలపాలు సేసికొని తాను మాత్రము ప్రాణంబులతో నవులఁబడి నిజదేశముం

1. అనేక + అనీకములు = పెక్కు సేనలు; 2. ససంభ్రములు = సంభ్రమముతోఁ గూడినవారు; 3. పఱగడ = ప్రక్క; 4. మిన్ను = ఆకాశము; 5. మన్ను = నేల; 6. డోలా + ఆందోళిత - మానసుఁడు = ఊయలవలె నూఁగులాడు మనస్సు గలవాఁడు; 7. ప్రోలు - (వి) - పురము (ప్ర.); 8. వారము = సమూహము; 9. పురోయాయి - పురస్(:) + యాయి = ముందు నడచువాఁడు.

జొచ్చినవాఁడు. దానినంతను నింతలోనే మఱచి తాను నొకమానిసి[1] ననుకొని ప్రబలత్వదుర్బలత్వంబులు తలంపక తగరువచ్చి[2] కొండను దాఁకినట్లు మరల మనమీఁద నే మొగంబున వచ్చి దండువెడలినాఁడు? చూచితివా యాతని కండకావరము? మన మిప్పుడపోయి యీమత్తుని[3] జన్యంబుచేసి[4] ససైన్యంబుగా యమపురి కతిథిం[5] గావింతము. అవార్యశౌర్యధుర్యుండ[6]నగు నా ముందఱఁ దృణకల్పుఁ[7] డగునీపక్షి యెంతటివాఁడు?

ఈతని సైన్య మెంత? మున్ముంద యీవచ్చినవీరవారంబునెల్ల ఫేరవంబుల కాహారంబు కావించి వచ్చి, పిదప సింహళద్వీపమునకుం గూడ దాడి వెడలి యీసారి తప్పక యాతనిరాజధానిం గూఁకటివేళ్ళతోఁ బెల్లగించి పేరు లేకుండ నేలమట్టము కావింతము." అనిన సవినయంబుగా మంత్రి యిట్లనియె.

"ఇన్నాళ్ళవలెఁగాదు. మొన్నటిపోరునఁ బేరుగలవారు పలువు రంతరించుటం జేసి మనసైన్య మిప్పుడు శూరశూన్యమై[8] యున్నది. తామ్రమాడుండు పోయిన తరువాత మనసేనల స్థితిగతుల నెఱిఁగి నడపి కార్యావసరంబున ధైర్యంబును శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి దళవాయితనంబు[9] పూన నర్హుం డగునూహాపోహవిచక్షణుఁ డొక్కఁడును నాకంటికిం గనఁబడకున్నాఁడు. అందుచే మన సైనికనికరంబులు[10] బహునాయకత్వంబు గలిగియున్నవి. ఎల్లకాలంబును సాహసంబు సాగిరాదు. శత్రు వొకప్పుడు లోఁబడినవాఁడె కదా యని తలంపం బనిలేదు; శిఖి శిఖాతప్తం[11] బగుజలంబె పొంగిపడి యాయగ్నిం జల్లార్చుచుండుట

---

1. మానిసి - (వి.) మనుష్యుఁడు (ప్ర.); 2. తగరు = పొట్టేలు; 3. మత్తుఁడు = మదించిన వాఁడు; 4. జన్యము = యుద్ధము; 5. యమపురి కతిథిగావించు = చంపు; 6. అవార్య - శౌర్య - ధుర్యుఁడు = వారింపరాని పరాక్రమభారమును వహించినవాఁడు; 7. తృణ కల్పుఁడు = కొంచెము తక్కువగా గడ్డితో సమానుఁడు; 8. శూరశూన్యము - శూరులచేత శూన్యము - తృతీయాతత్పురుషము; 9. దళవాయితనము = సైన్యాధిపత్యము; 10. నికరము = సమూహము; 11. శిఖి - శిఖా - తప్తము = అగ్నిజ్వాలలచేఁ గ్రాఁగినది.

లోకధర్మము. శకటగతచక్రంబు[1] తెఱంగునఁ గాలగతులం గ్రిందు మీఁదును మీఁదు గ్రిందును నగుచుండును. కరనిహతకందుకంబు[2]నకుం బోలె భూమి పయిం బడినదేహధారుల కందఱకును బడుచుండుటయు లేచుచుండుటయు నైసర్గికము[3]. నేనింతదూరము చెప్పుట నా ప్రాణములు వంచించికాదు. శరదంబుం[4] బోలె ఘనగర్జితము[5] చేయుటవలనం గార్య మెప్పుడును గానేరదు; మహాత్ములు సావధానముగా సాధకబాధకమ్ముల న్మంత్రిముఖంబునఁ జక్కఁగా నాలోచించి, యర్థానర్థంబుల[6] నూహించి, మఱి కార్యనిశ్చయమ్ము చేయుదురు. రాజు తానెంత బలవంతుఁడయినను, బలువురు రాజులతో వివాదము పెట్టుకోరాదు; పెట్టుకొనె నేని, నిశ్చయముగా దురంతము నొందును. సర్పమెంత బలవంత మయ్యును, చలిచీమలచేతం జిక్కి యుక్కఱు[7] చుండ మనము చూచుచుండలేదా? నిరర్థకవిరోధంబు[8] సమర్థింపం జూడక దేవర యిప్పుడు న న్ననుగ్రహించి విగ్రహంబు[9] మానవలయును. ఎవఁడు కార్యాకార్య విచారమును మాని, క్రోధమునే ప్రధానము చేసికొని యొక పనికిఁ బూనుకొనునో వాఁడు మొదల విచారింపకనకులమును[10] జంపుకొని పిదప విషాదము నొందిన బ్రాహ్మణునివలెనే కడపటఁ బశ్చాత్తప్తుఁ[11] డగును. దేవర కాకథ చెప్పెద నవధరింపుఁడు.

## అపరీక్షితకారి బ్రాహ్మణుని కథ

గౌడదేశమునందలి యొకయగ్రహారమున దేవశర్మ యనుపేరు గల వేదజడుఁ[12] డగువిప్రుఁ డొకఁడు గలఁడు. అతనికిఁ గొంతకాలము సంతానము లేని కొదవ యొక్కటియేకాని వేఱుకొదవ లేక యుండెను. అతని భార్య యగుయాజ్ఞసేని సంతానము లేనిదయి, పుత్త్రులం గని పెంచు తనయీడు

---

1. శకట - గత - చక్రము = బండిని బొందిన చక్రము; 2. కర - నిహత - కందుకము = చేతితోఁ గొట్టఁబడిన బంతి; 3. నైసర్గికము = సహజము; 4. శరదము = మేఘము; 5. ఘన - గర్జితము = గొప్పయుఱుము; 6. అర్థానర్థములు - అర్థమును, అనర్థమును - ద్వంద్వము; 7. ఉక్కఱు - ఉక్కు + అఱు = నశించు; 8. నిరర్థక - విరోధము - అర్థములేని వైరము; 9. విగ్రహము = యుద్ధము; 10. నకులము = ముంగిస; 11. పశ్చాత్ + తప్తుఁడు = వెనుక బాధపడువాఁడు; 12. వేదజడుఁడు = వేదములచే జడుఁడు.

చేడియలం గని ముచ్చట పడుచు, బిడ్డల నిమిత్తము యోగులని వేషములు వేసికొనువారినెల్లఁ గాళ్ళుఁ గడుపులుం బట్టుకొని యాశ్రయించి వారిచే వేళ్ళు వెల్లంకులు[1] గట్టించుకొనుచు, ఊయిగన్న ఊతికి గుడి గన్న గుడికి మ్రొక్కుచు, ఎవ్వ రేతీర్థము పేరు చెప్పిన నచ్చటికిఁ బోయి మునిఁగి వచ్చును, లోకములో లేనినోములు వ్రతములు పట్టుచుండును. ఇట్లు కొంత కాలము గడచినపిమ్మట, నా యింతి యీశ్వరానుగ్రహమువలన, గర్భవతియై యొక్కపుత్త్రకుం గనియెను. లేక లేక కలిగినసంతాన మగుటంజేసి, తల్లిదండ్రు లా చిన్నవానిని ఱొమ్ముమీఁదికాలు నేలఁ బెట్టనీక ప్రాణములకంటె నెక్కువగా గారాబమునఁ బెంచుకొనుచుండిరి. ఒకనాఁ డాబిడ్డను బా లిచ్చి నిదుర పుచ్చి, యుయ్యలలోఁ బరుండఁబెట్టి మగనిని గావలియుంచి యాజ్ఞసేని పొరుగు వీథి నున్న తనపుట్టినింటికిఁ జూడఁబోయెను. నాఁడు పర్వదిన మగుటంజేసి రాజు దగ్గఱనుండి పార్వణశ్రాద్ధదాన[2] మిచ్చుట కొఱకయి యాబ్రాహ్మణున కాహ్వానము వచ్చెను. సహజదరిద్రుఁ డయిన యాశుద్ధశ్రోత్రియుఁ[3] డప్పు డిట్లు చింతించెను. "రాక రాక నేఁటికాలమునకు భూపతికి నాయం దనుగ్రహము వచ్చి, సాహిత్యపరు లనేకు లుండ వారిం గాదని నాకే దాన మియ్యఁదలఁచి వర్తమాన మంపెను. నన్ను భాగ్యవంతునిఁ జేయవలె నను తలంపుతో నేలిక పిలువనంపినపుడే, నా పాలిటి యభాగ్య దేవత సమయమున కీ యసందర్భము తెచ్చి పెట్టినది. ఇఁకఁ బుట్టినింటి నుండి నా భార్య వచ్చు టెప్పుడు? నేఁ బోయి దానము పట్టు టెప్పుడు? రాకున్న నేమి, పోవుదు నన్న నిందాఁకఁ గంటికి ఱెప్పవలెనుండి కాపాడుకొనుచున్న పిల్లవానికడం గాపుండువారు లేరు; పోక మానెద నన్న భూపాలుఁ డాదానము నన్యుల కిచ్చి వేయును. నాకొక్క యుపాయము కనుపట్టుచున్నది. బహుదినములనుండి కన్నబిడ్డవలెఁ బెంచుచున్న నకుల మున్నదిగదా? ఈ పెంపుడు ముంగిని నా ముద్దుఁబట్టికి[4]

---

1. వెల్లఁకి - గడ్డ వేరు; 2. పార్వణ - శ్రాద్ధ - దానము = పిండప్రదానమునందలి పిండదానము; 3. శ్రోత్రియుఁడు = వేదపండితుఁడు; 4. ముద్దుఁబట్టి = ముద్దుబిడ్డఁడు.

రక్షక ముంచి కదలిపోయి దానమును స్వీకరించి యింట నున్నట్టె పరుగెత్తుకొని వచ్చెదను.' అని నిశ్చయించి, ముంగిసను ససంకేతముగాఁ జెప్పి యాయర్భకు నకుఁ గావలిపెట్టి, రాజమందిరమునకుఁ బోయెను. దానము నిమిత్త మేగిన రెండు గడియలును బ్రాహ్మణునికి శరీర మొక్కటియె రాజమందిరమున నుండెనుగాని చిత్తమంతయు నింటిమీఁదను గొమారునిమీఁదనె[1] యుండెను. ఇంతలో నొకకృష్ణసర్పము మిద్దెమీఁదినుండి యుయ్యాలచేరు[2]లగుండ బాలుఁడు నిద్రపోవుచున్న పాన్పు మీఁదికిఁ బ్రాఁకి వచ్చుచుండెను. దానిని ముంగిస చూచి యొక్కయెగు రెగిరి మెడపట్టుకొని కొఱికి ముక్కలు చేసి క్రిందఁ బడవైచెను. అంత నాబ్రాహ్మణుఁడును రాచనగరం గాసువీసములు గ్రహించి, కొడుకుమీఁది ప్రేమ తన్నుఁ ద్వరపెట్ట నేలమీఁద మడమలు మోపక డోలాయమానమానసుం[3] డయి మహావేగముతో వచ్చుచుండెను. బభ్రువునుం దన స్వామియడుగులచప్పుడు విని, పామునెత్తు రంటి కొన్న నీటితో మార్గము పొడుగున రక్తబిందువులు జాఱ వీధిగుమ్మము దగ్గఱ కెదురేగి, సంతోషముతో నాబాపనికాళ్ళవ్రేళ్ళం బడి పెనంగఁ జొచ్చెను. రక్తవిలిప్తముఖం[4] బగు నకులంబును జూచి గుండెలు తటతటఁ గొట్టుకొన, భీతిపరీత చేతస్కుండయి[5] యాపాఱుఁడు[6] తనకొమారునినె యా నకులంబు చంపి వచ్చెనని యెంచుకొని పెంచిన విశ్వాసమయిన లేక నాముద్దుఁబట్టి నెత్తురుఁగంధు నెట్లు గఱచితి వని దురహంకారంబునఁ జేరువ నున్న దుడ్డుకఱ్ఱను హస్తమున నంకించి నకులమును మోఁదెను. ఆమోఁదు శిరంబునం దగుల గ్రుడ్లు వెడలఁబెట్టి, నేలం బడి విలవిలఁ దన్నుకొనుచు నొక్క పెద్దయఱ పఱచి నకులము ప్రాణము విడిచెను. అట్లాముంగి యసుఱుఁ[7] గొని యా భూసురుఁడు నందనునికయి

---

1. కొమారుఁడు (వి) - కుమారుఁడు (ప్ర.); 2. చేరు = త్రాడు; 3. డోలాయమాన మానసుఁడు = ఊయలవలె నగుచున్న మనస్సు గలవాఁడు; 4. రక్త - విలిప్త - ముఖము - రక్తముచేతఁ బూయఁబడిన ముఖము గలది; 5. భీతి - పరీత - చేతస్కుఁడు = భయముచేఁ జుట్టఁబడిన మనస్సు గలవాఁడు; 6. పాఱుఁడు = బ్రాహ్మణుఁడు; 7. ఉసుఱు = ప్రాణము.

ప్రలాపించుచు లోనికిం జని తలిమంబునఁ[1] జెక్కు చెమర్పకుండ నిదురించు చున్న బాలకునిఁ గని ప్రమోదమానమానసుం డయి[2], వదంపడి డోలా సమీపంబున ఖండఖండము లయి పడియున్న నల్లత్రాఁచును జూచి చోద్యపడి, కలరూపు తెలిసికొని శోకోద్రేకమ్మున నురమ్మును[3] శిరమ్మును హస్తతలమ్మున మోఁదుకొనుచు నెందు నెవ్వరికిఁ గలుగని కలుషము తన కొదవెంగా[4] యని పెద్దతడవు రోదనము చేయఁదొడఁగెను. కాఁబట్టి యేకార్యమును సావకాశముగా విమర్శింపక త్వరపడి చేయరాదు."

అని దూరదర్శి చెప్పిన విని యించుక యనుమానించి, శిఖండి ప్రకాండుం[5] డిట్లనియె. 'మంత్రివరా! నీ విప్పుడు చెప్పిన దంతయు నాదరణీయముగనే కానవచ్చుచున్నది. కాని శత్రు వొక్కఁడు మన పట్టణము మీఁద దండు వెడలివచ్చి శాని నాక్రమింప నుపక్రమించుచుండఁగా దీర్ఘాలోచన చేసి కార్యనిశ్చయంబు చేయవలయునని జాగు చేయుచుండుట పాడిగాఁ గనుపట్టదు. మన యాలోచన కుదురునప్పటికిఁ బురము దొడ్డ పోవ[6]చ్చును. కాఁబట్టి ముందుగా నేరీతి నయిన నాతనిం బాఱఁదోలు సాధనము చూచుట ముఖ్యకర్తవ్యము. ఇప్పుడు వచ్చిన యాపదను దొలఁగించుకొన్న తరువాత హిరణ్యగర్భుని సంగతి చూచుకొందము. నాకుంజూడ వీరవారంబుం గూరుచుకొని పోయి వైరిం దారసించి పౌరుషంబు నెఱపుటకన్న వైరివారణంబు[7] నకుం దగినయుపాయం బన్యం బున్నట్టు కనుపట్టదు. అయినను నీ బుద్ధి ప్రచారంబునకు గోచరమయిన దేమయినం గలిగినఁ దెలుపుము. ఆలోచించి సర్వసమ్మత మయిన పక్షము నవలంబింతము. అనిన దాక్షాయ్య నాయకుం[8] డిట్లనియె.

1. తలిమము = పాన్పు; 2. ప్రమోదమానమానసుఁడు = సంతోషించుచున్న మనస్సు గలవాఁడు; 3. ఉరము = ఱొమ్ము; 4. ఒదవు = కలుగు; 5. శిఖండి - ప్రకాండుఁడు = నెమలులలో శ్రేష్ఠుఁడు - శిఖండము (పింఛము) గలది - శిఖండి (వ్యు.); 6. దొడ్డపోవు = కొల్లపోవు; 7. వైరి - వారణము = పగవానిని అడఁచుట; 8. దాక్షాయ్య - నాయకుఁడు = గ్రద్దల అధిపతి.

"మనము హిరణ్యగర్భునితోడం బోరి గెలుపుకొన్నవార మయ్యును, మన గెలుపాక గెలుపని సంతోషింపరాదు. ఏలయనిన - మనపాలం గల యోధవారంబులోఁ బేరు గలవారు పెక్కం డ్రాలము చేసి స్వర్గస్థులయిరి; ఉన్నవారిలోను బలువురు కాయంబుల నిండ గాయంబులు గలవా రయి పోరికి బనికిరానివా రయిరి. ఇట్టి యశక్తులను వెంటఁ బెట్టుకొని పోయి, మేమే శూరులమని సాహసంబున వైరిందలపడుదుమేని మనవారు శరీరంబున కాసపడక యోపినంతవట్టు పోరాడినను దుదను బరాభవంబు నిశ్చయము. ఈ మహాబలుం డిప్పుడు మనమీఁద దాడివెడలుట, హిరణ్యగర్భుని మంత్రియైన సర్వజ్ఞుని ప్రేరణము చేతం గాని స్వబుద్ధిచేతం గాదు. తనతొంటి విరోధంబు సాధించుకొనవలయు ననునుద్దేశంబును దానికిం గొంత తోడ్పడి యుండవచ్చును. అయినను దనమిత్ర మనోరథం బీడేఱు నేని నీతండు సంతుష్టుండయి తనపురికి మరలఁగలవాఁడగుట సందియము లేదు. మన మిప్పుడు హిరణ్యగర్భుని సమాధానపఱుచుకొను యత్నంబు చేయుటయె ప్రధానానుష్ఠేయ[1] మయిన కార్యము. కాఁబట్టి మున్ముంద యా హంసస్వామి పాలికి మనదూత యరుగవలయును; అట్లరుగుదూత కార్యసంఘటనం బొనర్చుకొని మరల మనలం జేరుటకు లోపలనె యీ మహాబలుని దళముల వలన నొకటి పుట్టకుండ నీక్షణంబ సారసరాజునొద్ద కొక రాయబారిఁ బంపుదము. ఇట్లు చేసిన సకలము ననుకూలముగా నడచును." అనిన రాజును నౌనని యూకొనియెను. అప్పుడే రాజానుమతంబున మంత్రి యరుణముఖుని రప్పించి మహాబలునితోడం బలుకవలయు పలుకుల నెల్లం దేటపడఁ గఱపి, కార్యంబు పొత్తుపఱుచుకొని రమ్మని పంచిన, నాతండును వినయవేషంబునం జని నగరంబు పఱగడ నొక్క వనంబున నున్న స్కంధావారంబుం[2] దఱిసి, సేనారక్షకులకుం దనవచ్చిన కార్యంబు చెప్పి యెల్ల సైనికులును మూఁకలు గట్టి తన్నుఁ జూచుచుండఁ దన్మధ్యంబున నొక్కచోఁ జందనతరు సమీపంబున[3] కారాగృహంబున వసియించియున్న మహాబలునిన్ ద్వార పాలకుల

1. ప్రధాన + అనుష్ఠేయము = ముఖ్యముగాఁ జేయఁదగినది; 2. స్కంధావారము = సేనలు విడియుచోటు; 3. చందన - తరు - సమీపము = మంచి గంధపుఁజెట్టు దగ్గఱ.

వెంబడింబోయి సందర్శించి నమస్కరించి, యాతని యాజ్ఞాను సారముగా సమీపంబునఁ గూరుచుండి చేతులు జోడించి యిట్లనియె.

"దేవా! జంబూద్వీపాధినాథు లగు చిత్రవర్ణ మహారాజులవారు తాముగ దేవరవారితోడ నాడుమన్న మాటల విన్నవించెద; అవధానముతోఁ జిత్తగింపుఁడు. ఇరుగు పొరుగుల దేశముల కేలికల మయిన మనము మనలో నిట్లు దుర్మత్సరంబు[1] వాటించి మానుషదర్మమును మఱచి లోకులు మనలం దల లెత్తి చూడ జగడము లాడుచుండుట యుచితముగాదు. మన మైకమత్యంబు పేర్మిని సోదరభావంబు గూరి[2]యుందు మేని, ముల్లోకము[3] లొక్కట నెత్తి వచ్చినను గలన న్మనలఁ దేఱిచూడఁగలవే? పూర్వ మేవేళా విశేషముననో మన మనసులలోఁ గ్రోధాగ్ని[4] పొడచూపి, మెల్లమెల్లఁగా రాఁజి ప్రజ్వరిల్లి యుద్ధరూపమునం బయల్వెడలి యుభయపక్షములవారిం గొందఱ దహించి యప్పటి కాఱినది; అఱిపోయినదాని న్మరల మండఁజేయుచు మన మనస్సీమలఁ[5] గోపంబులు గాఁపురం బుండనిచ్చుట యుభయులకును క్షేమకరము గాదు. ఇఁకముందు మన మన్యోన్యస్నేహము నవలంబించి మీమాట మేమును మామాట మీరును జెల్లించుచుఁ గూడి మనుట మా యభిమతము. కర్పూరద్వీపాధీశ్వరుండగు హిరణ్యగర్భుఁడు మన కిరువురకుఁ బ్రాణమిత్రుఁడుగా నుండఁదగినవాఁడు. అతని రాజ్యం బాతని కిచ్చితి మని తెలిపి, మాతోడ సఖ్యంబు నెఱప నాతని నడుగ నేఁడె దూతను బంపు చున్నారము."

అని చెప్పి యూరకున్న మహాబలుండును గొంతవడి చింతించి, తన బలంబులు మార్గాయాసంబునం బడలియుంటఁజేసియుఁ దనవచ్చిన కార్యం బనుకూలముగా ముగియుచిహ్నములు కానఁబడుచుంటంజేసియు సంధిచేసికొనుటయే యప్పటి కుచిత మని నిశ్చయించి, పూర్వవైరంబు మాని

---

1. దుర్మత్సరము = దుష్కోపము; 2. కూరు = కలుగు; 3. ముల్లోకములు = మూఁడు లోకములు - ద్విగువు; 4. క్రోధాగ్ని = క్రోధమనెడి అగ్ని - రూపకము; 5. మనస్సీమ = మనఃప్రదేశము.

సంధి కియ్యకొనియెను. అప్పుడు మహాబలచిత్రవర్ణులకుఁ గపాలసంధి[1] యయ్యెను.

తరువాతఁ జిత్రవర్ణుండు తనమంత్రితో నాలోచించి, యుచితగతిని హిరణ్యగర్భునిపేర నొకలేఖ వ్రాసి, తల్లేఖం[2] గొనిపోయి హంసస్వామితో యుక్తక్రమంబున సంభాషించి కార్యంబు పొందుపఱుచుకొని రా నరుణ ముఖుండె తగినవాఁడని యెంచి అతనినె పయనంబుచేసి[3] క్రమ్మఱఁ గర్పూరద్వీపంబునకుఁ బంపి యాతని పునరాగమనంబున[4] కెదురుచూచుచు దినము లెన్నుచుండెను. అతండును, గతిపయప్రయాణంబులఁ గప్పురపుదీవిం[5] జేరి, రాజధానిం బ్రవేశించి, ముందుగా మంత్రిసందర్శనంబు చేసి నిజాగమనకారణంబు[6] తెలిపి, యాతండు తన్ను వెంటఁబెట్టుకొని పోవ హిరణ్యగర్భుని రహస్యవాసంబుఁ జొచ్చి, యచ్చట నాప్తవర్గంబుతో నిష్టకథా ప్రసంగంబులఁ గాలక్షేపంబు చేయుచున్న హంసాధ్యక్షుని వీక్షించి, నమస్కార పూర్వకంబుగాఁ ద న్నెఱిఁగించుకొని, మితహితోక్తుల[7] నిట్లనియె. "జంబూ ద్వీపాధినాథుండు చిత్రవర్ణుండు దేవర సుగుణసంపదను బలువురు ప్రశంసింపఁ బూర్ణమనంబుతో నాకర్షించి, దేవరతోడి మైత్రి నపేక్షించి నన్నిటకుం బుత్తెంచెను[8]. నేఁడు మొదలుకొని యథాపూర్వముగా దేవరవారు కర్పూరద్వీపరాజ్యాధికారంబు మరల వహియించి, లోకోత్తరముగాఁ బ్రజాపాలనంబు గావించుచు మయూరస్వామితోడి సౌహార్దసౌఖ్యం బనుభవింప నర్హులు," అని లేఖం జేతికిచ్చెను, దానిం బుచ్చుకొని హిరణ్యగర్భుండు మంత్రితో నాలోచించి తగిన ప్రత్యుత్తరంబు వ్రాసి ధవళాంగునిచేత నిచ్చి, నీ వీ యరుణముఖునితోఁ జంబూద్వీపంబున కరిగి చిత్రవర్ణుని సందర్శించి

1. కపాలసంధి = ఇరు తెగలవారు సమానలాభనష్టములతోఁ జేసికొన్న సంధి; 2. తల్లేఖ = తద్ + లేఖ = ఆ కమ్మ; 3. పయనము (వి) - ప్రయాణము (ప్ర.); 4. పునః + ఆగమనము = పునరాగమనము - తిరిగిరాక; 5. కప్పురపుదీవి (వి) - కర్పూర ద్వీపము (ప్ర.); 6. నిజ + ఆగమన - కారణము = తన రాకకుఁగారణము; 7. మిత - హిత + ఉక్తులు = మితములు, హితములైన ఉక్తులు, తక్కువయైనవి, మేలుగోరినవియైన మాటలు; 8. పుత్తెంచు = పంపు, పుచ్చు + తెంచు.

యర్ఘసంభాషణంబుల నాతని నలరించి యీ జా బిచ్చి రమ్మని యానతి యొసఁగి, యరుణముఖుని నర్ఘసత్కారంబుల గారవించి చెప్పవలయు పలుకులెల్లం జెప్పి, వీడుకొలిపెను.

అంత ధవళాంగుండును నరుణముఖుండును బయలువెడలి, సరస సంభాషణంబుల మార్గాయాసంబు వీసంబును[1] గానరాకుండ నడచి, కతిపయ దినంబులకు జంబూద్వీపంబు చేరి చిత్రవర్ణుండు నిండుకొలువుండియుండ నాతని పాద సందర్శనంబుచేసికొని, సందేశంబు సమస్తంబును నివేదించి, కృతకృత్యు లయిరి. మహాబలుండును మిత్రకార్యంబును సాధించుకొని చిత్రవర్ణుని మన్ననఁ బడసి, పరమానందభరితుండయి సైన్యసమేతంబుగా నిజదేశంబునకుం జనియెను. నాఁడుమొదలుకొని మహాబల చిత్రవర్ణ హిరణ్యగర్భు లన్యోన్యమైత్రిం బొదలుచుఁ బరస్పరక్షేమలాభంబులఁ బత్రికాముఖంబులఁ దెలిసికొనుచుఁ జిరకాలము సుఖముగా రాజ్యపాలనంబు గావించిరి.

అని విష్ణుశర్మ సంధితంత్రమును ససాకల్యముగా[2] వచియించి, మీరును సర్వసర్వంసహాపతులతోను[3] సంధి కావించుకొని, యైకమత్యంబు పెంపున సకలసౌఖ్యంబుల ననుభవింపుఁడనిన, రాజపుత్త్రులెంతయు సంతసించి దేవరమూలమున నజ్ఞానాంధకారంబునుండి[4] వెలువడి జ్ఞానభాను[5] న్సందర్శింపఁగంటి మని విష్ణుశర్మను నుతియించిరి. అంత సనయులయిన[6] నృపతనయులఁ దనవెంటఁ దోడ్కొనిపోయి, సుదర్శనున కర్పించి, విష్ణుశర్మ యాతనిచే సకలసమ్మానంబులం బొంది, యొక యగ్రహారము బహుమానంబు వడసెను.

కందుకూరి వీరేశలింగ ప్రణీతంబయిన నీతిచంద్రికయందు
సంధితంత్రము సంపూర్ణము.



1. వీసము = ఒకటఁ బదునాఱవ భాగము, కొంచెము; 2. ససాకల్యముగాన్ = సంపూర్ణతతో; 3. సర్వ - సర్వంసహా - పతులు = ఎల్ల - భూభర్తలు; 4. అజ్ఞాన + అంధకారము=అజ్ఞానమనెడి అంధకారము - రూపకము; 5. జ్ఞానభానుఁడు = జ్ఞానమనెడు భానుఁడు (సూర్యుఁడు) - రూపకము; 6. సనయులు = నయము (నీతి)తోఁ గూడినవారు.

# సంపూర్ణ నీతిచంద్రిక

పరవస్తు చిన్నయసూరి

కందుకూరి వీరేశలింగం



Ph: 73444

రోహిణి పబ్లికేషన్స్

మెయిన్ రోడ్, రాజమండ్రి-I.